# గ్రంథకర్త పరిచయము

ఈ రచయితకు ప్రాచీన సాహిత్యంమీద కల అభిమానం ఒక గనివంటిది. ఈనాటికీ గ్రాంథికాన్ని వీరు వదలలేక పోవడమే దీనికి తార్కాణం. చిన్నతనం లోనే "ఆముక్తమాల్యదా పర్యాలోకనం" అనే విమర్శ గ్రంథం ప్రచురించి పండితుల మన్ననలకు పాత్రులైనారు. సంస్కృతాంధ్ర భాషలలోనేగాక ఆంగ్లంలో కూడా తగినంత పరిజ్ఞానం సంపాదించుకున్నారు.

"వలచినదాని వీడుమని పల్కుట న్యాయమె? పూర్వజన్మమం
దలరిన పుణ్యరాశి ఫలితంబులు యీ ప్రణయాలు; వీనికిన్
జలతిలతర్పణం బెటుల సల్ప నసాధ్యమగున్; తలంచు నే
వెళ్లలగలేను యెచ్చటికి ప్రేయసి దర్శన భాగ్యమున్వినా."

శ్రీ ప్రభాకరరావుగారు రచించిన 'ప్రేమసీమ' కావ్యంలోని దీ పద్యం. కీట్సు వ్రాసిన "ఈవ్ ఆఫ్ సెంట్ ఏగెన్స్" అనే గ్రంథాన్ని దీనికి మాతృకగా తీసుకున్నారు. కావ్యమంతా ప్రబంధ పక్కీలో నడిచింది. ప్రభాకరరావుగారు "శారదాంబామణీ శతకము" రచించారు. 'ప్రేమసీమ' కంటే ఈ శతక రచన చాలా ఉదాత్తంగా నడిచింది. ఈ శతకములోని కొన్ని పద్యాలు ప్రేమసీమలో కూడా వాడుకున్నారు. ఏదో గొప్ప ఆవేదనతో ఈ శతకం రచించినట్టు కనిపిస్తుంది.

కవితల్సెప్పిన గల్గునే అతుల శృంగ్రారాది విన్యాసముల్
అవనీ భాగమునన్ ప్రసిద్ధిగనునే యాచించి నీచుల్ గనన్
భువిలోన న్గడుపంగనే వలయుకా భుక్త్యర్థమంచు న్వచిం
త్రు వృథాలాపములన్ని నవ్వులకు క్షుద్రుల్ శారదాంబామణీ"

అని శారదను ప్రార్థించారు. వీరు వ్రాసిన 'అనర్ఘ రాఘవ పరిశీలనం' "శ్రీమద్ వెంకటాధ్వరి లక్ష్మీసహస్రం" అను వ్యాసములు పలువురి మెచ్చుకోలును పొందాయి. "జయభారత్" (హైద్రాబాదు) పత్రికకు వీరు కొన్నాళ్లు సహాయ సంపాదకులుగా వున్నారు.

— 'ఉదధి'

(తెలుగుదేశం—6-5-54, హైద్రాబాదు.)

# ఆముక్తమాల్యద

[ పర్యాలోకనము ]

గ్రంథకర్త

వెల్దండ ప్రభాకరామాత్యుఁడు

★

విద్యారత్న శ్రీమాన్
ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్య కృత
'ఆంధ్రసాహిత్యసౌరభ' (భూమికా) సమేతము

వెల్దండ రామకృష్ణరావు
సాహిత్యనికేతనము
248/B మల్లేపల్లి, హైద్రాబాదు - ద. - 1.

## అంకితము

*గీర్వాణాంధ్ర భాషా సంపదను ప్రసాదించిన*
*విమర్శకాగ్రేసర శ్రీ కురుగంటి సీతారామయ్య*
*విద్వత్కవిరాజ శ్రీ సరిపెల్ల విశ్వనాథశాస్త్రి*
*కవిరత్న శ్రీబుక్కపట్నమ్ అణ్ణయాచార్య లను*
*నేతత్సాహిత్యాచార్య త్రయమునకు సమర్పితము*

అంతేవాసి
"వెల్దండ"

# విషయసూచిక

# ఆశీస్సు

శ్రీ వేల్దండ ప్రభాకరరావుగారు వయస్సులో చిన్నలయ్యు, సునిశిత విమర్శనా నైపుణ్యముచే, పెద్దవారి సుద్దులనుగూడ దిద్దనగు బుద్ధిపాటవము గలవారుగ గన్పట్టుచున్నారు. వీరు "ఆముక్తమాల్యద పర్యాలోకన" మను నొక విమర్శన గ్రంథమును సరసముగ జిత్రించి యున్నారు.

వీరిందు బొందు పరుపవలసిన విషయముల నన్నిటిని సంగ్రహముగను, నిశితముగను, వినయ సుందరములుగను వ్రాసియున్నారు.

ఈ గ్రంథమును సాకల్యముగ పరిశీలించిన నిందు, జిన్నవారి జిలిబిలి పలుకులేగాక, పెద్దవారి ప్రౌఢోక్తి రీతులుగూడ వెల్లడియగుచున్నవి. అందుచే చిరంజీవులు తమ తలపులు ముందుగా విద్యాధికులగు నిజగురు చరణులకు నివేదించి, వందన పురస్సరముగ వారందిచ్చిన దిద్దుబాట్లు జేసికొని, పిమ్మట నీ గ్రంథమును బ్రకటించి యున్నటుల దోచెడిని.

చిన్న తీగెలు పెద్ద మ్రాకుల దరిజేరి వాని ప్రాపున నున్నతికి వచ్చునటుల పిన్నలగు విద్యార్థులు నాచార్యుల సేవించి గొప్పవారగుదురు.

"స్పర్ధయా వర్ధతే విద్యా" యను నార్యోక్తినిబట్టి యీ విమర్శన గ్రంథ మింత పెద్దగా పెరుగుటకు నిదానము శ్రీ సన్నిధానమువారు విష్ణుచిత్తీయములోని కవిత రాయలది గాదని వాదించుటయే యని తోచుచున్నది.

అయోమయ మందసములోని సొమ్ముల గాంచుటకు బీగమువలె విష్ణుచిత్తీయములోని యలంకారాది సంపదల గనుగొనుట కీవిమర్శన ముపయుక్తము కాగలదు.

గ్రంథకర్తలు నవ్యాంధ్ర సాహిత్య రసపిపాసా లోలుపులైనను గ్రాంథికాంధ్ర విలసితమగు కవిత నోర్పుతో సాకల్యముగా జదువు టెంతయు మోదావహము.

ఈ యువక మహాశయు లిట్టి సువిమర్శన గ్రంథముల నింకను విరివిగా బ్రకటించి గురుజనుల యాశీస్సులకు బాత్రులగుదురుగాక !

ఓం తత్సత్

ఇట్లు
విబుధ విధేయుడు
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి

కాకినాడ
6-8-1945

# ఆచార్య స్మృతి

గురు వర్గమ్ముల సత్కటాక్షమున నాకుంగల్గె సామర్థ్య మీ
చిరుపొత్తంబు రచింప; వారినెపుడున్ చింతింతు; నాంధ్రంబులో
సరసంబౌ చవిగల్గజేసి, రల "యాచార్యుండె శ్రీనాథు"డఁ
సరసాభాణక మొందె వారి యెడలఁ సంపూర్ణ సాఫల్యముఁ. 1

గీర్వాణంబున నద్వితీయ కవిగా కీర్తి ప్రతిష్ఠా స్థితుల్
సర్వోర్వీతలమందు గాంచిన మహాసర్వజ్ఞునిన్ సాహితీ
సర్వ స్వార్ణవకుంభసంభవుని దీక్షాస్ఫూర్తి నణ్ణార్యునిఁ
సర్వావస్థలయందు గొల్తు తిరమౌ సాహిత్య సంసిద్ధికై. 2

రాజ త్తిర్మల బుక్కపత్తన కులాంబోరాశి రాకాశశీ
కుర్యా న్మే హృదయాంబుజే కరుణయా సాన్నిధ్య మవ్యాహతమ్
శ్రీరంగార్య తనూభవో మమ పున స్సాహిత్య విద్యాగురుః
శ్రీమా నణ్ణయదేశిక స్సుకవితా సారస్య రస్యాంతరః. 3

★

# శ్రీకృష్ణరాయ ప్రశంస

మ. ఘనవిద్యానగరంబునందు కడు విఖ్యాతుండవై యుండి కీ
ర్తి నిలఁ జాటితి రాజకుంజరఘటా దిగ్భ్రాంతికృచ్ఛింహతఁ
మనుజుల్ మెచ్చగ నాటికాలపుగతిఁ వాగ్భూషణమ్ భూషణ
మ్మైనను నాభాషణమందు చాటవె కవీంద్రా, సాహితీభూషణా !

మ. సరసాలంకృతి శోభితాంధ్రకవితా సామ్రాజ్యలక్ష్మీ ధురం
ధర శృంగార విలాస వైభవ సముద్యద్భూమిపాలుండవై
యిరవౌ పేరిమి సార్వభౌముడవయ్యై యేకాతపత్రంబుగా
సరసుల్ మెచ్చగ రాజ్యమేలితివి భాషాయోష భూషింపగఁ. 2

మ. సరసాలంకృతియై విదగ్ధపఠనాసారస్య సంయోగ్యమై
సరళంబై యొకచో నిగూఢతర భాషాగుంభనాపూర్వమై
విరియఁ ప్రౌఢ పదప్రయోగములు ప్రావీణ్యానుకూలంబులై
మురిపంబొప్పగు కృష్ణరాయకవితాంభోజాస్య ప్రార్థించెదఁ. 3

మ. సరసాలంకృత వాగ్విశేషరచనా చాతుర్య మేపార పొం
పిరివోవంగ నపూర్వశబ్దములు ప్రావీణ్యప్రగల్భస్థితిఁ
ధరణీపాలుడుగూడ గ్రంథములు సంధానించున న్వాక్కు నీ
ధరణిఁ తెల్పవె కృష్ణరాయ కవిచంద్రా ! సాంద్రకీర్తీశ్వరా ! 4

శా. ప్రౌఢంబై, యసమానమై, కవిత ధారావాహికంబై మహా
గాఢంబైన సమాసబంధ మసదృగ్ధారాళవాగ్ధోరణిఁ
గూఢంబై, రసికాదరానుభవమై గూఢార్థ శుంభద్గతిఁ
రీఢారీణ ధురీణమై యలరు నీ శ్రీవిష్ణుచిత్తీయముఁ, 5

మ. పదవాక్యంబుల కృష్ణరాయ ! గడు గీర్వాణాంధ్రవాక్ప్రౌఢిమల్
పొదలన్వ్రాసి విపశ్చిదగ్రణులు ప్రోద్భూతంబుగా మెచ్చ నీ
సదలంకార విశేషయుక్తమగు భాషాప్రేమ నాముక్తమా
ల్యదలో చాటితి వాంధ్రభూమిని జగత్ప్రఖ్యాత సత్కీర్తితో. 6



"అల పోత్రిప్రభుదంష్ట్రి భోగివర
భోగాగ్రాళిరా లుద్భటా
చల కూటోపలకోటి రాపుచెడ
నిచ్చల్ రాయగానైన మొ
క్కలు భూకాంతకు నున్న నయ్యె
నరసక్ష్మాపాలు శ్రీకృష్ణరా
యల బాహా మృగనాభి సంకుమద
సాంద్రాలేప పంకంబునన్."

శా. వేదాంతప్రతిపాదకంబయి మహావిజ్ఞానవేద్యంబునై
తాదృగ్దీర్ఘసమాస పూరిత సుధాధారాతిమాధుర్య స
మ్మోదాపాదకమై మనోహరతరాంభోజాస్య బింబాధర
స్వాదుస్వాదు సుధాలహర్యుపరమౌ క్ష్మాపాల! నీకైతయుఁ. 7

శా. భూమీపాలకుడై కవిత్వరచనా భూరిప్రభాదక్షుడై
భామా మానస పుష్పబాణుడయి విద్వద్బృంద సంస్తుత్యుడై
సామంతాధిపవందనీయుడయి భాషాదేవి సద్భక్తుడై
యాముక్తంబు రచించినట్టి హరి భక్తాగ్రేసరుఁ గొల్చెదన్. 8

మ. కలుగు న్శంకలు - అంధ్రుడో ద్రవిడుడో కర్ణాటుడో; ఇంతకుఁ
తెలియంజాలము; ఆంధ్రవాఙ్మయమునఁ దీవ్రోరువాక్ఛక్తితో
నలరారన్ రచియించెగా కఠినమౌ నాముక్తమాల్యంబు రా
యలు - ఆహేతువె యాంధ్రభోజుడని బాహాటంబుగా చాటదే ? 9

★

# ప్రథమ ముద్రణము పీఠిక

చిరంజీవి వెల్దండ ప్రభాకరరావు నాకు శిష్యుడు. సాహిత్యోత్సాహి. నన్ను ఆశీర్వదింపుమని కోరగా శిష్యుని యభ్యర్థనమును నిరాకరింపజాలనైతిని.

ఇందు చిరంజీవియొక్క పరిశ్రమయు, సాహిత్యాభిరుచియు సువ్యక్తమగు చున్నవి. విమర్శనా శక్తియొక్క బీజములు పొడకట్టు చున్నవి. పిన్నవాడగుట చేతను, అనుభవము తక్కువయగుట ననేక శబ్దార్థ దోషములు దొరలినవి. బాల్య చాపల్యమును, గ్రంథకర్త కావలెనను ఔత్సుక్యమును గ్రంథ ముద్రణమునకు పురి కొల్పినవి. సహృదయులు దోసగులను పాటింపక గుణలేశములనే పాటించి చిరంజీవి నాశీర్వదింపవలెనని వేడుచున్నాను.

ఇతడు తన విజ్ఞానము నభివృద్ధి చేసికొని యితోధికముగ గ్రంథరచన సాగించుగాక యని యాశీర్వదించుచున్నాను.

నిజాము కళాశాల, హైద్రాబాదు,
పార్థివ ఉగాది, 15-3-1945

కురుగంటి సీతారామయ్య

★



"ఆముక్తమాలికా యేన విష్ణవే గోదయార్పితా
ఆముక్తమాల్యాదా నామ తస్యా స్తేనాభవ ద్ధ్వని"

# ఒక మాట

అఖిలాంధ్ర విషయ మనాదిగా త్రిలింగ సంజ్ఞతో ప్రసిద్ధినొందినను, విప రీతకాలవిపర్యాసభ్రష్టమై తెలంగాణమని వ్యవహరింపబడుచున్న యీ భూభాగమం దీర్ష్యావ్యాళసందష్టులయిన రచయితలు, మహాకవిమ్మన్యులు, కొంద ఱొకటిన్నర దశాబ్దముల క్రితమే ప్రతిభావంతులగు సాహిత్యాచార్యుల యాశీర్వచనముతో వారు ప్రసాదించిన భావవిభూతిని యాకళించుకొని విద్యార్థి దశలోనే గ్రంథకర్తలై ప్రాశస్త్యము గాంచి పండితుల మన్ననలు పొందిన యస్మదాదుల వ్యక్తిత్వమును రచయితలుగా కవులుగా శంకించుటవల్లనే యీ గ్రంథంబు నింత త్వరగా ముగింప వలసి వచ్చినది. ఒకటిన్నర దశాబ్దములక్రిత మీ భూభాగమున నామరూపములే లేని యీ మహాకవిమ్మన్య లీర్ష్యాయత్తచిత్తంబున నన్నోనమాలు రావని తూల నాడిన దానిని నేను సహింతునా ? అట్టి నిందలకు నిందకులకు నా హృదయ పూర్వక నమోవాకములు. కాలక్రమమున నా గ్రంథములే సమాధానములు కాగలవు.

విద్వద్వరేణ్యులును, విద్వత్కవులగు శ్రీయుతులు భావరాజు వేంకట కృష్ణరావు, రాళ్ళపల్లి యనంత కృష్ణశర్మ, పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, విశ్వనాథ సత్యనారాయణ, డా. పూళ్ళ తిరుపతిరాజు, ప్రొఫెసర్ చింతాహరణచక్రవర్తి, కపిల కాశీపతి, మొచెర్ల రామకృష్ణయ్య, మల్లంపల్లి సోమశేఖరశర్మ, శతావధానులు శ్రీనివాససోదరులు, వేదాల తిరువెంగళాచార్యులు, డా. వి. రాఘవన్, డా. నేల టూరి వేంకట రమణయ్య, తెన్నేటి సూరిగార లిచ్చిన ప్రోత్సాహపూర్వాభయ హస్తము నా యండనుండ నీ యసంబద్ధ ప్రలాపముల కేటి విలువ ? ఆ మహా కవిమ్మన్యుల నిందు పేర్కొని వారికి ప్రచారము కల్గింపను.

అంతేగాక సమకాలికులు కవిమిత్రు లగు శ్రీ ఉత్పల సత్యనారాయణా చార్యులు, పోతుకూచి సాంబశివరావు, జూలూరి హనుమంతరావు, సింగరాజు లింగమూర్తి మొగలగు నాంతరంగిక సహచరుల తోడ్పాటు మరువరానిది. అది యునుగాక యీ గ్రంథ రచనలో నాకు ప్రత్యక్షముగా పరోక్షముగా సూచన లిచ్చిన మహానుభావులకు నేనెంతయు కృతజ్ఞుడను.

ఈ గ్రంథమునకు సుదీర్ఘమగు భూమిక వ్రాసి యిచ్చిన శ్రీమాన్ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యుల కెంతయో కృతజ్ఞుడను. నన్ను సాహిత్య ప్రపంచ మునకు పరిచయముచేసినత్ర్యక్షరవ్యక్తిని, నన్నాశీర్వదించిన శ్రీ కాశీభట్ట సుబ్బయ్య

శాస్త్రిగారిని మరువగలనా? ముద్రారాక్షసములు లేకుండ నీ గ్రంథ మచ్చొత్తిన శతావధానులు శ్రీనివాససోదరులను మరువగలనా? నా గ్రంథమందు ప్రతిభ యుండిన ప్రకాశించును. అథవా నశించును. సహృదయులు, సరసులునగు విద్వజ్జనుల నుద్దేశించి గ్రంథము రచించితి. గుణగ్రహణ పారీణులగు సహృదయు లిందలి నెరసులను పాటింపక వాదసిద్ధాంతౌచిత్యమున మాత్రమే దత్తావధాను లగుదురు గాక!

'మమ యది న సదుక్తం సజ్జనైః క్షమ్యతాం తత్'

హైద్రాబాదు
అక్టోబరు 22, 1958
విలంబి విజయదశమి

సూర్యాలోకన మభ్యర్థించు
బుధజన విధేయుడు
వెల్దండ ప్రభాకరామాత్యుఁడు



# "ప్రాజ్ఞామోదము"

ఆముక్తమాల్యద పర్యాలోకనముపై
కవి పండితాభిప్రాయ నీరాజనము

కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, ఎం. ఏ.,
ఎం. ఎల్. సి., ఆంధ్రభాషా శాఖాధ్యక్షుడు - సి. వి. ఆర్.
యస్. యస్. ఆర్. కళాశాల, విజయవాడ.,
ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షుడు.

22—8—'58

శ్రీ వెల్లంద ప్రభాకరామాత్యుడు వ్రాసిన ఆముక్తమాల్యదా పర్యాలోకనము ప్రత్యక్షరము చదివితిని. అనుబంధములతో గ్రంథము ఒక సమగ్ర దృష్టితో సిద్ధము చేయబడినది. ప్రభాకరామాత్యునకు ఆముక్తమాల్యదమీద పరమాభిమానము. అట్టి యభిమాన ముండుటచేతనే వారు చేసిన ఈ పర్యాలోచనము సమగ్రమై భాసించుచున్నది. ఈ పర్యాలోచనములో ఆముక్తమాల్యదా సంబంధములైన ఏ విషయములను పరిత్యజించినట్లు కనిపించలేదు. ఈ గ్రంథమునందు స్పృశింపబడని యాముక్తమాల్యద యందలి మఱొక నూత్న విషయమును చెప్పుట చాలకష్టమైన పని. ఈ గ్రంథ మంత సమగ్రముగ నున్నది.

తొలుత గ్రంథకర్తృత్వమును గురించి యెక్కువగా వ్రాయబడినది. ఆంధ్రసారస్వతములో కొన్ని గ్రంథములయొక్క కర్తృత్వమును గురించి యీ చర్చలు చాలదినములుగా జరుగుచున్నవి. వాని కిది తుదిమాట యని చెప్పుటకు వీలులేదు. తుదిమాట చెప్పిన తరువాత కూడ మఱల నెవఁడో తొలిమాట చెప్పును కనుక. ఈ గ్రంథము శ్రీ కృష్ణరాయలవారే రచించిరన్న భావములోని సుఖము పెద్దన్నగారు వ్రాసినారన్నదానిలో లేదు. ఇంతకంటె ప్రబల సాక్ష్య మక్కఱలేదు.

ఆంగ్లేయభాషతోడి గాఢ పరిచయము వలన దేశములో క్రొత్త విమర్శ సూత్రములు బయలుదేరినవి. ఆంతర బాహిర సాక్ష్యములు విమర్శ విషయములో పాత్రపోషణము మొదలైనవి. వీనివలన సాధింపబడు కావ్యశోభ యెట్టిదో చింత్యము.

ప్రభాకరామాత్యులు చాల పరిశ్రమచేసి మతము రసము కావ్యలక్షణము మొదలైన బహు విషయములను పర్యాలోచించి యీ కావ్యముయొక్క వెలను నిరూపించుటకు ప్రయత్నించిరి. ఇతరుల వ్యతిరేక భావములను విమర్శించిరి.

సాహిత్య విమర్శ దృష్టితో గ్రంథ మసంపూర్ణమనియే చెప్పవలయును. విషయ సామగ్రి విషయములో సంపూర్ణ మనవలయును. ఈ గ్రంథము చదవిన తరువాత పాఠకునకొక్కటి నిస్సంశయముగా తోచును. గ్రంథకర్త సాహిత్య వీథులలో బహుపరిశ్రమ చేసినవాడు. ఆంధ్ర సారస్వతముతోడి యధిక పరిచయము కలవాడు.

ఇట్టి గ్రంథములు నేడు నిజముగా తెలుగు సాహిత్యమున కవసరములని చెప్పక తప్పదు. ప్రభాకరామాత్యుడు చిరాయురుపేతుడై ఇంకను సాహిత్యపు లోతులకు దిగి కృష్ణరాయకృత కావ్యఖనిలోని మాణిక్యముల వెల నిర్ణయించుటలో అనుపముడైన రత్నపరీక్షకుడు కాగలందులకు పరమేశ్వరుని దయ సంపాదించుగాక యని నేను కోరుచున్నాను.

*Padmabhushan*
**Dr. Poolla Tirupati Raju,**
University Professor of Philosophy & Psychology and Member of All India & International P. E. N.

Rajasthan,
Jaswant College Buildings,
JODHPUR,
28—1—1958.

I am glad to respond to Sri Veldanda Prabhakaramatya's request that I should say something as a greeting to his book on ĀMUKTAMĀLYADA. Sri Veldanda Prabhakaramatya is a rising writer and Literary Critic of Andhra Pradesh and deserves every encouragement. The present work is interesting and is very readable. The author seems to have been provoked into writing it by some harsh criticisms of his view that Sri Krishna Deva Raya, the Emperor of Vijayanagar, was the real author of ĀMUKTAMĀLYADA. Though there is some evidence against the king's authorship, that in his favour seems to me also to be stronger. Tradition also ascribes the authorship to him. Any tradition should be disbelieved only if the evidence against it is conclusive; but in the case of the king's authorship, it does not seem to be conclusive. And whatever may be the truth, writers holding different views ought to treat each other with literary courtesy, but not with harsh language.

To me it seems that Sri Veldanda Prabhakaramatya's appreciation of ĀMUKTAMĀLYADA is deep and interesting, and I wish him every success in his literary activities.

*కేరళ ప్రదేశ రాజ్యపాలకః*
డాక్టరు బూర్గుల రామకృష్ణామాత్యః

తిరువనంతపురం
5—6—'58

చిరంజీవులు వెల్దండ ప్రభాకరామాత్యులు నాకు బంధువులు. మాతులపుత్రులు. చిన్నతనమునుండయే తెలుగు సాహిత్యమునందు విశేషాభిమాన ముండుటచే మిగుల కృషిసల్పి నేడు రాయల ఆముక్తమాల్యద వంటి మహాకావ్యముపై నొక విపుల సమీక్షను వ్రాయు యోగ్యతను సంపాదించగల్గిరి. ఆచార్య శ్రీ డాక్టరు కురుగంటి సీతారామయ్యగారి వంటి సాహిత్య విమర్శకులు గురువులుగా లభించిన ప్రభాకరామాత్యులు కవి హృదయసౌహార్దతను, విమర్శనా పాటవముతో పాటు నలవరచుకొనుట ఆశ్చర్యజనకముకాదు. నేను గ్రంథకర్త యొక్క వ్యాసములను, కవిత్వముల నింతకుమున్నే పత్రికలలో చదివియుంటిని. ఈ గ్రంథము మాత్ర మామూలాగ్రముగ విమర్శక దృష్టితో చదువ నవకాశము లభింపలేదు. సాహితీ పరిశోధనా దృక్పథముతో సమీక్షిత విషయములను చర్చించుటకు ఔచిత్యాఽనౌచిత్యము

లను విమర్శించుటకు నే నధికారుడ ననుగాను. అందువల్ల ఆపనిని పాండిత్య ప్రకర్షా సంపన్ను లకే వదలివేతును.

కృష్ణరాయలీ కావ్యమునకు కర్తకాడను అనువాదమును ఈ గ్రంథకర్త యనేక కారణ ములు ప్రతిపాదించి ఖండించినారు. శ్రీహర్షుని గూర్చియు నిట్టివిధమగు వాదమే కొందఱిచే ప్రతిపాదింపబడినది. ప్రాచీన సాహిత్యకారు లందఱిచే నేకగ్రీవముగా నంగీకరింపబడిన గ్రంథకర్తృత్వమును శంకించి ఆ యశమునుండి విద్వత్కవులను ప్రాచీన మహారాజులను వంచితులను చేయుటకు ప్రబల చారిత్రక కారణము లుండవలయును. ఆంతరంగిక సాక్ష్యము (Internal evidence) వలననే ఈ మహారాజుల గ్రంథకర్తృత్వము నిస్సంశయముగా ఋజువగుచుండ, కొంకితిరుగుడు వాదములను లేవదీసి తద్గ్రంథకర్తృత్వమును మఱొక ప్రఖ్యాతయశుడైన మహాకవి కంటగట్టు చూచుట యా మహారాజుల పాండిత్య వైదుష్యములను, కళంకలకు గుఱియొనర్చుట మాత్రమే కాదు, యా మహాకవులను గూడ యప్రతిష్ఠ పాలొనర్చుట యగును. ప్రపంచ సాహిత్య చరిత్రలో ప్రతిభానంతులగు కవులచే వ్రాయించి కర్తృత్వము తమదేనని చెప్పుకొన్న కొందఱు రాజుల యుదాహరణములు లేకపోలేదు. కాని అల్పసంఖ్యలో గల నీ యుదాహరణముల నాధారముగా గొని శ్రీహర్ష, కృష్ణదేవ రాయాది విజ్ఞాన సంపన్నులగు సాహిత్య సమ్రాట్టులగు మహారాజుల పాండిత్యమును, ప్రతిభనే కాదు, వారి సత్యవర్తనను గూడ శంకించుట సమంజసమైన వాదము కాజాలదు. నే నెఱిగినంతవఱకు పై రెండపవాదములను సమర్థించుటకు చూపింపబడిన కారణము లత్యంత దుర్బలములనియు, ఒప్పుకోదగినవి కావనియు నా విశ్వాసము.

యువకుడైన యీ గ్రంథకర్త నెవరో దూషించుట, యే తద్గ్రంథరచనకు ప్రబల కారణమైనదని సూచించియున్నాడు. దౌర్భాగ్యవశమున ఆంధ్ర సాహిత్య విమర్శకులలో కొందఱు పెద్దలును, సాహిత్య విమర్శనతో పాటు వ్యక్తిగత దూషణకు దిగజారుచుందురు, ఇది మిగుల శోచనీయము. అయినను ఈ యువ సాహిత్యకుని యెడల "స్పర్ధయా వర్ధతే విద్యా" యను సూక్తి ననుసరించి ప్రత్యర్థుల దూషణయే తద్గ్రంథ రచనకు తగిన పూనిక నొసంగి శుభపరిణామమును కలుగజేసినందున దాని నంతగా గర్హించు టనవసరము. నాకు వయస్సులో చిన్నవాడగుటచే నీ గ్రంథకర్తకు ఇతోధిక సాహితీసేవా సామర్థ్యమును పరమేశ్వరు డనుగ్రహించుగాత యని యాశీర్వదించుచున్నాను.

డా. భోగరాజు పట్టాభి సీతారామయ్య, — హైద్రాబాదు
*మాజీ గవర్నరు, మధ్యప్రదేశ్.* — 9–8–1958

శ్రీ వెల్దండ ప్రభాకరామాత్య ప్రణీతంబైన "ఆముక్తమాల్యద పర్యాలోకనము" అను గ్రంథము నామూలాగ్రముగా జదివితిని. సరళశైలి - సరసభావ ప్రకటన - సహేతుక వాదము గల గ్రంథమిది.

ఆముక్తమాల్యద అసామాన్య పాండిత్య ప్రతిభగల గ్రంథము. సామాన్య పండితులకు కొరుకుడు పడునదికాదు. శ్రీ ప్రభాకరామాత్యుడు సాంగోపాంగముగ నీ గ్రంథము నవగాహన మొనరించుకొని రనుటలో సంశయములేదు. అవగాహనమైన విపుల విషయముల పరిపక్వముగా జీర్ణించుకొని రనుటయు నిర్వివాదము. ఆదిమొదలు అంత్యమువఱకు ఆముక్తమాల్యద ప్రబంధ విషయవిజ్ఞాన మీ పర్యాలోకనమున చిందులు ద్రొక్కుచున్నది.

ఈ విష్ణుచిత్తీయ ప్రబంధకర్త రాయలా ? పెద్దన్నా ? మఱొకరా ? యను వాద ప్రతివాదముల మూలముగ రేకెత్తిన ప్రభాకరామాత్యుని భావస్పందనమే పర్యాలోకన గ్రంథము.

విష్ణుచిత్తీయ ప్రబంధ విశిష్టతనంతయు జూఱగొని దాని నాంధ్రలోకమునకు ప్రభాకరామాత్యుడు కరతలామలకముగా నొసంగిరి. ఈ ప్రయత్నమున పర్యాలోకన గ్రంథకర్త జయభేరి మ్రోగించినారు. ఈ గ్రంథము విశ్వవిద్యాలయ విద్యార్థులకు మిక్కిలి యుపయుక్తము. పాఠ్యగ్రంథ నిర్ణయ యోగ్యముగ నున్నది.

కటకము మొదలు కన్యాకుమారి వరకు ఆంధ్రసామ్రాజ్యమును స్థాపింప గలిగినవాడు రాయలు. ఆ సామ్రాజ్యము నంతయు సుభిక్ష మొనరించినవాడు రాయలు. సిరిసంపదలతో తులదూగించినవాడు రాయలు. ఆంధ్రభాషా విదుషీమణికి మాతాపితృ స్వరూపమై సర్వతోముఖాలంకారములు తీర్చిదిద్దినవాడు రాయలు. తుష్టిగను, పుష్టిగను, వన్నెకెక్కునట్లుగను, పోషించిన విపుల ప్రజ్ఞాధురంధరుడు రాయలు. పండిత ప్రకాండమున కండ. కవివరేణ్యులకు కట్టనికోట. అష్టదిగ్గజములను కవికోకిలముల కిరవు. ఇట్టి రాయలు మహాపండితుడై కూడ యుండెనాయని సంశయింప బనియేమి ?

అప్రతిమాన ప్రతిభా విశేషముతో ఆంధ్రావనియందు దేవత్వమొందిన మహాప్రబంధకర్తల కవితామాధురి నాస్వాదించి, గుణవిశేషముల గమనించి, వారిని అర్హతానర్హతల ననుసరించి సత్కరింపగల మహత్తర ప్రజ్ఞాధురంధరుడగు రాయలు, మహనీయ కవికులాగ్రగణ్యుడై యుండెననుటయం దాశ్చర్యమేమి ? రాయల యభిమాన కవికులేంద్రుడైన కవితాపితామహుని మనుచరిత్రమును రాయల విష్ణుచిత్తీయమును, సహృదయమున సమీక్షించుచో మనుచరిత్రమునకు విష్ణుచిత్తీయము పరిపూర్ణమును, విశేషతయును కల్గించు ప్రబంధముగా నిరూపింపవచ్చును.

తన యాస్థానమందలి కవితా పితామహుని ప్రబంధముకంటెను, తక్కుంగల కవివరేణ్యుల ప్రబంధములకంటెను తాను మిన్నయగు ప్రబంధమును వ్రాయ నిశ్చయించిన రాయల సత్ప్రయత్న ఫలితమే విష్ణుచిత్తీయమని ఏల యనరాదు ?

మహోన్నత కవిస్పర్థ వారి యితివృత్తములలోనే గోచరించుచున్నది. ఏవియో మనస్సునకు దట్టిన భావపరంపరలను, ఛందోబద్ధ మొనరించుటయే పూర్వ సత్కవుల వృత్తికాదు. కాలక్షేపమును గాదు. లోక శ్రేయస్సు నభిలషించి ఆయా దేశకాల పాత్రముల కనువగు, అవసరమగు ఉత్తమధర్మ ప్రబోధకర ఇతివృత్తములనే మన పూర్వ కవిపుంగవులు పరిగ్రహించెడివారు. మంచి ఇతివృత్తములకు దారిద్ర్య మెన్నడును రాలేదు. ఇతివృత్త క్లేశమున రాయల కొలువునందలి కవులు సంక్షోభించిరనుట సమంజసము కాజాలదు.

రాయల కాలమున ఆంధ్రావని శాంతి సౌఖ్యములతో నోలలాడినది, ఇది చరిత్ర ప్రసిద్ధ సత్యము. పరమశాంతి, తుష్టి, పుష్టులే మహాకవులకు భాషాసేవ చేయుటకును, తద్రూపమున సంఘమును సేవించుటకును అనువైనవి. కడుపు నిండినకాలమే, కడుపులోచల్ల కదలనికాలమే, కళావిలాస నైపుణ్య విహారమున కదనగు కాలము. ఆకాలమున, రాజన్యులు వారి అనుచరులునుగూడ, సంతుష్టితో, విలాసపరులై, భోగలాలసులై యుండవచ్చును. భోగపరాయణ చిత్తవృత్తిచే వైదికకర్మ నిష్ఠాగరిష్ఠత యొకింత సడలి యుండవచ్చును. ఈ సాంఘిక పరిస్థితియే సత్ప్రవర్తనము నుద్బోధింపదగు తరుణమై యుండనోపు. దాన అల్లసాని వారు, సత్ప్రవర్తన ప్రబోధకరమగు ప్రవరుని యితివృత్తమును గ్రహించి లోకకల్యాణార్థమై ప్రబంధరూపమున ప్రదర్శించి యుండవచ్చును. ఇత్తరుణమున, ద్విభార్యా సమేతుడై, ఐహిక భోగలాలసుడుగానున్న రాయలుకూడ కవితా పితామహుని మానసమం దున్నతస్థానము వహించియుందవచ్చును. తత్కారణముననే పెద్దనార్యునకు రాయలుచెప్పిన సమాధానమే విష్ణుచిత్తీయమనుట సమంజసము.

"ఆంధ్రసామ్రాజ్య సార్వభౌముడనుమాత్రమే కాను. నేనాంధ్రభాషా సామ్రాజ్యాధిపతినిగూడ, అంతేగాదు; ఆంధ్రకవితా మహా సామ్రాజ్యాధిపత్యము కూడ నాదే"యని రాయలు విష్ణుచిత్తీయ రూపమున సుస్థిర మొనరించినాడు. కవికులశ్రేష్ఠుడై వన్నెకెక్కినాడు. అంతమాత్రమునగూడ సంతృప్తుడుగాలేదు. స్వప్రయోజనము మాత్రమే పరికించలేదు. మానవజన్మ ధర్మమగు ముముక్షు సామ్రాజ్యార్హత, తనకెంత గలదోకూడ వెలిబుచ్చినాడు. పరలోక సామ్రాజ్య వైభవసిద్ధికి, భక్తిప్రపత్తులే సాధన విధానములని నిర్వచించి తన పరిశుద్ధాంతఃకరణమును, విష్ణుచిత్తునిలో ప్రతిబింబింప జేసినాడు. విష్ణుచిత్తీయమును సింహావలోకన మొనరించుచో ఈ అసామాన్య పురుషసింహుడగు రాయల సందర్శనమే ఎల్లయెడల లభించును. ఈ సింహావలోకనమున సంశయాతీతమగు చిత్తవృత్తి యావశ్యకము. మనుచరిత్ర యందలి, యితివృత్తమును, విష్ణుచిత్తీయమందలి యితివృత్తమును ఎదుట నుంచుకొని ధ్యేయ మొనరించుచో గోచరించునదేమి? పెద్దనార్యుని ప్రబంధనాయకుడు ప్రవరుడు. ఈతడొక శ్రోత్రియ బ్రాహ్మణుడు. సంపన్న గృహస్థు. నిత్య కర్మానుష్ఠాన గరిష్ఠుడు. "వివిధాధ్వర ధర్మకర్మ దీక్షా నిరతుండు," "అనారతాధ్యాపన తత్పరుండు" "కాంక్షసేయు జారకామినులకు భోగబాహ్యమయ్యె" వాని చక్కదనము. తన్ను కామించి వచ్చిన సౌందర్యరాశికి గృహస్థాశ్రమ ధర్మముల నేకరువుపెట్టినాడు. "వేలిమియున్ సురార్చనయు విప్రసపర్యయుఁ జిక్కె" నని నిత్య కర్మానుష్ఠాన పరతంత్రతను ప్రకటించినాడు. "భుక్తికిన్ వేళ యతిక్రమించె జననీ జనకుల్ కడువృద్ధు లాకటన్ సోలుచు జింతతో నెదురు సూచుచునుందురు" అని పుత్ర లక్షణముల ప్రకటించుచు మాతా పితృ భక్తిని వెల్లడించినాడు. పెద్దన్న ప్రవరుని చరిత్రము ద్వారా బ్రాహ్మణ ధర్మమును, సంపన్న గృహస్థాశ్రమధర్మ నిరతిని ప్రబోధించినాడు. అధరం బానింపవచ్చి పైబడిన యన్యకాంతను, కామినిని "శ్రీహరీయంచున్ బ్రాహ్మణు డోర మోమిడి" భుజములనుబట్టి అవలకుదోచి, ధీరుడై నిలిచి, ఏకపత్నీవ్రతమును బాటింపగలిగిన సద్వర్తనుడు ప్రవరాఖ్యుడు. సతుల మాయలకు లోనుగానట్టి ధీరచిత్తుండు ప్రవరాఖ్యుడు.

పెద్దన్న సత్పురుష సత్ప్రవర్తన - లక్ష్య - లక్షణముల తన కథానాయకుని రూపమున నుద్ఘోషించినాడు. ఇట్లు మానవ సత్ప్రవర్తనము, నుద్ఘోషించుటయే పెద్దనార్యుని ప్రథమ లక్ష్యము. గృహస్థాశ్రమ ధర్మ నిర్వచనమే రెండవ లక్ష్యము.

కృష్ణరాయల విష్ణుచిత్తుడో, ఈతడును "నిష్ఠానిధి"; గృహస్థు. కాని ప్రవరాఖ్యుని వలె కలవాడు కాదు. ప్రవరాఖ్యుని చెప్పుడు "మాన్యక్షేత్రముల్ పెక్కు చందాలంబండు నొకప్పుడున్ దఱుగ దింటన్ బాడియున్ బంటయున్". విష్ణుచిత్తుడు "న్యాయార్జిత విత్తంబు" గలవాడు. ఇరువురును ఎదురేగి అతిథుల దోడ్కొనివచ్చి మృష్టాన్న భోజనముల సంతృప్తి పరచెడివారు. "గార్హస్థ్యమునకు సరియే" అను ధర్మము నిరువురును సక్రమముగ నెరవేర్చు చున్నారు. వీరిరువురి భార్యలును, ఆదర్శ గృహిణులు. ఇక యీ యుభయనాయకుల మధ్య గల తారతమ్యమేమి? ప్రవరుడు పుణ్యక్షేత్ర సందర్శనాభిలాషి. విష్ణుచిత్తుడో భగవత్కైంకర్యాభిలాషి. నిరంతర శ్రీమన్నారాయణ పాదసేవాభిలాషి. ప్రవరుడు కర్మిష్ఠుడు, విష్ణు చిత్తుడు భక్తిపరవశుడు. ప్రవరుని హృదయము గృహస్థాశ్రమ ధర్మనిర్వహణము పైననే కేంద్రీకరింపబడినది. విష్ణుచిత్తుని అంతఃకరణము ముక్తిపై లగ్నమైనది. ముముక్షువు. "ఆ నిష్ఠానిధి గేహసీమ నడురే యాలించినన్ మ్రోయు, నెంతే నాగేంద్ర శయాను పుణ్య కథలున్ దివ్యప్రబంధానుసంధానధ్వానము". బైరాగి యిడిన మూలికా ప్రభావంబున "తుహిన భూధర శృంగ శ్యామల కోమల కానన హేమాద్యదరీ ఝరీ నిరీక్షాపేక్షన్" బోయినవాడు ప్రవరాఖ్యుడు. "భాషాపరశేషభోగి" యతడు. విష్ణుచిత్తుడో శ్రీ విల్లిబుత్తూరు వటపత్రశాయి స్వామికి మాలా కైంకర్యము చేయువాడు. "ఇతఃపురా పఠిత శాస్త్రగ్రంథ జాత్యంధుడు". భగవత్ప్రేరితుడు, పాండ్యరాజ సంస్థానమున కేగిననాడు వైష్ణవమతమే శ్రేష్ఠమని నిరూపించుట, ప్రయాణకారణము. అందకత్తె మోహనమునకు గురియైనవాడు ప్రవరాఖ్యుడు. ముక్తిమార్గ నిర్ణయ మొనరింప సమకూడిన పండిత వాదమునకు గురియైన వాడు విష్ణుచిత్తుడు. "ఎందే డెందము గందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్ జెందున్ .......... ఎందే యింద్రియముల్ సుఖంబుగను నాయింపే పరబ్రహ్మ మానందో బ్రహ్మ యటన్న ప్రాజదువు" లు వికట వేదాంతము, జార కామినివల్ల వినవలసినవాడు ప్రవరుడు. జార కామినిని డాసినవాడు ప్రవరుడు. ఉంపుడుకత్తె గృహంబునకేగుచు "జరకై వయస్సు నను - రాత్రికై దివంబున - పూని పరంబున కిప్పు డుద్యమం బనువుగ చేయగానగు" అను బ్రాహ్మణ వాక్యములాలించి గృహమునకు మరలిన పాండ్యరాజును డాసినవాడు విష్ణుచిత్తుడు. "ఆరామక్ష్మ ఖననక్రియా కరఖనిత్రగ్రాహితోద్యత్కిణ స్తోమాస్నిగ్ధకరు" డు విష్ణుచిత్తుడు. గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగార పల్యంకికావహనంబో, వనమాలికా కరణమో, వాల్లభ్య లభ్యధ్వజ గ్రహణంబో, వ్యజనాతపత్ర ధృతియో. ప్రాగ్దీపికారోపమో" చేయగలవాడు మాత్రమే విష్ణుచిత్తుడు. అయినను భగవద్భక్తిచే, భగవంతుని అండనుండి, ఆతనిచే, ప్రేరేపితుడై రాజ సభాస్థలి వాదోపవాదముల విజయము బడసిననాడు విష్ణుచిత్తుడు. "సర్వమ్ విష్ణుమయం జగత్ - ఏకో నారాయణో హరిః" అని వైష్ణవ సిద్ధాంత స్థాపకు డైనవాడు విష్ణుచిత్తుడు. విషయలోలుడై ప్రవర్తించిన రాజన్యుని సంపూర్ణ విరక్తునిజేసి

ముముక్షువుగా మార్చినవాడు విష్ణుచిత్తుడు. తాను భక్తిచే తరించినవాడు. ఇతరులను దరింప జేయగలవాడు; తరింపజేసినవాడు విష్ణుచిత్తుడు. తుట్టతుదకు వైష్ణవ మతాళ్వారాదులలో నొక డైన ముక్తుడు విష్ణుచిత్తుడు. "దాన జపాగ్నిహోత్ర పరతంత్రుడనేని" యని హవ్యవాహ నుని ప్రార్థించి యింటికి మరల కలిగినవాడు ప్రవరాఖ్యుడు. సర్వేశ్వరధ్యానపరుడైనవాడు కాడు. ఇత్తరుణమున కూడ ప్రవరాఖ్యుని, సత్త్వవర్తనమునే పెద్దనార్యుడు రూఢిపరచినాడు.

ఈ రీతిగనే పెద్దన్న నాయికకూ, రాయల నాయికకూ గల తారతమ్యము లరయ దగును. పెద్దన్నవారి వరూధిని కామాంధకారమగ్న కామిని. మిట్టవేదాంతోపదేశ మొన ర్చిన కామశాస్త్రోపాధ్యాయిని. మోహము భరింపలేక మగవానిపై కురికిన జవ్వని. ప్రవరు డను భ్రాంతితో మాయాప్రవరాఖ్యుని వశమై సంసార సుఖమును బడసినది. పుత్రవతియైనది. స్వరోచిని కన్నది. స్వారోచిషుడను పౌత్రునిగూడ గాంచినది. పుత్రపౌత్రులను గాంచుటయే కదా గృహస్థాశ్రమధర్మ పరిసమాప్తి. ఈ గృహస్థాశ్రమ విధులకు - లక్ష్యములకు పరి పూర్తి నొసంగినవాడు పెద్దన్న. అంతటితో పెద్దన్నగారి కార్యభారము, కావ్యభారము గూడ పరిపక్వము నొందినవి.

వరూధినీ తనయుని గూడ, పెద్దన యిట్టి సద్వర్తన పరునిగను, సద్గృహస్థుగను చిత్రించినాడు. దుష్టమృగ సంహరణార్థ మేగిన స్వారోచి వన్యకన్యామోహితుడై, తన గృహ స్థాశ్రమ ధర్మమును, ఏకపత్నీవ్రతమును బాటించినాడు. "అన్యసతులయందు నాసక్తుడగు వాని దమకమొదవి గూడ దలచుకంటె, మరణమైన మేలు, మరి వితర్కింపంగ, ననుచు బలుకుటయును, నవనివిభుడు" ఇట్లు ఏకపత్నీవ్రత నిష్ఠను దెల్పిన, స్వారోచికి, వనదేవత "నే, నరేంద్ర సకలభూభువన రక్షదక్ష, మనువర్య నీయందు బడయు నెన్నిక, సమస్త దివి జులు నన్ను బ్రార్థించిన వచ్చితిని" యని పుత్రేచ్ఛకై మాత్రమే - సంసారసుఖము కాంక్షించి నట్లుగ - చెప్పుటయు గృహస్థాశ్రమ ధర్మస్వరూపమునకు సంపూర్తికాదా? ఇందు ఏకపత్నీ వ్రతము - పుత్రసంభవము, సద్వర్తనగల గృహస్థ ధర్మములుగా నిర్వచింప బడినవి. ఈ వనలక్ష్మీ పుత్రుడు, స్వారోచిషాఖ్యుడు, ఈతడు "చిరతపంబాచరించియు, లక్ష్మీవల్లభు ప్రత్యక్షము జేసుకొనియు, సాలోక్యం బొసంగ వరమడిగియు, నితరము లొల్లననియు తుట్టతుదకు ద్వితీయ మనువుగ నిలనేలమను సర్వేశ్వరాజ్ఞకు తలయొగ్గి మనుత్వమును స్వీకరించెను.

"శాస్త్ర వినిశ్చయయుక్తి దండపాలనముల నవ్విభుండు ప్రజలం బ్రజలట్లరసెం గృహమతిన్." శ్రీలపెంపొంది పాలకుండాయెను. అంతియే, ఆతని తపస్సునకు ఫలితము. భగవత్సాన్నిధ్యము లభింపలేదు. పెద్దన్నగారి నాయికకు - జన్మసాఫల్యము, పుత్రపౌత్రుల గాంచుట, వా రధికారవంతులై - ధర్మనిరతులై - ప్రజల నేలుటతో ముగిసినది.

రాయల నాయికయో? గోదాదేవి, అయోనిజ. అనపత్యుడగు విష్ణుచిత్తునికి - తులసికోటకడ లభించిన పుత్రిక. ఈమె మానవుని వరించలేదు. శ్రీరంగధామునే వరించి నది. పూలమాలలచే సేవించినది. రంగని వలచి రంగనిచే వరింపబడినది. చివరకు రంగని భర్తగా గొన్నది. శ్రీరంగనిలో నైక్యమైనది. ఐహికమున పన్నిద్ద రాళ్వా

రులలో నొకర్తెయయినది. జీవన్ముక్తురాలై చిరంజీవి యైనది. మానవ జన్మ సాఫల్యము, ముక్తిని సాధించుటయే యని, రాయల విష్ణుచిత్తుడు, అతని పుత్రికయు గూడ నిరూపించినారు. విష్ణుచిత్తీయ మందలి తదితర గాథలు గూడ భక్తియోగమున, శ్రీమన్నా రాయణ చరణదాస్యమున - ముక్తిని బొందుటయే మానవధర్మ పరమావధిని ప్రబోధించు చున్నవి. అంతేగాదు - ఇతర గాథలలో - రాయలకును, పెద్దనార్యునకు గల కవితా దృక్పథ మందలి, ఉత్తమ స్పర్థను పొడజూపుచున్నవి.

"వ్యభిచారి అయ్యును, జ్ఞానోదయము బొంది - తుదకు - భక్తిపరుడై రాజుగూడ తరింప గలడుసుమా" యని రాయలు పరోక్షముగ నెవ్వరికో సమాధాన మిచ్చుచున్నట్లున్నదీ పాండ్యరాజు కథ! రాజ్యాంతే నరకమ్ ధ్రువమ్మనుట సత్యముగాదని హెచ్చరించినాడు.

"ఎక్కడి రాజ్యవైభము - లెక్కడి భోగము లేటి సంభ్రమం। బక్కట, బుద్బు దప్రతిమమైన శరీరము నమ్మి మోక్షపుం। జక్కిగణింపకుంటి యుగసంధుల నిల్చియు గాలు చేతి బల్। త్రొక్కుట నమ్మను ప్రభృతులున్ దుదరూపఱకుండ నేర్చిరే" యని, పాండురాజు ముఖమునుండి రాయల్తు పల్కించినాడు. "రాజ్యభోగ విలాసములు శాశ్వతమని విశ్వసించిన వాడను గానుసుమా" యని, రాయలు, తన నిజమానసవృత్తి నీ పద్యరూపమున ప్రకటించి నాడా యని తోచుచున్నది. పాండ్యుని గాథలో భక్తిమార్గమున ముక్తిగనుదురను నిశ్చయము నిట రాయలు రూఢిపరచినాడు. అంతియేగాదు భోగియైన రాజైనను, విజ్ఞానోదయమున విరాగి కాగలడు సుమా యని రాయలు తన అంతరాత్మనే విశదీకరించినట్లున్నదీ గాథ.

కథాసంవిధానమునందు గుదిగుచ్చిన నాలుగు ఉపాఖ్యానములు కూడ, నాలుగు బంగారు తునకలు. విశిష్టాద్వైత మత ప్రవక్తలలో నొకడైన నాథమునికి పౌత్రుడై, బ్రాహ్మణుడయ్యు, ఆబాల్య భక్తుడయ్యు, మహాపండితుడయ్యు, విజయానంతరము రాజ్యముంగొని, పాండ్యుని సోదరియగు క్షత్రియ కన్యను, వివాహమాడినట్లు వ్రాయబడిన గాథ విశేషార్థపూరితము. ఎంతటివాడైనను, కామినీ కాంచనములకు లోనగునని చెప్పుటయేకాదు. యామునాచార్యుని జీవితచరిత్రమందు లేని యీ వివాహగాథ నీ గ్రంథస్థము చేసినవాడు పెద్దన్న కాజాలడు. ఈ ఒక్క గాథవల్లనే ఆముక్తమాల్యద కృతికర్త రాయలే యనుటకు ప్రోత్సహించుచున్నది.

శ్రీరంగనాథుని దర్శనమున యామునాచార్యుడు పూర్వజ్ఞాన సంపన్నుడైనటుల వ్రాయుటలో, రాయల కలమే గోచరించుచున్నది. ఇట్లే ఖాండిక్య కేశిధ్వజుల గాథయు ప్రత్యేక విషయమును నిరూపించుచున్నది. శత్రుసంహారమే రాజధర్మమయ్యు శత్రువు నాదరించుటయేకాక, రాజ్య రమా విభూతినంతయు కేశిధ్వజుడు సంపూర్ణముగ పరిత్యజింప గలుగుటయు, తపస్వియై ముక్తి గనజూచుటయు నుల్లేఖించుటలో గూడ, రాయలే ప్రతి బింబించుచున్నాడు. ఇక మాలదాసరి, సోమశర్మల గాథ యితివృత్త మంతయు నుత్తేజ కరము. మాలదాసరియయ్యు, విష్ణుభక్తి ప్రభావమున, ధనార్జనాపరుడైన బ్రాహ్మణుడగు సోమశర్మను బ్రహ్మరాక్షస స్వరూపమునుండి విముక్తుని గావించినాడు. కులముతో నిమి త్తములేని, గుణ ప్రభావము నిట్లుగ, నిరూపింప గలిగినవాడు రాయలే కావలయును. ఈ విధ ముగ నుపాఖ్యానములలో గూడ విష్ణుభక్తియే, తరింపగల ముక్తిమార్గమనియు, ఐహిక

రాజ్య భాగ్యభోగములకంటె పరమార్థ చింతనయే మానవజన్మ సాఫల్యమునియు, విష్ణు భక్తుడగు రాయలు తన గ్రంథమునం దామూలాగ్రముగ నిర్వచించినాడు. విష్ణుభక్తి ప్రభావమును చిత్రించినాడు.

ఐహిక నిష్ఠాగరిష్ఠాత్ములైన ప్రవరాఖ్యుని సత్ప్రవర్తనమును, అతని గృహస్థాశ్రమ ధర్మనిర్వహణమును, విష్ణుచిత్తుడు - గోదాదేవి - వీరి పరమ భాగవత మతతత్త్వమును భక్తిప్రపత్తులను జోడించినపుడే మానవజీవిత పరిపూర్తి సిద్ధింపగలదు. మానవజన్మ "ధన్యోస్మి" యనగలదు. ఈ మానవజీవిత పరిపూర్తి చిత్రించి రాయలు పెద్దనార్యునికంటె లోకశ్రేయస్కరమగు కవితా ప్రపంచమం దున్నత స్థానము నాక్రమించినాడు. కవితా సమ్రాట్గ స్థిరపడినాడు.

కవిగను - ధర్మ ప్రవక్తగను - లోక శ్రేయోభిలాషిగను - గూడ తన ప్రబంధ రాజ రూపమున అందరికంటె మిన్నయై తెన్నుగన్నవాడు రాయలు. సాహిత్య దృక్పథమునందీ ప్రబంధ రచనలో, నిరంకుశ స్వేచ్ఛాగతి చాలగలదని పండితులనుడి. ఇట్లు పూర్వాచారముల నతిక్రమించిన ప్రబంధ కర్తృత్వము భాషయందుగూడ వైదికనిష్ఠా పరతంత్రుడగు పెద్దన్న కంటగట్టుట సమంజసము కాదు.

అపూర్వ శబ్ద ప్రయోగములతో నిరంకుశముగ, పూర్వ సంప్రదాయముల నుల్లంఘించుచు మహత్తర ప్రబంధ రచన చేయగల సమర్థుడు, అసమాన ప్రజ్ఞాధురంధరుడు. ఆంధ్ర సామ్రాజ్యాధినేత యగు శ్రీకృష్ణదేవరాయలు తప్ప మరెవ్వరు కాగలరు ?

ఈ గ్రంథమునందు - కొన్ని అఱవ శబ్దములును, కన్నడ శబ్దములును గూడ కలవు. తమిళ పదములను వాడుట భక్తియోగము నుద్ఘాటించును, వైష్ణవభక్తుడగు తమిళుడెవరో యీ గ్రంథమును వ్రాసి రాయలపేరు పెట్టెనను వాదము హాస్యాస్పదము, అపహాస్యకరము. అరవ వైష్ణవభక్తునికి, ఆంధ్రమునం దసమాన పాండిత్య మెట్లు లభించగలదు ? ఆంగ్ల పాలనమున - రోడ్డు - లాంతరు - స్టేషను - పైపు - గవర్నమెంటు మొదలగు నెన్నియో ఆంగ్ల శబ్దములు వాడుకలోనికి వచ్చినవి. మన ఆధునిక కవు లెందరో యీ ఆంగ్ల శబ్దములను తమ తమ కొత్తములలో వాడుచునేయున్నారు. ఇందువల్ల మనతరువాత తరమువారీ పుస్తకముల నెవరో ఆంగ్లేయుడు వ్రాసెనేమోయనుట ఎంతటి సందర్భశుద్ధియో, తమిళుడెవరో ఆముక్తమాల్యద వ్రాసెనేమో యని యనుటయు, మనము శంకించుటయు, అంతటి సందర్భ శుద్ధియే.

"నేను తెలుగువాడను, భాషలలో కెల్ల తెలుగులెస్స, తెనుగున కవితను వ్రాసి తెలుగు దేశ ప్రభువగు శ్రీ తిరుపతి వెంకటేశ్వరుల కంకితమిచ్చుచుంటిని" అనెడి రాయల కర్తృత్వమును వేరొకరికి, అంటగట్టుటయందు, ఆంధ్రులకు కలిసివచ్చెడిదేమి ? మా శ్రీకృష్ణదేవరాయలు - మా ఆంధ్ర సామ్రాజ్య చక్రవర్తి - మా ఆంధ్రభాషాకోవిదుడు - మా ఆంధ్ర భోజుడు - సాహితీ సమరాంగణ సార్వభౌముడు - ఉభయభాషా ప్రవీణుడు, ఆంధ్రమునం దొక మహత్తర ప్రబంధరాజమును వ్రాసినా డనుకొనుటలో మహదానంద ముదయించుటలేదా ? కర్తృత్వ సంశయమున కాలయాపన చేయుటకంటె, సర్వతోముఖ

మహద్గుణ విశేషముల నాంధ్రలోకమునకు సుగమ మొనరించుటకు ప్రయత్నించుట విజ్ఞానుల విధి.

ఈ విధిని ప్రభాకరామాత్యుడు తమ పర్యాలోకనమున నిర్వర్తించి, ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులైరి. ఈ అముక్తమాల్యద ప్రబంధరాజ కృతిభర్తయగు శ్రీ వేంకటేశ్వరస్వామి, పర్యాలోకన కృతికర్తకు, ఆయురారోగ్యైశ్వర్యముల ప్రసాదించుగాక ! శ్రీ ప్రభాకరామాత్యులిట్టి గ్రంథములనేకముగ వ్రాసి ధన్యజీవులగుదురుగాక !

డా. దివాకర్ల వేంకటావధాని,
*ఎం. ఏ. (ఆనర్సు), పిహెచ్. డి.*

హైద్రాబాదు,
28—1—1958.

శ్రీ వెల్దండ ప్రభాకరామాత్యుడు రచించిన అముక్తమాల్యద పర్యాలోకనము నాంతము పఠించి యానందించితిని. ఆంధ్ర ప్రబంధములలోనికెల్ల మిక్కిలి ప్రౌఢమని చెప్పదగినదాముక్తమాల్యద. ఇది నారికేళపాకమున రచింపఁబడిన గ్రంథమగుటచేఁ బండిత జనైకవేద్యమై యున్నది. చరిత్ర చదువునప్పుడు రాయలవారి కవితాపోషణమును, గావ్య నిర్మాణ ప్రీతిని తెలిసికొనుటయే సంభవించునుగాని యాయన కవితా విశేషములను దెలిసికొనుట కవకాశముండదు. కొందరెవ్వరైన రాయలవారి యందలి భక్తి గౌరవములచే నా గ్రంథమును బఠింప లాలసులయ్యును అందలి రచనారీతి కొంత క్లేశకరమగుటచే ముందుకు సాగలేక యూరకొందురు.

అట్టి ప్రౌఢ రచనగల ఆముక్తమాల్యదను సమగ్రముగా జదివి యందలి కవితా విశేషము లందఱికిని సుబోధములగునట్లుగా నీ యుత్తమ విమర్శ గ్రంథమును వెల్వరించిన శ్రీవెల్దండ ప్రభాకరామాత్యుని నెంతయు నభినందించుచున్నాను. రాయలవారి వర్ణన నైపుణ్యమును, బ్రతిభా పాండిత్యములను, రాజనీతి కౌశలమును, కథాకథన చాతుర్యమును, పాత్ర రస పోషణమును ఈ పర్యాలోకనమున నద్దమునందువలె స్పష్టముగాఁ జూచి యానందింపవచ్చును. ఆముక్తమాల్యద యానాటి సాంఘికాచార పరిస్థితుల నెంతో చక్కఁగా వ్యక్తము చేయుచుండును. మహాచక్రవర్తియయ్యు రాయలవా రింత సూక్ష్మ పరిశీలనము నెట్లు చేయఁగల్గిరాయను నచ్చెరువు కలుగుచుండును. శ్రీ ప్రభాకరామాత్యులిం దప్పటి పరిస్థితుల నతి రమ్యముగాఁ జిత్రించినారు. ప్రతి విషయమును నుదాహరణ పూర్వకముగా నిరూపించు పద్ధతి యీ గ్రంథమున కెంతయో వన్నె చేకూర్చుచున్నది.

శ్రీ ప్రభాకరామాత్యులు విమర్శకులేకాక కవులుకూడ నగుటచే రాయలవారి కవితా హృదయమును బ్రౌఢిమైఁ బరిశీలింపజాలినారు. ఇందలి భాష సమాసాడంబరముగాని, పాండితీ ప్రకటనాసక్తికాని లేక సరళ సుందరమై సర్వజన సుబోధమై యలరారుచున్నది. శ్రీ ప్రభాకరామాత్యులు చూపిన దివ్యమైన యీ విమర్శ మార్గము ననుసరించి యితరులుకూడఁ బ్రౌఢ సుందరములైన మన పూర్వ ప్రబంధములయందలి యపూర్వ సౌందర్యమును స్వయముగాఁ జవిజూచుటయేగాక యన్యులకుఁ బ్రకటించుటకుగూడఁ బ్రయత్నింతురని నమ్ముచున్నాను.

ఆంధ్రభారతి
డా. పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి,
ఎం. ఏ., ఎం. లిట్., పిహెచ్. డి.

మీరు ప్రేమతో పంపిన 'ఆముక్తమాల్యద' పర్యాలోకనమును శ్రద్ధగా పరిశీలించితిని. మీ కృతి సాహిత్య విమర్శలో ఉత్తమము, సఫలముకూడ. వివాదాలను లేవదీసిన విమర్శకులకు మీ రిచ్చిన సమాధానాలు ప్రశంసనీయాలే గాక యితరులకు మార్గదర్శకాలు. అయః పిండములాంటి ఆముక్తమాల్యదను మీరు సునిశితమైన భావనా పటిమతో తీక్ష్ణబుద్ధితో అతి సులభావగాహనకు యోగ్యమగునట్లుగా చేయటం చూస్తే సహృదయ లక్షణము మీలో అన్వర్థీభూతమైనట్లు కన్పిస్తున్నది. రాయల ప్రతిభా విశేషాలు ఈ ప్రౌఢ ప్రబంధంలోని సద్యఃపరనిర్వృతి చక్కగా విశదీకరించినారు. మీ గ్రంథము వచ్చిన తర్వాత ఈ ఆముక్తమాల్యద కఠినమైన కావ్యమనేవా రుండటానికి వీలులేదంటే అతిశయోక్తి కాజాలదు. మీరు ఇతోధిక కృషిచేసి ఇంకా సాహిత్య జగత్తుకు అనేక శోభలను తీర్చిదిద్దగలరనే ఆశతో విరమించుచున్నాను.

**Dr. P. Sreenivasachari,** HYDERABAD.
M. A., Ph. D., 30—4—'58,
*Director of Archaeology.*

It is a welcome sign of the times that healthy criticism of the classics is coming more and more into prominence despite the general tendency for either indiscriminate praise of everything past as golden or blind condemnation of it all as primitive or reactionary fit for the dustbin before being substituted by something brand new imported either from U. S. A. or U. S. S. R.

The Amukta Malyada (Paryalokanamu) is a sober work of scientific criticism from the facile pen of Sri Veldanda Prabhakaramatya who is equally proficient in Sanskrit & Telugu and who has taken great pains to learn the social & religious background of the eminent classic that he has taken up for his objective study. The role of the Vaishnava Alvars in the development of religious thought in India, their unrivalled poetry the the Nalayira Prabandham which was the fountain source of inspiration for the Krishnadevaraya and the sampradaya that constitutes the background of the poem—all these have been well understood by the keen critic whose incisive approach is however hampered by an instinctive sympathy born of a breadth of vision and catholicity of outlook.

I sincerely hope that an adequate response from the public will encourage the author and critics of this type to come forward with more works of this nature. The present work of the author in the series of E. M. L. should give a lead to treatises on each classic.

ప్రతిభారవి, ఉభయకవిమిత్ర
కవితాకలానిధీత్యాది బిరుదాంకిత
శ్రీ భువనగిరి విజయరామయ్య, — గుంటూరు,
ఆంధ్రానర్ఘరాఘవ, లక్ష్మీసహస్ర, — 26—2—1958.
భారవీత్యాద్యనేకగ్రంథకర్త.

శ్రీ వెల్దండ ప్రభాకరామాత్యునితో నాకు పరోక్ష పరిచయము 4-12-51 న జాబు వలన కలిగినది. హైద్రాబాదు హైకోర్టులో నా వ్యవహార నిమిత్తమే నేతెంచుటచే 18-2-58 న సాక్షాత్పరిచయముకూడ సమకూడినది. వారి యాముక్తమాల్యద పర్యాలోకనా గ్రంథా వాప్తియు జేకూరినది. వారి కోరికపై నీ దిగువ దద్గ్రంథ సమీక్షణమున గలిగిన నాయానందము నందించుచున్నాడను.

సాహిత్యమున జటిలతమములగు కృతులలో సంస్కృతమున శ్రీ మురారికృతానర్ఘ రాఘవము, శ్రీమద్వేంకటాధ్వరిరచిత లక్ష్మీసహస్రమును, దెల్గున శ్రీకృష్ణరాయ కల్పితమగు నాముక్తమాల్యదయును "మురారే స్తృతీయః పంథా" యను గౌరవమునకు రాదగినవే, వీనిని యథాతథముగ నన్వయించుకొనుట ప్రౌఢపండితులకేని దుస్సాధ్యమని గణింపబడియుండ దద్గర్భిత రసాదిస్ఫూర్తుల గుర్తించి సమగ్ర విమర్శనా వీథుల కెక్కించుట కష్టాత్కష్టతర మనుట కెట్టి సందియములేదు. ఇది సర్వపండిత సువేద్య విషయమే.

సామాన్యముగ నేటి విద్యార్థులలో బలుపురు గురూదితముల నధ్యయనాంతముననే గురుప్రాంగణ సీమనే "గుంటబెట్టి గంటవాయించి" లౌక్య వృత్తుల కుద్యుక్తులగుచుండుట సర్వ సాధారణ సంఘటనగ సమకూడునదై యున్నది.

ఇట్టిచో నీ శ్రీ వెల్దండ ప్రభాకరామాత్యుడు గురు ప్రాప్తముల స్వయంకృషిచే నధిక సౌష్ఠవవంతములుగా నొనర్చికొని త్రిమూర్తులవలె సాహిత్యమున నగమ్యగోచరములగు పై మూడు కృతులపై ప్రారంభ ప్రయత్నముగ సమీక్షల కుద్యమించి యభినుతులంగాంచు టెంతయు శ్లాఘ్యము.

చ. ప్రకరణ సౌష్ఠవంబున బరస్పరశుద్ధి ప్రదర్శనా సమా
సక సహితౌచితిజ్ఞ దగు బ్రసంగ విధానతలోన మేలి సూ
చకము లితోభివృద్ధికి నెసంగుట గాగలవాడె సూ దదీ
య కృషి సమస్త దక్షతలనంది యశంబు నితండు పొందుతన్.

చ. పసిడికి వన్నెదెల్పు శిలవంటిదిసుమ్ము విమర్శ కైతకున్
బసిడియె లేనిచో నొరపు బంతల భాగ్య మభోగ్యమౌకదా

పసి నికషోపలంబుల బొసంగని పన్నెను జూపజాలునే
పస కవితన్ విమర్శకత బట్టు ఉత్కృష్ట ఫలంబునా దగున్.

చ. వరల ప్రభాకరుండు ప్రతిభాకరుడౌచు నముక్తమాల్యదా
వరకృతి గృష్ణరాయ కవివాసిత దివ్యతరాంధ్ర సాహితీ
స్ఫురిత విశేషవేష బహుభూషణ రుక్పరిపోషణాఢ్య వా
గ్ఝరి నరుసంబు సర్వుల కెసంగగజేయు ప్రసంగపుంబసన్.

I am glad to express my hearty appreciation of the Critica Treatise of Sri Veldanda Prabhakaramtya on Sri Krishna Deva Raya's Amukta Malyada. He is already a poet and now shows signs of a fullfledged Critic. May his twin capacities acquire an all round improvement on a merited recognition locally and international circles also with his redoubled vigours and energies.

కపిల కాశీపతి, పశ్చిమ వినయనగరం,
న్యూస్ ఎడిటర్, ఆలిండియా రేడియో. క్రొత్త ఢిల్లీ.

చిరంజీవి వెల్దండ ప్రభాకరామాత్యుడు రచించిన "ఆముక్తమాల్యద పర్యాలోకనము" ఆమూలాగ్రముగా పఠించుభాగ్యము, సావకాశము లభించినది. ప్రభాకరామాత్యునకు విద్య యున్నది, వినయమున్నది, వివేకమున్నది. అతని రచనలో ఈ గుణములు వ్యక్తమగు చున్నవి.

శ్రీరంగనాథుడు ప్రీతితో స్వీకరించినవి చద్ది పువ్వులు - ఆమె వాసనచూచి సమర్పించి నవి. ప్రభాకరామాత్యుని విమర్శ లట్టివికావు. ఒకరి వాసనలు వాటికిలేవు. చిరంజీవికి గురు భక్తి మెండు. సాహిత్య కౌద్దాలికున కది వాసనాలబ్ధమైన రత్నగర్భ. ఇక కృషితో నాస్తి దుర్భిక్షమ్!

శ్రీ సోమంచి యజ్ఞన్న శాస్త్రి, బొంబాయి
డిప్యూటీ మున్సిపల్ కమీషనరు.

వెల్దండ ప్రభాకరామాత్యుడు వ్రాసిన "ఆముక్తమాల్యద పర్యాలోకనము" చదివాను. చక్కని శైలిలో, సమగ్రమైన విమర్శక గ్రంథం వ్రాశారు. చదివినవారికి మూల ప్రబంధమే చదవాలన్న ఉత్సాహమూ, చదివి కొంత గాకపోతే కొంతైనా జీర్ణించుకో గలమన్న ఆశ రేకెత్తించేదిగా ఉంది. కేవల పాండిత్య ప్రకర్షకోసం గాక, ఆముక్తమాల్యదలోని పస, మెరుగులు, సులభగ్రాహ్యంగా, ఆకర్షవంతంగా సహృదయుల యెదుట పెట్టడానికి వీరు చేసిన కృషి అతి ప్రశంసనీయము. వీరు చిరకాల మిట్లే సాహిత్యసేవ చేయగలరని ఆశిస్తున్నాను.

శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు హైద్రాబాదు

శ్రీ వెల్దండ ప్రభాకరామాత్యులు తాము రచించిన 'ఆముక్తమాల్యద పర్యాలోకనము'ను చదివి నా యభిప్రాయమును తెలుపవలసినదనిరి. నేనును గ్రంథము నంతను జదివితిని. కృష్ణరాయలే ఆముక్తమాల్యదను రచించెననుట నాకు సునిశ్చితమగు నాశయము. ఇందుకు కారణములు నా స్వంత మార్గము లున్నవి. అవి వీరితో చాలా భేదించును. వాటి నన్నిటి నిట దడవ పనికాదు. మనుచరిత్రకారుడు ఇది రచించుట యెన్నటికిని సాధ్యపడని పని. ఆ తలలో నీ యూహలకు, ఈ కల్పనలకు, ఈ కథాగమనమునకు, ఈ కవితాధారకు, ఈ పద సంధానమునకు, ఈ పద ప్రయోగమునకు, ఈ వర్ణనలకు, ఈ శయ్యాపాకములకు లేశమేనియు చోటులేదు. భిన్న భిన్న మార్గముల కవితల నల్లగలవా రుందురు, ఉన్నారు. కాని విరుద్ధ మార్గము లొకతల ధరించుట నెందును కానము. విరుద్ధ ప్రస్థానము లొక రొనరింపగానీ యట్లొనరించి యలరింప గల్గుటకానీ అసంభవము. సరి అది యటుండె. ఈ గ్రంథకర్త తల పెట్టిన పని చాలా పెద్దపని. మొత్తము గ్రంథమంతయు బర్యాలోకిత మైనట్లే యున్నది. యోగార్థమున నాపదరీతి చాలవఱకు గుదిరినది. రూఢ్యర్థమునకు సంబంధించిన బీజము లట నట గన్పడును. ఆ మార్గమింకను బాగుగా అలవరచుకొనవలసి యున్నదనుకొందును. ఈ గ్రంథపు రచన ప్రసన్నమై చదువ మొదలిడిన తర్వాత వదలుటకు మనసొప్పని తీరున నున్నది. నేను ప్రొద్దున తొమ్మిది గంటలనుండి రాత్రి పదునొకండు గంటలవరకును దీనిని విడువకుండ, విసువకుండ జదువుటయే యిందుకు నిదర్శనము.

శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులు, సికింద్రాబాదు.
*గోవిందరామాయణ కర్తలు, భారత రాజ్యాంగ చరిత్ర,* 18—8—1958.
*మహాత్మా గాంధీ జీవితము ఇత్యనేక గ్రంథకర్త.*

శ్రీ వెల్దండ ప్రభాకరామాత్యులు ఈ మధ్యనే నాకు పరిచితులు. వీరు వ్రాసిన విష్ణుచిత్తీయ పర్యాలోకనము వచనకావ్యమే వీరి పరిచయమునకు మూలము. పర్యాలోకన గ్రంథము కాకతాళీయముగ లభించినది. దీని నామూలాగ్రముగ జదివితిని.

తదుపరి వీరి భట్టమురారి అనర్ఘరాఘవ పరిశీలన, గీర్వాణ మహాకావ్య చర్చయను శ్రీమద్వేంకటాధ్వరి లక్ష్మీసహస్ర పరిశీలన వ్యాసములను గూడ జదివితిని. వీరు వ్రాసిన "ప్రేమసీమ' 'కావ్యతరంగిణి' యను పద్యకావ్యములను గూడ జదివితిని. గద్య పద్య రచనల రెంటియందును, వీరి కలము సమానధాటితో నడచినది. His Poetry is indeed very rich in melody and heart-pouring of a Natural Poet. మృదు మధురమగు శైలి; సునిశిత విమర్శనము, సహేతుక వాదములు వీరిచేతికిఁ జిక్కినవి. ఇందులకు తగు సాహిత్య సంపద వీరికికలదు.

ఈ మధురకవి భాగవతోత్తముడు, భక్త్యావేశపరుడు, భక్తిచే పరిశుద్ధమైన, అంతః కరణమున స్పందించు భావపరంపరలు, స్వచ్ఛమై మధురమై యుండుననుటకు వీరి రచనలు కూడ తార్కాణములు. చింతామణి వీరి ఉపాసనాదైవతము. ఇక వీరికి కొదువయేమి. ("సాధువర్తనుని - మచ్చింతామణీ మంత్ర సద్గురుమూర్తి న్హృదయాంబుజంబున నుతింతున్ భక్తిపూర్వంబుగన్")అని గురుస్తుతిలో (ప్రేమసీమలో) ఉపాసనాదేవత చింతామణి యని ప్రకటించినారు. వీరి కవితాస్రవంతి చింతామణి హృదయసీమనుండియే ప్రవహించుచున్నది. నన్నయ శ్రీనాథులు వీరి ఆదర్శకవులుగ వీరి పద్య గద్య రచనలు స్ఫురింపజేయును. వీరు పద్యములలోనే కాక, గద్యమునఁగూడ వాడిన సమాసములే "ఆముక్తమాల్యద" యందు వీరికిగల ఆదరాభిమాన - అభిరుచులను వెల్లడించగలవు.

నేటి ఆధునిక కవులు, ఆముక్తమాల్యదవంక జూడ నిచ్చగింపరు. చూడబోరు. ఆధునికులే కాదు పూర్వ సంప్రదాయానుసారముగ విద్య నభ్యసించిన సాహిత్యశేముషీ ధురంధరులకు గూడ విష్ణుచిత్తీయము - ఇనుప గుగ్గిళ్ళవంటిది. ఇందలి శబ్ద కాఠిన్యము, సమాస కాఠిన్యము, నారికేళపాకములు - భీభత్స భయానక దృశ్యములనే ప్రకటించును. కాని కథా సంవిధానమును, భక్తి ప్రపత్తులతో మిళితమైన మధురభావ పరంపరలును, మహోత్తేజకరములు. 'భక్తి'ని రసముగా సనాతన లాక్షణికు లంగీకరింపరైరి. భక్తియు రసమేనని నిరూపింప దాక్షిణాత్య పండితకవులు కొందఱు ప్రయత్నించి సఫలీకృతులైరి. ఆ సఫలీకృత ప్రయత్నమే విష్ణుచిత్తీయ హృదయము.

రాయలు అకుంఠిత వైష్ణవభక్తుడు. తన భక్తి ప్రపత్తుల కనువుగా నుండుటకే విష్ణుచిత్తీయేతివృత్తమును పరిగ్రహించి యుండవచ్చును భక్తినిరసముగా పరిగ్రహించి తన యప్రతిమాన కవితా ప్రతిభచే విష్ణుచిత్తీయమున భక్తిరసము నుద్ఘాటించినాడు. ధృవపరచినాడు. భక్తి స్వరూప సంపదనంతయు నిందు చిత్రించి ధన్యుడైనాడు, గోదాదేవి తన హృదయమందంతర్వాహినిగా నున్న మాధుర్యరస విజృంభణమున ప్రియునియందెట్లు లీనమైనదియు చిత్రించి రాయలు కృతకృత్యుడైనాడు. 'ధన్యోస్మి' అన్నాడు. నవవిధ భక్తి రూపములు విష్ణుచిత్తీయమున గోచరింపగలవు.

ఇట్టి మహోత్కృష్ట ప్రబంధ రాజమునకు గ్రంథకర్త యెవరై యుండనోపు ? ఇది కుశంక ? పెద్దన్నయే యీ గ్రంథమును వ్రాసి రాయలపేరు పెట్టినాడనుట సత్యము కాజాలదు.

పెద్దన్నవి శిరీషకుసుమ పేశల సుధామయోక్తులు; రాయలవి గభీర హిమవన్నగసదృశ శబ్దజాలములు, సమాస పరంపరలు. ఆరితేరిన సుకవి పుంగవుని కలము రీతియందున, ధారయందున, బహుమార్గగామి కాదు. ద్రాక్షాపాకమున కలవడిన కలము పట్టుపట్టి వ్రాయవలె నన్నను నారికేళపాకమున కియ్యకొనదు. వ్రాయను జాలదు.

విష్ణుచిత్తీయమున రాచఠీవి, పరిపాలనాదక్షత, రాజ్యాధికార స్వేచ్ఛ, ప్రతి శబ్దమున, ప్రతి భావమున, ప్రతి పద్యమున, ప్రస్ఫుటముగ నున్నది. ఖడ్గమును, లేఖినిని గూడ నొక్కుమ్మడి చేబట్టగలిగిన ధీరోదాత్తుడే గోచరించుచున్నాడు, ఇందు వ్యాకరణ దోషములు-కాదు- వ్యాకరణమున స్వేచ్ఛా విహారము - సర్వ స్వతంత్రతలు సువ్యక్తము. గీర్వాణాంధ్ర వ్యాకరణ

సూత్రముల నెన్నింటినో స్వేచ్ఛగా జవదాటగలుగువాడు రాజన్యునకుగాక మఱెవరికట్టి సాహస మానాటి కవితాలోకమున ఉదయింపజాలదు.

ఇట్టి వ్యాకరణలోపములతో స్వేచ్ఛా విహారముగ ఆంధ్ర, తమిళ, కన్నడ శబ్దముల గుదిగుచ్చి మహా ప్రబంధరాజమును వ్రాయు సాహసము సామ్రాజ్యాధిపతికిదక్క యన్యుల కలవిగాదు. అథవా, పెద్దన వ్రాసెనని తలంచినను, తాను నిర్దుష్టము, పండిత పామరజన సేవ్య మగు ప్రబంధమును ద్రాక్షాపాకమునందు రచించి, కృష్ణరాజేంద్రునకు అప్పుడై యుండి ప్రౌఢ మగు శైలిలో వ్యాకరణదోష సంకలిత మనబడు నాముక్తము రచించి కృష్ణరాయలపే రిడి, యాతని యనుగ్రహమునకే కాక యాగ్రహమున కెట్లు పాత్రుడు కాకుండెను? పెద్దనయే రచించినచో యాతడు పరమ మాహేశ్వరాచార పరాయణుడును, వైదిక నిష్ఠాగరిష్ఠుండునై మూలమున లేనట్టి మార్పు గావించి, యామునునకు వర్ణాంతర వివాహము గావింపడు. సుక్షత్రియవంశ సంజాత - పాండ్యరాజ సోదరి. ఈ కన్యకను యామునాచార్యులవారికి వివాహము గావింపగల ధైర్య సాహసోపేతుడు రాయలే కావలయును. ఇది మూలమున లేనిగాథ.

తారుణ్యాతిగ చూతనూతఫలయుక్తైలాభిఘారస్వన
ద్ధారాధూపితశుష్యదంబుహృతమాత్స్యచ్ఛేద పాకోద్గతో
ద్గారంపుం గనరార్చు భోగులకు సంధ్యావేళలం గేళి కాం
తారాభ్యంతరవాలుకాస్థిత హిమాంత ర్వారికేళాంబువుల్.

ఈ పద్య మొక్కటి పెద్దన విష్ణుచిత్తీయ గ్రంథకర్తకా డని ముమ్మాటికిని చెప్పుటకు చాలును. "మాత్స్యచ్ఛేద పాకోద్గతోద్గారంపుం గనరార్చు" అను భావము స్వీయానుభవమువల్ల కలుగునదేకాని ఊహ నాశ్రయించుకొనునది కాదు - కాజాలదు - మామిడికాయ, చేపలను కలిపి వండుట - ఆ వంటకము భుజించిన వెడలు త్రేపులు - ఆ త్రేపులు కనరు గా నుండుట స్వీయానుభవమును బహిరంగ మొనరించుటలేదా? ఇది సుక్షత్రియ సంజాతుడు, మహా భోగియు నగు రాయల అనుభవమే కావలయును. పెద్దన కీ రుచిపాకము లెట్లు స్వానుభవ ములు కాగలవు? ఇందలి తిరుగుబోతఘాటు పెద్దన కెట్లు సోకును?

పూర్వకాలమున నేటివలె పుస్తకమును రిజిష్టరు చేసికోవలసిన శాసనము లేదు; సంస్థలును లేవు. ఆయా కవులు వారు వ్రాసిన పుస్తకములలోనే ఆయా కవులు తమ్ముగురించి వ్రాసికొనిన విషయములబట్టియే ఆయా కవుల గ్రంథకర్తృత్వమును మన మీనాడు నిరూపించు కొనగల్గుచున్నాము. వారి తదుపరికవులు పూర్వకవులను స్తుతించుటలో పేర్కొను అంశములు గూడ గ్రంథకర్తృత్వమును నిర్ణయించుటకు వలనుపడుచున్నవి. ఏ గ్రంథమున కైనను కర్తృత్వమును నిర్ణయించుట కీ రెండే మార్గములు. విష్ణుచిత్తీయమున రాయలు సంస్కృతముననే కాక ఆంధ్రమున గూడ నీ ప్రబంధరాజమును రచించినట్లుగా వ్రాసికొనినాడు. రాయ లీ ప్రబంధమును వ్రాసినట్లుగా మారీచీపరిణయమున - ఆతని తనూజాతయే పేర్కొనినది. రాయ లిట్టి ప్రబంధరాజమును వ్రాయగల భాషా ధురంధరుడు గాదందుమా, రాయల సమ కాలికుడు, ఆస్థానకవియగు ముక్కు తిమ్మన్న 'కవితా ప్రావీణ్య ఫణీశా' యని సంబోధించి నాడు. ఇక ఏవిధముగ రాయ లీ గ్రంథమును వ్రాయలేదని చెప్పగలము? భారతము వ్రాసి

నది కవిత్రయము కాదని యేల చెప్పరాదు ? వారే వ్రాసిరని చెప్పుటకు ప్రత్యక్ష ప్రమాణ మేమున్నది ? తదుపరి కవుల వ్రాతలే యిట్టి కుశంకలను దీర్చుటకు శరణ్యముగదా ! ఈ గీటు రాయి యీ విష్ణుచిత్తీయమున కేలవర్తించదు ? ఈ కుశంకలతో రసజ్ఞునకు సంబంధములేదు. కుశంకలతో నిండియుండు వాదోపవాదముల కంతునూ లేదు. సత్యనిరూపణ ముండదు. విజ్ఞుల ధర్మ మేమి ? విష్ణుచిత్తీయమందలి మనోహర భావములను, భక్త్యావేశత ప్తహృదయమును, భక్తిరస నిరూపణ పోషణమును విరివిగా ఆంధ్రలోకమున కందిచ్చుటయే సాహితీపరుల ధర్మము.

ఈ ధర్మమును నెరవేర్చు పూనికయే పర్యాలోకన గ్రంథము. పర్యాలోకనమున విష్ణు చిత్తీయగాథ నంతయు విపులముగా వెల్దంద ప్రభాకరామాత్యుడు వివరించినాడు. రాయల ఆస్థానకవుల యితర గ్రంథములతో విష్ణుచిత్తీయమును పోల్చి చూపించిరి. రాయల కవితా సంస్థానస్వరూపము సక్రమముగా చిత్రించిరి. హంపీ విజయనగరముల ప్రస్తుత జీర్ణావస్థను గూడ స్వానుభవముతో కన్నులకు గట్టునట్లు వ్రాసిరి. రాయలే విష్ణుచిత్తీయ గ్రంథకర్తయని హేతువాదమున నిరూపించిరి. విష్ణుచిత్తీయ పద్య ప్రబంధమును చదువజాలనివారికి ఈ 'పర్యాలోకనము' అరచేతి యందలి యద్దమువలె నున్నది. ఇంతటి మహత్కృషికి పూని విజయవంతముగా వ్రాసిన వెల్దంద ప్రభాకరామాత్యునికి నా ధన్యవాదములు.

శ్రీ వెల్దంద ప్రభాకరామాత్యులు ప్రభుత్వోద్యోగము చేయుచున్నవారు. అయినను సాహిత్య సమారాధన కూడ చేయుచున్నారు. ఇందుల కానందింపజాలని సహృదయు లుండ జాలరు. ఆంధ్ర కవితాలోకమున, 'సమానానాం ఉత్తమ శ్లోకోఽస్తు,' అని ఆంధ్ర కవివతం సులు, విద్వన్మణులు సహృదయులై శ్రీ వెల్దంద ప్రభాకరామాత్యుని ఆశీర్వదింతురు గాత!

ఇక్ష్వాకుల కులదైవతముగా వెలసిన శ్రీరంగధాముడు వీరికి, ఆయురారోగ్యైశ్వర్య ములఁ బ్రసాదించుగాత.

శ్రీ పింగళి లక్ష్మీకాంతము

అలిండియా రేడియో,
విజయవాడ

మీరు పంపిన ఆముక్తమాల్యద పర్యాలోకనము అందినది. చాల కృతజ్ఞుడ. గ్రంథ మును సాంతముగా చదివి చూచితిని.

మీ పరిశ్రమకు చాలా ఆనందించితిని. విషయ వివరణము, రచనా విధానము ప్రశం సార్హముగా ఉన్నవి.

*విమర్శకాగ్రేసర*
శ్రీ కురుగంటి సీతారామయ్యగారు

హైదరాబాదు

ఈ గ్రంథముయొక్క ప్రథమ ముద్రణమునకు పీఠిక వ్రాయుచు "ఇతడు తన విజ్ఞా నము నభివృద్ధిచేసుకొని యితోధిక గ్రంథరచన సాగించు గాక !" యని వ్రాసితిని. అట్లై

చిరంజీవి యొనర్చినాడు. వెనుకటిదానికంటె విషయ వివేచనలోను, చర్చలోను యీ ముద్రణము మిన్నగానున్న దని చెప్పుటకు సాహసించుచున్నాను. సామాన్యముగా తెనుగుగ్రంథము పునర్ముద్రణ మగుట యరుదు. అందును యిట్టి విమర్శనాత్మక గ్రంథము పునర్ముద్రణమైన విషయమే గ్రంథముయొక్క ప్రాశస్త్యమును తెల్పుచున్నది. శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులవంటి పండితుల మన్ననల నందుకొనదగిన గ్రంథముయొక్క గొప్పదనమును వేరే కొనియాడ నవసరములేదు. ఇం దితని బహుగ్రంథపఠన మడుగడుగునకు వ్యక్తమగుచున్నది. భగవంతు డితనికి దీర్ఘాయువు నొసంగి యిట్టి గ్రంథము లనేకములను వ్రాయు సమర్థతను కలుగజేయు గాక యని కోరుచున్నాను.

శ్రీ దిగుమర్తి సీతారామస్వామి, యం. ఏ.
*ఆంధ్రశాఖాధ్యక్షుడు.*

W. G. B. *కళాశాల,*
భీమవరం.

మీరు విశేషాదరముతో పంపిన 'ఆముక్తమాల్యద (పర్యాలోకనము)' చేరినది. చాలా సంతోషమైనది. గ్రంథము నించుమించుగా పూర్తిచేసితిని.

ఇందలి ప్రతి వాక్యము మీకు ఆముక్తమునందు గల నిరుపమాన గౌరవమును చాటినది. ఆంధ్రజాతి రాయలవారికి ఎంతో ఋణపడియున్నది. మీవంటి సహృదయులు కొందరైన తద్విమోచనమునకై జతనము నేత కొనియాడదగినది.

మీ గ్రంథమున మీరు వివాదమును పెంచు సిద్ధాంతములు చాల చేసియున్నారు. కాలక్రమమున ఇది విమర్శకుల కుపాదేయము కాగలదు. — భవతు.

*సరసకవి - సాహిత్యరత్న*
శ్రీ మోచర్ల రామకృష్ణయ్య

*కవితా నికేతనము,*
నెల్లూరు.

నీవు ప్రేమ పురస్సరముగా నా కంపిన "ఆముక్తమాల్యద-పర్యాలోకనము" ద్వితీయ ముద్రణపు ప్రతి చేరినది. చదివితిని.

అచ్చు ముద్దులు మూటలు కట్టుచున్నది—నీవు కావించిన పరిశ్రమ మిక్కిలి అభినందనీయముగా నున్నది — ఇదిగో నా శుభాశంసనము,

గీ. "కృష్ణరాయల మహనీయకృతిని గూర్చి
నీ వొనర్చిన కృషి మాననీయ మగుట
నిజము - సాగర కన్యక నెనరు కలిమి
బొందెదవు నీ వితోఽధికాభ్యుదయ మింక."

తెలంగాణ మహోజ్జ్వలకవి
శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

సికింద్రాబాదు,
14-2-1958.

ఒకనాడీ తెలగాణమందుఁ బరదాస్యోపాత్త భేద ప్రవ
ర్తకులైపోయిన తెల్గుతమ్ముల కభేదస్ఫూర్తి గల్గింపఁగా
నొకఁడై యుజ్జ్వల బోధకుండయి ప్రభూతోద్గ్రంథసంధాన సా
ధకుడై వెల్గినవాడెవండనగ నాతం డొక్క వెల్దండయే.

అనుదును నేను నాడు కవితామృతమున్ నలుదిక్కులందు పం
చిన కవి తన్నుగూరిచి వచించుకొనండదియేమి చోద్యమో
కనుగొన నిప్డు కావ్యకృషికన్న యశః కృషియెల్ల ఇబ్బడై
తనను గుఱించి కాక మఱి తక్కిన సత్కవులం దలంపరే.

కావ్యజీవనులైన సత్కవులనుండి
రావలయు నిట్టి సద్గ్రంథరాజి మనకు
కవికులమ్మున న్యూనాధికములు లేవు
తలప నొక రసాస్వాదభేదమ్ము దక్క.

శ్రీ జూలూరి హనుమంతరావు

కర్నూలు,
19-3-1958.

౧

కమ్మని తేటతెన్గు నుడికారపుఁ దీవలు సాగిపోవ నం
దమ్ముగ సాహితీ సుమ వనమ్ముల నాటుచు భావగంధ పు
ష్పమ్ములు విశ్వరంజనము సల్పునటుల్ వికసింపఁ బుష్పగం
ధమ్మయి వ్యాప్తుఁడౌ సుకవి తల్లిజుఁ డందఱిలోన ధన్యుఁడౌ.

౨

పరుసము విరసము లెఱుగని
సరసుని సరసంపుఁ గైత జాబిలివెలుగుల్
సరసుల విరియుచు నగు విరి
వరుసలవలె విరిసి మురిసి పసలిడు దెసలన్.

౩

ఏదీ తీయని సద్విమర్శనము రాదేః లేదకే యాంధ్ర కా
వ్యోదార ప్రభఁ జిమ్మి చూపుటకు నుద్యోగమ్ము నేడింతగా

లేదా ఓ బుధులార ! ప్రజ్ఞ ? యిఁక నిక్లే ప్రమగ్గిపోనెంతురా ?
రాదా ? ఆంధ్రకవిత్వ వైభవ కళారాకోదయమ్మెన్నడేన్.

౩

రావలె సద్విమర్శనలు ప్రాఁజదువుల్ ఫలియింపఁ బూర్వ కా
వ్యావళిలోని ప్రాజ్ఞతయు నందలి దివ్యరస ప్రసారముల్
దేవలె నాంధ్ర భూజనుల దృష్టికి విశ్వహితార్థమౌచు నే
యే విధముల్ గ్రహింపఁబడి యీ రచనల్ సృజితమ్ము లయ్యెనో.

౪

తెలగాణమ్మునఁ గావ్యరత్న కళికాదీప్తుల్ బ్రకాశింప ని
శ్చల సాహిత్య రసజ్ఞ బాంధవులు నిచ్చల్ సల్పు నుద్యోగ ని
ర్మల దీక్షాతపముం దలంచికొన నబ్రమ్మౌను పాండిత్యమే
బలమై దీప్తరసజ్ఞతాగుణము ప్రాప్తంబైన సాధింపరే !

౫

పొలుపు వహింప నొక్క హిమభూధర ధీమహిమోన్నత ప్రభా
కలితము కృష్ణరాణ్ణృపతి కావ్యము సృష్టి యొనర్చె నాడు పొం
పొలయ విమర్శనం బనుచు నొప్పెడు పూత వియత్తరంగిణిన్
నిలిపెఁ బ్రభాకరాహ్వయుఁడు నేఁడు తెలుంగు జగమ్ము పొంగగా.

౬

ఆదరణీయమౌచు సురసాశ్రిత మౌచును మాధురీ రసా
స్వాదన లంపటుల్ విడని భావములన్ సమకూర్చుకొంచు ని
ర్వాదముగా సమగ్రముగ రంజిలు నీదు విమర్శనంబు స
మ్మోదము గూర్పఁగాత రసమూర్తులు మెచ్చునటుల్ ప్రభాకరా !

౭

అలతి జటిలముకాని దాముక్తమాల్యద
పదము పదము బంధబంధురమ్ము
పడసె నాడె కఠిన బంధప్రబంధమ్ము
పేరు లెటుల వాని విప్పితొగద !

౮

కలికి నడలఁ జిక్కని పద
ముల కూర్పుళ సోయగముల ముదమొలయగఁ గా
వ్యలతాంగి చలనమ్ములు
విలసించెడు నీ విమర్శ వివిధము లౌచున్.

శ్రీ కోతుకూచి సాంబశివరావు 5—3—1958

ఉ. ఏరి మహాకవుల్ ? కలయ నెగ్గడి వారు విమర్శ కాగ్రణుల్
ఏరి ? సరాగ భావనల తేల్చెడి యుత్తమ కావ్యకర్తలున్
ఏరి ? యటంచు సంతతము బీరములాడు ప్రచారకాములే
ఔర యనంగ తప్పదు, సగౌరవ మౌనము నీ విమర్శకున్.

తే. మగువ సౌందర్యవర్ణన ; మారుడొసగు
బాధలను కావ్యమనుటయె మేధకాదు
నారికేళ కావ్యములకు మారులేని
సద్విమర్శలు సాహిత్య సంపదరయ

సీ. మునుపటి తలపుల మొలకలు వృద్ధియై
చిఱుపొత్త మీరీతి చెలువమొందె
ప్రతిభయు పాండితి పరువంబులో పడి
సాహిత్య చింతనే సంతరించె
విష్ణుహృదయమందు విరజిల్లు హారమే
మదిపెగ్గె మాణిక్య మాలభంగి
ఏరీతి దీధితి యెటులవర్తించునో
విమలసాధనతోడ వెడలె రచన
తే. తరచి చూడగ నీ కవితా విమర్శ
మానవాతీత శక్తియే మలిచెనోపు
పండితులు మెచ్చ గ్రంథము వాసికెక్క
శుభము నీకు ప్రభాకరసూరి కులజ !

శ్రీ సింగరాజు లింగమూర్తి హైద్రాబాదు,
5—3—1958.

ఉ. నీ హృదయంబు నిత్య నవనీతముగా కనిపించు నాకు ఐ
నా, హృదయంబులోన భయదావహ రోష బిభీషికల్ యశో
దాహముతోడ చచ్చెడి విధానముపై దయమాలి లేచి నీ
ధీ హననంబు నింపుక ప్రతిక్రియగా నిలబెట్టెనందునా !

తే. కృష్ణదేవరాయల కృతి యెవరికైన
యినుప గుగ్గిళ్ల సమమె, మనన మొనర్చి
సాహితీభక్తితోడ వచనము చేసి
యీ గల అనసూయా ధృతి నెన్నుచుంటి !

తే. యశము వెలిదండ నీకు. నీ కగుతలే ప్ర
భాకరాంశు తనుత్రాణ పరమశక్తి
ఆదరింతురు మనసులోనైన మెచ్చి
అంద రాముక్తమాల్యదు లౌచు నిన్ను :

*బాలకవిశేఖర*
వాకాటి పెంచలరెడ్డి

బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరుజిల్లా.
19–8–1958

తమరు వాత్సల్యపూర్వకముగ బంపిన, ఆముక్తమాల్యద పర్యాలోకనమును సమగ్రముగఁ బఠించి, అందలి యమూల్య విషయముల నవగాహన మొనరించికొంటిని. సాహితీ జిజ్ఞాసతత్పరమతుల కియ్యది కావ్య విమర్శనాజ్ఞానమును ప్రసాదించు ననుట సత్యదూరము కాదు. సమకాలీన కావ్యాంతర్గత విషయములతోఁ బోల్చి మీరు విమర్శించుటవలన, భాషారాధకులు, కావ్యప్రయోజనములను గ్రహించుటేగాక, ఆ కావ్యములనుఁ జదువ నుత్సహింతురు. ఆముక్తమాల్యద "పర్యాలోకనము" అని గ్రంథమునకు నామం బిడితిరి. ప్రప్రథమమున మీరు వ్రాసినది "పర్యాలోకనము" కావచ్చును. కాని యీ గ్రంథము "పర్యాలోకనము" కాదు. ఈ గ్రంథమునకు ఆముక్తమాల్యద "పారిజాతము" అని వ్రాయుట సమంజసమని నా యభిప్రాయము. ఈ గ్రంథములో పరీక్ష విద్యార్థుల కుపయుక్తము లగు ప్రశ్నలకు జవాబులు వ్రాయుటవలన విశ్వవిద్యాలయ విద్యార్థుల కీ గ్రంథము పరీక్షలలో దోహద మొనరించును.

ఆముక్తమాల్యదను విమర్శించినట్లే, పంచకావ్యములను విమర్శించిన, భాషా వధూటికి నెనలేని సేవజేసినవా రగుదురు. తప్పక విమర్శింతురని విశ్వసింతును. ఇంకను గ్రంథములను రచింప రమాపతి మీ కాయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాఁక :

*మహాకవి శిరోమణి, అభినవ పోతన,*
బ్రహ్మశ్రీ చిపుకుల అప్పయ్య దీక్షితులు,
*గర్గభాగవత గ్రంథకర్తలు.*

ఆదర పురస్సరముగాఁ దా మొసగిన "ఆముక్తమాల్యద పర్యాలోకన" యను గ్రంథ మందికొని యవ్యవధిగా నుంట నందం దవలోకించి యానందించితిని. ఏతత్కార్య కర్తృ ప్రభవ, ప్రాభవ, ప్రవర్తన, ప్రతిభా ప్రతాప కవితా కళాకౌశల సంప్రదాయ, సౌజన్య, భక్తి శక్తి సామర్థ్యాది విషయములలో వివిధ విధములుగా విశ్వమునందు వెల్లివిరిసి యున్న విషయంబులం గైకొని యథోచిత గ్రంథాంతరార్యోక్తి హేతుజాత సముపేత రీతులఁ విమర్శించి భవన్నిర్ణీత భావంబుల సమర్థించికొని యుంటిరని స్పష్టీకరింపవచ్చును. తత్తత్స్థలల భావోచిత భవద్వచన రచనయుఁ బ్రశంసాపాత్రము.

చిఱుతతనమునుండి మీకుఁ గల దివ్యవాణ్యాంధ్రభాషాసేవాసక్తి దినదినాభివృద్ధిఁ జెందుచు నేఁటికి గ్రంథరూపముగా వికసించి విజృంభించుచుండుట ముదావహము.

పరమేశ్వరుఁ డింక నిట్టి యుత్తమకోశముల నాంధ్రలోకమున కందించుట కితోధిక దీర్ఘాయురారోగ్య భాగ్య యోగ్యతల నొసంగి మిమ్ము రక్షించుగాక !

శ్రీ శ్రీనివాస సోదరులు,
*శతావధానులు.*

సికింద్రాబాదు
12—9—1958

యువకుఁడు, భావుకుఁడు, సహృదయుఁడు, సాహసి, విశేషించి మిత్రుఁడు నగు ప్రభాకరామాత్యుని గ్రంథమునకు మా యామోద మెప్పుడు నుండునదే. అందును శ్రీకృష్ణదేవరాయ సార్వభౌమ సుపరిష్కృత యగు నాముక్తమాల్యద స్వస్వరూపానుసంధానమునకు ముకురాయమాణమైన పర్యాలోచన మిది. ఒలిచిన యరటిపండు. టెంకాయ కొట్టి ఎడనీరు, పాలమీగడవంటి కొబ్బెరతెర తీసి యిచ్చిన అనుభవించుటకు గ్రుడ్లు మిటకరించువా రుందురా ? ఉండినచో “తే కే న జానీమహే”.

ఇతోధిక పరిశ్రమతో పరిపుష్టమైన, పరిపూర్ణమైన రూపముతో అచిరకాలమున ఈ గ్రంథము పునర్ముద్రణ భాగ్యము నొంది యాంధ్రుల నలరించుఁ గాక ! ప్రభాకరామాత్యుని ప్రతిభాస్ఫూర్తులు—ఆంధ్రవాణీ కంకిణ కింకణులు—పెక్కులు పెక్కు విధముల రవళించి సహృదయానందకందములగుఁ గాక !



# ఆంధ్రసాహిత్యసౌరభము

( ఆముక్తమాల్యదాపర్యాలోకన భూమిక )

'విద్యారత్న'
శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు, యం. ఏ., ఏ. ఇ. యస్.,
భారతీయభాషాశాఖాధ్యక్షుఁడు
ప్రభుత్వమువారి ఆర్ట్స్‌కాలేజి, రాజమహేంద్రవరము.

1957

ఒకనాఁ డీ తెలగాణమందుఁ
బరదాస్యోపాత్తఖేద ప్రవ
ర్తకులైపోయినతెల్గుతమ్ముల
కఖేదస్ఫూర్తి గల్గింపఁగా
నొకఁడై యుజ్జ్వలబోధకుండయి,
ప్రభూతోద్గ్రంథసంధానసా
ధకుఁడై వెల్గినవాఁ డెవండనగ
నాతం డొక్క "వెల్దండయే".

—శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యులు

# 1. ఆముక్తమాల్యద - కథాశరీరము - అంగప్రత్యంగసూచిక

పద్యములు : 99

గద్యములు : 2

మొత్తము 101

తృతీయాశ్వాసము : పద్య. పుట.



పద్యములు : 84

గద్యములు : 9

మొత్తము 93

తురీయాశ్వాసము :

పద్యములు : 265

గద్యములు : 24

మొత్తము : 289

పద్యములు : 151
గద్యములు : 10
మొత్తము : 161



పద్యములు : 61
గద్యములు : 9
మొత్తము : 70

| | | | | |
|---|---|---|---|---|
| పద్యములు : | 61 | (7 ఆశ్వాసములకు) మొత్తము | పద్యములు : | 805 |
| గద్యములు : | 14 | | గద్యములు : | 73 |
| | 75 | | | 878 |

## 2. ముఖభూషణము :

'అలకవినిహితాభిః స్రగ్భి రాకృష్టనాథా
విలసతు హృది గోదా విష్ణుచిత్తాత్మజా నః'—(శ్రీ వేదాన్తదేశికులు)

కావ్యనిర్మాణప్రావీణ్యము, కావ్యరసాస్వాదనకౌశలమును విలక్షణశక్తులు. కావ్యరచనాదక్షులు కొందఱు, కావ్యరసగ్రహణసమర్థులు మఱికొందఱు. పై రెండు ప్రజ్ఞావిశేషములు నొకవ్యక్తియందే యెక్కడనో కాని కన్పట్టవు. బంగారము నీనుశక్తి యొకానొకశిల కుండుచో, సువర్ణప్రాశస్త్యమును బరిశీలించుశక్తి నికషోపలమునకే యుండును.

మంద. 'కశ్చి ద్వాచం రచయితు మలం శ్రోతు మే వాపర స్తాం,
కల్యాణీ తే మతి రుభయథా విస్మయం న స్తనోతి,
నహ్యేకస్మి న్నతిశయవతాం సన్నిపాతో గుణానా
మేక స్సూతే కనక ముపల స్తత్పరీక్షా క్షమోఽన్యః.'

అని యొకకవిశేఖరునిసూక్తిని రాజశేఖరుఁడు కావ్యమీమాంసయం దుల్లేఖించుకొనెను.

సారస్వతాభ్యుదయమునకుఁ గావ్యనిర్మాణ మెంత ముఖ్యమో, కావ్యసమీక్ష యు నంతప్రధానమే. కవిశేఖరులకున్న ప్రాధాన్యము విమర్శతిలకులకు నున్నది. వ్యాఖ్యాతలు విమర్శకులే లేనిచో కవుల కింత ఖ్యాతి, వారికావ్యముల కింత వ్యాప్తియుఁ గలిగెడివే కాదు. కావ్యకుసుమమంజరీసౌరభమునకు సహృదయ గంధవహుఁడే లేనియెడల వ్యాప్తియే యుండదు గదా ? కావ్యారవిందము నందలి మధువు రసికాళిసాహాయ్యముననే యాస్వాద్య మగును. 'కవితాకన్యరసజ్ఞతఁ గవికంటె రసజ్ఞుఁ డెఱుఁగు' నని సూక్తి.

## 3. ఆంధ్ర సారస్వతము - ప్రబంధావతరణము :

ఇంచుమించుగా సహస్రవర్షజీవి యగునాంధ్రసాహిత్యకల్పద్రుమము ప్రాఙ్నన్నయయుగమున నంకురించి, నన్నయాదులదోహదమునఁ బురాణేతి హాసము లగుభారతభాగవతరామాయణాదులరూపమునఁ జిగిర్చి, పుష్పించి, ప్రబంధరూపమునఁ బరిణతఫలముల నందినది. పురాణేతిహాసములు కథాకథన ప్రధానములు. వీనియందుఁ బ్రముఖముగా ధర్మబోధయు. హితోపదేశము, కర్మ జ్ఞానభక్తివైరాగ్యాదికవిచారణయు, నందుల కుపకరించునాఖ్యానోపాఖ్యానప్రాచు ర్యమే కాన నగును గాని, కవితాశిల్పాదు లిం దతివిరళములు. పురాణేతిహాసముల యందు బీజప్రాయముగ నున్న పద్యరచనానైపుణి, రసాలంకారాదివిశేషములు, వ్యంగ్యవైభవము, కావ్యశిల్పము, ఔచిత్యస్ఫూర్తి, కవితాచమత్కారములు, కావ్య గుణములును గ్రమముగాఁ బ్రబంధరూపమునఁ బరిణతి నందినవి. వాల్మీకి రామాయణ మాపాదచూడము ఛందోబద్ధమై పాఠ్యగేయమధుర మైనది. సంస్కృతమహాకావ్యముల కిది యొరవడి యగుటచే సర్గబంధము లగుమహా కావ్యము లామూలాగ్రము పద్యమయములు. కాదంబరీహర్షచరితాదులఁ గృత్యాదిని, కథాశరీరమున నెడనెడ శ్లోకము లున్నను బద్యవైరళ్యమును బట్టి వీనిని మహా కావ్యములందుఁ జేర్పక, కథాఖ్యాయిక లని గద్యకావ్యములుగానే పండితమండలి నిర్ణయించినది. సంస్కృతమహాకావ్యమే యాంధ్రమునఁ బ్రబంధరూపమున నవతరించినది. చక్కఁగాఁ గూర్పఁబడిన (ప్రబద్ధమైన) గ్రంథమే ప్రబంధము. ఇది కేవలకల్పనాత్మకము; ఇతివృత్తప్రధానము గాక వర్ణనాప్రధానము. మహా కావ్యమున 18 వర్ణనము లుండ నిందలివర్ణనలు 22. కేవలకల్పనాకథలు కృత్రిమ రత్నము లని యెంచి, యాంధ్రకవులు సానలఁ దీరినజాతిరత్నము లగు 'సత్కవి కల్పనావిశేషావహపూర్వవృత్తముల'నే గ్రహించి, ప్రబంధముల రచింపఁజొచ్చిరి.

నన్నయతిక్కనలరచనలలో బీజప్రాయములుగా నున్న ప్రబంధసామాన్యలక్షణము లెఱ్ఱనకృతు లగు హరివంశ - నృసింహపురాణాదులలోఁ బ్రస్ఫుటము లగుటచే నీయన ప్రబంధపరమేశ్వరుఁ డను బిరుదము నందెను. నాచనసోముని 'ఉత్తర హరివంశము', నన్నెచోడుని 'కుమారసంభవము', శ్రీనాథునిరచనలు, అందు ముఖ్యముగా 'శృంగారనైషధము' - వీనియందుఁ బ్రబంధలక్షణములు మఱింత పరిస్ఫుటము లైనవి. శృంగారనైషధము నొరవడిగాఁ గొని పెద్దన మనుచరిత్ర మును రచించెను. సంస్కృతమున మహాకావ్య మంతయు శ్లోకబద్ధ మైనను దాని ననుసరించినయాంధ్రప్రబంధములు మాత్రము గద్యపద్యమయములుగా రచింపఁబడు చుండెను. ఆంధ్రవాఙ్మయము గద్యపద్యాత్మకముగా నుదయించె ననఁ దగును. చంపూప్రబంధములయెడఁ గలయాదరము తెనుఁగుకవులకుఁ గేవలపద్యకావ్యములయెడఁ గన్పట్టదు.

## 4. ఆంధ్ర వాఙ్మయము - చంపూప్రాచుర్యము :

'గద్యపద్యమయీ కాచి చ్చమ్పూ రిత్యభిధీయతే'—అని క్రీ. 7 వ శతాబ్దికిఁ జెందిన ఆచార్యదండి కావ్యాదర్శమున (I. 31) నుడివియున్నను, తత్కాలమునఁ గాని, యంతకుఁ బూర్వమునఁ గాని రచింపఁబడిన సంస్కృత చంపూప్రబంధము లలో భట్టార హరిచంద్రుని 'జీవంధరచంపు' వొక్కటే లభించినది. భట్టబాణునిచేఁ బేర్కొనఁబడిన భట్టార హరిచంద్రుఁ డీతఁడే యగుచో నీతని కాలము క్రీ. 5, 6 శతాబ్దు లనఁదగును. లభించిన చంపువులలో నిది ప్రప్రథమ మనఁ జనును. సింహాదిత్యుఁ డనఁబడు యమునాత్రివిక్రముఁడు (క్రీ. 10 వ శతకము) దమయంతీ కథ యనఁబడు 'నలచంపువు' ను రచించెను. ఇది యాశుప్రబంధ మని ప్రతీతి. పిమ్మటఁ బేర్కొనఁబడవలసినవి సోమదేవుని (క్రీ. 10 వ శతాబ్ది) 'యశస్తిలకము' భోజుని (క్రీ. 11 వ శతాబ్ది) 'రామాయణ చంపువు'. స్వయముగాఁ బండితుఁడు, కవిశేఖరుఁడు నగు భోజుఁడు మహామహుఁడు, విద్వద్బాంధవుఁడు, కవిలోకచింతా మణియు నగుటచే, నీతని కీర్తి కౌముదికి, నీతని కావ్యరత్నములకు యావద్భారత దేశవ్యాప్తి వచ్చియుండును. ఇప్పటినుండియు, కవులకు, ముఖ్యముగా దాక్షిణాత్య కవులకు మణిప్రవాళములసంయోగమువలె మనోరమములుగా నుండు గద్యపద్యా త్మకరచనలపై వ్యామోహము ప్రబలఁ జొచ్చెను. భోజునకు సమకాలికుఁ డగు నన్నయయు నీతని ప్రభావమువలెనే కావలయు భారతమును చంపువుగానే రచింప, నీతనిఁ జూచి తిక్కనయు, వీ రిరువురను బట్టి ఎఱ్ఱనయుఁ దమ రచనలను

చంపువులుగానే నిర్మించిరి. తిక్కన ప్రారంభ రచన యగు 'ఉత్తర రామాయణము' మాత్రము నిర్వచనముగానే యున్నది. భోజుఁడు చంపూప్రబంధముల హృద్యత్వము నిట్లు పేర్కొనెను:

'గద్యానుబన్ధరసమిశ్రితపద్యసూక్తిః,
హృద్యాపి వాద్యకలయా కలితేవ గీతిః,
తస్మా ద్దధాతు కవిమార్గజుషాం సుఖాయ,
చమ్పూప్రబన్ధరచనాం రసనా మదీయా'—(రా. చం. I.)

వేంకటాధ్వరి సంస్కృతమున విశ్వగుణాదర్శము మొదలగునాలుగు చంపువుల రచించెను. చంపూరచనలు బుధాస్వాద్యము లని యీ కవి యిట్లు నుడివెను:

'అథత్తే హి తయోః ప్రయోగ ఉభయో రామోదభూమోదయం,
సఙ్గః కస్య హి న స్వదేత మనసో మాధ్వీకమృద్వీకయోః.'
—(విశ్వగుణాదర్శము.)

ఆంధ్రవాఙ్మయమున నాదికవియని పేరొందిన నన్నయకాలమునకే (11వ శ.) చంపూకావ్య వ్యామోహము వ్యాప్తి నందుటచేతచే కావలయు నాతనిరచనయుఁ దరువాతితెనుఁగుకవులలో నూటికిఁ దొంబదిమంది యనుఁడు, తమతమకృతులను చంపూరూపముననే నిర్మింపఁజొచ్చిరి. రాయలకాలమునకుఁ బ్రహతమైన యీ మార్గముననే రాయలును, తదాస్థానకవిమండలియు నెన్నియో చంపూప్రబంధములనే యాంధ్రమున రచించిరి. ఆముక్తమాల్యదయందు మొత్తము గద్యపద్యములసంఖ్య 878: ఇందు 805 పద్యములు, 73 వచనభాగములును గలవు. రాయలు వాడిన వివిధ పద్యజాతులను గూర్చియుఁ నాతని కభిమానపాత్రము లగు పద్యజాతులను గూర్చియుఁ బ్రకరణాంతరమున వివరింపఁబడును.

## 5. ఆంధ్రకావ్యపంచకము - ఆముక్తమాల్యద

గీర్వాణవాఙ్మయతరంగిణిలో నవగాహన మొనరించుటకుఁ బంచకావ్యము లను నైదురేవులను గొన్నిశతాబ్దములక్రిందటనే నిర్ణయించిరి. పంచకావ్యద్వారము ననే సంస్కృతవిద్యార్థి గీర్వాణసాహిత్యమహానదిలోఁ బ్రవేశించి, విహరించుట కొన్నివందల యేండ్లనుండి యాచారముగా నున్నది. ఇట్లు పాఠప్రవచనమున నున్నవి కాళిదాసకావ్యత్రయము—రఘువంశ, కుమారసంభవ, మేఘసందేశములు, ఛత్రభారవికృతకిరాతార్జునీయము, ఘంటామాఘుని శిశుపాలవధ. కాళిదాసకావ్య

త్రయమునకు కాళిదాసత్రయ మనియు వ్యవహారము గలదు. ఈమూఁడుకావ్యము లకు లఘుత్రయి యనియు, కిరాతార్జునీయము, శిశుపాలవధ, శ్రీహర్షుని నైషధీయ చరితములకు బృహత్త్రయి యనియు బంగాళాదేశమున వ్యవహార మఁట. బహుశః, ఆ ప్రాంతములఁ బంచకావ్యములు గాక, షట్కావ్యములు పఠనపాఠన ముల నుండుట సంప్రదాయము కావచ్చును. ఆంధ్రదేశమునఁ గూడ, మేఘ సందేశమును వదలివేసి, తక్కిన కాళిదాసకావ్యములు రెండును, భారవి, మాఘ, శ్రీహర్షులకృతులు మూఁడును గొన్నిప్రాంతములఁ బంచకావ్యములుగా నెన్నఁబడు చుండును. అందువలననే వ్యాఖ్యాతృచక్రవర్తి యగు మల్లినాథసూరి యీ కావ్య షట్కమునకుఁ జక్కనివ్యాఖ్యల రచించెను.

సంస్కృతసంప్రదాయము ననుసరించి తెనుఁగునను పంచకావ్యవ్యవస్థ యేర్పడెను. ఈనియమము రామరాజభూషణ—పింగళిసూరనలకుఁ బిమ్మట వచ్చి యుండును. ఆంధ్ర పంచకావ్యములు : పెద్దన మనుచరిత్రము, రామరాజభూషణుని వసుచరిత్ర, పింగళిసూరనకృతరాఘవపాండవీయము, శ్రీనాథునిశృంగారనైషధము, కృష్ణదేవరాయల 'ఆముక్తమాల్యద' (=విష్ణుచిత్తీయము). ఉత్తరోత్తర ప్రౌఢత్వమును బట్టి యివి యీ క్రమముననే సాధారణముగఁ బఠింపఁబడు చుండెను. సంస్కృతమున బాణుని 'కాదంబరీహర్షచరిత్రములు,' సోమదేవకవి 'యశస్తిలకచంపువు,' మురారి రచించిన 'అనర్ఘరాఘవ' నాటకము, శ్రీ హర్షుని 'నైషధీయచరితము' ను, మహాప్రౌఢకావ్యములై, శాస్త్రీయవిజ్ఞానసంప్రదాయ ములకు, భారతీయసంస్కృతికిని నిధులుగాఁ బేర్కొనఁబడును. మాఘుని శిశుపాల వధయందు నవసర్గములఁ బఠించినవాని కిఁక నవశబ్దమే యుండదని ప్రతీతి. అట్లే 'ఆముక్తమాల్యద' యుఁ బ్రౌఢత్వమున నాంధ్రకావ్యపంచకమున మిన్న; వేదాంతాది శాస్త్రసంప్రదాయములకు గని. ఆంధ్రసంస్కృతియుఁ దాత్కాలికసమాజ పరిస్థితులు నిందుఁ జక్కఁగాఁ జిత్రింపఁబడెను. మాఘమురారులకు సంస్కృతపదజాల మంతయు జిహ్వాగ్రమున నుండె ననిపించును. రాయలకన్ననో యాంధ్రకర్ణాట ద్రావిడభాషల యందలిశబ్దజాలమునందును, సంస్కృతప్రాకృతశబ్దజాలమునందును గూలంకషపైదుష్య మున్నట్లు స్ఫుటముగాఁ గన్పట్టును. మొత్తముమీఁద ఆముక్తమునఁ గవితావైభవముకంటె వైదుషీవైభవము హెచ్చుగా గోచరించును. స్వయముగా విద్వత్కవియు బహుభాషావేత్తయు నగుటయే కాక, బహు శాస్త్ర - కోవిదులతోడను, వివిధభాషలయందు నిష్ణాతులైనవిద్వత్కవులతోడను నిరంతర - విద్యాగోష్ఠియే దీనికి హేతువు కావచ్చును.

## 6. రాయల-కృతులు :

బహుశాస్త్రవేత్తయు, బహుభాషావిశారదుఁడు నగురాయలు సంస్కృతాంధ్ర భాషల రెంటను బ్రచండ కవి. 'ఆముక్తము' నందలి 'పలికితుత్ప్రేక్షోపమలు' (I. 13)† అను పద్యమునుబట్టి రాయలు సంస్కృతమున

౧. జ్ఞానచింతామణి
౨. మదాలసచరిత్రము
౩. రసమంజరి
౪. సకలకథాసార సంగ్రహము
౫. సత్యావధూప్రీణనము (లేక సత్యభామాసాంత్వనము)

ఇంక నేవేవో మధురకావ్యములు రచించి, సహృదయులమెప్పు నందినట్లు తెలియు చున్నది. పై కృతు లన్నియు నుత్సన్నము లగుట మనయభాగ్యము. పై రస మంజరి సాహిత్యవిచారక మగుకృతియో, కావ్యమో తెలియదు. రాయల యాస్థానమునకుఁ జెందినవిద్వత్కవి యని దృఢముగా నమ్మఁదగిన మైథిల దేశవాసి యగుభానుకరుఁడు రచించిన 'రసమంజరి' యను సాహిత్యగ్రంథము భారతవర్షమునం దంతటను బ్రచురప్రచారమున నున్నది. బహుశః రాయల ప్రోత్సాహమువల్లనే *భానుకవి రసమంజరిని నిర్మించెనేమో. ఈ నడుమ మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకాగారమువారికి లభించిన 'ప్రపంచదర్పణ' మను గ్రంథమున

('అల్లసాని పెద్దనార్యేణాపి) ఏవముక్తం రసమంజర్యామ్'
'ఉడురాజముఖీ మృగరాజకటి, ర్గజరాజగతిః కుచభారనతా,
యది సా రమణీ హృదయే రమతే, క్వ జపః ? క్వ తపః ? క్వ సమాధిరతిః'

అను శ్లోక ముల్లేఖింపఁ బడెనఁట.

అందే- 'అల్లసానిపెద్దనార్యేణ సత్యావధూపరిణయే-
'అఙ్గుళీషు కురఙ్గాక్ష్యా శ్శోభతే ముద్రికావళిః,
ప్రోతేవ బాణైః పుష్పేషోః సూక్ష్మలక్ష్యపరమ్పరా.'

ఆముక్తమాల్యదాకర్తృత్వమువలెనే ‡రసమంజరీ - సత్యావధూపరిణయ ములకర్తృత్వమును జనశ్రుతి పెద్దనయం దారోపించి యుండును. ఈగ్రంథములు రాయలరచనలే యైనను పెద్దన వానిని సంస్కరించి యుండుటచేఁ గావలయు

---

† చూ. 'పర్యాలోకనము'—23, 67 పు.

*'భానుకరుఁడు—శ్రీకృష్ణదేవరాయలు' (ఈ. వే. వీ. రాఘవాచార్యులు)—'భారతి' ఫిబ్రవరి, 1952, (పుటలు : 141-44)

‡ భానుకరుఁడే గాక రాయలయాస్థానమునందలిసంస్కృతకవి దివాకరుఁడును 'రసమంజరి' యనుకృతిని రచించెను.

నవి పెద్దనరచనలే యని కొంత యపప్రథ లోకమునఁ గలిగియుండును. రాయల వంటిమహనీయుఁడు కంఠోక్తముగాఁ దా నీగ్రంథముల రచియించితి నని వక్కాణించియుండ నాయనవాక్యముల శంకించి, కుతర్కదుష్పాండిత్యముల సాయమున నీరచనలను పెద్దన కంటఁగట్టుట సమంజసము కాదు.

రాయలు 'ఆముక్త' ను రచించినపిమ్మట జాంబవతీపరిణయ మను నాటకమును రచించెను. అయిదంకములు గల యీరూపకమున స్యమంతకమణి వృత్తాంతము, జాంబవంతునితనయ యగుజాంబవతిని కృష్ణుఁడు పరిణయ మాడుట చిత్రింపఁబడెను. దీని కేకైకమాతృక తంజావూరుసరస్వతీమహల్ గ్రంథాలయమునఁ గలదు. దీనికిఁ బుత్రికలు ఆంధ్రసాహిత్యపరిషత్తునందు (కాకినాడ), శ్రీవేంకటేశ్వరప్రాచ్యగవేషణాలయమునను (తిరుపతి) గలవు. పరిషత్ప్రతిని బట్టి నేను 1934 వ సంవత్సరమున 'సంస్కృతసాహిత్యపరిషత్' పత్త్రికయందుఁ గొంతభాగమును బ్రకటించితిని (అక్టోబరు సంచిక-పు. 159-168) లేఖకదోషజుష్టము, త్రుటితము నగుమాతృక నాధారముగాఁ గొని తక్కిన గ్రంథమును బ్రకటింప వీలైనది కాదు. అసూర్యంపశ్యయగునీ కృతికన్యక మధురవాక్కులు కొన్ని రసికవినోదమునకై యిటఁ జూపఁబడును :

౧. శ్లో. వాసిష్ఠం సతతం దేయా త్తద్వారణముఖం మహః,
యచ్చన్ద్రిమౌశే రానన్దనిష్యన్దం ప్రథమం విదుః.—(జామ్బవతీపరిణయమ్. I. 1.)

౨. శ్లో. సౌఖ్యం సమగ్రయతు నః స జగన్నివాసః,
య స్యోరసి స్ఫురతి కౌస్తుభరత్నహారః,
గాఢోపగూఢకమలాహృదయానురాగ–
నిష్యందబిన్దు రివ నిశ్చలసన్నివేశః. - -(జాం. ప. I. 2, పద్య)

౩. శ్లో. ఆకూతస్మితగర్భ మర్ధవచసా నీవేతి శంస న్మిథో,
రుక్మిణ్యా వదనే రుషా సకుటిలభ్రూవల్లయం(?) వేల్లయన్,
నైషా తన్వి త వేతి రోమలతికాం హస్తాఞ్చలేన స్పృశన్,
ఆవిస్పాధ్వస యానయా సరభసా శ్లిష్టో హరిః పాతు వః. (I. 3.)

౪. శ్లో. లలితతయా మృదులతయా
రాగాతిశయేన నైవ భేదకథా,
నఖరుచిరేవ బిభేత్రీ
హస్తాశోకప్రవాళచోరస్య.

౫. శ్లో. కల్పానోకహపుష్పధూళిపటలైః కృత్వాలవాలస్థితిం,
పుష్ట్రీక్షుప్రకరై ర్వృతిం నదసుధాధారాభిరాసేచనమ్,

మాధుర్యం తరు మారచయ్య మదనక్రీడావనే వర్ధితా,
సిక్తా సూక్తి రియం విపాకవిస్మృతైః కిం తత్ఫలానాం రసైః.

౬. శ్లో. నిసర్గమలినా ద్ఘనా ద్భవతి విద్యుదుద్ద్యోతినీ,
స్వభావకఠినా ద్గిరేః కుసుమితా జలా (లతా?) జాయతే,
తరఙ్గగణభీషణా దభవ దమ్బుధే రిన్దిరా,
తరో ర్విటపసంకటా త్తరుణమఞ్జరీ జృమ్భతే.

౭. శ్లో. వరాహవ్యూహోఽయం, గవయతతి రేషా, మృగపతి-
వ్రజోఽయం, సంఘాత స్తరుణశరభాణా మయ మయమ్,
గణో భల్లూకానా మయ మిహ నికాయః కరటినాం
సమూహో వ్యాఘ్రాణా మయ మిహ మృగాణాం సముదయః (1. 30 ప.)

౮. శ్లో. ఉల్లోలేక్షణ మున్నమయ్య వదనం నిష్పన్దకర్ణద్వయం,
దేహ స్యార్ధ ముదస్య పూర్వ మపరం చానమ్య గాఢాన్తరః,
వేగోద్రేకవశా దలక్ష్యచరణన్యాసః క్షితౌ భూయసా,
వల్గన్, వ్యోమ్ని చ ధావతి ప్రతిపదవ్యావృత్తకణ్ఠో మృగః— (I. 34)

భరతవాక్యము :

౯. శ్లో. ధర్మః పాదచతుష్టయేన కృతవత్ స్థైర్యం సమాలమ్బతాం
చాతుర్వర్ణ్య ముపైతు కర్మ సతతం స్వస్వాధికారోచితమ్,
శేషక్ష్మాధరనాయకస్య కృపయా సప్తార్ణవీమధ్యగాం,
రక్షన్ గా మిహ కృష్ణరాయనృపతి ర్జీయాత్ సహస్రం సమాః'

సకలకళాభోజరాజవిభవ - మూరురాయరగండ - శ్రీకృష్ణదేవమహారాయవిరచితం జాంబవతీకల్యాణనాటకే పంచమాకః సమాప్తం'

పైపద్యములలో 'ఉల్లోలేక్షణమ్' (8 ప.) అనునది, 'గ్రీవాభఙ్గాభిరామం' అను 'శాకుంతలము' (I. 7 ప.) నందలిశ్లోకమునకుఁ బ్రతిధ్వని ప్రతిబింబములవంటిది. పాణిని రచించినజాంబవతీవిజయము (లేక జాంబవతీహరణము - పాతాళవిజయము) అను మహాకావ్యమును, ఏకామ్రనాథుఁడు (తెలుగునాఁటిసంస్కృతకవి —16 వ, 17 వ శతాబ్దములు) రచించిన 'జాంబవతీపరిణయ' మను మహాకావ్యము నిట స్మరింపఁదగును. వీ రిరువురరచనలును మహాకావ్యములు, రాయలకృతి రూపకము.

రాయ లుషానిరుద్ధుల వివాహమునుగూడ 'ఉషాపరిణయ'మను నాటకమునఁ జిత్రించెను. ఈ కృతిరత్నము కూడ సూర్యాలోకభాగ్యము నందలేదు. దీనిప్రతి

వనప్రశస్తిసంస్థాన గ్రంథాలయమునఁ గలదఁట. మనోహర మగు నీ యితివృత్తమును గైకొని సంస్కృతకవు లనేక కృతులు రచించిరి. వామనభట్టబాణుఁడు, రుద్ర దేవుఁడు, హర్షనాథుఁడు, గుండు రామస్వామి కవియు నీవస్తువును స్వీకరించి నాటకముల రచించిరి. కృష్ణకవి, త్రివిక్రమకవి యీ కథను మహాకావ్యములుగా రచించిరి. ప్రఖ్యాత కేరళదేశ సంస్కృతకవి రామపాణివాదుఁ డీ కథను గైకొని 'ఉషానిరుద్ధ' మను ప్రాకృత కావ్యమును రచించెను. ఎన్నో సంస్కృతకావ్య నాటకముల రచించిన రాయ లాంధ్రవిష్ణు ప్రోత్సాహమున, నుద్బోధనమున నాంధ్రమున 'ఆముక్తమాల్యద' ను రచించెను. సంస్కృతసారస్వతసాగరమున విహరించినమాత్రమున నెవరికిని, ఆంధ్రవాఙ్మయతరంగిణిలోఁ జక్కఁగా నీఁదులాడనిచో, ఆంధ్ర ప్రబంధ నిర్మాణకౌశల మలవడదు. కావున, నప్పటికే రాయ లాంధ్రభాషావాఙ్మయములయందుఁ గఠోరవ్యాసంగ మొనరించి యుండుటచే భగవదాజ్ఞను మాలికనువలెఁ దలఁదాల్చి, వెంటనే యాముక్తమాల్యదను రచింప నుపక్రమించెను. రాయలు సంస్కృతమున రచించిన కావ్యషట్కమునఁ దృటిత మగు జాంబవతీపరిణయమును, ఆంధ్రమున నిర్మించిన 'ఆముక్తమాల్యదయు' మాత్రమే మనకు దక్కినవి.

## 7. రాయలబిరుదములు—శేముషీవైదుష్యములు :

'భూపాలమౌళిమాణిక్య రంజితాంఘ్రిద్వయాంబుజుఁడు' ను, దక్షిణభారత చక్రవర్తియు నగురాయల కీర్తించిబిరుదము లున్నట్లు శాసనములనుబట్టి తెలియు చున్నది :

'మహారాజాధిరాజ - రాజపరమేశ్వర - శ్రీవీరప్రతాప - పరిభూతసురత్రాణ - యవనరాజ్యస్థాపనాచార్య - మూరురాయరగండ - అరిరాయవిభాడ - అష్టదిక్కు రాయమనోభయంకర - భాషగెతప్పువరాయరగండ - పూర్వదక్షిణపశ్చిమసముద్రా ధీశ్వర' శ్రీకృష్ణదేవరాయలు. వీనిని బట్టి రాయలకీర్తిప్రతాపములు, సామ్రాజ్య విస్తృతి వైభవాదులు తెలియుచున్నవి.

నిశితధిషణాసంపన్నులై, శస్త్రశాస్త్రప్రతిష్ఠ నందినప్రాచీన భారతవర్ష ప్రభుపుంగవులలోఁ గొలఁదిమందిలో రాయ లొకఁడు. హర్షవర్ధనుఁడు (క్రీ. 7 వ శతాబ్ది) భోజుఁడు (క్రీ. 11 వ శతాబ్ది), కాశ్మీరమహారాజు హర్షుఁడు (క్రీ. 11 వ శతాబ్ది) రాయలు నొక కక్ష్యకుఁ జెందుదురు. వీ రందఱును సంస్కృతమున విద్వత్కవులే.

సంస్కృతగద్యకవిసార్వభౌముఁడగు భట్టబాణుఁడు తనకవిత కుపఘ్న తుల్యుఁడగు హర్షవర్ధనచక్రవర్తి నిట్లు వర్ణించెను :

'హర్షవర్ధనస్య త్యాగ స్యార్థినః, ప్రజ్ఞాయాః శాస్త్రాణి, కవిత్వస్య వాచః, సత్త్వస్య సాహసస్థానాని, ఉత్సాహస్య వ్యాపారాః, కీర్తే ర్దిఙ్ముఖాని, అనురాగస్య లోకహృద యాని, గుణగణస్య సంఖ్యా, కౌశలస్య కలా, న పర్యాప్తో విషయః.'

['There is not a sufficient number of suppliants for his liberality—i.e. to enable him to exercise his liberality to the fullest. All the *Sastras* do not give sufficient employment to his intellect. Language fails to give adequate expression to his poetic gifts. ... ... The 64 *kalas* did not exhaust his skill.'] Prof. P. V. Kane's notes–p. 157– in his ed. of the *Harsha-caritam*—Vol. I (1918)

పై వర్ణనము రాయలకును నన్వయించును. ఇఁక రాయలవైదుషీగరిమను గూర్చి యాలోచించిన నీ మహనీయునకు శ్రుతిస్మృత్యుపనిషత్తులు, భాష్యసహిత ప్రస్థానత్రయము, నాలాయిర మనుదివ్యప్రబంధము, సర్వదర్శనసారసంగ్ర హము, భగవద్రామానుజాచార్యాది వైష్ణవపూర్వాచార్యుల గ్రంథములు, పురాణేతి హాసములు, జ్యోతి స్సంగీత వైద్య రాజనీతి శాస్త్రములు, కాళిదాస భవభూతుల - మాఘభారవుల - హర్ష భట్టబాణాది పూర్వకవుల సంస్కృతకావ్య నాటకములు - ఇత్యాది పూర్వవాఙ్మయమునఁ గూలంకషవైదుష్య మున్న ట్లాయనప్రబంధమును బట్టి విశదమగును. సర్వతోముఖము, తలస్పర్శము నగు నింతటి పాండిత్యము రమారమి నలువదేండ్లు జీవించిన రాయల కెట్లు సంక్రమించినదా యని మన కాశ్చర్యము కలుగవచ్చును. సాంద్రశాస్త్రారణ్యములఁ జొచ్చుకొని పోవునిశిత ధిషణాపాటవము గలరాయలు గురుకులవాసమువలనను, నిరంతరగ్రంథ వ్యాసంగమువల్లను బడసిన వైదుష్యము, నిరంతరకవితావినోదములఁ బట్టియు, సాహిత్యగోష్ఠులవల్లను, శాస్త్రచర్చలను బట్టియు నిగ్గుతేరి యుండును. ప్రాగ్జన్మ సంస్కారము కూడ దీని కెంతో తోడ్పడి యుండును. 'తాం (పార్వతీం) ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః'– అని కదా కాళిదాససూక్తి ! అట్లే రాయలును తియ్యనీటికిఁ జేఁప యెక్కినట్లు పాండితీపర్వతసోపానపరంపర ననాయాసముగ నచిరకాలముననే యెక్కి, పాండిత్యపరమావధిని జేరి యుండును. కవితార్కిక సింహ వేదాంతదేశికవిద్వత్కవి (క్రీ. 1268-1369) 'వింశత్యబ్దే విశ్రుతనానావిధ విద్యః' అని- అన్నివిద్యలును దమ కిరువదేండ్లయీడునకే పూర్తి యైనట్లు

చెప్పుకొని యున్నారు. అట్లే రాయల నాప్రాంతముననే సకలవిద్యావిశారదుఁడై యుండనోపు. రాయలదర్బారున నాట్యాచార్యుఁడగు బండారు లక్ష్మీనారాయణ కవి 'సంగీతసూర్యోదయము'న

* 'బాల్యేఽసౌ సకలకలాకలాపయుక్తః'–

అని రాయలపాండిత్యగరిమను బ్రశంసించెను.

## 8. ఆముక్తమాల్యదాకర్తృత్వము – రాజ్యపాలకులలో విద్వత్కవులు :

ఆముక్తమాల్యదానిర్మాత కృష్ణదేవరాయ లగునా, కృష్ణదేవరాయలు కవి యగునా ? ఇత్యాదిచర్చలు వాఙ్మయరంగమున సప్తతిసంవత్సరములనుండియు నెడనెడ బయలుదేరినవి. ఈ విషయము ప్రకృత 'సమాలోకము' న ద్వితీయ ప్రకరణమున (పు. 22-32) చర్చింపఁబడెను. శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి చరణులు 'ఆముక్త' భూమికలో దీనిని గూర్చి కొంతవఱకుఁ జర్చించిరి. ( 68—72 పు. ) రాయలు మహావిద్వాంసుఁడు, ప్రతిభానిధి, పరమభాగవత శిరోమణి. ఆయన శ్రీకాకుళక్షేత్రమున నాంధ్రమధుమథనుని సేవించి, హరివాసరోపవాసం బచ్చటఁ గావింప, నాఁటిరాత్రి యాంధ్రమహావిష్ణు వాతనికిఁ గలలో సాక్షాత్కరించి, యాతనిఁ బ్రశంసించి, యాంధ్రమున నొకకృతిని రచించి యిష్టదైవ మగువేంకటేశ్వరస్వామికిఁ గృతి యి మ్మనియు, వేంకటేశ్వర స్వామియుఁ దాను నభిన్ను లనియుఁ జెప్పె నఁట. ఈస్వప్నకథ యంతయు నసత్య మనియు, రాయ లసత్యవాది యనియు, పెద్దనచే రచింపబడిన ప్రబంధ మును దాను స్వకృతముగాఁ బ్రకటించుకొన్న యభాగ్యుఁ డగు కవితాచోరుఁ డనియు నిందారోపణము చేయువాఁడు సహృదయుఁడు కాఁజాలఁడు. రాయల యితరరచనలు నష్టమైనను జాంబవతీపరిణయ మనుసంస్కృతరూపకము లభించెను గదా. దానిని బట్టి, రాయల కావ్యనిర్మాణకౌశలమును శంకింపఁ జాలము. కంఠోక్తముగా నామహనీయుఁడు చెప్పుకొనినదానిని నిరసించి, యితరుల వాక్య ముల విశ్వసించి, పెద్దనయే యాముక్తమును రచించె ననుట దారుణము. రాయల

* పంచప్రకరణాత్మక మగు 'సంగీతసూర్యోదయము' రాయల కంకితముగా లక్ష్మీ నారాయణకవిచే నిర్మింపఁ బడినశాస్త్రగ్రంథము. [చూ. డాక్టర్ మా. కృష్ణమాచార్యులవారి 'సంస్కృత వాఙ్మయచరిత్రము,—1937]

కృతి పెద్దనమనీషానికషమునఁ బరిష్కృతము కావచ్చును. అంతమాత్రమున నిది పెద్దనరచన యనుట యసమంజసము.

గీర్వాణవాఙ్మయమున వైదుషీభూషితులు, కావ్యనిర్మాణపటిష్ఠులు నగు రాజ్యపాలకులగ్రంథము లెన్నియో మనకు లభించినవి. రాజ్యపాలకులలో సంస్కృతమునఁ గాని, ప్రాకృతమునఁ గాని గ్రంథనిర్మాత లేఁబదిమందివఱకు నున్నట్లు నాగవేషణఫలముఁగఁ దెలియవచ్చినది.

భోజుఁడు, సింగభూపాలుఁడు, వేమభూపాలుఁడు, కుమారగిరి మొదలగు వారు సాహిత్యగ్రంథకర్తలు.

యశోవర్మ, విశాఖదత్తుఁడు, శూద్రకుఁడు, హర్షవర్ధనుఁడు, భీమటుఁడు, అనంగహర్షమాయురాజు, మహేంద్రవిక్రమవర్మ, కులశేఖరవర్మ, ఇమ్మడిదేవ రాయలు మొదలగువారు రూపకరచయితలు.

ప్రవరసేనుఁడు, కుమారదాసకవి మొదలైన ప్రభువులు మహాకావ్యకర్తలు.

సముద్రగుప్తుడు, హాలసాతవాహనుఁడు, భర్తృహరి, కులశేఖరాళ్వారు మొదలగుమూర్ధాభిషిక్తులు లఘుకావ్యనిర్మాతలు.

శ్రీవర్ధదేవుఁడు, నాన్యదేవుఁడు. హరిపాలుఁడు, జగదేకమల్లప్రతాప చక్రవర్తి. కోమటి వేమభూపాలుఁడు, రఘునాథభూపాలుఁడు మొదలైన ప్రభుపుంగవులు సంగీతాదిశాస్త్రకర్తలు.

దుర్వినీతుఁడు, కుంభరాణా, అర్జునవర్మ, కాటయవేమభూపాలుఁడు మొదలగుకిరీటవారులు వ్యాఖ్యాతలు.

పాశ్చాత్యవాఙ్మయములందుఁ గూడ గ్రంథనిర్మాతలు కవులు నగు ప్రభుశిరోమణు లనేకు లున్నట్లు తెలియుచున్నది.

డేవిడ్‌ప్రభువు (King David, the Hebrew psalmist), రోమన్‌చక్రవర్తి జూలియస్‌సీజర్ (Julius Caesar), మార్కస్ అరీలియస్ (The philosophic Emperor, Marcus Aurelius of Rome) మహామహుఁ డగు ఆల్‌ఫ్రెడ్ ప్రభువు (King Alfred, the Great of England), జేమ్సు ప్రభువు (James VI of Scotland and I of England), మహామహుఁ డగు జర్మనీ చక్రవర్తి ఫ్రెడరిక్ (Frederic, the Great of Prussia), ఫ్రాన్సుదేశచక్రవర్తియు, యూరప్‌ఖండమున కేకచ్ఛత్రాధిపతియు నగునెపోలియన్(Napoleon I) మొదలగు మహాప్రభువులును సామ్రాజ్యాధినేతలును గ్రంథనిర్మాతలును కవులునై విఖ్యాతి నందినపాశ్చాత్యులు.

మహమ్మదీయులలోఁ గూడఁ గవితానిర్మాణకౌశలము గల ప్రభువరేణ్యులు గలరని తెలియుచున్నది. తైమూరు (Tamerlane or Timur), ఢిల్లీలో మొగల్ సామ్రాజ్యపీఠము నధిరోహించిన బేబరుచక్రవర్తియుఁ గవితాప్రావీణ్యము కలవారు. బేబ రాత్మచరిత్రను రచించుకొనెను. ఈతఁడు గద్యపద్యములను పెర్షియన్ భాషలో ధారావాహికముగా నిర్మించుచుండుటే కాక, గుఱ్ఱముమీఁద స్వారిచేయుచుఁ గూడ నాశువుగాఁ బద్యములు కూర్చెడివాఁడఁట. ఈతని ప్రపౌత్త్రుఁడగు జహంగీరుచక్రవర్తియు పెర్షియన్‌భాషలోఁ గవియై, తనయనుభవములను గ్రంథముగా నిర్మించెనఁట. దీనినిబట్టి సామ్రాజ్యాధిపత్యమును కవితారాజ్యాధిపత్యమును తేజస్తిమిరములవలెఁ బరస్పరవిలక్షణములు గావనియు, మహారాజులు రాజాధిరాజులును మహాకవులగుట విడ్డూరము కాదనియుఁ దెలియుచున్నది. కావున, రాయలగ్రంథరాజములకర్తృత్వమును పెద్దనయం దారోపించినచో నుభయులకు మహాపచారము నొనరించుటయే యగును.

## 9. రాయలవిద్వత్కవిపోషణము - అష్టదిగ్గజములు :

మహారాజులకీర్తియు, మహాకవికోవిదులయశస్సును బరస్పరాశ్రితములు, తాను బడసినయఖండదిగ్విజయములకంటె నిరంతరవిద్వత్కవిపోషణమువల్లనే రాయల కజరామర మగుకీర్తి లభించెను. దీనికిఁదోడు రాయలు స్వయముగా మహాకవి, మహాపండితుఁడు, బహుభాషావేత్త.

బిల్హణమహాకవి తనకవిత యంతగా మనోహరము కాకపోయినను విఖ్యాతమహారాజచరిత్ర నభివర్ణించుటవలనఁ దనకావ్యము మాననీయ మగు నని నుడివి, కవులకు మహారాజాశ్రయము ముఖ్య మని హితోపదేశ మొనరించెను :

శ్లో. 'గిరాం ప్రవృత్తి ర్మమ నీరసాపి
మాన్యా భవిత్రీ నృపతే శ్చరిత్రైః,
కే వా న శుష్కాం మృద మభ్రసిన్ధు-
సమ్బన్ధినీం మూర్ధని ధారయన్తి' —(విక్రమాంకదేవచరితము, I. 28)

మహాకవులకవితాలతకు మహారాజులుపఘ్నతుల్యు లని నుడివి, మహాప్రభువులకు నిట్లు హితోపదేశ మొనర్చెను :

శ్లో. 'పృథ్వీపతేః సన్తి న యస్య పార్శ్వే
కవీశ్వరా స్తస్య కుతో యశాంసి,

భూపాః కియన్తో న బభూవు రుర్వ్యాం
జానాతి నామాపి న కోఽపి తేషామ్.

శ్లో. లఙ్కాపతేః సఙ్కుచితం యశో యద్
యత్కీర్తిపాత్రం రఘురాజపుత్త్రః,
స సర్వ ఏ వాదికవేః ప్రభావః
న కోపనీయాః కవయః క్షితీన్ద్రైః'– (వి. దే. చ. I. 26-27)

శ్లో. 'కవినా చ విభు ర్విభునా చ కవిః
కవినా విభునా చ విభాతి సభా;
మణినా వలయం, వలయేన మణి
ర్మణినా వలయేన విభాతి కరః.'

ఈవిషయము లన్నియు నెఱిఁగినరాయలు విద్వత్కవికోకిలకల్పద్రుమమై విఖ్యాతి నందెను. విద్వాంసులకుఁ గవులకు సమ్మానసమయమున రాయలచేతి కెముక లే దఁట. ఆయనవితరణ మేనుఁగుపాఁడి యఁట. తద్వితరణవైభవము లొల్ల లక్ష్మీధరపండితుఁ డిట్లు వర్ణించెను :

శా. 'శ్రీకృష్ణక్షితిపాలదత్తమణిభి ర్విద్వత్కవీనాం గృహా
నానారత్నవిచిత్రకుట్టిమభువో రత్నాకరత్వం గతాః,
అబ్ధిః కేవలవారిపూరనిలయ స్సంభాష్యతే సజ్జనై
రమ్భోధి ర్జలధిః పయోధి రుదధి ర్వారాన్నిధి ర్వారిధిః' *

రాయలయాస్థానమునకు 'భువనవిజయ' మని పేరు. ఆస్థానము నందలి విద్వత్కవులలో నుద్దండుల నెనమండుగుర నెంచి, వారిని రాయ లష్టదిగ్గజ బిరుదముతో వ్యవహరించెడివాఁడు. ఈయష్టదిగ్గజములలోఁ జేరినవారెవరు? వీ రందఱును దెలుఁగుకవులా? లేక, ఆంధ్ర కర్ణాట ద్రావిడ సంస్కృతకవులా యనునది క్లిష్టసమస్య. రాయలు కడపమండలము నందలి తిప్పలూరు అను గ్రామమును సర్వాగ్రహారముగా 'అష్టదిగ్గజకవీశ్వరు'లకు దానము చేసినట్లు క్రీ. శ. 1528 వత్సరమునకుఁ జెందిన తిప్పలూరిశాసనమునఁ గలదు. మఱియు, మైసూరుప్రాంతమున నందిదుర్గలో సోమేశ్వరాలయము నందలికృష్ణదేవరాయల శాసనమున అష్టదిగ్గజప్రశంస కలయీక్రిందిశ్లోకమును శ్రీ ప్రభాకరశాస్త్రిగారు ప్రచురించిరి.

---

* 'చాటుపద్య మణిమంజరి' —2 భా. ౬౪ పు. (1922)- శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి సంపాదితము.

శా. 'యత్కీర్తిర్భువనైకభూషణ మభూ ద్యస్యప్రసాదా న్నరా
స్సర్వే రాజసమానతా ముపగతాః, సంప్రాప్య విత్తం బహు,
య స్యాష్టౌ కవిదిగ్గజాః పృథుయశోభారా జగచ్ఛోభనా
యద్దానోదకసామ్య మేవ సరితా మాసేతుశీతాచలమ్.'†

ఈయష్టదిగ్గజసంప్రదాయము కృష్ణరాయలకాలమునుండియు వ్యాప్తికి వచ్చిన దనియు, గోల్కొండనవాబుల యేలుబడిలో నున్నసంస్థానములలో అష్టదిగ్గజకవు లుండెడివా రనియు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు 'అష్ట దిగ్గజము' లను వ్యాసమున వ్రాసి, పెద్దాపురసంస్థానమునందును, కార్వేటినగర సంస్థానమునందును గొంతకాలముక్రిందట విలసిల్లిన 'అష్టదిగ్గజము'ల సూచిక నొసఁగినారు. ఆపట్టిక క్రింద సూచింపఁబడుచున్నవి.*

కార్వేటినగరాస్థానము (శ్రీ మాకరాజు పెరుమాళ్ళురాజుకాలము):

౧. అప్పయకవి (పాలమంగలము)
౨. అప్పయాచార్యులు (ముదుంబ)
౩. వీరరాఘవకవి (రాయభట్లు)
౪. వేంకటనారాయణకవి (ఋగ్వేదికవి)
౫. వేంకటరాయకవి (పోలిపెద్ది)
౬. వేంకటాచలకవి (ఋగ్వేదికవి)
౭. శ్రీశైలకవి
౮. సారంగపాణి

పెద్దాపురసంస్థానము నందలి అష్టదిగ్గజములు:

౧. ఘోరకవి
౨. త్వరకవి
౩. దిట్టకవి
౪. నిమిషకవి
౫. బంధకవి
౬. మధురకవి
౭. శతఘంటకవి
౮. శృంగారకవి

కాని, రాయలకాలమునుండియు అష్టదిగ్గజసంప్రదాయము వ్యాప్తమైన దను వేంకటరావుగారి యభిప్రాయము సరి కాదు. ఇంతకుఁ బూర్వపూర్వకాలముల యందలిసాహిత్యచరిత్రములఁ బరిశీలించిన నీయంశము విశద మగును దాక్షిణాత్య శ్రీవైష్ణవ పూర్వాచార్యు లగు మణవాళమహాముని(=వరవరముని=రమ్య జామాతృముని=సౌమ్యజామాతృముని) శక. ౧౨౯౩ (=క్రీ. శ. 1370) వత్సర మున నవతరించి, శక. ౧౩౬౬ (క్రీ. 1443) లోఁ బరమపదించిరి. వీరికిఁ

† శ్రీ ప్రభాకరశాస్త్రిగా రీశాసనమును ముక్త్యాలనుండి ప్రకటింపఁబడు 'సరస్వతి' యను మాసపత్రికయందు (I సంపు. 6 సంచి. ౮ పు.) - 1923 - ప్రకటించిరి. ఈశాసనము తిరిగి శ్రీ టి. యల్. నరసింహారావుగారిచేఁ బరిష్కృతమై, ప్రకటింపఁబడెను.

* 46 వ ఉగాదిసంచిక (1955—56 - మన్మథ) - పు. 73—79

బరశ్శతశిష్యులు గలరు. అందీక్రిందివిద్వాంసులు అష్టదిగ్గజము లని ప్రఖ్యాతి నందిరి.*

౧. అప్పిళ్లాన్.
౨. అప్పిళ్ళై (యతిరాజవింశతికి, 5 తిరువన్తాదులకు వ్యాఖ్యాత)
౩. ఎరుంబి అప్పా (సంస్కృత విద్వత్ ప్రకాండుఁడు: వరవరముని దినచర్యా - శతకముల రచయిత)
౪. కోయిల్ - కన్దాడై - అణ్ణన్.
౫. తిరువేంగడజీయర్.
౬. పత్తంగి - పరవస్తు - పట్టర్పిరాన్ జీయర్ (అన్తిమోపాయనిష్ఠపై వ్యాఖ్యానకర్త)
౭. ప్రతివాదిభయంకరం అణ్ణన్ (అష్టశ్లోకీవ్యాఖ్యాత; కాంచీపురము)
౮. వానమామలై జీయర్ (వానమామల మఠప్రతిష్ఠాపకుఁడు)

ఇంకను వరవరమునిగోష్ఠిలోఁ దొమ్మండుగు రాచార్యపురుషులు 'నవ రత్నము' లనుబిరుదము నందిరి. కాని, వారి నామములు మాత్రము ప్రకృతము లభింపలేదు.

శ్లో. 'ఆయాత్యయం వరవరో ముని రష్టభిస్తైః
దిగ్దంతిభిః పరివృత స్తవ పాదపద్మమ్
స్తోతుం భవాంతరవిహంతృసుమంత్రరత్న-
శ్రీమత్పరాంకుశగురో తవ సుప్రభాతమ్'.†

క్రీ. 15 వ శతాబ్దాదిని, కాలికట్ నగరమున 'జమోరిన్' సంస్థానమును మానవిక్రమమహారాజు పరిపాలించుచుండెను. ఈయనయాస్థానమున పదునెన మండ్రున్నర కవు లుండెడివారు (Eighteen and Half Poets). కాని యీకవి మండలికిఁ బ్రత్యేకబిరుదనామ మేదియు లేదు. ఇందు 18 గురు సంస్కృత కవులు; పున్నట్టు నంబూద్రి సంస్కృతమళయాళమిశ్ర మగుమణిప్రవాళభాషలో గ్రంథరచన మొనర్చుటచే నర్ధసంస్కృతకవిగాఁ బరిగణింపబడెను.‡

---

* 'ఉపదేశరత్నమాలా' - ఆంగ్లపీఠిక. (Ananda Press, Madras) by Prof. M. T. Narasimha Aiyangar. (1910)

† పరాంకుశ సుప్రభాతమ్.

‡ కావ్యవినోద, శారదా విలాస, సరస్వతీ హృదయాలంకార, సాహిత్య రత్నాకర, సాహిత్య సుధాకర, సాహిత్య వాచస్పతి, సాహిత్య విద్యాధర, కవికావ్య కథాసరి త్సాగర డాక్టర్ మాడభూషి కృష్ణమాచార్యులవారు; (M.A.,Ph.D.,M.L.,M.R.A.S) తిరుపతి. 'లౌకిక సంస్కృత వాఙ్మయ చరిత్ర' (1937) పుట 250, Para 168.

క్రీ. శ. 12 వ శతాబ్దిలో వంగదేశమును (గౌడదేశము) పాలించినమహారాజ లక్ష్మణసేనునియాస్థానము 'పంచరత్నము' లని పేరొందిన యైదుగురుమహా కవులచే నలంకరింపఁబడెను, వారినామములు :

౧. ఉమాపతిధరుఁడు (ప్రధానమంత్రి)
౨. గోవర్ధనాచార్యుఁడు.
౩. జయదేవుఁడు (గీతగోవిందకర్త)
౪. ధోయీకవిచక్రవర్తి (పవనదూత నిర్మాత)
౫. శరణకవి.*

విశిష్టాద్వైతమతోద్ధారకు లగు భగవద్రామానుజాచార్యులవారిసన్నిధిని (క్రీ. 1017–1137) కూడ అష్టదిగ్గజములనుమహాపండితు లుండెడివా రని తెలియుచున్నది ; ఇందు ముఖ్యులు రామానుజులయాప్తశిష్యు లగు ఆంధ్ర పూర్ణులు (=వటుపూర్ణులు).

"Vatupurna is thus assigned a place in the inner circle of Ramanuja's hierarchical institutions, called the Asta-diggajas, or the Eight Elephants of Faith to guard the eight cardinal points of the compass''†

క్రీ. శ. 855-884 నడుమ కాశ్మీరదేశమును పాలించిన అవంతివర్మయాస్థానమున

౧. ఆనందవర్ధనాచార్యులు.
౨. ముక్తాకణుఁడు.
౩. రత్నాకరుఁడు.
౪. శివస్వామి.

అనుసంస్కృతకవులు నలుగు రుండెడివా రఁట, కాని యీకవిచతుష్టయమునకుఁ బ్రత్యేకసాముదాయకబిరుద మేమియు లేదు.

కాశ్మీరదేశాధీశుఁ డగు జయాపీడపండితునియాస్థానము నీక్రింది యెన మండుగురు గీర్వాణకవు లలంకరించి యుండి రఁట.

౧. ఉద్భటుఁడు (సభాపతి; ప్రధానమంత్రి)
౨. క్షీరస్వామి.
౩. చటకకవి.
౪. దామోదరగుప్తుఁడు.
౫. మనోరథుఁడు.
౬. వామనపండితుఁడు.
౭. శంఖదత్తుఁడు.
౮. సంధిమంతుఁడు.

పైకవ్యకష్టమున కష్టదిగ్గజాదిబిరుద మున్నట్లు తెలియదు. కావున రామానుజా చార్యులవారికాలము నుండియు (11 వ శతాబ్ది. క్రీ. శ.) అష్టదిగ్గజవ్యవహార ముపక్రమించి యుండును. ప్రపన్నశేఖరుఁ డగురాయ లీసంప్రదాయమునే యనుస రించి యుండును.

---

* ఈ. వే. వీ. రాఘవాచార్యుఁడు: 'సంస్కృతదూతకావ్యోత్పత్తి వికాసములు'- (1930)

†—A. Govindacharya; *Life of Ramanuja,* P. 222—(1906)

రాయలయాస్థానమునఁ గల అష్టదిగ్గజములను గూర్చి చరిత్రకారులు, కవులచరిత్రల రచించినవారు, వాఙ్మయగవేషణనిరతులు పలువురు కృషి సల్పి భిన్నమతముల వెలువఱచిరి. వారికృషి కాలక్రమమున నిట సూచింపఁబడును :

| | | | |
|---|---|---|---|
| ౧. గురుజాడ శ్రీరామమూర్తిగారు | : | 'కవిజీవితములు' | క్రీ. 1893 |
| ౨. కందుకూరి వీరేశలింగముగారు | : | 'ఆంధ్రకవులచరిత్ర'- 2 భా. | 1895 |
| ౩. చిలుకూరి వీరభద్రరావుగారు | : | 'జీర్ణకర్ణాటరాజ్యచరిత్ర' | 1903 |
| ౪. కొమర్రాజు వేం. లక్ష్మణరావుగారు | : | 'మహమ్మదీయమహాయుగము' | 1915 |
| ౫. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు | : | 'చాటుపద్యమణిమంజరి' 2 భా. | 1922 |
| ౬. డాక్టర్ నేలటూరి వేం. రమణయ్య | : | *Studies in the History of the Third-Dynasty of Vijayanagara.* | 1935 |
| ౭. చాగంటి శేషయ్యగారు | : | 'ఆంధ్రకవితరంగిణి'-7 సం. | 1950 |
| ౮. నిడుదవోలు వేంకటరావుగారు | : | 'అష్టదిగ్గజముల'లను వ్యాసము | 1955 |

పై రచయితలు సూచించిన అష్టదిగ్గజములపట్టిక యిట నొసఁగి, యందలి ప్రామాణ్యము నాలోచింపఁదగును.

౧. *పివిరాట్టు :* ప్రభాకరశాస్త్రిగారొక్కరే యితనిని అష్టదిగ్గజములలోఁ జేర్చిరి.

౨. *తిమ్మన (నంది లేక ముక్కు) :* ఈతఁ డేకగ్రీవముగా, అష్టదిగ్గజములలోని వాఁ డని యంగీకృతము.

౩. *ధూర్జటి :* అష్టదిగ్గజమండలి లోనివాఁ డని నందఱచే ముక్తకంఠమున నొప్పుకొనఁబడెను.

౪. *పెద్దన్న (అల్లసాని) :* ఈతనివిషయమున నభిప్రాయభేదమే లేదు.

౫. *మల్లన (మాదయగారి) :* గురుజాడవారు, వేటూరివారు తప్పఁ దక్కినవారీతనిని అష్టదిగ్గజములలోఁ జేర్చిరి.

౬. *రాధామాధవకవి (చింతలపూఁడి ఎల్లన) :* ఈతఁ డష్టదిగ్గజములలో నొకఁ డని నిడుదవోలువా రొక్కరే సప్రమాణముగ నిరూపించిరి.

౭. *రామకృష్ణకవి (తెనాలి) :* ఈతఁ డష్టదిగ్గజములలోఁ జేరినవాఁ డని యందఱు నంగీకరించిరి,

౮. *రామభద్రకవి (పుత్తేటి....) :* గురుజాడవారు, కందుకూరివారు, చిలుకూరి వారు, కొమర్రాజువారును, అష్టదిగ్గజములలోనివాఁడు అయ్యలరాజు రామభద్రకవి యని పొరపడిరి. చాగంటివారు పైరామభద్రకవి రాయలయాస్థాన

మునకుఁ జెందఁ డనిరి. నేలటూరివారిపట్టికలో రామభద్రకవి చేరనే లేదు. అష్టదిగ్గజములలోఁ జేరిన రామభద్రకవి, పుత్తేటి రా. భ. కవి యనియు, నీతఁడే రాయల 'సకలకథాసారసంగ్రహము'నుఁ దెనిఁగించె ననియు వేటూరివారును, వారి ననుసరించి నిడుదవోలువారును సప్రమాణముగ నిర్ణయించి యున్నారు.

౯. *రామరాజ భూషణుఁడు :* చాగంటివారు, నిడుదవోలువారుమాత్ర మీతనిని అష్టదిగ్గజములలోఁ జేర్పలేదు. తక్కినయార్గురు నీతఁ డష్టదిగ్గజములలోనివాఁడే యనిరి. కాని, భట్టుమూర్తి యను పేరుగలయీతఁడు రాయలకుఁ బిమ్మట రాజ్యము చేసినయాతనిజామాత యగు అళియరామరాయల కాలమున నుండి, రామరాజభూషణబిరుదము నందెను. కావున అష్టదిగ్గజములలోనివాఁడు కాఁడు.

౧౦. *రుద్రకవి (కందుకూరి) :* వేటూరి, నేలటూరి, నిడుదవోలువారు మాత్ర మీతనిని అష్టదిగ్గజములలో, సప్రమాణముగఁ జేర్చిరి. తక్కినయైదుగురు నీతని నందుఁ జేర్పనే లేదు.

౧౧. *శంకరకవి :* గురుజాడవారిపట్టికలో మాత్ర మష్టదిగ్గజములలోఁ జేర్పఁబడెను. తక్కినయేడుగురును దీని నంగీకరింప లేదు. ఇతఁ డష్టదిగ్గజములలోఁ జేరఁడు.

౧౨. *సూరన (పింగళి) :* చాగంటివారు, నిడుదవోలువారు నీతనిని అష్టదిగ్గజములలోఁ జేర్పలేదు. ఇతఁడు రాయలకుఁ బిమ్మట నున్న నంద్యాల కృష్ణరాజున కాశ్రితుఁడు కావున, పైవా రన్నది ప్రమాణమే. కాని, తక్కిన విమర్శకు లార్గురు నీతఁ డష్టదిగ్గజములలోనివాఁడే యనిరి. ఇది ప్రమాణరహితము.

ఆంధ్రవాఙ్మయ చరిత్రము* నాంగ్లభాషయందు రచించినరాజాభుజంగరావుగారు, చెంచయ్యగారు ననుశ్రుతముగా వచ్చుచున్న అష్టదిగ్గజనామావళి నిట్లు పేర్కొనిరి.

| | |
|---|---|
| ౧. తిమ్మన్న (నంది) | ౫. రామభద్రయ్య (అయ్యలరాజు) |
| ౨. ధూర్జటి | ౬. రామకృష్ణకవి (తెనాలి) |
| ౩. పెద్దన (అల్లసాని) | ౭. రామరాజభూషణుఁడు |
| ౪. మల్లన (మాదయగారి) | ౮. సూరన్న (పింగళి...) |

* *A History of Telugu Literature.* (Heritage of India Series)—1928.

పైకవులలో ౬-౮ సంఖ్యలు గల కవులు ముగ్గురును రాయలరాజ్యపాలనకాలమున లేనే లే రని పూర్వోక్తగ్రంథకర్తలు వ్రాసిరి. కాని, ఈముగ్గురిలో తెనాలిరామకృష్ణకవి మాత్రము రాయలయాస్థానమున నుండిన ట్లిదివఱకే సూచించియున్నాను.

ఇఁక రాయలభువనవిజయాస్థానము నలంకరించినగీర్వాణవిద్వత్కవిశేఖరులను పేర్కొని, పిమ్మట రాయలసమకాలికు లైనను తదాస్థానమునకుఁ జెందనిసంస్కృతకవికోవిదులను సూచింతును :

౧. అహోబలమఠాధిపతులలో నాఱవవా రగు పరాంకుశస్వామి (మఠాధిపత్యము క్రీ. 1497-1511). ఈయనరచన 'నరసింహస్తవము'*

౨ అహోబలమఠమున సప్తమపీఠాధిపతి శఠకోపయతి (మఠపాలనము క్రీ. శ. 1512-22) ఈయనకృతి 'వాసంతికాపరిణయ'మను రూపకము.* రాయలగురు వగుతాతాచార్యులు పూర్వోక్తపరాంకుశస్వామికిఁ బూర్వాశ్రమమున భాగినేయుఁడు. పెద్దన కాచార్యు లగుశఠకోపయతియుఁ బైని పేర్కొనినశఠకోపయతియు నభిన్నులని నాయూహ. రాజగురువునకు మేనమామ యగుటచే పరాంకుశస్వామికిని, ఆస్థానకవి యగుపెద్దనకు గురు వగుటవలన శఠకోపయతియు రాయలచే సమ్మానితు లై, ఆస్థానమునకు సంబంధించినవా రనుట సత్యదూర మని తోఁచదు.

౩. *తిరుమల తాతాచార్యులు :* పంచమతభంజన మనుప్రసిద్ధగ్రంథనిర్మాత. రాయల కాచార్యులు. తాతాచార్యులభాగినేయుఁడు శ్రీనివాసాధ్వరి (అప్పయాధ్వరి); శ్రీనివాసాధ్వరిపౌత్త్రుఁడు లక్ష్మీసహస్ర విశ్వగుణాదర్శాదులను రచించిన వేంకటాధ్వరి.

౪. *అచ్చాన్ దీక్షితుఁడు :* (=ఆచార్యదీక్షితుఁడు = నరసింహదీక్షితుఁడు = సర్వతోముఖమహావ్రతయాజి) ఈయన అప్పయ్యదీక్షితులకుఁ బితామహుఁడు. వరదరాజస్వామివసంతోత్సవమును దర్శించుటకై రాయలు పట్టమహిషితో కాంచీపురమున వరదరాజును సేవించుచుండ నట నున్న ఆచార్యదీక్షితులు వరదరాజును, రాయలపట్టమహిషి నుద్దేశించి యీశ్లోకమును రచించె నఁట :

'కాంచి త్కాఞ్చనగౌరాఙ్గీం వీక్ష్య సాక్షా దివ శ్రియం,
వరదః సంశయాపన్నః వక్షఃస్థల మవైక్షత'

---

* S. N. Venkatesa Iyer: '*History of the Ahobilam Mutt*' (Coimbatore).

మనోహర మగునీశ్లోకమున కలరి రాయ లాయనకు వక్షస్థలాచార్యు లను బిరుదము నొసఁగి, తనయాస్థానమున నాయన నొకపండితునిగాఁ జేసి సమ్మానించెను.

౩. లొల్ల లక్ష్మీధరపండితుఁడు : 'విద్వత్సార్వభౌమ - నూతనవ్యాస' బిరుదములు గలవిశ్వనాథభట్టారక తనయుఁడు, ఉత్కలదేశాధీశ్వరు డగు గజపతి వీరరుద్రమహారాజాస్థానవిద్వాంసుఁడు, షడ్దర్శనీపారంగతుఁడు, బర్హావతంస కర్ణావతంసాదిగ్రంథరాజములను లక్ష్మీధర మను సౌందర్యలహరీవ్యాఖ్యా దులను నిర్మించిన విద్వచ్చూడామణి. వీరరుద్రగజపతితనయను రాయలు పరిణయ మాడినపిమ్మట లక్ష్మీధరుఁడు రాయలభువనవిజయసభ నలంక రించెను. ఈయనశిష్యుఁడు శివపంచస్తవివ్యాఖ్యాత యగు ఊరదేచా మాత్యుఁడు.

౪. సాళువ తిమ్మరుసు : రాయలకుఁ బితృస్థానీయుఁడు, మహామాత్యుఁడు, ఆయనమహావైభవమునకు మూలభూతుఁడు. సంస్కృతమున మహా విద్వాంసుఁడు, సహృదయచూడామణి. అగస్త్యవిద్యానాథకృత మగు 'బాలభారత' మహాకావ్యమునకు 'మనోహర' యను వ్యాఖ్యానమును రచించెను.

౫. నాదెండ్ల గోపమంత్రి : పైతిమ్మరుసునకు మేనల్లుఁడు; మాదయ్యగారిమల్లన కృతి యగు 'రాజశేఖరచరిత్రము' ను కృతి నందిన నాదెండ్లఅప్పమంత్రి కనుజుఁడు. గోపమంత్రిరచనలు - 1 కృష్ణమిశ్రుని 'ప్రబోధచంద్రోదయ' మను సంస్కృతనాటకమునకు 'చంద్రిక' యను వ్యాఖ్య.
2 'కృష్ణార్జునసంవాద'మను నాంధ్రద్విపదకావ్యము. తిమ్మరుసు పక్షమున కొండవీడు నగరీసామ్రాజ్యధురంధరుఁడై, కవియై, త్యాగియై, భోగియై పేరందిన ధన్యతముఁడు.

౬. ఊర-దేచమంత్రి : పైఁ బేర్కొనినగోపమంత్రిక్రింద నమాత్యుఁడై గీర్వాణ విద్వాంసుఁడు, సహృదయశేఖరుఁడు నగు పుణ్యమూర్తి; పూర్వము పేర్కొనఁబడిన లొల్లలక్ష్మీధరపండితుని కాప్తశిష్యుఁడై 'శివపంచస్తవి'కి సంస్కృతవ్యాఖ్య రచించెను. తెనాలిరామలింగకవికృత మగు 'ఉద్భటా రాధ్యచరిత్రము'నకుఁ గృతిపతి. దేచమంత్రితనయుఁడే 'హరిశ్చంద్రో పాఖ్యాన' మనునాంధ్రప్రబంధమును రచించినశంకరకవి.

౯. భానుకరుఁడు (భానుదత్తుఁడు): గణపతికవితనయుఁడు, మైథిలుఁడు. రస మంజరి, రసతరంగిణి రసపారిజాతము మొదలైన గ్రంథాష్టకమును రచించెను. రాయలప్రోత్సాహముననే యీతఁడు రసమంజరిని రచించినట్లు కన్పట్టును. రాయలను బ్రశంసించునీతనిశ్లోకములు రెండు లభించినవి*

౧౦. బండారు లక్ష్మీనారాయణకవి: రాయలయాస్థానమున వాగ్గేయకారుఁడుగా నుండి, రాయల కంకితముగా 'సంగీతసూర్యోదయ'మను 5అధ్యాయముల శాస్త్రగ్రంథమును రచించెను, అభినవభరతాచార్య సూక్ష్మభరతాచార్య బిరుదములనే కాక, రాయలనుండి, బంగారుపల్లకి, గజములు, ముక్తావళ్య లంకృతము లగురెండుశ్వేతచ్ఛత్రములు, మౌక్తికచామరములు, మలహరి వాద్యములు మొదలగు రాజచిహ్నములను సమ్మానముగాఁ బడసెను. రాయలనుగూర్చి యైతిహాసికప్రాధాన్యముగల యనేకవిషయములు 'సంగీత సూర్యోదయ' ప్రారంభమునఁ గలవు. ఈకవి కాంధ్రవాఙ్మయమున నభి మానము గలదు. భానుకవి పంచతంత్రము నాంధ్రీకరించి, లక్ష్మీనారా యణకవి కంకిత మొనర్చెను.

౧౧. దివాకరుఁడు: పైద్యేశ్వరునితనయుఁడు- లొల్ల లక్ష్మీధరునివలె నీతఁడును ప్రతాపరుద్రగజపతియాస్థానమున నుండి యామహారాజువలన 'కవిచంద్ర రాయ'బిరుదము నంది, కృష్ణదేవరాయలు గజపతితనయను వివాహము చేసికొనినపిమ్మట లక్ష్మీధరునితోఁ బాటు విజయనగరసంస్థానమునకు వచ్చి రాయలసభ నలంకరించెను. దివాకరుని రచనలు: 1. దేవీస్తుతి. 2. పారిజాతాపహరణము. 3. భారతామృత మను ౪౦ సర్గలమహాకావ్యము. ఈకావ్యమున మహాభారతసారము వివరింపఁబడెను. 4. రసమంజరి.

---

*1. శ్లో 'కృష్ణం సమర - సతృష్ణం, దృష్టవతో విష్టరశ్రవసః,
రాజన్య - జన్మ - మూలే, భుజమూలే (భ్రాన్తి)పులకముకులాని' - (భానుకరస్య)
— లక్ష్మణభట్ట - అంకోలకరుఁడు కూర్చిన 'పద్యరచనా' - (16 పు. ౩ పద్య.)

2. శ్లో. 'ప్రస్థానం రతిమందిరాత్ కమలినీబంధో రపి ప్రేక్షణం,
కాకుః కేళివిధిం వినాపి చరణన్యాసః పృథివ్యా మపి.
కిం చ క్లాంత మతాళవృంతపవనః ప్రత్యంగ మాలింగతి,
ద్రష్టవ్యం కి మతోఽపి కృష్ణనృపతేః ప్రత్యర్థివామభ్రువామ్'.
(భానుకరస్య)— [పద్యరచనా, 27 పు. ౬౩ పద్య,
నిర్ణయసాగరముద్రణాలయము, బొంబాయి - 1908]

భానుకరునిరసమంజరి పూర్వప్రకరణమునఁ బేర్కొనఁబడెను. రాయలు కూడ 'రసమంజరి' యను కృతిని నిర్మించినట్లు తెలియుచున్నది. పైని పేర్కొనిన 'పారిజాతాపహరణ'నాటకము, నందితిమ్మనకృతికి నాటక రూపమున సంస్కృతానువాదమో, లేక యాయితివృత్తమునే చిత్రించు స్వతంత్రరచనయో.*

౧౨. *కుమారడిండిమకవిసార్వభౌముఁడు* : (=రెండవ అరుణగిరినాథుఁడు= చతుర్థడిండిముఁడు). బహుభాషావేత్త. కవిరాజరాజబిరుదము గలయాతఁడు విజయనగరచక్రవర్తులగు వీరనరసింహరాయల (క్రీ. 1505-09) యాస్థానమునను, కృష్ణరాయలయాస్థానమున నుండెను. ఈతనికృతి 'వీరభద్రవిజయ' మనుడిమము. †

౧౩. *ఈశ్వరదీక్షితులు* : రాయలప్రోత్సాహమున వాల్మీకిరామాయణమునకు లఘు గురువ్యాఖ్యలు నిర్మించెను. రామాయణము నందలి 7 కాండలను 60 ఘటికలలో నీతఁడు పఠించి, రాయలమెప్పు నందెను.

౧౪. ‡*తుక్కాదేవి* : ప్రతాపరుద్రగజపతితనయ, రాయలమహిషి. సాంసారికానందము ననుభవింప నోచుకొననియభాగ్యురాలు. 'తుక్కాపంచక' మీమె రచించినదే యందురు.

ఇఁక రాయలసమకాలికు లగుసంస్కృతకవుల, మతప్రవర్తకులనామముల స్మరింపఁదగును :

1. *అఘోరశివాచార్యులు* (*జన్మ : క్రీ. 1445*) : రామానుజాచార్యులు, వేదాంతదేశికులు, అణ్ణయాచార్యులవలె శతాధికవర్షజీవి యగునీమహామహునిశిష్యులలోఁ బ్రఖ్యాతులైనముగ్గురుమహాకవు లుండిరి. ఆంధ్రమున, ప్రబోధచంద్రోదయమును బరివర్తించిన నందిమల్లయ్య-ఘంట సింగయలలో సింగయ్యయు, ఆతనిభాగినేయుఁ డగునంది - తిమ్మన్నయు, మాదయగారిమల్లన్నయు అఘోరశివాచార్యుల కంతేవాసులే. రాయలజనకుఁ

* Dr. M. Krishnamachariar: *History of Classical Sanskrit Literature* (1937)—Page 298, para 237.

† Dr. M. Krishnamachariar: *History of Classical Sanskrit Literature* – (2nd ed. Revised and Enlarged) – Page 223, para 138 (1937)

‡ 'ఆంధ్రవిదుషీమణులు' - 1 భా. - పు. ౪౦-౫౩ (ఆంధ్ర-శేషగిరిరావు) - మద్రాసు (1950)

డగు నరసరాయల కాశ్రితులు నందిమల్లయ-ఘంట సింగయ్యకవులు. రాయల అష్టదిగ్గజముల లోనివారే ముక్కు తిమ్మన్న, మాదయగారి మల్లన్నయు; కావున, రాయ లఘోరశివాచార్యుల సమ్మానించియే యుండనోపు.

2. *తిరుమలాంబ: కృతి- వరదాంబికాపరిణయచంపువు. రాయలసవతితమ్ముఁడగు అచ్యుతరాయలకును వరదాంబికకు జరిగిన కల్యాణోత్సవకథ యిందలియితివృత్తము. విదుషీమణి యగుతిరుమలాంబ రాయలయాస్థానమునకుఁ జెందినది కాదు, కాని యాయనకు సమకాలవర్తిని

3. †గౌరాంగస్వామి (=చైతన్యుఁడు-క్రీ.1486-1533): వంగదేశీయుఁడు, కృష్ణభక్తాగ్రేసరుఁడు, భక్తిమతప్రతిష్ఠాపకుఁడు, జగద్గీతకీర్తి యగునీమహా మహునిరచనగా నొక'శిక్షాష్టక' మొక్కటిమాత్రమే లభించినది. ఈ యనను గూర్చి యపార మైనగ్రంథజాలము బయలుదేరినది.

4. రూపగోస్వామి (క్రీ. 1490-1563): మహాకవి, సాహిత్యవేత్త, చైతన్యుని ప్రధానశిష్యుఁడు; గౌడదేశాధీశునిమంత్రి. రచనలు: ఉజ్జ్వలనీలమణి యను సాహిత్యగ్రంథము, హంసదూత, ఉద్ధవసందేశాదికావ్యములు, విదగ్ధమాధవాదినాటకములు - మొత్తము ౧౯.

5. సనాతనగోస్వామి (క్రీ 1484 - 1558): రూపగోస్వామికి సోదరుఁడు. ఉజ్జ్వలనీలమణిపై వ్యాఖ్య, హరిభక్తివిలాసము, భాగవతామృతము మొదలగున వీయనకృతులు. సోదరునితోఁ బాటీతఁడును గౌడదేశాధీశునిమంత్రి.

6. వల్లభాచార్యులు (క్రీ. 1478-1530): *ఆంధ్రుఁడు వల్లభమత మనుభక్తి మతమునకు ప్రతిష్ఠాపకుఁడు. బ్రహ్మసూత్రవ్యాఖ్య ప్రేమామృతాదు లీతని రచనలు.

7. రామచంద్రభట్టు (క్రీ 1484 ప్రాంతమున జన్మ): పైవల్లభాచార్యున కనుజుఁడు. అయోధ్యాధీశుఁ డగువీరసింహున కాశ్రితుఁడు. కృష్ణకౌతూహల కావ్యము, గోపాలలీలాకావ్యము, రసికరంజనము - ఈయనరచనలు.

---

*'ఆంధ్రవిదుషీమణులు'- 1భా. (ఆం. శేషగిరిరావు)-పు.54-63 మద్రాసు.[1950]

† Dr- S. K. De's Introduction to his ed. of Rupagosvami's *Padyavali* - pp.1-117 (Dacca University Oriental Publications Series- No. 3— 1934)

8. *గంగానందకవీంద్రుఁడు :* మైథిలుఁడు; బికనేర్ మహారాజగుకర్ణప్రభువునకు (క్రీ. 1506-27) ఆశ్రితుఁడు. కర్ణభూషణము, కావ్యడాకిని, భృఙ్గసందేశము, మందారమంజరియు నీతనికృతులు.

కృష్ణదేవరాయలు - సమకాలికాంధ్రకవులు :

1. *వల్లభాచార్యులు :* కవిలోకదేవేంద్రబిరుదాంచితుఁడు. నామాంతరము వల్లభ సూరి. ప్రబోధానందస్వామికి, కుమారతాతాచార్యులకు శిష్యుఁడు, కృష్ణ రాయలకు, అచ్యుతరాయలకు ముఖ్యాశ్రితుఁడై, వారి మన్ననల నందిన బొమ్మలాటకాళయప్రేరణమున భాస్కరాచార్యుని 'లీలావతి' నుండి 'పాటి గణితము' నాంధ్రీకరించి, కాళయకే యంకిత మొనర్చెను.
2. *మొల్ల :* కులాలకులసంజాత. ప్రఖ్యాత మగు 'మొల్లరామాయణము'ను రచించిన మహిళాకవి. రాయలసత్కారము నందియుండు నని వీరేశలింగముపంతులు గారు, రాయలచే సత్కృత యని నిడుదవోలువారు ననిరి.
3. *ఎఱ్ఱన (ఎడపాటి) :* మల్హణచరిత్రము, కుమారనైషధము నను ప్రబంధము లీతనిరచనలు. ఈకవి మల్హణచరిత్రమును రాయల కంకిత మొనర్పక, దాచి యుంచి, తన కాప్తబంధు వగు చుండికాళయామాత్యున కంకితము చేసె నఁట.
4. *నృసింహకవి (సంకుసాల) :* వైష్ణవమతానుయాయి; భట్టపరాశరులశిష్యుఁడు మాంధాతృచరిత్రను కవికర్ణరసాయన మనుప్రౌఢప్రబంధముగా రచించి శ్రీరంగనాథునకుఁ గృతియిచ్చెను. పెద్దనయీసువలన నీతఁడు రాయల దర్బారున నడుగిడలేకపోయెనఁట.

భువనవిజయము నందలికర్ణాటక కవికోవిదులు :

1. *మహాకవి తిమ్మణ్ణ :* 'కర్ణాటకవికులసార్వభౌముఁడు'! భానుకవికుమారుఁడు. కుమారవ్యాస-నారణప్పకవి పూర్తిచేయలేకపోయినభారతకర్ణాటానువాదము నీతఁడు (శాంతిపర్వమునుండి) పూర్తిచేసి రాయల కంకిత మొనర్చెను.
2. *వ్యాసరాయరు :* (=వ్యాసతీర్థులు). శ్రీపాదరాయరునకు శిష్యుఁడు; వ్యాస రాయమఠప్రతిష్ఠాపకుఁడు; రాయలసింహపీఠికను గొంతకాల మధిరోహించి, సామ్రాజ్యవైభవము ననుభవించినమహామహుఁడు. ఈయన రచనలు - సంస్కృతమున తర్కతాండవము, న్యాయామృతతాత్పర్య సంగ్రహము; కన్నడమున - కీర్తనలు.

3. *పురందరదాసు:* పై వ్యాసరాయరుశిష్యుఁడు. కన్నడమున నెన్నో కీర్తనల రచించి పేరందెను. నిర్యాణము - క్రీ. 1564.

4. *కనకదాసు:* పురందరదాసునకు సమసమయవర్తి. రచనలు - మోహన తరంగిణి, నలచరిత్ర, హరిభక్తసారము, రామధ్యానచరిత్ర.

5. *కుమారవాల్మీకి నరహరి:* (క్రీ. 1500 ప్రాంతము) - వాల్మీకిరామాయణము నకు కర్ణాటకపరివర్తన మీయనరచన.

6. *అభినవవాదివిద్యానందుఁడు:* జైనుడు, భల్లాతకిపుర (Gersoppa). వాసి. కావ్యసారమను సుభాషితగ్రంథమును సంధానము చేసెను.

7. *మల్లనార్యుఁడు:* గుబ్బివాస్తవ్యుఁడు. శైవుఁడు. క్రీ. 1513 వ వత్సరమున 'భవచింతారత్నము'ను క్రీ. 1530 లో 'వీరశైవామృతము'ను గూర్చెను.

8. *చాటువిఠలనాథుఁడు:* (క్రీ 1530 ప్రాంతము). కృష్ణరాయలదర్బారున, అచ్యుతరాయలయాస్థానమున విలసిల్లెను. భాగవతపురాణమునకు కర్ణాటాను వాద మొనర్చెను.

రాయలయాస్థానము నందలి తమిళ (ద్రావిడ) విద్వత్కవులు ;

1. *కుమారసరస్వతి:* రాయలకు గజపతితనయకు జరిగినవివాహవైభవము నఱవమునఁ గావ్యరూపమునఁ జిత్రించెను.

2. *మండలపురుషుఁడు:* జైనుఁ డగు నీతఁడు రాయలయాస్థానమున నుండి, 'చూడామణి' యను ద్రావిడనిఘంటువును గూర్చెను.

3. *జ్ఞానప్రకాశర్:* తొండమండలము నందలివెల్లాలవంశమునకుఁ జెందిన వాఁడు. రాయలప్రశంసించుచు 'మంజరిప్పా' అను ద్రావిడకావ్యమును రచించెను. ఇతనిగ్రంథ మింకొకటి 'కచ్చికలంబకమ్.'

4. *తత్త్వప్రకాశకవి:* తిరువారూరు నందలి శివాలయార్చకుఁడు. ఆయాలయ మునఁ బూజావిధానమున జరుగునక్రమములఁ బరిష్కరింపఁ బ్రార్థించుచు నీయన రాయలకు ఛందోబద్ధవిజ్ఞప్తి నంపెను. రాయలా యక్రమములఁ బరిష్కరింపఁ దిరిగి పద్యబద్ధలేఖమూలమున రాయలకుఁ దనకృతజ్ఞతను దెలిపికొనెను.

5. *హరిహరదాసు:* శైవుఁడు. 'ఇరుసమయవిలక్కమ్' ఈతనికృతి. దీని భూమికయందు సింహాచలక్షేత్రప్రశంస, రాయలజయస్తంభవర్ణనమును గలవు.

రాయలకు విద్వత్కవిపోషణము పైతృపితామహప్రసాదితవ్యసనము. రాయలపితామహుఁ డగుఈశ్వరనాయకుఁడు నందిమల్లయ-ఘంటసింగయ యను జంటకవుల కవితాకల్పలత కుపఘ్నాయమానుఁ డయ్యెను. రాయలజనకుఁ డగు నరసనాయకుఁడు 'వరలక్ష్మీకల్యాణము, నరసింహవిజయము నను కావ్యములను, పైనిబేర్కొనిన జంటకవులగు మల్లయ-సింగయకవుల'ప్రబోధచంద్రోదయ' మను ప్రబంధమును గృతి నందెను. ద్విపదనారసింహపురాణము, వచనబాలభారతము, సౌభరిచరిత్ర, జక్కులకథ మొదలగు కృతుల నిర్మించిన అష్టభాషాకవివర్యుఁ డగు ప్రోలుగంటి చెన్నశౌరిని, రాయలకగ్రజుఁడగు వీరనరసింహరాయలగ్రహారముల నిచ్చి సత్కరించెను. 'మైరావణచరిత్ర' మనుస్వతంత్రప్రబంధనిర్మాత యగు మాడయకవియు వీరనరసింహరాయలసత్కారముల నందెను. ఈ ప్రభువుకాల మున గీర్వాణకర్ణాటభాషలలోఁ గొన్ని కృతులు రచింపఁబడినట్లు తెలియుచున్నది. పితామహునియందు, జనకునియందు, అగ్రజునందు బీజాంకురపుష్పప్రాయముగ నున్నకవిపండితపోషణనిరతి, సహృదయుఁడు, స్వయముగాఁ బండితుఁడే కాక, ఆంధ్రసంస్కృతప్రాకృతాదిభాషలయందందెవేసినకవిశేఖరుఁడు నగురాయల యందు సర్వతోముఖముగ ఫలించినది.

కొన్నియేండ్లక్రిందట గుంటూరు, విశాఖపట్టణములయందును, కొన్ని నెలలక్రిందట హైదరాబాదు నందలి ఉస్మానియావిశ్వవిద్యాలయసమాదరణమునను భువనవిజయసామ్రాజ్యవినోదములును, అష్టదిగ్గజోత్సవములును మహావైభవమున జరుగఁగా రాయలనాఁటి ప్రాచీనసాహిత్యసామ్రాజ్యవైభవ మెట్టిదో ప్రజల కించుక గోచరించినది. హైదరాబాదునగరమున జరిగిన మహాసభయందు రాయలను, ఆముక్తమాల్యదను గూర్చి యుపన్యసించినవారు డాక్టర్ దివాకర్ల వేంకటావధాని గారు. ఈయన 'ఆముక్తము'ను గూలంకషముగ మథించి, 'భారతి'లో నాల్గును, ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రికలో నొకటియుఁ జక్కనివ్యాసములఁ బ్రకటించిరి. హైదరాబాదుసభలో అష్టదిగ్గజములఁ గూర్చియు రాయలను గూర్చియు వివిధ విద్వాంసులొనఁగిన యుపన్యాసముల నేకముఖముగా నొకసంపుటమునఁ బ్రకటింప సభానిర్వాహకులు నిర్ణయించుట ముదావహము. ఈసభలో అష్టదిగ్గజనిర్ణయమును గూర్చి శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగా రుపన్యసించినట్లు తెలిసినది కాని, వారి నిర్ణయ మెట్లో తెలియలేదు.

శ్లో. 'లీనం వస్తుని యేన సూక్ష్మసుభగం తత్త్వం గిరా కృష్యతే,
నిర్మాతుం ప్రభవే న్మనోహర మిదం వాచైవ యో వా బహిః,

వన్దే ద్వావపి తా వహం కవివరే వన్దేతరాం తం పునః,
యో విజ్ఞాత పరిశ్రమోఽయ మనయో ర్భారావతా రక్షయః'

—కుంతకుని 'వక్రోక్తిజీవితము'

II-107 ప-[పుట. 129]

Edited by Dr. S. K. Dey, 2nd Edition (1928)

## కృష్ణదేవరాయలు-ఆంధ్రకవితాపితామహుఁడు

మందా. 'దంతివ్యూహం, కనకలతికాం, చామరం, హైమదండం.
యో గౌడేన్ద్రా ద్దలభత కవిక్ష్మాభృతాం చక్రవర్తీ,
శ్రీధోయీకః సకలరసికప్రీతిహేతో ర్మనస్వీ
కావ్యం సారస్వత మివ మహామంత్ర యేత ద్జగాద.

[పవనదూత. ౧౦౧. పద్య]

అని కవిచక్రవర్తియు, వంగదేశీయుఁడును, నగు ధోయీకవి తనపోషకప్రభువగు లక్ష్మణసేనుని(12వ శతాబ్ది)వలనఁ దాను బడసినమహాగౌరవమును గూర్చి పవనదూతమనుకావ్యమున* వివరించియున్నాఁడు.

భారతవర్షమునఁ బ్రాచీనకాలమునుండియు మహాకవులకు, ప్రౌఢవిద్వాంసులకు, మహారాజాస్థానములయందును, సార్వభౌమాస్థానములయందునఖండ గౌరవమర్యాదలు లభించుచుండెడివి. మౌక్తికచామరములు, ముక్తావళ్యలంకృతములగు రెండుశ్వేతచ్ఛత్రములు, దివాప్రదీపికాద్వయము, కనకాభిషేకము, స్వర్ణపల్యంకిక, స్వర్ణదండము, మత్తేభములు, అర్ధసింహాసనాసనము, తాంబూలద్వయము, బ్రహ్మరథయానము, భద్రగజయానము, బిరుదప్రదానము, గండపెండేరమునుదొడుగుట, స్వర్ణకంకణములు, రెండుకాశ్మీరరాంకవకంబళములు (శాలువలు), అగ్రహారములు, రాజ్యాధిపత్యము, మొదలగునవి విద్వత్కవిశేఖరులకు మహారాజాధిరాజులనుండి లభించుచుండెడి సమ్మానములు. పండితప్రకాండుల ప్రతిభావైదుష్యములకు, కవిశేఖరులకవితాకౌశలమునకు, నలరి మహారాజులు వారివారిపాదములకు కవిగండపెండేర మను స్వర్ణమంజీరమును స్వయముగాదొడిగియు,హస్తములకుస్వర్ణకంకణములదొడిగియు, తుదకునాయా విద్వాంసులను, కవులను, పల్లకియం దధివసింపఁజేసి ప్రభుశేఖరులు స్వయముగా నాపల్లకిని వహించియు, నఖండసమ్మానముల నొనరించు చుండెడివారు.

---

* చూ. ఈ. వే. వీ. రాఘవాచార్యుఁడు ; 'సంస్కృతదూతకావ్యోత్పత్తివికాసములు.'— ఆం. సాహిత్యపరిషత్పత్రిక. సంపు. 18. సంచిక. ౧. [1927]

విష్ణుచిత్తులు, మహావిష్ణుపారమ్యమును స్థాపించి విద్యాశుల్కమును స్వీకరించినపిమ్మట పాండ్యరాజాయనయలంకరించినపల్లకిని స్వయముగా మోసి భద్రగజాధిరూఢు నొనరించి యూరేఁగించెనఁట :

క. 'నిచుళేశుఁడు సద్వృతమొం
దుచు నావిప్రునకు భక్తితో మ్రొక్కి నుతిం
చుచుఁ దాను బల్లకీ మో
చుచు నేఁగించెన్ విభూతి శోభిల్లఁ బురిన్'

*[తిమ్మభూపాలుని పరమయోగివిలాసము. ౩అ. - ౩౦౩ పద్య-]

గీ. 'మఱియు నిజవైభవం బెల్ల మెఱసి తనదు
పట్టపేనుంగుమీదటఁ బెట్టి యతనిఁ
బురముఁగలయ నేఁగింపఁగ హరి సమస్త
సురలు గొలువఁ దద్విభవంబుఁ జూడ వచ్చె.' [అదే.4-౩౫]

పెద్దనామాత్యునకు రాయలవలన నఖండగౌరవములు కలిగినట్లు

సీ. ఎదురైనచోఁ దనమద కరీంద్రము నిల్పి
కేలూత యొసఁగి యెక్కించు కొనియె
బిరుదైన కవిగండపెండేరమునఁ కీవె
తగుదని తానె పాదమునఁ దొడిగె
మనుచరిత్రం బందుకొనువేళఁ బురమేగ
బల్లకిఁ దనకేల బట్టియెత్తె
కోకట గ్రామాద్యనేకాగ్రహారంబు
లడిగిన సీమలయందు నిచ్చె

గీ. నాంధ్రకవితాపితామహ యల్లసాని
పెద్దన కవీంద్ర యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతో దివికేఁగఁలేక
బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు.

[పెద్దనాచార్యుని చాటువు.]

యనుపద్యమున, రాయలు దివంగతుఁ డైనప్పుడు పెద్దన విలపించుటనుబట్టి విశదమగును.

పండితసమృద్ధ మగుమైథిలదేశమున క్రీ. 18 వ శతాబ్దమున 'సచలమిశ్రుఁ' డనుప్రఖ్యాతనామముగల భవానీనాథుఁ డనుమహావిద్వాంసుఁడు వందలకొలఁది

* శ్రీ వేంకటరామకృష్ణకవుల ప్రకటనము.—పిఠాపురము. [క్రీ. 1912.]

మైళ్ళదూరమున నున్న పునహా(పూనా)నగరమున పేష్వామాధవరావునారాయణ ప్రభువునాస్థానమున కరిగి, యట నాప్రభువునుండి యగ్రహారద్వయమును బహుమానముగ స్వీకరించెను. ఆయగ్రహారములు నేఁటికిని భవానీనాథపండితుని సంతతివా రనుభవించుచున్నారు. ఇంతియేకాక భవానీనాథుని, పల్లకిలో నధివసింపఁజేసి, పేష్వామాధవరావు తన భుజస్కంధముపై వహించెనఁట.†
ఇట్టిమహాసమ్మానమెంతటిమహామహులగు పండితులకో కాని తఱచుగా లభింపదు.

## 10. ఆముక్తమాల్యద - ఇతివృత్తవైశిష్ట్యము - నామౌచిత్యము - విలక్షణత :

ఆంధ్రమహాసామ్రాజ్యచక్రమును ద్రిప్పి, బహుభాషావేత్తయై, సహృదయచూడామణియై, స్వయముగా విద్వత్కవి యైనరాయలు నిర్మించిన దగుటవలన ఆముక్తమునకు వక్తృవైలక్షణ్యము బాగుగా సిద్ధించినది. కావ్యమునకు వస్తువు (ఇతివృత్తము), నేత (=నాయకుఁడు), రసము, పాత్రపోషణము (లేక పాత్రల శీలమునకుఁ గ్రమోన్మీలనము)ను ప్రాణతుల్యములు. అంతగాఁ బ్రతిభాసంపన్నుఁడు కాకపోయినను రచయిత యుదాత్త మగు నితివృత్తముపైఁ గావ్యసౌధమును నిర్మించిన దానికి ఘనత కల్గును. పన్నిద్దఱాళ్వారుల (దివ్యసూరుల) యందు భట్టనాథుఁడు (పెరియాళ్వారు) మహత్త్వమున సర్వజ్యేష్ఠుఁడు.

'గురుముఖ మనధీత్య ప్రాహ వేదా నశేషాన్,
నరపతిపరిక్లప్తం శుల్క మాదాతుకామః,
శ్వశుర మమరవన్ద్యం రంగనాథస్య సాక్షాద్
ద్విజకులతిలకం తం విష్ణుచిత్తం నమామి.'

—(నాథముని)

† "Towards the end of the 18th century there was the famous Bhawaninatha, popularly known as *Sachala Mishra*, who went to distant Poona to the court of the then Peshwa Madhawa Rao Narayan......and is reputed to have won.........the high honour of having his *palki* carried by the Peshwa on his *own shoulder*, an honour which was reserved only for the select Pandits, which was very rarely bestowed." (Pt. Ramanatha Jha's Introduction-p. 36- to his edition of MM. Harihara's *Suktimuktavali*. Patna—1949).

అపఠితశాస్త్రగ్రంథజాత్యంధుఁడు, గురుకులమునననాఘ్రాతనిగమపరిమ ళుఁడునగు నీయన యెంతటియచిన్త్యమహిమాన్వితుఁడు కాకపోయిన నీయనచే. శ్రుతిస్మృతిశాస్త్రప్రమాణపురస్సరముగా నారాయణపారమ్యమును వటపత్త్రశాయి సిద్ధాంతీకరింపఁజేయును ? ద్వంద్వాతీతుఁడు, జ్ఞానవైరాగ్యసంపన్నుఁడు, మాలికా సమర్పణరూపభగవత్పరిచర్యయే చరమపురుషార్థ మని విశ్వసించినవాఁడు, భగవ న్నిష్ఠకంటె భాగవతనిష్ఠయే గొప్పదని నమ్మినవాఁడు, విశ్వమున నెవ్వనికిని దల వంపని శ్రీరంగనాథునికి శ్వశురుఁ డగుటచే వంద్యు డైనవాఁడు, సీతాదేవివలె నయోనిజ యగుగోదాదేవికి పితృస్థానీయుఁడు నగువిష్ణుచిత్తునిచరిత్ర, మానవ మాత్రుని వివాహ మాడ నని ప్రతిజ్ఞ పట్టి, పరాత్పరుఁడగు రంగనాథరూపమున నున్ననారాయణునే వలచి, వలపించుకొని తత్సాయుజ్యము నందినభువనాద్భుత చరిత్రయగు గోదావృత్తాంతము నుదాత్తములనుటలో సందేహ మేమి ? దీనిని బట్టి యీప్రబంధమునకుఁ బ్రతిపాద్యవైలక్షణ్యము లభించినది. చర్మచక్షువులతో భగవత్సాక్షాత్కారము నందిన మహనీయుఁడు విష్ణుచిత్తుఁడు. భౌతికదేహముతో శ్రీరంగనాథునియందు లీన మైనయుజ్జ్వలాలౌకికమహిళ గోదాదేవి. వీ రిరువురకు మోక్షప్రాప్తి కలిగె నని వేఱె నుడువవలయునా ?

'యది భవతి ముకున్దే భక్తి రానన్దసాన్ద్రా
విలుఠతి చరణాబ్జే మోక్షసామ్రాజ్యలక్ష్మీః'.

నామౌచిత్యము - విలక్షణత :

రాయలు తనప్రబంధమునకు 'ఆముక్తమాల్యద' అని పేరిడెను. ద్రవిడ మున గోదాదేవికి 'శూడిక్కుడుత్తనాచ్చియార్' అని నామాంతరము. అనఁగా, (మాల్యమును) తాను ధరించి, (భగవంతునకు) సమర్పించిన మహిళ యని యర్థము. ప్రబంధమునఁ బ్రధానకథ గోదాదేవీరంగరాజకల్యాణవృత్తాంతము. ఇందు నాయకుఁడు రంగరాజు, నాయిక గోదాదేవి. ఈమె భూదేవికపరావతారము, జనకతనయవలెనే యయోనిజ యగులోకోత్తరమహిళామణి. ఈమె యవతరించిన దేశము దక్షిణభారతవర్షము. ఈమెజననముచే నీదేశము సర్వోత్తర మైనదని శ్రీవేదాంతదేశికులశ్రీసూక్తి.

'దిగ్దక్షిణాఽపి పరిపక్త్రిమపుణ్యలభ్యా
సర్వోత్తరా భవతి దేవి, తవావతారాత్,
యత్రైవ రఙ్గపతినా బహుమానపూర్వం
నిద్రాళునాపి నియతం నిహితాః కటాక్షాః' - (గోదాస్తుతి, ౧౧)

గోదాదేవికి జనకుఁ డగుభట్టనాథుఁడు (=పెరియాళ్వార్) తాను పొందిన భగవదనుభవమును 'తిరుప్పల్లాండు' (భగవన్మంగళాశాసనము - 12 ద్రావిడపద్యములు), 'తిరుమొజి' (శ్రీసూక్తి - 461 పద్యములు) రూపమున దివ్యప్రబంధ యుగళమును రచించియు, అనవాప్తపూర్వమైన భగవత్ప్రసాదమును, మహత్తర స్థానమును, గోదామౌళిగన్ధసుభగమగుమాల నర్పించుటవలనఁ బడసె నఁట.

'తాతస్తు తే మధుభిదః స్తుతిలేశవశ్యాత్
కర్ణామృతైః స్తుతిశతై రనవాప్తపూర్వమ్,
త్వన్మౌలిగన్ధసుభగా ముపహృత్య మాలాం
లేభే మహత్తరపదానుగుణం ప్రసాదమ్.'

—[శ్రీవేదాంతిదేశికులు- గోదాస్తుతి, ౧౦.]

ఇట్టిమహత్తరమహిమాన్వితయగు ఆముక్తమాల్యదపేరు కవి ప్రబంధమున కిడుట యెంతయు సముచితము.

ప్రబంధనామవిలక్షణత :

ప్రాచీనసంస్కృతసారస్వతమునఁ గావ్యములు నాయికానామాంకితములుగా నుండుట సామాన్యము. సుబంధుని 'వాసవదత్త', హర్షవర్ధనుని 'రత్నావళి-ప్రియదర్శిక'లు, భట్టబాణుని 'కాదంబరి' క్షేమేంద్రుని 'కనకజానకి'; ఇంతేకాక కొందఱు సంస్కృతకవికోవిదులు తమరచనలకు తమతమప్రేమాస్పదలగు ప్రియురాలిపేరో, కొమారితపేరో పెట్టి తత్తద్వ్యక్తుల కమరత్వమును బ్రసాదించిరి. వాచస్పతిమిశ్రుఁడు తనదర్శనభాష్యమునకుఁ దనధర్మదార యగు 'భామతి' నామ మొసఁగెను. వల్లభాచార్యుఁడు తనభార్య యగులీలావతిపేర '(న్యాయ) లీలావతి' యనుగ్రంథమును రచించెను. ఘనశ్యాముఁడు తనధర్మపత్నులలో నొకర్తె యగుసుందరిపేర 'ఆనందసుందరి' యనుగ్రంథమును గూర్చెను. మైథిలుఁడగుగోకులనాథుఁడు చిన్నయస్సుననే దుర్మరణము నందిన తనయయగు 'కాదంబరి'పేరఁ గొన్నిగ్రంథముల రచించెనఁట. రవిపాణి తనతనయ యగు 'మధుమతి'నామముతో కావ్యప్రకాశికకు వ్యాఖ్య రచించెను. ఇట్లే కల్యాణమల్లుఁడు తనభార్యపేరునఁ గాఁబోలు 'మాలతి'యను గ్రంథమును కూర్చెను.

కాని, ప్రాచీనాంధ్రవాఙ్మయమున నాయికానామమున వెలసినప్రబంధము 'ఆముక్తమాల్యద' యొక్కటియే యని తోఁచును. అధునాతనాంధ్రసాహిత్యమున మాత్ర మిట్టివెన్నియో కలవు.

విష్ణుచిత్తీయము - ఆముక్తమాల్యదకు నామాంతరము :

ప్రబంధమున నెచ్చటను రాయలు దీనిని విష్ణుచిత్తీయ మని వ్యవహరింప లేదు. విష్ణుచిత్తుఁడు కావ్యమునఁ బ్రముఖపాత్రము. ఈయనమాలాసేవానిరతి, వటపత్త్రశాయియాజ్ఞ ననుసరించి పాండ్యదేశాధీశునిపండితపరిషత్తునఁ బాల్గొని పరమత వాదముల ఖండించి, స్వమతస్థాపన మొనర్చి, మోక్షప్రదుఁడు శ్రీమన్నారాయణుఁ డొక్కఁడేయని నారాయణపరాత్పరత్వమును నిర్ణయించి, పండితశుల్కమును గైకొనెను. పరబ్రహ్మసాక్షాత్కారహేతువు యోగమే యని సిద్ధాంతీకరించెను. తనతనయయగు గోదాదేవిచరిత్రతోఁబాటీయనచరిత్రయుఁ బ్రబంధోపసంహారము వఱకు వ్యాప్తమైనది. కనుక, విష్ణుచిత్తీయ మనుపేరు రాయలవిద్యత్కవిపండిత పరిషత్కాలము నుండియు వ్యవహారములోనికి వచ్చిన దేమో యని తోఁచును.

## 11. గోదాదేవి - అక్కమహాదేవి - మీరాబాయి :

గోదాదేవిపేరెత్తినంతనే మహాభక్తమండలియందు అక్కమహాదేవి యను కర్ణాటదేశీయమహిళామణి, ఆర్యావర్తమునకుఁ జెందినమీరాబాయి యనుహిందీ వనితారత్నమును తలఁపునకు వత్తురు. ఈపవిత్రచరిత్ర లిరువురకును గోదాదేవికి నెంతో సాదృశ్యము గలదు. కావున వారిని గూర్చి దిఙ్మాత్రముగ నించుక వివరింపఁబడును :

అక్కమహాదేవి (క్రీ. 1130-66 ప్రాంతము) : అక్క కన్నడదేశమున ఉడుతడిగ్రామవాసు లగుశైవదంపతులతనయ. శైవేతరుఁ డగుకేశికుఁడు తద్గ్రామ పాలకుఁడు. సర్వాంగసుందరియగుఅక్క యాదృచ్ఛికముగా నాతనికంటఁ బడ నాతఁ డామెనుమోహించెను. కాని, యామె మాత్రము తనహృదయమును ప్రేమను శ్రీశైలక్షేత్రము నందలి చెన్నమల్లికార్జునదేవునకే యర్పించి, మానవమాత్రుని వివాహమాడనని ప్రతిజ్ఞ పట్టెను. 'శరణసతి, లింగపతి' (భక్తుఁడు-భక్తురాలు-భార్య, శివుఁడు భర్త)యని శైవశరణసిద్ధాంతము. ఇదియే విశిష్టాద్వైతసిద్ధాంతమున జీవాత్మ పరమాత్మలకుఁ గల నవవిధ సంబంధములలో భార్యాభర్తృసంబంధము. శైవభక్తులు త్రివిధము. ప్రథమదశలో భక్తులు ; మధ్యమదశలో మహేశ్వరులు ; ఉత్తమదశలో శరణులు. ఈచరమదశకుఁ జెందినఅక్క కేశికకరస్పర్శ నేవగించు కొనియు, రాజనిగ్రహమువలనఁ దల్లిదండ్రుల కేమియాపద కల్గునో యని వెఱచి, మూఁడునియమము లొనర్చి, వాని నతిక్రమించుచో నాతనిపొత్తు పొసఁగ దని

కంఠోక్తముగా నుడివెను. అందు మొదటి దాతఁడు 'భవి'(=శైవుఁడు) అగుట. ఆత డానియమముల కంగీకరించి యామెను వివాహమాడెను. ఒకనాఁ డామె యర్ధనగ్నయై మైమఱచి, దేహాభిమానశూన్యయై, యొకశరణుని కాతిథ్యమొసఁగఁ బోవ, కేశికుఁ డామెను వారించెను. నియమభంగమైనదని. నాఁటితో నాతని పొత్తునకుఁ దిలోదకములు వదలి శ్రీశైలమల్లికార్జునస్వామికే హృదయవచశ్శరీరముల నర్పించి, తత్సాయుజ్య భాగ్యము నందెను.

ఈమె భగవత్సాక్షాత్కారసాయుజ్యములకై, తీవ్రవేదనముతోఁ జేసిన ప్రతిపత్తి హృదయములఁ గరగించును.

'Her imaginative prayer changes into a frontic appeal to every object that meets her frenzied eye— Parrots, cuckoos, bees, swans, peacocks. After much spiritual travail, the *Supreme Vision* was granted to her. She experienced mystic union with the Formless Itself.'†

ఈమె కన్నడమున రచించినకృతులు : ౧. యోగాఙ్గత్రివిధి. ౨. సృష్టియ వచన. ౩. అక్కగళపీఠికె.

ఈమె పవిత్రచరిత్ర 'మహాఅక్కనపురాణము'నఁ జిత్రింపఁబడెను.

గోదాదేవి విష్ణుభక్తినిరత; అక్కమహాదేవి శివభక్తిపరురాలు. ఈమెవలె నామెయుఁ దాను నమ్మినదైవముతోడిసాయుజ్యమునకై తపించిపోయి తహతహలాడి, తాను రచించినగోదాశ్రీసూక్తి (=నాచ్చియార్ తిరుమొழி)* యందు విహంగకీటకాదుల నెన్నిటినో తనప్రణయసందేశమును రంగనాథునికడకుఁ గొనిపొమ్మని ప్రార్థించును. ఇక్కడను భక్తురాండ్రిరువురకును సామ్యము గలదు. పురుషులదృష్టిచిత్తములను గూడ నపహరించుదివ్యమంగళకమనీయవిగ్రహ-సౌందర్యము గలపురుషోత్తముఁడు శఠకోపముని (నమ్మాళ్వారులు) అనువిఖ్యాత దివ్యసూరికి నాయికావస్థను గల్గింపఁ. పరమపతివ్రతకుండునాకారత్రయము - 'అనన్యార్హత్వము, అనన్యభోగ్యత్వము, అనన్యశరణ్యత్వము'ను గలయాభక్తాగ్రణి భగవద్విశ్లేషమును భరింపఁజాలక, సారసము- హంస- కోకిల- క్రౌంచము,

---

† Prof. T. N. Srikanthayya's article in the *Women Saints of East and West* (pp. 30-40)—1955. —London. Vide also '*Great Women of India*'—Calcutta (Dec. 1953), pp. 300-4.

* 'తిరువాయ్మొழி' VI వ శతకము, 1 వ దశకము; I వ శతకము, 4 వ దశకము.

శుకాదిపక్షులను, తుమ్మెదలను వాయువును, మనస్సును వనప్రణయవార్త భగవంతునికి నివేదింపఁ బ్రార్థించెను. ఇందీయనకును గోదాదేవికి అక్కమహాదేవికిని గలసాదృశ్యమును గుర్తింపఁదగును.

వీరివలెనే యార్యావర్తవాసిని యగు మీరాబాయియు సద్భక్తశ్రేణికిఁ జెందును. వినిర్మలచరిత్ర యగునీమెయుదంతము నిట నించుక స్మరింపఁదగును. ఈమె జోద్‌పురరాజవంశకల్పద్రుమప్రసూనము. జననము - క్రీ. 1504 ప్రాంతము. చిత్తూరురాజకుమారుఁడగుభోజరాజును వివాహమాడెను. ఈమెహృదయమును చూఱఁగొన్నదైవము గిరిధరగోపాలుఁడు. ఈదైవమును గూర్చి యొడలు తెలియని యీమెయార్తపరిపక్వహృదయమునుండి వెల్లివిరిసినహిందీగేయములు వందలు, వేలు. మీరాదేవి బాల్యమునుండియే గిరిధరగోపాలునికి భక్తురాలు. అనుదినము, సంసారజీవితమునఁగూడ గృహకృత్యములకుఁ బిమ్మటరాత్రులయందు శ్రీకృష్ణవిగ్రహమునెదుట భజనసంకీర్తనము, నృత్యము చేయుచు తన్మయురా లగుచుండెడిది. ఆమెకృష్ణభక్త్యున్మాదమత్తగారికి నాడుబిడ్డకు నితరస్త్రీలకు విడ్డూరముగాఁ దోఁచెను. వా రందఱు బతిమాలినను, బెదరించినను, భక్తిమార్గమునుండి యామె తొలఁగ లేదు. ఆమెయాడుబిడ్డయు చెలికత్తెలును రాత్రులందు దేవాలయమున మీరా విటులతో సరససల్లాపము లాడుచుండు నని భోజరాజుతో కొండెములు చెప్పిరి. అతఁడు వికలచిత్తుఁడై యొకఁనాటిరాత్రి దేవాలయమున మీరానృత్యము, సంకీర్తనము చేయుచుండ దూసినకత్తితో దేవాలయమున బ్రవేశింప నట కృష్ణవిగ్రహము తప్ప మఱెవ్వరును లేకుండిరి. ఈమెభక్త్యున్మాదమును గూర్చి విని, అక్బరుపాదుషాయును, ఆస్థానసంగీతవిద్వాంసుఁడు తాన్‌సేనును బైరాగివేషములతో చిత్తూరునకు వచ్చి నాఁటిరాత్రి దేవాలయమున శ్రవణానందముగ నామె సంకీర్తనమును, నేత్రోత్సవముగా నామెనృత్యమును, కని, విని, యామెవలెనే మైమఱచిరి. వారికొండలు తెలిసినతర్వాత పాదుషా యామెకు నమస్కరించి గిరిధరగోపాలుని కిమ్మని యొకరత్నహారము నామెకిచ్చి వెడలిపోయెను. ప్రచ్ఛన్నవేషముగ వచ్చినబైరాగి పాదుషా యని తెలిసిపోయెను. మహమ్మదీయుఁడొకఁడు రాజపుత్రస్త్రీనిఁ దిలకించి, దేవాలయమునఁ బ్రవేశించి, రత్నహారమొసఁగుట రాజస్థానప్రతిష్ఠకు భంగహేతువని భోజరాజు "ఇఁక నీమొగము చూడను. ఏనదిలోనైనఁ బడి చావుము" అని మీరాను గెంటివేసెను. విరక్తితో నామె యొకనదిలో దూకెను గాని స్మృతి వచ్చునప్పటి కొడ్డునఁ బడి యుండెను. ఆమెపాదచారిణియై యెన్నాళ్ళకో బృందావనము చేరి గిరిధరగోపాలునెదుట

నిర్విరామముగా సంకీర్తనమును నృత్యమును చేయుచుండెను. ఆమెమహిమను విన్నభర్త బృందావనమున కరిగియామెను దనయపచారమునకు మన్నింపుమని వేఁడెను. భర్తతో నామెచిత్తూరునకు వచ్చి భజనల, నృత్యముల సాగించుచునే యుండెను. ఇంతలో భోజరాజు మరణింప నతనితమ్ముఁడు రాజై మీరాచర్యల నేవగించుకొనుచు నెల్లైన నామెను చంపవలె నని యెంచి యొకపాములబుట్టనందు పూలహారము లున్నవని యామెకుఁ బంపెను. బుట్టలోమీరా చేయి పెట్టఁగా నందు సర్పములకు బదులు పూలహారములే యుండెను. మఱియొకసారి రాజా యమృత మని చెప్పి యామెకు విషపాత్ర నంప మీరా కదియమృతమే యయ్యెను. నాటఁనుండి మీరాబాయి లోకపూజ్యయై, యావజ్జీవ మిట్లే కృష్ణసంకీర్తనమున కాలము గడపి, యవసానమున భగవంతునిలో నైక్యమయ్యెను. ఈమె కొలిచిన స్వర్ణగోపాలవిగ్రహమును నేఁటికిని జోధ్‌పురమున జనులు పూజించుచున్నారు.

ఇట్లు మహామహిమాన్విత యగుగోదాదేవికిని, అక్కమహాదేవికిని మీరా బాయికి నత్యంతసామ్యము కన్పట్టును. గోదాదేవి యయోనిజ, విష్ణుభక్తురాలు. అక్కమహాదేవి మీరాబాయియు మాతృగర్భమునుండి యవతరించినపవిత్రచరిత్రలు. అక్కమహాదేవి కిష్టదైవము శ్రీశైలమల్లికార్జునుఁడు. మీరాబాయికి గిరిధర గోపాలుఁడు. గోదాదేవికి శ్రీరంగధాముడు.

## 12. రాయల పదజాలము—భట్టబాణ - మాఘ - మురారి కవులతో సామ్యము :

సంస్కృతవాఙ్మయమున బాణునిహర్షచరిత్ర, కాదంబరియు నపారమైన పదజాలమును, అపూర్వపదసమూహమును బ్రదర్శించును, గీర్వాణశబ్దసముదాయ పరిజ్ఞానమున బాణునకుఁ బ్రౌఢపాండిత్యము గలదు. సంస్కృతకవులలో నీతనితోఁ బోటీ చేయఁగలవారు మాఘమురారికవీంద్రులు. మాఘుని 'శిశుపాలవధ' యందు తొమ్మిదిసర్గలు పఠించినవానికి సంస్కృతమునఁ గ్రొత్తపదమే యుండ దని లోకోక్తి :

'నవసర్గగతే మాఘే నవశబ్దో న విద్యతే'

ఇందించుక యతిశయోక్తి యున్నను గీర్వాణశబ్దసంతతిపై మాఘునకు విశేషమైనయధికారము గల దనుట సత్యదూరము గాదు. 'అనర్ఘరాఘవ' రూపకమును రచించిన 'బాలవాల్మీకి' మురారికిని శబ్దస్తోమముపైని ట్టియధికారము గల దని నానుడి.

'యే శబ్దశాస్త్రనిష్ణాతా యే శిలితనిఘంటవః,
తేషామేవాధికారోఽస్తి మురారికృతనాటకే'

పైకవులను బోలినవాఁడే రాయలును. పైకవులకు సంస్కృతముననో, సంస్కృతప్రాకృత భాషలయందో విస్తృతవైదుష్య మున్నచో, సంస్కృతప్రాకృ తాంధ్రద్రావిడకర్ణాటక భాషలలోఁ గూలంకషపాండిత్య మున్నట్లు కన్పట్టును. ఆముక్తమాల్యద యందలివిశిష్టపదపట్టిక యిందొసఁగఁబడినది. దానిని జూచిన రాయల పదజాలవైదుషీవిస్తృతి విశదమగును.

ఆముక్తము - అపూర్వశబ్దాను క్రమణిక.

అందూ - I-77 (పు. ౧౨౧)
అగస్తి - II-39 ; IV-178 (పు. ౧౨౨)
(అడ్డిగము)-ఆముక్తమునలేదని వేదము వేంకటరాయిశాస్త్రి (లడ్డిగ?)
అధ్వసీన - II-51 ; V-123 (పు. ౧౨౦-౧౨౧)
అయనిష్ట - IV-165
ఇరంమద - I-3 ; IV-86 (పు. ౧౦౯-౧౧౦)
ఇఱ్ఱింకులు - IV-43 ; (పు. ౧౩౫)
ఉంభిత - I-46 ; II-55 (పు. ౯౭)
ఉరు - IV-221 ; VI-28 (పు. ౧౪౨)
ఉలియ - I-74 ; IV-34 (పు. ౧౩౩)
ఎడకాండ్రు IV-35 (పు. ౧౩౫)
ఎరవు - II-53 ; IV-134,221 ; V-124 (పు. ౧౪౨-౧౪౩)
ఎలగోలు - IV-91 (పు. ౧౩౬-౧౩౭)
ఏధన - IV-19 (పు. ౧౧౬-౧౨౦)
ఒరుదలకాడు - IV-220 (పు. ౧౪౩)
ఓహారిసాహారి - IV-93 (పు. ౧౩౮)
కక్కసము - IV-35 (పు. ౧౩౪)
కడార - IV-147 (పు. ౧౧౫-౧౧౬)
కతక - IV-146 ; V-138 (పు. ౮౪-౮౫)

---

సూచన: పైసంఖ్యలలో మొదటిసంఖ్య ఆశ్వాసమును, రెండవసంఖ్య పద్యగద్యములను, మూడవది వేదమువారి ఆముక్త పీఠికయందలి పుటలను సూచించును. [ ] ఇట్లు గుర్తింపబడిన పదములు నాచే జేర్పబడినవి.

కరండ - II-83; V-159 (పు. ౧౦౫-౧౦౮)
కరుసులు - VI-17 (పు. ౧౪౦-౪౧)
కర్కటి - II-73 (పు. ౮౨ ౮౮)
కర్కరీ - IV-140 (పు. ౪౦౪ వావిళ్ల ఆముక్తమాల్యదప్రతి)
కర్బుర - IV-35; VII-34 (పు. ౮౩)
కలంబ - IV-27 (పు. ౨౯)
కసీసము - IV-10 (సాహిత్యసమీక్ష పు. ౩౬౦)†
కస్థల (లీ ?) - III-92 (పు. ౨౪)
కాడుపడి - VI-12 (పు. ౧౪౧-౪౭)
కాశ్మీర - IV-119 (పు. ౧౦౩-౧౦౫)
కిసరు - IV-175 (పు. ౧౩౯, ౫౫౬)
కీకట - IV-31 (పు. ౮౯)
కుథ - IV-58; VII-32 (పు. ౮౭, ౨౦౦)
కృకలాస - IV-123 (పు. ౯౫)
కేకర - II-26 (పు. ౧౭౬-౧౭౨)
కేలసము - IV-96 (౧౩౬-౧౩౯)
కొంగవాలు - VI-85; VII-21 (పు. ౧౪౩)
కొడిమెలు - V-58 (పు. ౧౪౦)
ఖురళీ - IV-35 (పు. ౯౦-౯౧)
గండె - IV-35; V-41 (పు. ౧౩౯-౧౪౦)
గనపరాకులు - VII-14 (పు. ౧౪౩)
గార - IV-20 (పు. ౧౪౦)
గిరవుంచుట - I-54 (పు. ౧౪౪-౧౪౫)

ఘటశాసి : - VII-3(పు. 676)=తార్కికుడు. అర్థజ్ఞానశూన్యముగా వేదమును బఠించువారు. చూ. కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయముపై నాదిండ్ల గోపమంత్రి రచించిన చంద్రికావ్యాఖ్య.... "ఏతే తావ దర్థావధారణ విధురాః స్వాధ్యాయాధ్యయనమాత్రనిరతాః వేదవిప్లావకాఏవ" అను దాని వ్యాఖ్య— "ఏతే ఘటశాసినః అర్థజ్ఞానశూన్యాః, అతఏవ వేదోపద్రవకారిణః × × అర్థావ

† సా. స.=సాహిత్యసమీక్ష. (శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి. నెల్లూరు, 1955)

లోధానుష్ఠానయోరభావే ఘటశాసినాం × × స్వతఏవాయాతి వేదవిప్లవత్వం. (II వ అంకము. 54 వ పుట. నిర్ణయసాగర ప్రతి. (1924.) ఈ పదము వల్లభామాత్య రచనముగాఁ బ్రకటితమైన 'క్రీడాభిరామమున' గూడఁ గలదు. (చూ. వేటూరి ప్రభాకరశాస్త్రి పరిష్కృతమగు ప్రతి. 257 - వచన. పు. 84. 1928.) శ్రీ బండారు తమ్మయ్యగారి టీక...ఘటశాసి=శాస్త్రి.(వావిళ్ళ ప్రతి. పు.46. 1953.)

ఘర్మగవి - III-21 (పు. ౭౮)
ఘుణ - IV-141 (పు. ౮౩-౮౪)
ఘుసృణ - I-46 ; V-143 (పు. ౯౩-౧౦౨)
చండాతక - IV-35 (పు. ౩౦౧)
చాండాలిక - VI-7 (పు. ౬౩౬-౭౬)
చట్టలు - IV-35 (సా.స.పు. ౩౬౧)
చావడము - II-96 ; IV-35 (పు. ౧౪౧)
చయ్యంకి - IV-35 (పు. ౧౩౪)
చేఁగొను - IV-28 (సా.స.పు. ౩౫౩)
జంభల - V-143 (పు. ౧౧౨)
జడి - I-80 : IV-96, 127, 129, 134, (పు. ౧౩౨-౧౩౩)
ఝాట - IV-22 (పు. ౫౩-౯౧-౮౨)
టెంకి - VI-6 (పు. ౧౪౧)
తపారంబు - II-75 ; IV-58 (పు. ౧౩౭)
తాపెకత్తె - V-70 (పు. ౧౪౦)
తూపరాణి - VI-10 (పు. ౧౩౧-౩౨)
తృణతా - V-145 (పు. ౫౩, ౧౩౦-౧౩౧)
తెండి - V-146 (పు. ౫౫-౧౪౬)
త్రాడ్గారికికోన్ - VI-40
దాత్ర - II-98 (పు. ౧౨౯-౧౩౦)
దివాకీర్తి - VI-10 (పు. ౮౫)
దివెదారికొమ్ము (కోల) IV-35
దుసికిలుట II-65 (పు. ౧౪౫)
ధామార్గవVI-14 (పు. ౬౪౦)
ధూమ్య - V-118 (పు. ౧౧౨-౧౧౪)

నిట్రు - IV-50 (పు. ౧౩౬-౧౩౭)
పనసపండు దిగినపరిగ - IV-274 (సా. స. పు. ౩౫౯)
పర్జనీ - V-89 (పు. ౭౫)
పొగడము - I-56 (పు. ౧౪౫)
పాటచ్చర - IV-285 ; VII-15 (పు. ౯౫-౯౭)
పాటిపాటి - IV-35 (సా. స. పు. ౩౫౮)
పాదూవహ - IV-7 (పు. ౭౩-౭౪)
పొఢ్రేను
ప్లవ - III-90 ; VI-49 (పు. ౮౫-౮౬)
బారాసి - III-15 ; IV-50 (పు. 133)
భల్లాతకి - VI-49 (పు. ౧౧౦)
భ్రుకుంస - IV-36 (పు. ౯౨)
మండ - IV-35 (పు. ౯౧-౯౨)
మణిధనువు - IV-103 (పు. ౭౮)
మత్తల్లి - III-92 (పు. ౭౬)
మదనచేతులు - II-17 (పు. ౧౦౬)
మరులుఁదీగె - VI-12 (పు. ౧౪౧)
మలకవాటు - VII-7
మిహికా - V-102 (పు. ౧౧౪)
మైరేయ - VI-25 (పు. ౧౦౮-౧౦౯)
లాపరా - VI-10 (పు. ౧౩౭)
వర్ధకి - IV-32 (పు. ౧౧౬)
వశత్త - IV-38 (పు. ౯౨-౯౪)
వారవాణ - IV-31 (పు. ౮౯)
వార్ధశ్రవస - II-99 (పు. ౧౩౦)
వార్ధుషిక - II-99 (పు. ౧౩౦)
వింగడము - IV-50 ; V-4 (పు. ౧౩౫-౧౩౬)
వితీర్ణి - II-35 ; (పు. ౧౨౨-౨౪)
వైజనన - IV-137 (పు. ౯౪)
వైశికి (ఆముక్తమునమృగ్యమఁట)

వైశికముల్ - V-81; (పు. ౧౧౫)
శిఖ - IV-178; VII-23 (పు. ౧౧౦-౧౧౨)
శృంగాటక - IV-8; (పు. ౭౯-౮౧)
శృంగిబేర - VI-35 (పు. ౯౨)
షాడబ - IV-281 (పు. ౮౫) ఈ పదమునుగూర్చి శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు. బులుసు వేంకటరమణయ్యగారు, ఆంధ్ర వారపత్రిక (దసరాసంచిక), 'భారతి' సంచికల యందును, 'త్రిలింగ' యందును వివదించుకొనిరి. ఆయా వ్యాసముల సారసంగ్రహము శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి సాహిత్య సమీక్ష యందు (పు. 380-84) కననగును (1955. నెల్లూరు).
సన్నెగాశె - IV-35 (పు. ౧౩౪)
సరవణి - II-15, VII-30 (పు. ౧౪౪)
సామి - I-46; IV-139 (పు. ౯౭-౯౮)
[సున్నమెత్తుట - IV-187 (సా.స.పు. ౩౫౪)]
సృణి - I-47 (పు. ౧౦౨-౧౦౩)
సేవధి - I-13; IV-287 (పు. ౯౮-౯౯)
హట్ట - II-35 (పు. ౧౨౪-౧౨౬)
హదను - IV-93; II-46 (పు. ౧౩౮)
హల్లీసక - III-92 (పు. ౭౭)
హసంతిక - IV-135; V-118 (పు. ౧౨౭-౧౨౮)
[హింఢితము - V-93 (పు. ౫౬-౫౯)]
హేవాక - I-89.

## 13. 'బ్రౌన్'పండితుఁడు కూర్చిన'ఆముక్త'పదసూచిక (Index Verborum):

ప్రాచీనప్రఖ్యాతరచయిత లొక్కొక్కరచనయందును, తమతమగ్రంథ జాలము నంతటియందును ప్రయోగించినపదములసమగ్రసూచికల, నర్థవిశేషాదులతోఁ గూర్చుట పాశ్చాత్యదేశాచారము. 'షేక్స్పియర్ మహాకవి, మిల్టన్ కవిశేఖరుఁడు మొద లగువారిరచనలకుఁ ప్రత్యేకనిఘంటువులు కూర్పఁబడినవి. ఇట్టి కోశములు భాషాచర్చలకు, భాషాపరిణామవిచారమునకు నెంతయో యుపకరించును.

ఇట్టికోశములు భారతదేశీయభాషలయందు మహాకవిఖ్యాతి నందినవారిప్రధాన గ్రంథములకై నను గూర్పఁబడలేదు. కాని పాశ్చాత్యవిద్వాంసులు మాత్రము తాము పరిష్కరించి ప్రచురించినసంస్కృతగ్రంథముల కిట్టిపదసూచికలను గూర్చి, ఆయాగ్రంథముల కనుబంధించి, మహోపకార మొనర్చిరి. ఆంధ్రభాషావాఙ్మయ గవేషణవ్యసనియై కఠోరకృషి సల్పి, ఆంధ్రమునకు, ఆంధ్రసారస్వతమునకు నెంతయో యమూల్యసేవ యొనర్చి, ప్రాతఃస్మరణీయుఁ డైన శ్రీ సి. పి. బ్రౌన్ పండితుఁడు,[1] విద్వత్సాహాయ్యమున 'ఆముక్తమాల్యద'ను బరిష్కరించి, దాని యంచలిపదజాలమున కకారాద్యనుక్రమణికను సంధానించెను.[2] నేఁటివఱకు నీపద సూచిక మద్రాసులో, ప్రభుత్వమువారిప్రాచ్యలిఖితగ్రంథాలయమున నసూర్యంపశ్య వలె మఱుఁగుపడి యున్నది. ఈసూచికను, ఆశ్వాసపద్యసంఖ్యలతో, ఏవేవమువారి ప్రతిని బట్టియో పుటసంఖ్యలను గూడఁ జేర్చి, పదములకర్థములను గూడ వ్రాసి, పచురింపవలెను. అట్టిభాగ్య మెన్నఁటికో.

## 14. సంజ్ఞావాచకసూచిక ఐతిహాసికసాంస్కృతికవిషయములకు అకారాద్యనుక్రమణిక :

'ఆముక్తము' నందలివివిధసంజ్ఞావాచకపదములకు, లఘువివరణములతో, అకారాద్యనుక్రమణికను (Index of the various proper names - of persons, places, rivers and mountains etc.) కూర్చు టత్యవసరము. మఱియు, నీప్రబంధ మున నైతిహాసికసాంస్కృతికాదివిశేషములు, శాస్త్రీయాంశము లనేకములు నిక్షిప్త ములై యున్నవి. ఈవిషయమున నీగ్రంథరాజముతోఁ బోల్పఁదగినవి బాణుని కాదంబరీ-హర్షచరితములు, మురారికృతి 'అనర్ఘరాఘవము'; శ్రీహర్షుని 'నైషధీయ చరితము'; సోమదేవుని 'యశస్తిలకము?' పైగ్రంథములలో బాణునిరెండుగ్రంథము లకును, 'శ్రీహర్షునినైషధీయచరితము'నకు అకారాదిగఁ బ్రకీర్ణవిషయానుక్రమణికలు (General Index of items of historical, literary and cultural interest) భారతీయవిద్వాంసులే కూర్చి యున్నారు. ఈయవసరమునఁ బేర్కొనఁదగినది గౌహతివిశ్వవిద్యాలయకులపతి యగుశ్రీకృష్ణకాంత 'హాండికీ' [Prof. K. K. Handiqui, M. A. (Oxon of Calcutta)] పండితుఁడు స్వరచిత మగు 'యశస్తి

1. క్రి. శ. 1798-1884

2. క్రి. శ. 1849 వ వత్సరమునఁ బూర్తిచేయఁబడెను. ('ఆముక్తమాల్యదాశబ్దసూచి' 423 వ సంఖ్యగల గ్రంథము - మద్రాసు ప్రభుత్వప్రాచ్యలిఖిత గ్రంథాలయము)

లక చంపూసమీక్ష' కనుబంధించినసమగ్రసర్వతోముఖ మగు అకారాదివిషయాను క్రమణిక. ఇట్టివిషయానుక్రమణికల కిది పరమలక్ష్యము. క్రీ.శ. 1915వ వత్సర మున, శ్రీమాడభూషి వేదాంతనరసింహాచార్యులవారు కాఁబోలును, జక్కనకవికృత 'విక్రమార్కచరిత్రము'న కిట్టియనుక్రమణికను సంధానించి 'ఆంధ్రసాహిత్యపరి షత్పత్రిక'యందు బ్రచురించిరి. పైరెండనుక్రమణికలవంటిదే 'ఆముక్తము'నకు గూడ నత్యంతవాంఛనీయము.

## 15. ఆముక్తమాల్యదపై వ్యాఖ్యలు :

ఇంతవరకు ఆముక్తమాల్యదపై నయిదు వ్యాఖ్యానములు లభించినవి. అందు రెండు మాత్రమే ముద్రింపఁబడినవి. తక్కినమూఁడున్ను మద్రాసులో ప్రభుత్వమువారి ప్రాచ్యలిఖితగ్రంథనిలయమున నెండక న్నెఱుఁగకుండ నజ్ఞాతవాస వ్రతము నవలంబించి యున్నవి. ఈవ్యాఖ్యలను గూర్చి కూలంకషముగఁ జర్చించి, కీ.శే. 'రాజచరితవిశారద - రావుసాహెబ్ 'సి. హయవదనరావుగారు రచించిన యాంగ్లవ్యాసమున † విశేషములను గుతూహలము గలపాఠకులు విలోకింతురు గాక. పైవ్యాసమునకు శ్రీవిద్వాన్ బులుసు వేంకటేశ్వరులు (బి.యే)గారియాంధ్ర పరివర్తనము ‡ 'శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిషష్టిపూర్త్యుత్సవసన్మానసంపుటమునఁ బ్రకటింపఁబడెను. వ్యాఖ్యానవ్యాఖ్యాతలను గూర్చి దిఙ్మాత్రసూచిక :

అ. అముద్రితములు : 3

౧. గట్టుపల్లి శ్రీనివాసకవి : 'మహాటీక' (క్రీ. 1800ప్రాంతము)

౨. ఉప్పలపాటి జోగిజగన్నాథరాజు : 'బుధమనస్తోషిణి' (క్రీ. 1813 ప్రాంతము)

౩. గుడిపాటి వేంకటకవి : 'తాత్పర్యబోధిని' (క్రీ. 1848కంటెఁ బ్రాక్తనము)

---

† '*Āmukta-mālyada*'—an article in English, by the late Rāja-caritaviśārada C. Hayavadana Rāo, B.A., B.L., M.L.C. (in *Bhāsoddhāraka Vāvilla Venkateśwara Śastrulu Commemoration Volume*, Madras.) (1941) – Pp. 89-103.

‡ మద్రాసు - (1952) - పుటలు 231-'40. ఈవ్యాసము - ఆముక్తమాల్యదకు - (వావిళ్లవారిప్రచురణము, 6వసంస్కరణము - 1954) అనుబంధముగాఁ బునర్ముద్రణము నందినది (పు.89-99).

(ఆ) ముద్రితములు : 2

౧. వావిళ్ల రామస్వామిశాస్త్రి : 'రుచి' (క్రీ. 1869)

౨. వేదము వేంకటరాయశాస్త్రి : 'సంజీవని' (క్రీ. 1927)

శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రిగారు 'రుచి' వ్యాఖ్యానముతో నీప్రబంధమును బ్రకటించుటకుఁ బూర్వమే దీనికి, సమగ్రములు, అసమగ్రములు నగు పెక్కు వ్యాఖ్యలు రచింపఁబడినవి. నెల్లూరు - నవాబు పేఁటవాస్తవ్యులు శ్రీ వింజమూరి నరసింహాచార్యులుగారు 'బహుప్రాచీనవ్యాఖ్యానసమాకలనప్రాయముగా' నొకవ్యాఖ్యను నిర్మించి, శ్రీ రామస్వామిశాస్త్రిగారి కొసఁగ, వీరు, ప్రెసిడెన్సీకాలేజీలో నాంధ్రపండితు లగు శ్రీచదలవాడసీతారామశాస్త్రిగారితోడ్పాటున, ముద్రించి ప్రకటించినట్లు సీతారామశాస్త్రిగారే తమశిష్యశిఖామణి యగు శ్రీవేదమువేంకట రాయశాస్త్రిచరణులతో వక్కాణించి రటఁ, "ఆముక్తమాల్యదను 'రుచి'వ్యాఖ్యానముతో శ్రీవావిళ్లవారు ప్రకటించినప్పటి నుండి యది కాంచినఖ్యాతి నిరుపమానము. విద్యార్థిప్రపంచమున కది కామధేనువుగా విరాజిల్లుచున్నది. అంతే కాదు, ఇది యానాఁడు ప్రకటింపఁబడకయే యున్న నేనాఁడో ఆముక్తమూల్యద రూపరేఖ లేక నశించియుండెడి దనుటలో నాశ్చర్యము లేదు"—అని శ్రీవేంకట రాయశాస్త్రిగారు వ్రాసియుండెరఁట. 'రుచి'వ్యాఖ్యానము ప్రాచీనవ్యాఖ్యలనుఁ బరిశీలించి వావిళ్లరామస్వామిశాస్త్రిగారే రచించిరని శ్రీహయవదనరావుగారు కంఠోక్తముగా వక్కాణించి యున్నారు. శ్రీచెదలవాడ సీతారామశాస్త్రిగారు శ్రీ వేదమువేంకటరాయశాస్త్రిగారితో స్వయముగా జెప్పినవాక్యములను బట్టి శ్రీ వింజమూరినరిశిసింహాచార్యులవారురచించినవ్యాఖ్యను రామస్వామిశాస్త్రిగారు ప్రకటించినట్లు తెలియుచున్నది. ఇందలిసత్యాసత్యములను బ్రకృతము నిర్ణయింపఁ జాలము.

రుచి - సంజీవనివ్యాఖ్యానములు :

శ్రీ వావిళ్లరామస్వామిశాస్త్రిగారు విశేషవ్యయమునకును, కఠోరపరిశ్రమకును లోనై ప్రచురించిన రుచివ్యాఖ్యానము ప్రతిపదార్థతాత్పర్యములతోఁ గూడియుండుటచే విద్యార్థిమండలికి, ఆముక్తమాల్యదాపఠనమున నెక్కుడు తోడ్పడుచున్నది. విద్వాంసులకే యుపయోగించు విశేషవిషయము లిం దంతగా లేవు. శ్రీవేదమువేంకటరామయశాస్త్రిగారి సంజీవనీవ్యాఖ్యానము విద్యార్థులకంటె విద్వాంసుల కెక్కు డుపయోగకారి. ఇందు విశిష్టాద్వైతసంప్రదాయవిశేషములు, శాస్త్రీయాంశములు, పూర్వవ్యాఖ్యానముల లేనివి, విశేషముగా వివరింపఁ బడినవి.

కావ్యవ్యాఖ్యానవిధానమునను, కూడ నిది విస్తృతముగా నున్నది. కాని కొన్ని కొన్నిఘట్టములఁ బరిశీలించిన నిది కూడ, ఆముక్తమునకుఁ బర్యాప్త మైనవ్యాఖ్యకా దేమో యనిపించును. ఆముక్తమాల్యదయందలిగద్యపద్యములకు, అకారాది ప్రతీకానుక్రమణికనుకూర్చి తమవ్యాఖ్యానమునకనుబంధించి, పాఠకలోకమునకు విశేషోపకారము చేసినమహనీయులు ప్రప్రథములు శ్రీవేదమువారే. వీరిప్రచురణము నను వ్యాఖ్యానమునను గలదోషములను, లోపములను, శ్రీదీపాలపిచ్చయ్యశాస్త్రి గారుఁ 'సాహిత్యసమీక్ష' యందుఁ జూపియున్నారు.

ఆముక్తమాల్యదాప్రవేశమునకు 'రుచి' యను ఘంటాపథమును నిర్మించిన వారు రామస్వామిశాస్త్రిగారు. ఆఘంటాపథమును విద్వజ్జనసంచరణార్హముగాఁ జేసి, ఛాయావృక్షములతోనలంకరించినమహామహులు వేంకటరాయశాస్త్రిచరణులు. ఈ రాజమార్గమునఁ బ్రమాదవశమునఁ బడినశిలాకంటకాదులను తొలఁగించిన సహృదయులు శ్రీదీపాలపిచ్చయ్యశాస్త్రిగారు. ఈపండితత్రయము, ఆముక్త మాల్యదా పాఠక లోకమునకు పూజనీయము.

## 16. ఆముక్తమాల్యద - వివిధపద్యజాతులు - కవుల కేకవృత్తాభిమానము :

ఆముక్తమాల్యదయందుఁ గలపద్యగద్యములలో వచనభాగములు - డెబ్బది మూఁడు. వివిధపద్యజాతులు మొత్తమెనిమిదివందలయైదు. రాయలు పదునేడు సంస్కృతాంధ్రపద్యజాతులను రచించెను. ప్రాచుర్యమును బట్టి చూచిన కంద పద్యరచనమున నీతని కెక్కుడభిమాన మున్నట్లు కన్పట్టును. దానితరువాత తేటగీతి, చంపకమాల లీయన కెక్కువప్రీతిపాత్రములు. భట్టబాణునివలెఁ గొందఱు కవులకు గద్యరచనమునందే యెక్కువ యభిమానకౌశలములు కనఁబడును. బాణునకు పద్యరచనయం దంతగానేర్పు లే దనిపించును. ఈవిషయమునే

'యాదృగ్గద్యవిధౌ బాణః పద్యబంధే న తాదృశః'

అని భోజుఁడు సరస్వతీకంఠాభరణమున నుల్లేఖించెను. రాయ లట్లు గాక పద్యగద్య నిర్మాణమున సమానకౌశలమును బ్రదర్శించెను. సంస్కృతమునను, తెనుఁగునను, కొందఱుకవులకుఁ గొన్ని కొన్ని వృత్తములయందు విశేషాదరముకలదు. గీర్వాణ కవులలో కాళిదాసమహాకవికి మందాక్రాంత మన నెక్కువ ప్రీతి. శంకరభగవత్పాదు లకును భవభూతికిని శిఖరిణీవృత్తరచనమున నెక్కువ మోజు. ఛత్రభారవికి వంశస్థవృత్తము విశేషప్రీతిపాత్రము. తిక్కనకు కందమునందును, శ్రీనాథభట్టు మూర్తులకు సీసమునందును, వేమన కాటవెలదులందును, ప్రేమ మిక్కుటము.

ఈక్రింద నొసఁగుపట్టికలను బట్టి రాయల కేయేపద్యజాతులందెంతెంత యాదరము కలదో తెలియనగును.

| | I ఆ. | II | III | IV | V | VI | VII | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | వేదమువారి ప్రతి | | | |
| 1. ఆటవెలఁది | 1 | 1 | 9 | 14 | 1 | 4 | 1 | 31 |
| 2. ఉత్పల | 10 | 9 | 4 | 13 | 22 | 7 | 7 | 72 |
| 3. ఉత్సాహ | — | — | — | — | — | 1 | — | 1 |
| 4. కందము | 17 | 17 | 31 | 79 | 29 | 13 | 14 | 200 |
| 5. కవిరాజవి | — | — | — | 1 | — | — | — | 1 |
| 6. చంపక | 17 | 20 | 5 | 38 | 26 | 7 | 4 | 117 |
| 7. తేటగీతి | 6 | 16 | 10 | 62 | 38 | 10 | 15 | 157 |
| 8. తోటక | — | — | — | — | 1 | — | — | 1 |
| 9. భుజంగప్ర | 1 | — | — | — | — | — | — | 1 |
| 10. మత్తకోకిల | — | — | — | 1 | — | — | — | 1 |
| 11. మత్తేభ | 12 | 12 | 8 | 21 | 15 | 3 | 3 | 74 |
| 12. మహాస్ర | 2 | — | 1 | 2 | 1 | — | 1 | 7 |
| 13. మాలిని | — | 1 | — | — | — | — | — | 1 |
| 14. శార్దూల | 4 | 6 | 3 | 11 | 6 | 9 | 2 | 41 |
| 15. సీసము | 14 | 17 | 12 | 21 | 12 | 7 | 13 | 96 |
| 16. స్రగ్ధర | — | — | — | 2 | — | — | — | 2 |
| 17. స్రగ్విణి | — | — | 1 | — | — | — | 1 | 2 |
| 18. వచనము | 5 | 2 | 9 | 24 | 10 | 9 | 14 | 73 |
| | 89 + | 101 + | 93 + | 289 + | 161 + | 70 + | 75 | 878 |

ప్రాచుర్యక్రమమునుబట్టి ఆముక్తమాల్యదలోని పద్యజాతులు :

| | | | |
|---|---|---|---|
| 1. కందము | 200 | 10. స్రగ్ధర | 2 |
| 2. తేటగీతి | 157 | 11. ఉత్సాహము | 1 |
| 3. చంపకమాల | 117 | 12. కవిరాజవిరాజితము | 1 |
| 4. సీసము | 96 | 13. తోటకము | 1 |
| 5. మత్తేభవిక్రీడితము | 74 | 14. భుజంగప్రయాతము | 1 |
| 6. ఉత్పలమాల | 72 | 15. మత్తకోకిల | 1 |
| 7. శార్దూలవిక్రీడితము | 41 | 16. మాలిని | 1 |
| 8. ఆటవెలఁది | 31 | 17. స్రగ్విణి | 1 |
| 9. మహాస్రగ్ధర | 7 | 18. [వచనము] | 73 |

## 17. ఆముక్తమాల్యద మాతృకలు :

'దేవస్య మహిషీం దివ్యా మాదౌ గోదా ముపాస్మహే.
యన్మౌళిమాలికాం ప్రీత్యా స్వీకరోతి స్వయం ప్రభుః.'

—శ్రీపరాశరభట్టర్ శ్రీసూక్తి

ఆముక్తమాల్యద కుపజీవ్యము లైనప్రాక్తనగ్రంథములను గూర్చి విచారించుటకు ముం దీప్రబంధమునఁ గలవివిధఘట్టముల నెన్నఁ దగును.

1. విష్ణుచిత్తునివృత్తాంతము. 2. గోదాదేవిచరిత్ర
3. యామునాచార్యకథ 4. చండాలబ్రహ్మరాక్షస సంవాదము
5. ఖాండిక్యకేశిధ్వజసంవాదము.

అను నైదుఘట్టములిందు కానవచ్చును. ఇందు ప్రధానములు మొదటిరెండుఘట్టములే. వీనియందలికథ సంస్కృతమున కవివైద్యపురందరుఁడును భగవద్రామానుజ గురువరచరణకటాక్షలబ్ధవిద్యావైభవుఁడును శ్రీరంగరాజారోగ్యశాలావల్లభుఁడు, నగు గరుడవాహనపండితుఁడు నిర్మించిన 'దివ్యసూరిచరిత' మను సంస్కృతకావ్యరత్నమునను, ద్రావిడభాషయందు 'పిన్జజగియపెరుమాళ్‌జీయర్' పండితుడు సంస్కృతద్రావిడమిశ్ర మగుమణిప్రవాళభాషలో రచించిన 'గురుపరంపరాప్రభావమునను' (71-92 పుటలు) కన్పట్టుచున్నది. పైరెండుగ్రంథములే రాయలకాధారములు కానోపును. దివ్యసూరిచరితము క్రీ. శ. 11—12 శతాబ్దములయందును, గురుపరంపరాప్రభావము క్రీ. శ. 14వశతకమునను రచింప బడినట్లు చరిత్రలనుబట్టి తెలియుచున్నది. పైకథలు గలగ్రంథములు గీర్వాణమున, అనంతాచార్యపండితుని 'ప్రపన్నామృత' మనుమహాగ్రంథమునను, ప్రతివాదిభయంకరమ్అణ్ణన్‌శిష్యు డగునంబూరి కేశవాచార్యుల 'ఆచార్యసూక్తిముక్తావళి'యందును కన్పట్టుచున్నవి. కానియీ గ్రంథరచనాకాలములను బట్టి యివి రాయల కాధారములు కాఁజాల వని నిర్ణయింపదగును. వీనితోడిదే శ్రీవేదాంతదేశికులకుమారు లగు 'నయనార్‌స్వామి' శిష్యులు బ్రహ్మతంత్రస్వతంత్రస్వామి మణిప్రవాళభాషలో నిర్మించిన "మువ్వాయిరప్పడి" యనువడగలై 'గురుపరంపరాప్రభావమును'.

దివ్యసూరిచరితమున సరళమధురముగా విష్ణుచిత్తగోదాదేవీవృత్తాంతము మహాకావ్యధోరణిలోఁ జిత్రింపఁబడెను- (9-13 ; సర్గలు పుటలు 54-96). మొత్తము 446 శ్లోకములలో నిర్వురిచరిత్రమును బహుమనోహరముగా నిందుఁ జిత్రింపఁబడెను. ఈశ్లోకములనే యాధారముగాఁ గొని రాయలు తనప్రబంధమును నిర్మించి యుండినచో మిగుల హృదయావర్జకముగ నుండెడిది. పైగ్రంథము నందలి మూల

కథ, దానికి రాయ లొనరించినకూర్పులు మార్పులను గూర్చి శ్రీమేడేపల్లివేంకట రమణాచార్యులవారి 'ఆముక్తమాల్యదాభూమిక' యందును శ్రీప్రభాకరరావుగారి 'పర్యాలోకము'నను గన నగును. ఆయామూలానుకరణములవ్యత్యాసములసార్థక్యమును గూర్చియు నటఁ బరిశీలింపఁ దగును. యామునాచార్యకథ కూడ 'దివ్యసూరిచరిత్రము'నందలిదే. యామునాచార్యులు గోదాదేవికంటెఁ జాల నవీను లగుటచే నాముక్తమున వీరిచరిత్ర కెట్టిప్రసక్తియును లేదు. కాని, రాయ లెట్లో యామునాచార్యకథను ప్రధానకథతో ముడిపెట్టెను. చండాలబ్రహ్మరాక్షససంవాదము వరాహపురాణాంతర్గతము. శ్రీవరాహభూదేవీసంవాదమున భగవద్గాన మహిమను, బ్రతిపాదించునలువదినాల్గవసర్గలో నీవృత్తాంతము గలదు. ప్రబంధము నందలి ప్రధానేతివృత్తమునకును, మాతంగబ్రహ్మరక్షస్సంవాదమునకును, సంబంధ మేమియులేకపోయినను, రాయ లేదో యొకవిధమున బదరీబాదరాయణసంబంధమును గల్పించి కొన్ని మార్పు లొనరించి, దీనియందు విశిష్టాద్వైతమతసంప్రదాయంబును, యుక్తిచాతుర్యంబును. జ్ఞానపరిణతిని విశదీకరించెను.

ఖాండిక్యకేశిధ్వజసంవాదమును పరాశరనిర్మిత 'శ్రీవిష్ణుపురాణము'నందలి షష్ఠాంశములో షష్ఠసప్తమాధ్యాయములలోఁ బరాశరునిచే మైత్రేయఋషికి వివరింపఁ బడెను. ఈకథ శ్రీమద్భాగవతము నందలినవమస్కంధమున, త్రయోదశాధ్యాయములో నించుక సూచింపఁబడినది. యామునాచార్యచరిత్రమున మూలకథావ్యత్యయములు, వానిసమంజసత్వమును, ఆముక్తభూమికా - పర్యాలోకనములఁ గనవచ్చును. కాని ఖాండిక్యకేశిధ్వజసంవాదమున రాయ లెట్టిమార్పును జేయలేదు.

## 18. ఆముక్తమాల్యద - ఆశ్వాససంఖ్య - ఆశ్వాసోపసంహారవిలక్షణత :

ఆముక్తమాల్యదయందు వావిళ్లరామస్వామిశాస్త్రిగారిప్రతిని బట్టియా ఱాశ్వాసములు కలవు. ప్రక్షిప్తభాగ మని యిందు నాల్గుపద్యములు చివర ననుబంధింపఁబడినవి. విమర్శశిరోమణి జూలూరిఅప్పయ్యపండితులు క్రీ.శ.1834లోఁ బూర్తిగా బరిష్కరించినప్రతియం దాఱాశ్వాసములే కలవు. కాని షష్ఠాశ్వాసాంతమున

మ. 'ఇది నీలాచలనీలచేలకసుభద్రేందీవరాభాక్షికో -
ణదృగంచద్భుజవీర్యధుర్యజయసన్నాహోర్భటీవాద్యభీ -
త్యుదితేభేశ్వరకృష్ణరాయమహిజాన్యుత్పాదితాముక్తమా -
ల్యద నాశ్వాసము సప్తమం బలరు హృద్యం బైనపద్యంబులన్'

—(వేదమువారిప్రతి. VII-75. ౭౨౨ పు.

అను పద్యము క్రొత్తగాఁ జేర్పఁబడినది. గట్టుపల్లి శ్రీనివాసకవి ప్రతిలోఁగలఁ

మ. 'ఇది నైరామనయావనావనిధవాహీనాభ్రచుంబిస్ఫుర -
ద్విదితాఖిలమణీగృహాశిదళనోద్వేలోగ్రహస్తివ్రజో -
ద్యదనీకాగ్రగకృష్ణరాయమహిభృత్సంజ్ఞాస్మదాముక్తమా -
ల్యద నాశ్వాసవరేణ్య మాఱవది హృద్యంబైన పద్యంబులన్'
—(అదే. IV-69. ౬౭౪ పు.)

అనుపద్యమును వేదమువారు షష్ఠాశ్వాసాంతమునఁ జేర్చిరి. దీనికాధారము శ్రీనివాసకవిప్రతియే. క్రీ.శ. 1813వసంవత్సరమునకుఁ జెందిన జగన్నాథరాజు ప్రతిలో 'ఇదినీలాచల' యనుపద్యము కలదు. దీనికిఁ బూర్వపు బ్రతులలో 'ఇదిసింహాచల' యనుపద్యమే యున్నది. శ్రీనివాసకవి, ఆముక్తమున నేడాశ్వాసములు కలవని తెలిపెను, ఈవ్యాఖ్యాత యేడాశ్వాసము లనుట కేమైన నాధారము కలదో, లేక తానే య ట్లూహించెనో తెలియదు. ఆఱవయాశ్వాసమునే శ్రీనివాసకవి రెండాశ్వాసములుగా విభజించె నేమో యని కొందఱిసందేహము. కాని యాముక్తమున నాశ్వాసములసంఖ్య యేడే యని నాయూహ. ఈవిషయమున వివిధాంశవిచారచర్చను శ్రీ సి. హయవదనరావుగారివ్యాసమున (ఆంధ్రపరివర్తనము - వావిళ్లప్రతి 95-98 పుటలు) కననగును.

సంస్కృతమహాకావ్యములయందుఁ బ్రతిసర్గాంతమున నాత్మవృత్తాంతసూచక మగుగద్యమును రచించుట పరిపాటి. దీనికి విలక్షణముగాసర్గాంతమున గద్యమును జేర్పక, యావిషయములను ఛందోబద్ధముగాఁ గూర్చినప్రథమకవి, నే నెఱిఁగినంతవఱకు దివ్యసూరిచరిత్రనిర్మాత యగుగరుడవాహనపండితుడే. నైషధీయచరిత్రకర్త యగుభట్టహర్షుఁడు ద్వితీయుఁడు. ఇట్టి యాశ్వాసాంతవిలక్షణత 'ప్రతినైషధము, భృగువంశము' అనునముద్రితకావ్యములందుఁ గన్పట్టుచున్నది. మఱియు, కిళాంబి (ఆత్రేయ) వేంకటేశకవి 'రామచంద్రోదయము', మలయకవి 'మీనాక్షీపరిణయము', సంకర్షణకవి 'సత్యనాథాభ్యుదయము', ఆలూరిసూర్యనారాయణయజ్వరచించిన 'ఏకదినప్రబంధము', చిదంబరకవి 'కథాత్రయి' 'శబ్దార్థచింతామణి' యనుకావ్యద్వయము కవితార్కికసింహ పరవస్తు వేదాంతాచార్యకవి 'వేదాంతాచార్యవిజయము' అనుకావ్యములందును జూపట్టుచున్నది.

రసికవినోదహేతువు లగునాయాయాశ్వాసాంతశ్లోకములు లభించినంతవఱకు నీక్రింద నుల్లేఖింపఁ బడుచున్నవి :

1. శ్లో. స్వామీ రఙ్గపతి ర్గురు ర్వరవరాధీశ శ్చ యస్యాతులో,
వాధూలో వరదః పితా వరవరక్ష్మేమేశలక్ష్మీసఖః,
లోకేశా జననీ తు తస్య గరుడశ్రీవాహనశ్రీసఖః,
కావ్యే దీవ్యతి దివ్యసూరిచరితే సర్గ స్తురీయో గతః'
—గరుడవాహనపండితుని 'దివ్యసూరిచరితము' IV 90 శ్లో. (౨౬ పు.)†

పైకావ్యమున నీసర్గోపసంహారచమత్కృతి మొదటినాలుగుసర్గలయందు మాత్రమే కలదు.

2. శ్లో. 'శ్రీహర్షం కవిరాజరాజిముకుటాలంకారహీరః సుతం,
శ్రీహీరః సుషువే జితేంద్రియచయం మామల్లదేవీచ యమ్,
ద్వావింశో నృపసాహసాంకచరితే చంపూకృతోఽయం మహా-
కావ్యే తస్య కృతౌ నలీయచరితే సర్గో నిసర్గోజ్జ్వలః'
—భట్టహర్షుని 'నైషధీయచరితము'-22వ సర్గము. 151 శ్లో. (627 పుట)*

3. శ్లో. 'కల్పద్రుః కవివాదికేసరిగురోః ప్రజ్ఞాసుధావారిధే-
ర్జాతః కశ్చన కల్పితార్థవితతి శ్చమ్పూప్రబన్ధాత్మనా,
త స్యామ్నాయకిరీటదేశికకథామాధ్వీఝరీ ముద్వహన్,
షష్ఠోఽయం స్తబకః కరోతు సుమనః కర్ణావతంసశ్రియమ్'
—వేదాంతాచార్యవిజయము (=ఆచార్యచంపూః) VI స్తబక. (78 పు.)‡

1. శ్లో. 'భారద్వాజకులధ్వజా దుదభవద్ యో రామనాథా ద్భుధాత్,
పుత్త్రః శ్రీమలయో విచిత్రకవితాపుష్పద్రుమోద్యానభూః,
తస్య శ్రీపదపద్మసద్మమనసః సర్గోఽయ మష్టాదశః
కావ్యే మీనవిలోచనాపరిణయే నావ్యే రసౌఘైర్నవైః' ౧౧౩ శ్లో.
(—Descriptive Cata of Skt. Mss. S.M. Library Vol. VI పు. 2626)

2. శ్రీసత్యాభినవీనతీర్థయతిరాట్ శిష్యేణ తత్ప్రీతయే
శేషాచార్యతనూభవేన రచితే సజ్జ్కర్షణే నాదరాత్,
కావ్యే శ్రావ్యపదే మహాగుణనిధిశ్రీసత్యనాథోదయే
శ్లాఘ్యే సద్గుణసారలబ్ధకవిభిః సర్గోఽయ మేకాదశః'
—(Ibid. Vol. VI p. 2679)

† తెనుఁగులిపిప్రతి-విద్యాతరంగిణీముద్రాక్షరశాల, మైసూరు. (పార్థివ; ఏప్రిల్,1885)

* నాగరలిపిప్రతి - శ్రీమహామహోపాధ్యాయహరిదాససిద్ధాన్తవాగీశభట్టాచార్యప్రణీత జయంతివ్యాఖ్యతో కలకత్తానుండి ప్రకటితము. రెండు సంపుటములు. సంపు. II పుట 627.

‡ కవితార్కికసింహ-పరవస్తు-వేదాంతాచార్యకృతము (తెనుఁగులిపిప్రతులు: ౧. శ్రీనికేతనముద్రాక్షరశాల, మద్రాసు) నందన=క్రీ. శ. 1892-93. ౨. విద్యాతరంగిణీముద్రాక్షరశాల, మైసూరు-క్రీ.శ. 1898.

3. శ్రీయజ్ఞేశ్వరయజ్వనః సితకరా దాలూరివంశాంబుధే
ర్జానాంబా సుషువే య మధ్వరివరం శ్రీసూర్యనారాయణమ్
తస్య శ్రీమతిలింగయప్రభుసభామధ్యే ప్రతిజ్ఞాకృత
శ్రీమానేకదినప్రబంధసుకృతౌ సర్గ శ్చతుర్థో౽జని.
—(Ibid page 2698-99 ౧౧౫ శ్లో.

1. ఆత్రేయవేంకటేశకవి - 'రామచంద్రోదయము'

శ్లో. ఆత్రేయః శ్రీనివాసాహ్వయగురుతనయః కావ్యరత్నం వ్యతానీత్,
సీతానాథప్రసాదప్రకటితధిషణో రామచంద్రోదయాఖ్యమ్,
ఆసీతేశాభిషేకా దుదితశుభకథం త్రింశతా యత్తుసర్గైః,
తస్మిన్ రామాభిషేకాభ్యుదయశుభకథ స్త్రింశ ఆభాతి సర్గః.'
—(Des. Cata. of Skt. Mss. in the S. M. Library - VI. page 2662.)

2. చిదంబరకవి - 'శబ్దార్థచింతామణి'

శ్లో. 'యజ్వా కౌశికగోత్రభూషణమణిః యః సూర్యనారాయణః,
తస్యాభూ త్తనయాత్సుతనయాత్ యో౽నన్తనారాయణాత్,
చిత్రే తస్య కృతౌ చిదంబరకవేః శబ్దార్థచింతామణౌ,
సర్గే భిక్షుకిలోలదిక్షుకరసః సారీ ద్వితీయో౽జని.'
—(D. C. Skt....Ibid. Vol. VI. p. 2845)

3. చిదంబరకవి - 'కథాత్రయి'

శ్లో. 'యజ్వా కౌశికభూషణం సమభవ ద్యస్సూర్యనారాయణః,
పుత్ర స్తస్య సమః పురందరగురో ర్యో౽నన్తనారాయణః,
సూనో స్తస్య చిదంబరస్య సుమతే శ్శ్రీకావ్యరత్నేకృతౌ
సర్గే రాఘవపార్థకృష్ణచరితే సాధు ర్ద్వితీయో౽జని.'
—(Ibid. Vol. VI. p. 2706)

## 19. కృష్ణదేవరాయలు - కవితాహరణవిచారము.

రాయ లాముక్తమాల్యదయందుఁదనవంశమును వర్ణించుపట్ల స్వోత్కర్షను దనకుఁ దానే యుగ్గడించుట యనుచిత మని కాఁబోలుఁ దనభువనవిజయము నందలియాస్థానకవిశేఖరులపద్యములను, ముఖ్యముగా, పెద్దనామాత్యునిపద్యము లను 20 వఱకు నటనట స్వల్పమైనమార్పులతోఁ దనప్రబంధమునఁ జొప్పించి నాఁడు. సహృదయలోకము దీనిని కవితాస్తేయముగా నెంచదు. కవికులగురు వగుకాళిదాసునంతటివాఁడు భాసవాల్మీకిమహాకవులకావ్యముల యందలిభావములనే

కాక, పదబంధములనుఁ గూడ స్వీకరించి తనకృతులయందుఁ జేర్చుకొనెను. అంతియే కాక

శ్లో. 'కచ్చిత్ క్షితిభృతాం నాథ దృష్టా సర్వాంగసుందరీ,
రామా రమ్యే వనోద్దేశే మయా విరహితా త్వయా.

—రామాయణము - అరణ్యకాండము.

అనుచిత్రాలంకారవైచిత్రి గలశ్లోకమును మొదటిరెండక్షరములకు 'సర్వ' యను మార్పు చేసి విక్రమోర్వశీయమునఁ జతుర్థాంకమునఁ జేర్చుకొనెను. భాసవాల్మీకుల కవిత్వమునుకాళిదా సనుసరించినపట్టములు పరశ్శతములు. ఆమహాకవులయం దీకవికిఁ గలగౌరవమునే యిది సూచించునుఁ గాని యితనియశక్తిని సూచింపదు.

విద్వత్కవి యగుభోజుఁడు తానునిర్మించిన'శృంగారప్రకాశ' మనుబృహత్సాహిత్యగ్రంథమునకు నవతంసముగా నీక్రిందిశ్లోకమును కవినామమును దెలుపకయే చేర్చుకొనెను.

శ్లో. 'అచ్ఛిన్నమేఖల మలబ్ధదృఢోపగూఢ-
మప్రాప్తచుంబనమవీక్షితవక్త్రకాంతి,
కాంతావిమిశ్రవపుషః కృతవిప్రలంభ-
సంభోగసఖ్య మివ పాతు వపుః పురారేః.'

పైశ్లోకము భోజునియాస్థానకవి యగు'ఛిత్తపకవి దని'సదుక్తికర్ణామృత మున, శ్రీధరదాసుఁడు పక్కాణించియున్నాఁడు. ఇట్లు పరస్సహస్రముగా నుదాహరణముల చూపవచ్చును. దీనినిఁ బట్టి రాయలు తనయాస్థానము నలంకరించిన మహాకవులు తనవంశమును వర్ణించినపద్యములను స్వగ్రంథమున స్వీకరించుట దోషాస్పదము కాఁజాలదు. ఆయాకవులరచనలయెడ నితనికిఁ గలయాదరణమునే యిదిసూచించును. రాయలుమనుచరిత్రమునుండి గ్రహించినపద్యములసూచిక యిట నొసగఁబడు చున్నది.

| | ఆముక్త. | మనుచరిత్ర. |
|---|---|---|
| 1. అందునరస | I. 29ప-పు ౩౪ | I. 28 (౧౪) |
| 2. అంభోధివసన | I. 30 - ౩౫ | I. 30 (౩౦) |
| 3. అతనికియదు | I. 22 - ౨౯ | I. 21 (౧౨) |
| 4. అభిరతిఁగృష్ణ | I. 40 - ౪౫ | I. 39 (౨౦) |
| 5. అలపోత్రిప్రభు | — | I. 35 (౧౭) |
| 6. అలుకన్ఘోటక | I. 42 - ౪౭ | — |

| | అముక్త. | మనుచరిత్ర. |
|---|---|---|
| 7. ఆనృసింహప్రభు | I. 31 - ౩౭ | I. 31 (౧౬) |
| 8. ఆయీశ్వరనృపతికి | I. 28 - ౩౪ | I. 27 (౧౪) |
| 9. ఆవిభుననంతరంబ | I. 33 - ౩౭ | I. 33 (౧౬) |
| 10. ఆసుధాధామ | I. 20 - ౨౮ | I. 19 (౭) |
| 11. ఉదయాచలేంద్రంబు | — | I. 11 (౧౧) |
| 12. ఎకరాలన్ | — | I. 40 (౨౦-౧) |
| 13. కచస్తఫణి | I. 39 - ౪౪ | — |
| 14. కలశపాథోరాశి | I. 19 - ౨౫ | I. 18 (౧౦) |
| 15. కూరిమిఁగృష్ణరాయ | I. 38- ౪౩ | — |
| 16. క్రూరవనేభదంత | — | I. 36 (౧౮) |
| 17. ఘనుఁడైతిమ్మ | I. 24- ౩౦ | I. 23 (౧౨) |
| 18. చిత్రము కృష్ణరాయ | I. 37- ౪౧ | — |
| 19. జయజయదానవ | IV. 16-౨౭౯ | VI. 103 |
| 20. తునియలు తొమ్మిది | I. 35- ౩౯ | — |
| 21. తొలఁగెనుధూమ | I. 34- ౩౮ | I. 34 (౧౬) |
| 22 తొలుదొల్త నుదయాద్రి | I. 36- ౪౦ | I. 37 (౧౮) |
| 23. ధరకెంధూళులు | — | I. 38 (౧౯) |
| 24. నిజభుజాశ్రిత | I. 27- ౩౨ | I. 26 (౧౩) |
| 25. నీలమేఘముడాలు | I. 12- ౧౬ | — ఎత్తుగీతముభిన్నము. |
| 26. పవిధారాపతనంబు | IV. 26-౨౮౮ | — |
| 27. ప్రబలరాజాధిరాజ | I. 44- ౪౯ | — |
| 28. బలమదమత్త | I. 26- ౩౧ | I. 25 (౧౩) |
| 29. మదకలకుంభి | — | I. 41 (౨౧) |
| 30. వానికిఁబురూరవుఁడు | I. 21- ౨౮ | I. 20 (౧౧) |
| 31. వానివంశంబు | I. 23- ౨౯ | I. 22 (౧౨) |
| 32. వితరణఖని | I. 25- ౩౧ | I. 24 (౧౩) |
| 33. వీరనృసింహుఁడు | I. 32- ౩౭ | I. 32 (౧౬) |
| 34. వేదండ | — | I. 42 (౨౨) |
| 35. శ్రీరుచి | — | I. 29 (౧౪) |

36. సనకాదిదివిజ I. 41- ౪౬
37. సుమతిపునఃపునా I. 43- ౪౮

## 20. రాయలవైష్ణవమతాభినివేశము - దశావతారవర్ణనము :

రాయలు పరమప్రపన్నశిరోమణి. పంచమతభంజననిర్మాణమువలన విశేష విఖ్యాతి నందినశ్రీతిరుమల తాతాచార్యులవారి శిష్యచూడామణి. రాయలకాచార్యనిష్ఠ మెండు. పరమతభంగమునకు, స్వమతస్థాపనమునకు రాయ లాముక్తమును నిర్మించెను. ఆంధ్రవల్లభరాయని యాదేశమున నీప్రబంధమును శ్రీవేంకటేశ్వర స్వామికిఁ గృతిగా నర్పించెను. వేంకటేశ్వరస్వామికిఁ బరమభక్తుఁ డగునీయన తనశిలావిగ్రహమును,దేవేరు లగుతిరుమలదేవి - చిన్నాదేవులయొక్క శిలావిగ్రహ ములను నిర్మింపఁజేసి తిరుమలలోదేవాలయప్రాంగణముననే స్వామి కభిముఖముగా వానిని స్థాపించెను. కృష్ణరాయలు కాంచీపురము నందలివరదరాజస్వామిదర్శనమున కప్పుడప్పుడు వెళ్ళుచుండెడివాఁడు, ఆయన పట్టమహిషితోనొకసారి స్వామిదర్శన మునకరుగఁగా శ్రీఅప్పయ్యదీక్షితులపూర్వపురుషుఁ డగుఆచ్చాన్ దీక్షితుఁ డీక్రింది శ్లోకము నాశువుగాఁ జెప్పె నఁట :

శ్లో. 'కాంచిత్ కాంచనగౌరాంగీం వీక్ష్య సాక్షా దివ శ్రియం,
వరదః సంశయాపన్నః వక్షఃస్థల మవైక్షత'.

యామునాచార్యవృత్తాంతము ప్రబంధమున నప్రసక్త మైనను బరమత నిరసనము, స్వమతస్థాపనములకే రాయలు తనకృతియందు దానిని జేర్చెను. అట్లే మాతంగబ్రహ్మరక్షస్సంవాదమును వైష్ణవమతోత్కర్షను స్థాపింపఁ గవి ప్రబంధ మునఁ జేర్చెను. అట్లే ఖాండిక్యకేశిధ్వజసంవాదమును విశిష్టాద్వైతమతసంప్రదాయ మును విపులముగా, వివరించుచున్నది. దీనికిని గోదాకల్యాణకథకును బ్రసక్తి యేమియుఁ గన్పట్టదు. రాయలితరకవివిలక్షణముగాఁ దనప్రబంధమునఁ గృత్యాదిని రచించెను. మొదటిపద్యమున వేంకటేశ్వరస్వామిని గొలిచి, పిమ్మట ననంత గరుడవిష్వక్సేనులను, శ్రీమహావిష్ణువుపంచాయుధములను, బిమ్మట, ఆళ్వారు లనఁ బడుద్వాదశదివ్యసూరులను స్తుతించెను. శ్రీకాకుళక్షేత్రమున నాంధ్రవిష్ణువును దర్శించి, హరివాసరోపవాసము చేసి, నాఁటిరాత్రి యాదేవుని స్వప్నమందు దర్శించి, తన్నిదేశము ననుసరించి, గోదాదేవితాను ధరించినమాలను రంగనాథుని కర్పించి, తదనుగ్రహమునఁ దత్సాయుజ్యము నందినయితివృత్తమును రాయలు ప్రబంధీక రించెను. విష్ణుచిత్తుఁడు పరమతములనుఖండించి విశిష్టాద్వైతమునుస్థాపించి

విద్యాశుల్కమును స్వీకరించునవసరమున పాండ్యరాజామహనీయునికి గజారోహణమహోత్సవమును జరుపుచుండఁగా శ్రీమన్నారాయణుఁడే స్వయముగా విష్ణుచిత్తునకుఁ బ్రత్యక్షమయ్యెను. ఇట్లు విష్ణుసాక్షాత్కార మనులోకోత్తరభాగ్యము నందినపెరియాళ్వారు మైమఱచి, తా నధిరోహించిన భద్రగజమునకుఁ గట్టిన గంటలనే చేకొని, వాదన మొనరించుచు భగవంతునికి దృష్టిదోషము తగులకుండునట్లు పల్లాండ్ అనుద్రావిడభాషాలఘుస్తుతిరూప మగుమంగళాశాసన మొనర్చెను. ఈఘట్టముననే యాముక్తమాల్యదయందు విష్ణుచిత్తునిచే రాయలు దశావతారస్తోత్రము నుద్ఘోషింపఁ జేసెను. ఆముక్తమున నీక్రిందికందపద్యమున దశావతారములను బేర్కొనఁబడినవి.

క. 'జలచరకిటిహరివటుభృగు-
కులరఘుకులసీరిబుద్ధఘోటిప్రముఖో-
జ్జ్వలజనికృతజనరక్ష,
యలమేల్మంగాభిధేందిరాలయవక్ష ?

(ఆముక్తమాల్యద I-87)

రసికవినోదహేతువుగా రాయలదశావతారస్తవమునుండి యొకపద్య ముదాహరింపఁ బడుచున్నది :

చ. 'క్షితిహలకృష్టిఁ బుట్టి యడఁగెఁగా క్షితియందునె సీత' యంచుద
త్పతివిరహార్తిఁ బోడిమయుఁ దాలిచి, రామశరీర మెత్తి, యా
క్షితిఖననక్రియ న్మగుడఁ జెందఁగఁ గాక కళిందజాతట
క్షితి దున నేటికిన్ హలముచే మఱి నీ కవశాత్మతన్ హరీ'

(ఆముక్తమాల్యద IV-28)

సంస్కృతమున వ్యాసదాసబిరుదాంకితుఁ డగుక్షేమేంద్రుఁడు (క్రీ.శ. ౧౧వ శతాబ్ది) 'దశావతారచరిత' మనుకావ్యమును రచించెను. వేదాంతదేశికులు (క్రీ.శ. 1268-1369) దేవభాషయందు 'దశావతారస్తుతి'† యనులఘుకావ్యమును నిర్మించిరి. ఆంధ్రమున ధరణిదేవులనారయామాత్యుఁడు దశావతారచరిత్ర మను ప్రబంధమును గూర్చెను. ప్రాచీనాధునికాంధ్రశతకములలో దశావతారస్తుతులు పెక్కులు గలవు. రాయలదశావతారస్తుతిని దులనాత్మకముగఁ బరిశీలించుటకై తత్పూర్వులును, సమ

---

† మఱియు, గీర్వాణవాణియందు, శ్రీశంకరభగవత్పాదులు రచించిన 'దశావతారస్తోత్రము'ను, వాదిరాజమహాకవి నిర్మించిన 'దశావతారస్తుతి'యు, ఆధునికుడగు వీరవల్లి విజయరాఘవాచార్య కృతమగు 'దశావతారస్తవము'ను గలవు.

కాలికులును, తదర్వాచీనులును రచించిన యీక్రిందిప్రఖ్యాతప్రబంధములయందు దశావతారప్రశంసను* జూడఁదగును.

| | |
|---|---|
| శృంగారనైషధము (శ్రీనాథుఁడు) | 8- ఆశ్వాసము |
| మనుచరిత్ర (అల్లసానిపెద్దన) | 6- ఆ. |
| పారిజాతాపహరణము (ముక్కుతిమ్మన) | 3- ఆ. |
| ఆముక్తమాల్యద (కృష్ణదేవరాయలు) | 4- ఆ. |
| పాండురంగమాహాత్మ్యము (తెనాలిరామకృష్ణుఁడు) | 2- ఆ. |
| దశావతారస్తుతి (సంస్కృతము) (డిటో) | |
| రుక్మిణీపరిణయము (సత్యవోలుభగవత్కవి) | 4- ఆ. |
| యామినీపూర్ణతిలకావిలాసము (చెల్లపిళ్లనరసకవి) | 6- ఆ. |
| రుక్మిణీకల్యాణము (జన్నాద రంగాచార్యులు) | 4- ఆ. |
| శ్రీకృష్ణాభ్యుదయము (మండపాక పారతీశ్వరకవి) | — |

## 21. ఆముక్తమాల్యద - ఐతిహాసిక-రాజనైతికప్రాముఖ్యము :

రాయలప్రబంధమునఁ దత్పరిపాలనవైభవము వ్యంగ్యముగా సూచింపఁబడినది. ఆయనదిగ్విజయములు, ఆయన యనుసరించినరాజనీతివిధానము, అర్థశాస్త్రీయాంశములు నిందు వివరింపఁబడినవి. ఆయనరాజ్యపాలనమును గూర్చి శాసనాదులు, వైదేశికులగుసమకాలికులు రచించినచరిత్రాత్మకగ్రంథములవలనఁ దెలిసినయంశముల నాముక్తమాల్యద దృఢపఱచుచున్నది.

ఐతిహాసికప్రాధాన్యము :

ప్రథమాశ్వాసమున ౧౯-౪౪ పద్యములయం దనేకవిశేషములులభించుచున్నవి. I. ఆ. 11-వచనమున రాయలు కళింగదేశముపై దండెత్తి వెడలి, విజయవాడలోఁ గొన్నాళ్లుండి, నేఁటికృష్ణామండలము నందలిశ్రీకాకుళక్షేత్రమున ఆంధ్రవిష్ణువును సేవించి, హరివాసరమున నుపవసింప నాఁటిరాత్రి తెలుఁగు

---

* శ్రీ గర్భాం అప్పారావుగారు (విజయనగరము) రచించిన యీక్రింది రెండు వ్యాసములను కుతూహలముగల పాఠకులు పరిశీలింపఁదగును; (౧) 'ఆముక్తమాల్యదలోని దశావతారపద్యములు' - (ఆంధ్రపత్రిక - 'సారస్వతానుబంధము' - క్రోధన - చైత్రబహుళ ప్రతిపత్తు - శుక్రవారము - క్రీ. 1925—'26.)

(౨) 'దశావతారపద్యములు - శ్రీకృష్ణదేవరాయలు' (ఆంధ్రపత్రిక - ఉగాదిసంచిక ఆంగిరస - 1932—'33.)

వల్లభరాయఁ డను నాస్వామి రాయలకు స్వప్నమునఁ గానఁబడి, ఆముక్తమును రచింపు మనె నఁట.

౧౯-౨౩ పద్యములయందుఁ జంద్రవంశవైభవము, అందుదయించిన ప్రాచీనమహాపురుషమహత్త్వమును వర్ణింపఁబడెను.

౨౪-౨౫. తుర్వసువంశమే తుళువవంశము. వితరణఖని తిమ్మదేవరాయలకు దేవదేవియం దీశ్వరప్రభువు జనించెను.

౨౬. ఈశ్వరదేవరాయలపరాక్రమధాటికి నిలువలేక శత్రురాజు లడవుల పాలైరి.

౨౭. ఈశ్వరదేవరాయల రాజ్యపాలనవైభవము.

౨౮. ఈశ్వరరాయలకు బుక్కమాంబయందు, భాస్కరసదృశతేజశ్శాలు రగునరసింహరాజు, తిమ్మరాజును జనించిరి.

౨౯-౩౦. వారిలో నరసభూపాలుఁడు కవిబాంధవుఁడై, విద్వత్పోషకుఁడై, శత్రుసంహారకుఁడై మహావైభవమున సామ్రాజ్యము నేలెను.

౩౧. అతనికి తిప్పమ్మ, నాగమ్మ యను నిరువురుదేవేరులు. తిప్పమ్మ తనయుఁడు వీరనృసింహరాయలు. నాగమ్మకుమారుఁడు కృష్ణాంశసంభూతుఁ డగు కృష్ణదేవరాయలు.

౩౨. వీరనృసింహరాయలు నిర్వక్రపరాక్రమముతో నేకచ్ఛత్రాధిపత్యమును వహించెను.

౩౩-౩౫. ఆయనకుఁ బిమ్మట తిరుమలదేవియు, అన్నపూర్ణాదేవియు, రాణులుగా కృష్ణరాయలు రాజ్యచక్రనిర్వహణమును గైకొనెను. రామరాజ్యవైభవముతో వెలింగినకృష్ణదేవరాయలరాజ్యమున, ఈతిబాధలు లేవు. కావలసినంత వర్షములు గురియుచుండెను. శత్రురాజులభయము లేదు. బాలమరణాదిదోషములు లేవు. ఆబాలగోపాలముమహానందమున కాలము గడపిరి. ఇంతవఱకు, అష్టదిగ్గజములును, ఆదివరాహమును, ఆదికమఠమును, ఆదిశేషువును, సప్తకులపర్వతములును మొత్తముపదునెనమండ్రు భారతఖండాదినవఖండములభారమును వహించుటేమి ఘనత యన్నట్లు నవఖండమండితభూమండలము నంతయుఁ దనయేకైక భుజమున రాయలు ధరించెను.

౩౬. కృష్ణరాయలజైత్రయాత్రాక్రమవర్ణనము. - ఉదయగిరిదుర్గము, కొండవీటిదుర్గము, జమ్మిలోయ, వేఁగిదేశము, కోనసీమ, కొట్టము, కనకదుర్గము.

పొట్టునూరు, మన్నెపుదేశములు, ఓఢ్రదేశములను జయించి కటకపురి (Cuttack) మొదలగువానిని జయించెను.

౩౭. రాయల నెదిరించినశత్రురాజులు పిఱికిపందలై పలాయన మైరి.

౩౮. కళింగరాజ్యలక్ష్మి ప్రతాపరుద్రగజపతిని వదలి కృష్ణరాయలనాలింగన మొనరించుకొనెను. †

౩౯. రాయలధాటి కాగలేక కళింగదేశాధిపతి యగు గజపతి దేశత్యాగ మొనర్చి వింధ్యపర్వతమునకు వలసపోయి తలదాచుకొనెను.

౪౦. పొట్నూరియొద్ద రాయలు విజయశాసనమును వ్రాయించి విజయ స్తంభమును స్థాపించెను.

౪౧. రాయలు కలబరిగె - నగరనగఃప్రభువు అగుతురుష్కుల సంహ రించెను.

౪౨. బీజపురసుల్తానుఏదిల్షాయును, గోలకొండనిజామసాహును, అహ మద్‌నగరుసుల్తానును కలసివచ్చి కృష్ణానదిసమీపమున రాయలతో యుద్ధ మొనర్చి యాతనిచే నిహతులైరి.

౪౩. కృష్ణరాయలు షోడశమహాదానము లొనరించు చుండెడివాఁడు. మహాగ్రహారముల దాన మొనర్చునీతనివితరణశీలమునకు కల్పవృక్షములుకూడఁ జాలవు.

౪౪. రాజాధిరాజవీరప్రతాప - రాజపరమేశ్వరార్ధదుర్గానవేశ - సాహితీ సమరాంగణసార్వభౌమబిరుదాలంకృతుఁడు కృష్ణదేవరాయలు.

ఆముక్తమాల్యద యందలిపైచారిత్రికాంశములకు మనుచరిత్రము పారిజాతా పహరణము, కృష్ణరాయవిజయము, ననుప్రబంధములయందును, రాయవాచకము నందును, న్యూనిజ్ మొదలగువిదేశయాత్రికులసమకాలికచరిత్రములయందును. ప్రమాణాంతరములు లభించుచున్నవి.

---

† Vide: Mr. V. S. Ramachandra Murti's "The authorship and importance of the *Amukta Malyada* as a source of History, for the reign of Sri Krishna Deva Raya".

2. Mr. B. Kesava Rao's 'The Historical Importance of Parijatapaharana' in the *Vijayanagara Sexcentenary Commemoration Volume.* (1936—K. H. R. Society, Dharwar).

3. Vide: Mr. T. V. Mahalingam's "The Administrative Value of the *Amukta-malyada*" in the *Vavilla Venkateswara Commemoration Volume* (1941).

కృష్ణదేవరాయలరాజనీతివిధానము యామునప్రభువు తనకుమారున కుప దేశించినరాజనీతినిబట్టి విశదమగుచున్నది. రాయలు కామందకీయశుక్రనీతి కౌటిలీ యాదిప్రాచీనరాజనీతిగ్రంథములఁ గూలంకషముగ వ్యాసంగ మొనరించి యందలి సారమును తనయనుభవమునకు జోడించి యాచరణమున బెట్టెను. ప్రజలవిషయ మున సహానుభూతి, వివిధవర్ణజాతులయం దనురాగమిళితసమాదరణయు, దేవ బ్రాహ్మణ భక్తియు రాయలయంతఃకరణమున గాఢముగా లగ్నమైన యుత్తమ గుణములు. ప్రజానురంజకముగా శ్రీరామచంద్రునివలె నీయన రాజ్యపాలన మొనరించెను. ఈభూజానిరాజనీతివిధాన మాముక్తమునందు వివరించినదానికిని, దా నవలంబించిన విధానమునకు నించుకైనను భేదములేదు.

## 22. దివ్యసూరిచరణచామరము - దివ్యప్రబంధదీపిక :

శ్లో. 'భద్రం శఠారిముఖభక్తజనస్య తత్తద్
దివ్యప్రబంధనివహస్య చ దోషలేశాత్,
ముక్తస్య దేశికజనస్య తదుక్తిరాశే
రుజ్జీవనస్య జగతాం సహితస్య వేదైః'

—(అభిరామవరకవి - ఉపదేశరత్నమాల; శ్లోకము ౩)

"భక్తామృతం విశ్వజనానుమోదనం,
నమా మ్యహం ద్రావిడవేదసాగరమ్"

—నాథముని

'ఇలపన్నిద్దఱుసూరుల న్దలఁతు మోక్షేచ్ఛామతిన్ దివ్యులన్'

—కృష్ణదేవరాయలు

ద్రావిడదేశమున క్రీ.శ.దశమశతాబ్దికిఁ బూర్వమున, ద్వాదశాదిత్యులవలె భువనాద్భుతజనకమగుమహావైభవముతో ద్వాదశదివ్యసూరులు(పన్నిద్దరాళ్వారులు) అవతరించి, తమదివ్యప్రబంధగానముచేతను, పరమపవిత్రచరిత్రచేతను, దేశమును భక్తిరససాగరమున ముంచెత్తిరి. వివిధవర్ణములకుఁ జెందినయీమహామహులు భగవత్సాక్షాత్కారముకొఱకై తహతహలాడి, మైమఱచి ద్రావిడభాషలో గానము చేసినభగవన్మహిమాత్మకరచనలే దివ్యప్రబంధము లని విఖ్యాతినందినవి.దాక్షిణాత్య వైష్ణవాలయములలో వీరిప్రబంధములను గానముచేయనిదే, వీరిశిలావిగ్రహములను ప్రతిష్ఠించి పూజింపనిదే దేవాలయములకు దివ్యస్థల మనుమహాగౌరవము రాజాలదు. దివ్యప్రబంధములకు దాక్షిణాత్యశ్రీవైష్ణవులు వేదప్రామాణ్యము నొసఁగెదరు. దివ్య ప్రబంధములు ౨౪ వీనియందలిపాశురముల (ద్రావిడపద్యముల) సంఖ్య ౪౦౦౦.

అందువలననే వీనికి నాలాయిరదివ్యప్రబంధ (చతుస్సాహస్రి) మనువ్యవహారము కల్గెను.

ద్వాదశదివ్యసూరులు :

| క్రమసంఖ్య | నామము | కాలము సంప్రదాయసిద్ధము | కాలము (చారిత్రికము) |
|---|---|---|---|
| 1. | పొయ్‌గైయాళ్వారు (కాసారయోగి) | ద్వాపరయుగము | ... |
| 2. | పూదత్తాళ్వారు (భూతయోగి) | ద్వాపరయుగము | ... |
| 3. | పేయాళ్వారు (మహాయోగి) | ద్వాపరయుగము | ... |
| 4. | తిరుమళిశైయాళ్వారు (భక్తిసారయోగి) | ద్వాపరయుగము | క్రీ. శ. 720 |
| 5. | పెరియాళ్వారు (విష్ణుచిత్తులు) | కలివత్సరము ౪౮ | ,, 725 |
| 6. | ఆండాళ్ (గోదాదేవి) | కలివత్సరము ౬౭ | ,, 776 |
| 7. | తిరుమంగైయాళ్వారు (పరకాలయోగి) | కలి - ౬౭ | ,, 776 |
| 8. | కులశేఖరాళ్వారు | కలి - ౨౭ | ,, 767 |
| 9. | తొండరడిప్పొడియాళ్వారు (భక్తాంఘ్రిరేణువు-విప్రనారాయణులు) | కలి - ౨౦౯ | ,, 787 |
| 10. | నమ్మాళ్వారు (శఠకోపయోగి) | కలి - ౪౩౯ దినము | — |
| 11. | మధురకవి | కలి - ౯౮౩ | ,, 797 |
| 12. | తిరుప్పాణాళ్వారు (మునివాహనయోగి) | — | — |

దివ్యప్రబంధములందలి నాలుగువేల పద్యములలో తిరుమంగైయాళ్వార్ గానముచేసిన (పద్యసంఖ్య 1361) ప్రబంధషట్కము గ్రంథవైపుల్యమును బట్టి ప్రథమగణ్యము. గ్రంథవిస్తృతినిబట్టి ద్వితీయస్థానము నమ్మాళ్వారులది. వీరు

రచించిన ప్రబంధచతుష్కము నందలి పద్యసంఖ్య 1296. తృతీయస్థానము నలంకరించువాడు పెరియాళ్వార్. వీరి ప్రబంధయుగళమునందలి పద్యములు 473. తురీయస్థానము తిరుమళిశై యాళ్వారులకు జెందును. వీరి ప్రబంధయుగ్మమునందలి పాశురములు 216. గోదాదేవియే దివ్యసూరిమండలియం దేకైకమహిళామణి. ఈమె గానముచేసిన ప్రబంధద్వయమునందలి పద్యములు 173. కులశేఖరాళ్వారు కృతప్రబన్ధమునందలి పద్యములు 105. ఈ భక్తాగ్రణిరచించిన ముకుందమాలయను గీర్వాణస్తుతి విశ్వవిఖ్యాతమే. ముందొసగబడిన దివ్యసూరి సూచికయందలి మొదటి మువ్వురు నొక్కొక్క శతకమును అంతాదిచమత్కారముతో నిర్మించిరి. అంతాది యనగా బూర్వపద్యమునందలి యంత్యాక్షరము తరువాతి పద్యమునకాద్యక్షరమగు విలక్షణచమత్కారము. ఇట్టి యంతాదికావ్యములు ద్రావిడ వాఙ్మయమున నెన్నియో కలవు. తొండరడిప్పొడి యాళ్వారు రచించిన ప్రబంధయుగళమునందలి పద్యములు 55. మధురకవి రచించిన యేకైక ప్రబంధమునందలి పద్యములు 11. 'హరిజన'కులమున నవతరించిన తిరుప్పాణాళ్వారురచించిన యొక్క ప్రబంధమునందలి పద్యములు పది.

దివ్యప్రబంధదీపిక :

*1.* ముదలాయిరం : (కవులసంఖ్య : 7 ; ప్రబంధములు : 10 ; మొత్తము పద్యములు : 947)

| | | | |
|---|---|---|---|
| 1. తిరుప్పల్లాండు | 12 | పెరియాళ్వార్ (విష్ణుచిత్తులు) | శ్రీవిల్లిబుత్తూరు (తిరునల్వేలి జిల్లా) |
| 2. పెరియాళ్వార్ తిరుమొళి | 461 | ,, | — |
| 3. తిరుప్పావై | 30 | ఆండాళ్ (గోదాదేవి) | ,, |
| 4. నాచ్చియార్ తిరుమొళి | 143 | ,, | ,, |
| 5. పెరుమాళ్ తిరుమొళి | 105 | కులశేఖరాళ్వార్ | తిరువంజిక్కళం (మలబార్) |
| 6. తిరుచ్చందవిరుత్తం | 120 | తిరుమళిశైయాళ్వార్ | తిరుమళిశై (పూనమల్లియొద్ద) |
| 7. తిరుమాలై | 45 | తొండరడిప్పొడియాళ్వార్ | మండంగుడి(తిరుచినాపల్లిజిల్లా) |
| 8. తిరుప్పళ్లియెళుచ్చి | 10 | ,, | ,, |
| 9. అమలనాదిపిరాన్ | 10 | తిరుప్పాణాళ్వార్ | ఉరైయ్యూరు శ్రీరంగసమీపము |
| 10. కణ్ణినున్ శిరుత్తాంబు | 11 | మధురకవియాళ్వార్ | తిరుక్కోలూరు తిరునల్వేలిజిల్లా |

*2.* ఇరణ్డాం ఆయిరం : (ఏకకవికృతము ; ప్రబంధములు : 3 ; పాశురములు : 1134)

| | | | |
|---|---|---|---|
| 11. పెరియతిరుమొళి | 1084 | తిరుమంగై యాళ్వార్ | తిరుక్కురైయలూరు. తిరునగరి (చిదంబరసమీపమున) |
| 12. తిరుక్కురుందాండగమ్ | 20 | ,, | — |
| 13. తిరునెడుందాండగమ్ | 30 | ,, | — |

*3.* మూన్ఱాంఆయిరమ్ : (కవులు : 6 గురు ; ప్రబంధములు : 10 ; పద్యములు : 816)

| | | | |
|---|---|---|---|
| 14. ముదల్ తిరువంతాది | 100 | పొయిగై యాళ్వార్ | కాంచీపురము |
| 15. ఇరండాంతిరువంతాది | 100 | పూదత్తాళ్వార్ | మహాబలిపురం |
| 16. మూన్ఱాం తిరువంతాది | 100 | పేయాళ్వార్ | మైలాపూర్ |
| 17. నాన్ముకన్ తిరువంతాది | 96 | తిరుమళిశై యళ్వార్ | తిరుమళిశై |
| 18. తిరువిరుత్తం | 100 | నమ్మాళ్వార్ | ఆళ్వార్ తిరునగరి (తిరునవ్వేలి జిల్లా) |
| 19. తిరువాశిరియం | 7 | ,, | — |
| 20. పెరియ తిరువంతాది | 87 | ,, | — |
| 21. తిరువెజుక్కూర్ తిరుక్కై | 1 | తిరుమంగై యాళ్వార్ | తిరుక్కురైయలూరు. తిరునగరి (చిదంబరసమీపము) |
| 22. శిరియ తిరుమడల్ | 77½ | ,, | — |
| 23. పెరియ తిరుమడల్ | 148 | ,, | — |

*4.* నాలాం ఆయిరమ్ : (ఏకకవికృత ప్రబంధము ; పద్యములు : 1101)

| | | | |
|---|---|---|---|
| 24. తిరువాయిమొళి | 1101 | నమ్మాళ్వార్ | ఆళ్వార్ తిరునగరి (తిరువన్వేలి జిల్లా) |

(మొత్తము కవులు : 12 గురు ; ప్రబంధములు : 24 ; పద్యములు : 4000)

పై నాలాయిర దివ్యప్రబంధమునకు మంగళప్రదమైన యుపసంహారము ప్రపన్నగాయత్రి యని ప్రఖ్యాతి నందిన 'ఇరామానుశనూత్తందాది' (108 ద్రావిడ పద్యములు). దీనిని రచించిన ప్రపన్నచూడామణి భగవద్రామానుజులశిష్యాగ్రణియు, శ్రీరంగవాస్తవ్యులు నగు 'అముదనార్'. శ్రీవైష్ణవులీప్రపన్నగాయత్రికి దివ్యప్రబంధముకంటె నెక్కువప్రాముఖ్యము నొసఁగెదరు. ఇందలివిషయము రామానుజశరణాగతి.

దివ్యస్థలములలో మహాక్షేత్రములగు తిరుపతి, కాంచీపురము, శ్రీరంగము, తిరునారాయణపురముల యందలియాలయములలో విశేషముగా నాలాయిరము

పారాయణము చేయఁబడు చుండును. పుస్తకాపేక్ష లేకుండ నాలాయిరమును బఠింపఁగలపండితులు నాలాయిరాధ్యాపకు లని విశిష్టగౌరవముతోఁ జూడఁబడు చుందురు. ద్రావిడవేదమును సంస్కృతవేదసార మనియు నమ్మాళ్వార్ రచించిన నాలుగుప్రబంధములును చతుర్వేదసార మనియు, తిరుమంగై యాళ్వార్ నిర్మించిన ప్రబంధషట్కము సంస్కృతవేదాంగములవలె ద్రావిడవేదషడంగము లనియుఁ బ్రాచీనసంప్రదాయవేత్తలు వచించెదరు. ఈయభిప్రాయము విచారమూలకము కాదు. గీర్వాణవేదవేదాంగముల కున్నగౌరవము ద్రావిడవేదమునకుఁ గూడఁ గల్గుటకే యిట్లు చెప్పబడినది. కాని సంస్కృతవేదవేదాంగాదులసారము ద్రావిడ దివ్యప్రబంధవాఙ్మయ మనుట యెంతమాత్రమును సమంజసము కాదు.

## 23. ఆముక్తము భారతీయవిజ్ఞానసంస్కృతులకు గని :

ఆముక్తము హైందవవిజ్ఞానసంస్కృతులకు గని. ఇందు వివిధశాస్త్రీయ సంప్రదాయము లెన్నియో యెడనెడఁ జూపఁబడి యున్నవి. ఈప్రబంధమును బఠింపుచో నెన్నియో కవిసమయవిశేషములు, లవలేశములతోడి వివిధాలంకార రహస్యములు మొద లగున వెన్నియో విశదమగును. జాతీయసంప్రదాయాదిక సూచికయం దిట్టి వెన్నియో సూచింపఁ బడినవి.

సమసమయసామాజికస్వరూప మీ ప్రబంధమునఁ జిత్రింపబడిన ట్లేయాంధ్ర ప్రబంధమునను జిత్రింపఁబడలే దని విమర్శకాగ్రణులయభిప్రాయము. రాయల ప్రబంధము నామూలచూడముగాఁ బరిశీలించినచోఁ దాత్కాలికసామాజికవ్యవస్థ, ప్రజలయాచారవ్యవహారములు రాయ లనుసరించినరాజనీతివిధానము మున్నగునవి విపులవిశదముగా బోధపడును.

ఆముక్తమందలిలోకోక్తి – న్యాయజాతీయసూచిక :

అంగిసుఖమైన నంగంబు లటకుమునుపె చాల సుఖు లౌట (ఆముక్త. III ఆ. 34)

అకృత్యముచే నగునట్టిపీడయుం గోచరమౌనె దైవ మనుకూలము నై పరుమేలు దీఱినన్ (V - 120)

అతిహర్షహేతూత్కటలాభం బిడునె మది క్షుధ స్నీర్వట్టున్ (IV-122)

అమృతమైనను జవుల జాత్యన్నసమమె (VI-34)

అహీయేమి గొఱబల్వాఁడిసెడిన (IV-235; ౪౭౩)

ఇంటిలో నేదుము ల్లయ్యె (V-84)

కారణగుణంబు గలుగదే కార్యమునకు (IV-174)
కుంపటిలో దామరలు (II-69) ఈ నానుడి నృసింహపురాణమున,(నీమగని)
పరమయోగివిలాసమున (కలిగెఁగదా)
బసవపురాణమునను (వినఁగఁగల్గునె V-101) గలదు
(చూ. వేదమువారి 'ఆముక్త'పీఠిక 1-17 పు.)
గజకచ్ఛప (కలహ) న్యాయము (V-35; ౫౩౫ పు.)
ఘనతఁ జొచ్చినయిండ్లను దనయ లుండి కాన్పునకుఁ బుట్టినిల్ చేరు
క్రమము (IV-78; ౩౯౦ పు.)
ఘనమగువారు నిజార్జవముఁ జేరువారికి నీరే (V-23; ౫౨౮ పు.)
తఱ చెందుఁ దల్లిబడికోల్ చె ట్టాటయే కా (V-132 పు. ౬౧౧)
తిర్యక్తతి దా గతానుగతికం బౌఁగా (IV-25; ౨౮౭)
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స (I-15; ౨౧)
దైవికమునెదుట యుక్తులు ఫలింపవు (V-147; ౬౨౪)
నాభియు న్నిర్విషంబును దోఁబుట్టువు లయ్యు వేర్పడ గుణంబు ల్పాపవే.
(II. 67 ౧౬౯) చూ. 'సాహిత్యసమీక్ష' (దీపాలపిచ్చయ్యశాస్త్రిగారిది)
1955 (పు. 376-79).
పాఱువారలసుద్ది సెప్పంగ నేల (IV-61; ౩౩౦)
పాసెం బడిగినవారే పేదలె (V-58; ౫౫౩)
పుట్టు మఱి నూఁతుల్ ద్రవ్వ బేతాళముల్ (VI-65; ౬౬౯)
పుణ్య మమ్ముట, కప్పురంబు వెట్టి యుప్పు గొనుట (VI-62; ౬౬౮)
బోనంబు ప్రజకు జక్కులబోనంబులె యయ్యె (VI-126; ౭౯౦)
మసిపాత మానికంబు (VI-5; ౬౩౪)
మీన్ మ్రింగినగ్రుక్క న్వారిధికిం గొఱఁతయె. (VI-64; ౬౬౮)
విధాతృకృత్య మది యేలా మాను నెప్పట్టునన్ (V-101; ౫౮౧)
శతాపరాధమును సహస్రదండము నతర్క్యము (IV-257; ౪౮౭)
శూలపృథువణిజ్న్యాయము (IV-239; ౪౭౫-౭౬)
అంపకోల నూల నాజ్ఞ చెల్లు నంట (IV-206; ౪౫౮)
అకృత్యముచేనగునట్టిపీడయుం. గోచరమౌనె దైవమనుకూలమునై పరు
మేలు దీఱినన్ (V-120; ౬౦౦)
అగస్తి నీరుబురదల వే ర్పఱచుట (IV-178)

ఆరణ్యకధ్వని వినఁగఁజేసి, గర్భము సుఖచ్యుతము సేయుట (IV_79; ౩౪౦-౪౧)

ఆహారదోషంబె విజ్ఞాననాశంబునకు మూలంబు (IV-194; ౪౫౨)

దశవిధదోహదములు - (అకాలమున వృక్షములను బుష్పింపఁజేయుటకై) ఇందు చరణతాడనము మొదలగునవి నాలు గవమానకరములు; ఆలింగనాదులాఱు అభిలషణీయములు (II-37. 132; ౩౩)

ఉప్పుచింది యినుమడియగుట (VII-24; ౬౯౩)

కామినీవదన సురాదోహదముచే వకుళము పుష్కలముగాఁ బుష్పించుట. (V_129, 130; ౬౦౯, ౧౦)

కంచుటద్దములు బూడిదతోఁ దోముట (IV-180; ౪౪౧)

కర్ణికారమునకు దరుణీసల్లాపముదోహదము (IV-128; ౬౦౭-౮)

కాలితడిసినముత్తెము సున్నమగుట (V-61; ౫౫౫)

కురవకమునకు(గోరంటకు)తరుణీజనాలింగము దోహదము(V-126;౬౦౬)

చలికాలమునఁ బెదవులకు మైనముపూసికొనుట (V-100; ౪౮౦)

చెవిమూసికొనుట (IV-42; ౬౫౭)

చేఁప తన జెనను తానే శరదృతువున భక్షించుట (IV-177; ౪౩౮)

జక్కులబోనంబులు (IV-126; ౭౯౧)

జమిలి వెండిమీలెక్కు వెంఁడ్రుకవిల్లు (IV-177; ౪౩౮)

డెందానఁ జేయిడి నిద్రవోవు (IV-261; ౪౭౯)

తప్తపాత్రమందున్నపాలు చిక్కఁబడుట (IV-176; ౪౩౯)

తామ్రచూడము (కోడి) నెమలిగ్రుడ్లను బొదుగుట (VI-179; ౪౩౯)

(చూ. 'శాకుంతలము'-V 'ప్రాగన్తరిక్షగమనాత్ స్వమపత్యజాత మన్యై ర్ద్విజైః పరభృతాః ఖలు పోషయన్తి')

తొట్టియక్కరంబు (VI-62;౬౬౮) - (ఘుణాక్షరన్యాయము. VI-15 ౬౪౦-౪౧)

త్రివిధోత్పాతములు - దివ్యభౌమాంతరిక్షము - తచ్ఛాంతి. (IV-253; ౪౮౪)

దప్పిగొన్నవారు పాలుత్రాగిన దప్పితీఱదు (IV-168; ౪౩౨-౩౩)

దోమతెరలు మంచములకుఁ గట్టుట (V-104; ౫౮౩)

నీలము తృణగ్రాహి (IV-132; ౩౯౬) చూ. చెన్నబసవపురాణముVI-౨౬౮ పీఠము; చంద్రాంగదా (IV-౧౨౬ ప.)

పసిమేయుచుఁ గ్రేపుఁదలఁచి, పాలుచేపుట (IV-168; ౪౩౨)
ప్రసూనరజః కనకాభిషేకము (V-131; ౬౧౦-౧౧)
పులిజున్ను (IV-261; ౪౮౯) పులిపాలు. కుందేటికొమ్ము-వంటిది.
మంచముక్రింద నినుపకుంపటులను బెట్టుకొనుట (V-104; ౫౮౩)
మలయతరున్యాయము (V-103; ౫౮౩)
మహాధనికులు కోటికిఁబడగెత్తుట (II-36. ౧౩౧-౨)
మహానీలము బహుతృణగ్రాహి (IV-164: ౪౨౯) చూ. ఆముక్త (IV-132; ౩౯౫-౬)
మామిడిచెట్టునకు యువతీకరస్పర్శము దోహదము (V-127; ౬౦౭)
ముఖరాగముచేఁ జంపకము పుష్పించుట (V-132. ౬౧౧,౧౨)
ముఖవాయుచే సిందువారము (వావిలి) పుష్పించుట (V-134; ౬౧౩)
ముఖసీధువుచే వకుళము (పొగడ) పుష్పించుట (V-125, 129, 130; ౬౦౫)
మెఱకదుక్కి దున్నలకుఁ గష్టము, రొంపిదుక్కి యెడ్లకుఁగష్టము (IV-124; ౩౮౮)
మొగిలువిరియెండ (మబ్బువిడిచిన శరత్కాలపుటెండ) (IV-166: ౪౩౧)
యువతీకటాక్షములు తిలకమునకు (బొట్టుగుచెట్టునకు) దోహదము. (V-135; ౬౧౪)
రాజునకుఁ గార్యఖడ్గములనుచరుల్ (IV-259; ౪౮౮)
రాజ్యాంతే నరకంధ్రువమ్ (IV-276; ౫౦౦)
వసంతరాగమును పాడుటచే (గానదోహదముచే) ప్రియాళుద్రుమము (ప్రేంకణపుఁజెట్టు) పుష్పించుట (V-133; ౬౧౨-౧౩)
వసంతుడు క్రమముగా మకరందవర్షముచేతను. రాలినపూమొత్తముల చేతను, పుష్పపరాగముచేతను, పాతాళ భూలోక స్వర్గ లోకముల నాక్రమించుట. (V-136 ; ౬౧౪)
వెదమొదవువెంటఁ బోలేని యాఁబోతు అంకెలువేయుచు మందగతిని మంద వెనుకఁబోవుట. (IV-169 ; ౪౩౩)
వేగుజామునందలి తెమ్మెరల కిప్పచెట్లు పుష్పించుట. (V-104 ; ౫౮౩)
వేఁటకాఁడువోలె విషయాళివలనఁ దత్తృష్ణఁదీరనిచ్చి త్రిప్పుటొప్పు (IV-193. ౪౫౧)
వ్రాఁతయం దంచపదము వ్రాయుట (V-29. ౫౩౧)

శరత్కాలమున నగస్త్యున కర్ఘ్యమొసఁగుట (IV-175. ౪౩౭)
శిశువులకు దంతములు మొలచినపిమ్మటఁ దన్మాతలు పురుషసంగంబును గోరుదురు (V-116 - ౬౫౪)
సురపొన్నకు (నమేరువునకు) తరుణీహాసము దోహదము (IV-128. ౬౦౭)
హంస పాలు విఱుచుట, అగస్త్యుఁడు నీటినే విఱుచుట (IV-178. ౪౩౭-౯)

## 24. ఆముక్తమాల్యద - పర్యాలోకనకర్త :

ఈగ్రంథకర్త యార్వేలనియోగి. తెలంగాణమండలమందున్న మహబూబునగరంజిల్లా కల్వకుర్తితాలూకాలోని పడకల్లు వీరి జన్మస్థానము. కౌశికసగోత్రుడు. వీరి జనకులు రామకృష్ణారావుగారు. జనని రుక్మిణీదేవి. వీరికి గీర్వాణసాహిత్య సంపద శ్రీ తిరుమలబుక్కపట్టణం అణ్ణయాచార్యులవారును, ఆంధ్రసాహిత్య సంపదను శ్రీయుతులు కురుగంటి సీతారామయ్య, నరిపెల్ల విశ్వనాథశాస్త్రిగారలు ప్రసాదించిరి. ఈగ్రంథ మీసాహిత్యాచార్యత్రయమునకే నంకితము గావించి తన గురుభక్తిని వ్యక్తముచేసుకొనినాడు. వాగ్దేవి వీరి ఉపాస్యదైవము.

పర్యాలోకనరచయిత యగు శ్రీవెల్దండ ప్రభాకరామాత్యులు రమారమి పదునైదు సంవత్సరములనుండి యాంధ్రసారస్వత ప్రపంచమునకు సుపరిచితులు. వయసునఁ జిన్నయయ్యు సాహిత్యవ్యసనమున మిగులమిన్న. అఖిలభారత ప్రాచ్య విద్వన్మహాసభయం దొక దశాబ్దమునుండి కౌన్సిలుసభ్యులుగా వీరు పాల్గొనుచు గవేషణాత్మకమగు తమరచనల బఠించుచుండుటకు వీరి సాహిత్యవ్యసనమే హేతువు. ఆంగ్లకవి చక్రచూడామణియగు "కీట్సు" మహాకవి రచించిన 'ఈవ్ ఆఫ్ సెంటు ఏగెన్సు' (Eve of St. Agnes) అను కావ్యరత్నమును 'ప్రేమసీమ' యను స్వేచ్ఛానువాదము ధారాశయ్యతో నేకాశ్వాసకావ్యముగా రచించి తెలుఁగు నాఁటి విద్వత్కవివరుల యామోదమును బడయఁగలిగిరి. వీరి, 'ఆముక్తమాల్యదా పర్యాలోకనము' స్వల్పాకృతిలో క్రీ.శ. 1945 వ వత్సరమున, తొలిసారి విద్యార్థిగా నున్నప్పుడే సూర్యాలోకన భాగ్యమునందెను. చిన్న యాకృతిలో రమారమి నూట యేబది పుటలలోనున్న యారచనయేఁ బరిపుష్టినంది ప్రస్తుతరూపమున నూట డెబ్బదియాఱుపుటల విపులసమాలోచనముగాఁ బరిణమించినది. ఆంధ్రసాహిత్య ప్రపంచమున 'ఆముక్తమాల్యద' ప్రౌఢతమ ప్రబంధము. సామాన్యభాషాసంస్కారము కలవారి కదికొఱుకుడుపడదు. అందువలననే రాయల కావ్యమునుబఠించి రసా

స్వాదనమొనరించు వారిసంఖ్య బహుస్వల్పము. వీరి విమర్శ ప్రచురింపఁబడుటకుఁ బూర్వమున నేరచయితయు నాముక్తమాల్యదపై బహు విషయ విచారకమగు విమర్శనుఁ బ్రకటింపలేదు. దీనివలన నీ సమాలోకన ప్రాభవము విశదమగు చున్నది. అనవధానతవలనఁ గాఁబోలు నిందు నెడనెడ దొరలిన స్వల్పమగు భాషాదోషములను సహృదయులగు విద్వాంసులు గణింపక యిందలి గుణగణ ములనే స్వీకరింతురుగాక.

అగాధసరోవరమువంటి యాముక్తమాల్యదయందు 'బ్రవేశించుటకు నీ పర్యాలోకన మొకఘట్టము(రేవు)వంటిది, దీనికిఁ బూర్వమునఁ జేర్పఁబడిన 'ఆంధ్ర సాహిత్యసౌరభ' మను భూమిక సరోవరమున సుఖప్రవేశమునకై తోడ్పడు సోపాన పరంపర యని నాయూహ. పర్యాలోకనమునకుఁ బరిపూర్ణగ్రంథము (Supplement and Compliment)వలె భూమిక యుండనోపు నని తద్రచయిత యభిప్రాయము. ద్వితీయసంస్కృతి నందిన వీరివిపులవిమర్శ కూడ పర్యాప్తము కాదని దోచును. అచిరకాలమున నిది తృతీయావృత్తి నందుభాగ్యము కల్గుచో నీరచయిత సువిస్తృ తము, సర్వతోముఖవిచారకము, నిర్దుష్టము నగు గ్రంథమునువెలయింపఁ గల్గును. ఏ కొలఁదిమందిపాఠకులనైనను, ఆముక్తమాల్యదాపఠనమున కున్ముఖులగున ట్లుద్బోధనముచేయఁగల్గుచో పర్యాలోకనకర్త పడిన శ్రమ సఫల మగును. అట్టి సదవకాశము నేతత్ప్రబంధనాయిక యగుగోదాదేవియు, తద్భర్త శ్రీరంగనాథుఁడును వీరికిఁ బ్రసాదించుఁగావుత మని మా మంగళాశాసనము.

## 25. ప్రకృతభూమికాలక్ష్యములు :

ప్రబంధమునకుఁ గృత్యాది యెట్టిదో, యాధునికకాలమున రచింపఁబడు గ్రంథములకు భూమిక యట్టిది. నేఁడు తగినంతయోపిక, తీటిక, వలయునంత కాలవ్యవధిని గ్రంథావలోకనమునకు వినియోగింపఁ జాలని యధునాతనపాఠక ప్రపంచమునకు భూమిక మిక్కిలి యవసరము. గ్రంథ మెంతయుత్కృష్ట మైనను సామాన్యముగ నేఁటిపాఠకమండలి భూమికాద్వారముననే గ్రంథస్థవిషయములయం దవగాహన మొనరించును. పఠితలకు గ్రంథాంతర్గతవిషయములపై నభిరుచిని గల్గించి, వారిని గ్రంథపఠనోన్ముఖులుగాఁ జేయుటకు మనోహరముగాఁ గూర్పఁ బడిన ప్రాక్కథనము సమర్థ మగును. బంగారుపళ్లెమున కైనను గోడచేర్పవ సరము. ఈదృష్టితోడనే పాశ్చాత్యులు రచించినగ్రంథములు సర్వసాధారణముగా,

పర్యాప్తములు, సర్వవిషయవిచారకములు నగు భూమికలచే నలంకృతము లగు చుండును.

జగద్విఖ్యాతకీర్తి నందిన 'జార్జి బెర్నార్డుషా' కవిశేఖరుఁడు తాను రచించినరూపకముల కాయాగ్రంథములకంటెను బహువిపుల మైనయుపోద్ఘాతముల గూర్చి ఖ్యాతి నందెను. తెనుఁగునాట సర్వోత్తమభూమికానిర్మాతలలో నగ్రగణ్యులు, స్వర్గీయులు, ప్రాతఃస్మరణీయులు నగు శ్రీ మానవల్లి రామకృష్ణకవిచరణులు. వారిభూమికలనే లక్ష్యములుగాఁ గొని, పాశ్చాత్యవిద్వాంసులసరణి, భారతీయపూర్వాచార్యుల ప్రమాణైకనిరతి, వంగదేశవిద్వాంసులసంకలనచాతురి, మహారాష్ట్రగవేషణనిరతుల పౌర్వాపర్యచారిత్రికదృష్టి, మనమునం దుంచుకొని యిదివఱలో [1]మురారి అనర్ఘ రాఘవమునకు నాంధ్రపరివర్తనము, [2]వేదాంతదేశికుల హంససందేశమున కాంధ్రీకరణము, [3]అగస్త్యవిద్యానాథుని ప్రతాపరుద్రీయయశోభూషణమున కాంధ్రపరివర్తనములకును సువిపులముగా భూమికల రచించితిని. అవి సహృదయశేఖరుల యామోదమును బడసినవి. ఆభూమికలచే నాకర్షింపఁబడి శ్రీ వెల్లండ ప్రభాకరామాత్యులు తమ 'ఆముక్తమాల్యదాపర్యాలోకనము' (ద్వితీయావృత్తి)నకుఁ గూడ నట్టిభూమికనే రచింపవలె నని నన్ను గోరఁగా బహుకార్యవ్యగ్రుఁడ నై యుండియు, ఆముక్తమాల్యదపైఁ గల గాఢాభిమానమువలనను, కవిపండితకల్పక మగు శ్రీకృష్ణదేవరాయలయెడఁ గల విశిష్టగౌరవమువల్లను, అమాత్యులయెడల నాకుగల యనిర్వ్యాజవాత్సల్యమువల్లను; గురుకులక్లిష్టులనఁబరగు మురారి, వేంకటాధ్వరి రాయలపై గ్రంథకర్తకు నాకుఁగల సమానాభిమానమువల్లను; పీఠికారచన కంగీకరింపక తప్పినది గాదు. తత్ఫలితమే యీఆంధ్రసాహిత్యసౌరభము. పై లక్ష్యముల నే నెంతవఱకుఁ బాటింపఁగల్గితినో సహృదయులే నిర్ణయింతురుగాక.

## 26. ఆముక్తమాల్యద – ఉపజీవ్యగ్రంథముక్తాకలాపము :

**1886**

1. ఆముక్తమాల్యదను పెద్దనయే రచించిరని యొకలేఖ, బోడపాడి రామలింగేశ్వరప్పగారు (28-9-1886) ఆ. గ్ర. చింతామణిలో ప్రకటించిరి.

---

1. శ్రీ సత్యవోలు కామేశ్వరకవి—కాకినాడ 1937. (పీఠిక 50 పుటలు). [అనర్ఘ రాఘవసమాలోచనము].

2. శ్రీ పెనుమర్తి వేంకటేశ్వరశాస్త్రి—తెనాలి 1943. (పీఠిక 18 పుటలు).

3. శ్రీ చలమచర్లరంగాచార్య శిరోమణి—హైద్రాబాదు 1944. (పీఠిక 55 పుటలు). [సాహిత్యకుసుమాంజలి].

1894

2. ఆంధ్రకవుల చరిత్ర. రెండవ సంపుటము. కందుకూరి వీరేశలింగం పంతులుగారు. మొదటి ఎడిషను.

1897

3. డిటో — రెండవ ఎడిషను.

1898

4. డిటో — మూడవ ఎడిషను.

1902

5. The Holy lives of the Azhvars or the Dravida Saints by Alkondavalli Govindacharya (Mysore).

6. Divine Wisdom of the Dravida Saints by Alkondavalli Govindacharya (Mysore).

1906

7. 'సత్యవాదిని' - 1906 జనవరి 17 న కృష్ణరాయ జయన్త్యుత్సవమునఁ బ్రకటితవ్యాసము.

1911

8. శ్రీ కృష్ణదేవరాయలకాలంబున నాంధ్రభాషాస్థితి. (నాగపూడి కుప్పుస్వామయ్య, బి. ఎ., ఆంధ్రపత్రిక ఉగాది సంచిక - 1911 - పుటలు 49-53).

1912

9. A Neglected Emperor Poet by G. Harisarvottama Rao.

1914

10. ఆముక్తమాల్యద కుపోద్ఘాతము - మేడేపల్లి వేంకటరమణాచార్యులు - ఆముక్తమాల్యద - వావిళ్ల ఆముక్తప్రతి.

1915

11. Some Mile-stones in Telugu Literature: I—The Age of Krishna Deva Raya (in English) by G. R. Subbaramiah Pantulu (Kitcneer Press, Madras).

1916

12. 'ఆముక్తమాల్యదను రచించినది కృష్ణరాయలగునా కాదా'?-(కోటగిరి వేంకటకృష్ణరావు. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. సంపుటి - 5, సంచిక. 3. పుటలు 81-90.)

1916-17

13. 'ఆముక్తమాల్యదయోగ్యత'. (వి. కృష్ణమోహన్, ఎం.ఏ., (ఆనర్సు). బి. యల్., ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సంపుటి 5 - సంచిక 8-9. పోవెల్ మోహెడ్ వర్నాక్యులర్ ప్రైజు).

**1917**

14. The Yet Remembered Ruler of a long Forgotten Empire - Krishna Deva Raya of Vijayanagar–(Dr. S. Krishnaswami Ayyangar.)

15. Never to be Forgotten Empire (B. Suryarayana Rao).

**1918-19**

16. 'కృష్ణరాయల కొన్ని దిగ్విజయ యాత్రలు' - (కొ. వెం. లక్ష్మణ రావు). ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సంపుటి 7. సంచిక - 5

17. 'కృష్ణదేవరాయల నిధనకాలము', (డిటో). ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సంపుటి 7 - సంచిక - 6. 4 పుటలు.

**191 9**

18. Sources of Vijayanagar History (A. Rangaswami Saraswati under Dr. S. K. Ayyangar). Publication No. 1 of the Department of Indian History and Archaeology. University of Madras.

**1921**

19. ఆముక్తమాల్యదా వ్యాఖ్యానము. మద్రాసులో జరిగిన ఆంధ్రసాహిత్య పరిషత్సభలో మహామహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రివర్యుల యుపన్యాసము. (ఆంధ్రపత్రిక సారస్వతానుబంధమున ప్రకటితము. దుర్ముఖి కార్తీక బ. ౪ శనివారము).

**1922**

20. కృష్ణదేవరాయలు కవియగునా? (విద్వాన్ కోపల్లి శివకామేశ్వరరావు) ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము. దుందుభి జ్యేష్ఠ బ. ౧ శనివారము. 1922 జూన్.

21. ఆముక్త కర్తృత్వమునుగూర్చి వేటూరి ప్రభాకరశాస్త్రులు ప్రకటించిన వ్యాసము. (ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము. దుర్ముఖి మాఘ శు. ౧ శనివారము).

22. ఆముక్తమాల్యద పెద్దన రచన యను విషయముపై వేటూరి ప్రభాకర శాస్త్రిగారి వ్యాసము. (ఆంధ్రపత్రిక దుర్మతి మాఘ శు. ౧ శనివారము, వేదము వేంకటరాయశాస్త్రిగారిచే తమ పీఠికయందు 72వ పుటలో ప్రస్తావింపబడినది).

**1923**

23. లక్ష్మణరాయ వ్యాసావళి - మొదటి సంపుటము. (కె. వి. లక్ష్మణరావు, మద్రాసు.)

**1925**

24. కవిజీవితములు. (గురజాడ శ్రీరామమూర్తి). వావిళ్ళప్రెస్సు.

25. ఆముక్తమాల్యదలోని దశావతారపద్యములు. (గర్భాం అప్పారావు, బి. ఏ.,) ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము - క్రోధన చైత్రబహుళ ౧ శుక్రవారము.

**1926**

26. శ్రీకృష్ణరాయల జన్మదినము - కొటికలపూడి యజ్ఞేశ్వరముగారి నరసింహశర్మ. (భారతి సంపుటము. 3. సంచిక 9. 1926 సెప్టెంబరు.)

27. శ్రీకృష్ణదేవరాయల చరిత్రము. మద్దూరి (శ్రీరామమూర్తి. 127 పుటలు. రాజమహేంద్రవరము.) Popular but not reliable as History.

28. The Date of Krishna Deva Raya's Death—K. Raghavacharyulu. J.A.H.R.S. Vol. 2. Part I. Pp. 58-60.

**1927**

29. ఆముక్తమాల్యదకుఁ టీకానుబంధములు. (కె. వి. ముద్రాక్షరశాల మద్రాసు) వేదము వేంకటరాయశాస్త్రి. 148 పుటలు.

30. శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయ రజతోత్సవ సంచిక. హైద్రాబాదు. 150 పుటలు. అష్టదిగ్గజముల ప్రతిభ. కృష్ణదేవరాయల విజయయాత్ర. ఇత్యాది గాథలకు తత్కాల వాఙ్మయచారిత్రక విషయములకు చెందిన వ్యాసములనేకములు.

31. ఆముక్తమాల్యదలో నొకపద్యము - కొత్తపల్లి సూర్యారావు. ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక Vol. 25 No. 5.

32. The Contemporaries of Periyalvar by K. G. Sankar, B.A., B.L., Asst. Librarian, Imperial Library, Calcutta—J. O. R. Madras. Vol. I. Pt. 4.

33. The date of Sri Andal—M. Raghava Ayyangar—J.O. R. Madras Vol. I. Pt. 2 (18-12-731).

34. The date of Tirruppavai by K. G. Shankar, J.O.R. Madras. Vol. I. Pp. 167-69.

**1928**

35. ఆంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహము. కవిత్వవేది - వావిళ్ళ.

**1929**

36. Hymns of the Alvars—By J. S. M. Hooper, M.A., Heritage of India Series—Wesleyan Mission Press, Mysore City.

**1930**

37. మిత్రభాషితము - మొదటిభాగము. ఆముక్తమాల్యదాచర్చ. దేవులపల్లి నరిసింహశాస్త్రి సుజనరంజని ప్రెస్సు-కాకినాడ.

38. ఆముక్తమాల్యద - శ్రీకాకుళశాసనము- భారతి 1930 నవంబరు సంచిక కలగూరగంపలో వ్రాసినది.

39. Importance of Rayavachakamu and other Telugu sources for Krishna Raya's reign. J.A.H.R.S. Vol. IV. Nos. 3, 4 by K. Raghavacharyulu.

1931

40. Krishna Deva Raya—His Officers and Contemporaries. J.A.H.R.S. Vol. V. Pt. 3 by K. Raghavacharyulu.

1932

41. దశావతార పద్యములు, శ్రీకృష్ణదేవరాయలు. గర్భాం అప్పారావు, బి. ఏ., ఆంధ్రపత్రిక ఉగాది సంచిక ఆంగీరస 1932-1933.

1933

42. రాయవాచకము. (ఆంధ్రసాహిత్యపరిషత్-కాకినాడ)

1934

43. Social and Political Life in the Vijayanagar Empire (1346-1646 A.D.) by Dr. B. A. Saletore 2 V. Madras.

1935

44. 'Studies in the III Dynasty of Vijayanagara' (Dr. N. V. Ramanayya) No. 11 of the Publications. Department of Indian History and Archaeology—University of Madras.

45. Compaigns of Sri Krishna Deva Raya (K. Ishwar Dutt) J.A.H.R.S. Vol. IX. Part 4.

46. ఆంధ్రప్రబంధకథలు - మూడవప్రకరణము. సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి, శికింద్రాబాదు.

1936

47. 'Vijayanagara Samrajya' in Kannada—Desai Panduranga Rao. B.A. (Hons.) Vijayanagara Smarakotsava Mandala, Dharwar.

48. The authorship and importance of the Amukta Malyada as a source of History for the reign of Krishna Deva Raya.

49. Krishna Deva Raya and his literary circle by N. Venkat Rao.

50. Krishna Raya—The Man: (References 48 to 50 are from Vijayanagara Sexcentenary Commemoration Vol. Karnatak Historical Research Society, Dharwar).

1937

51. Krishna Deva Raya and the Portuguese (Gurti Venkat Rao) Jayanti Ramayya Pantulu 75th Birth Day Commemoration Volume. J.A.H.R.S. Vol. X. Pts. 1-4. 1936-37.)

52. 'Polipadu Grant of Krishna Deva Raya' with plate, Dr. P. Srinivasachary, Ibid. Pp. 121-42 Vol. X of J.A.H.R.S.

53. 'Andhra Literature in the Vijayanagar Empire'—T. Achyuta Rao, Ibid. Pp. 209-21. Vol. X. J.A.H.R.S.

1939

54. కృష్ణరాయల సకలకథాసారసంగ్రహము. వేటూరి ప్రభాకరశాస్త్రి. భారతి అక్టోబరు 1939.

1940

55. Administration and Social Life under the IIIrd Dynasty of Vijayanagar by T. V. Mahalingam, Madras.

56. విజయనగర సామ్రాజ్యమునందలి ఆంధ్రవాఙ్మయ చరిత్రము. రెండవ సంపుటము. (తుళువయుగము, క్రీ. శ. 1500-42) చేకుమళ్ళ అచ్యుతరావు.

57. ఆముక్త కర్తృత్వము - సన్నిధానము వ్యాసము. (దివ్యవాణి శికింద్రాబాదు విజయ సంచిక 10-10-1940).

1941

58. Amukta Malyada—Rajacharita Visharada Rao Saheb C. Hayavadana Rao's Article—Sri Vavilla Venkateshwara Sastry Commemoration Vol.

59. The Administrative Value of Amukta Malyada (T. V. Mahalingam) (Ibid).

60. Krishna Deva Raya and the "Demos" (G. Harisarvottama Rao) (Ibid).

61. Krishna Deva Raya's Economic Policy (Y. Venkata Ramana) paper read at the IX session of A.I.O.C. Trivandrum. Dec. 1937. I.H.Q. Vol. 17. No. I March 1941).

62. సాహిత్యసమీక్ష (వ్యాససంపుటి) : దీపాల పిచ్చయ్యశాస్త్రి. ఆముక్తమాల్యద వ్యాఖ్యానములు : పాఠవిచారణ, ('యతినియతి' అను శీర్షికతో 1941 లో త్రిలిఙ్గరజతోత్సవ సంపుటమున బ్రకటితము.)

63. 'The Doctrine of Substitution in Religion and Mysticism': by Dr. K. C. Vardachari J.S.V.O.I. Vol. II. Pt. I January-June-41 Tirupati : Contains references to the two works of Āndāl.

64. 'Divine Lady or a Maid's Vow' by Dr. K. C. Varadachari. This is on Andal and her Tiruppavai (J.S.V.O.I. Vol. II. Pt. II) Orthodox thinkers assign Vishnuchitta to Third Century A.D. while Modern Writers assign him to Eigth Century A.D.

**1942**

65. 'రాయల రచ్చ' - పాలెపు వేంకటరత్నము. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సంపుటము 31 - సంచికలు 1, 2.

66. శ్రీకృష్ణదేవరాయలు - మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి - 21 పద్యములు-ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సంపుటము 31 - సంచికలు 3, 4.

**1943**

67. The Philosophy of Visistadwaita by Prof. Srinivasacharya, Adyar, Madras.

68. భువనవిజయప్రశంస - 33 పద్యములు - వాజుపేయాజుల రామసుబ్బారాయుఁడు. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. సంపుటము 31 - సంచికలు 5, 6.

**1944**

69. షాడబము - బులుసు వేంకటరమణయ్య, భారతి 1944 జూలై.

70. ,, - డా. చిలుకూరి నారాయణరావు. భారతి 1944 అక్టోబరు.

71. ,, - డా. నేలటూరి వేంకటరమణయ్య, భారతి 1944 నవంబరు.

**1945**

72. ఆముక్తమాల్యద పర్యాలోకనము. వెల్దండ ప్రభాకరరావు. ప్రత్యూష ప్రచురణము ౧౧. సాధనసమితి, శికింద్రాబాదు.

**1946**

73. ఆముక్త : రచనోద్యోగకాలము. (ఓరుగంటి రామచంద్రయ్య). భారతి-23 సంపు. 8 వ సంచిక.

74. Further Sources of Vijayanagara History by K. A. Nilakanta Sastry and Dr. N. Venkataramanayya. No. 18 of the Indian History and Archaeological Publications. 3V. Madras University.

**1947**

75. కళాపూర్ణోదయము - కృష్ణరాయలు. మల్లంపల్లి వీరేశ్వరశర్మ. భారతి 24 వ సంపుటము - సంచిక 9.

76. రాయలనాటి రమణీయజీవితము : హంపీ క్షేత్రము. పుట్టపర్తి నారాయణాచార్యులు - భారతి 24 వ సంపుటము - 5 వ సంచిక.

1948

77. ఆముక్తమాల్యద - వస్తుసంవిధానము. డా. దివాకర్ల వేంకటావధాని. భారతి 1948 డిసెంబరు.

1949

78. కృష్ణదేవరాయలు - డా. నేలటూరి వేంకటరమణయ్య. భారతి - సంపుటము 26 - సంచికలు, 2, 3, 4, 5, 6, 7, 8, 12.

79. గోదాదేవి విరహము - డా. దివాకర్ల వేంకటావధాని. భారతి-సంపుటము 26 - సంచిక 5.

1950

80. ఆంధ్రకవితరంగిణి - ఏడవ సంపుటము. చాగంటి శేషయ్య, కాకినాడ.

81. కృష్ణదేవరాయల కళింగజైత్రయాత్ర. డా. నేలటూరి వేంకటరమణయ్య - భారతి 1950 ఏప్రియల్.

82. కృష్ణదేవరాయలు - డా. నేలటూరి వేంకటరమణయ్య. భారతి 1950 జూను.

1951

83. రాయల ప్రకృతివర్ణన - పిలకా గణపతిశాస్త్రి. ఆంధ్రపత్రిక 42వ ఉగాది సంచిక 1951-52.

1952

84. రాయలవారి ఋతువర్ణనలు - డా. దివాకర్ల వేంకటావధాని. భారతి 1952 మే.

85. ఆంధ్రవాఙ్మయమున శృంగారము - డా. యస్వీ జోగారావు. భారతి 1952 మే.

86. ఆముక్తమాల్యద - సి. హయవదనరావుగారి వ్యాసమునకు బులుసు వెంకటేశ్వర్లు ఆంధ్రానువాదము. వావిళ్ళషష్ఠిపూర్తి సంచిక.

87. కృష్ణదేవరాయలు -డా. నేలటూరి వేంకటరమణయ్య. భారతి-సంపుటము-29 - సంచికలు. 7, 9, 11.

1953

88. రాయల శాస్త్రవైదుష్యము - డా. దివాకర్ల వేంకటావధాని. భారతి-1953 ఆగస్టు.

89. కృష్ణదేవరాయలు - డా. నేలటూరి వేంకటరమణయ్య. భారతి-1953, ఫిబ్రవరి, మే.

90. Studies in Krishna Deva Raya of Vijayanagar (by Dr. O. Ramachandrayya, Andhra University, Waltair).

91. Kodai (Andal)—Authors's name; not stated from "Great Women of India" Advaita Ashram, Alamora.

1954

92. 'Periyalvar and Andal'—Article in Part III—Chapter XV by K. R. Srinivasa Iyengar in History and Culture. Of the Indian People—Bharatiya Vidya Bhavan, Bombay.

93. అముక్తమాల్యద - దేవరకొండ వీరయ్య, యం. ఏ., ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక - సంపుటము 43 - సంచికలు 1-3.

94. అముక్తమాల్యద - రాయలవారి యాంతరభావములు - డా. దివాకర్ల వేంకటావధాని, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సంపుటము 43 - సంచికలు 1-3.

95. Andal and Meera—by S. Shankar Raju Naidu. University of Madras—Annals of Oriental Research, Vol. XII; 1954-55; Pts. 1 & 2. Hindi Section.

1955

96. అష్టదిగ్గజములు - నిడుదవోలు వెంకటరావు. ఆంధ్రపత్రిక మన్మథ సంవత్సరాది సంచిక నెంబరు. 46.

97. షాడబశబ్దవిచారము. దీపాలపిచ్చయ్యశాస్త్రిగారి వ్యాసము. ఆంధ్ర వారపత్రిక దసరా సంచిక.

98. 'రాయలనాటి రసికత' - రాయలపై దుష్యము. "సారస్వతావలోకనము. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ. (త్రివేణీ పబ్లిషర్సు - మచిలీపట్టము.)

99. Women Saints of East and West. (Sri Saradadevi Birth Centenary Memorial).

1957

100. అముక్త కతిపయ పద్యార్థ పరిశీలనము - బులుసు వెంకటేశ్వర్లు- భారతి 1957 ఏప్రియల్.

101. రాయల కృషికజీవనప్రియత. యం. వి. యస్. సూర్యనారాయణ భారతి 1958 ఏప్రియల్.

**1958**

102. ఆముక్తమాల్యదలో అపూర్వాలంకారములు - యామిజాల పద్మనాభ స్వామి. 7-4-58 తేది వాణి.

103. కృష్ణకథావిపంచి - బాడాల రామకవి. మైసూరు.

104. ఆముక్తమాల్యద రచనాకాలము - దేవరపల్లి వేంకటకష్ణారెడ్డి - ఉలవపాడు - నెల్లూరు.

105. విజయనగర చరిత్రము - 400 పుటలు - టాగూరు పబ్లిషింగ్ హౌసు, హైద్రాబాదు.

## గోదావాఙ్మయము

1. ఆచార్య సూక్తిముక్తావళి - నంబూరు కేశవయ్యంగారు.
2. ఆండాళ్ తిరుక్కల్యాణము - వచనము.
3. ఆచార్య రత్నహారము. (వంగిపురం సీతారామాచార్యకవి). 1910.
4. గురుపరంపరాప్రభావము. అఱవము. కాంచీపురం. 1910.
5. గోదాగుణరత్నకోశ - సంస్కృతము. (MSS)?
6. గోదానాసామౌక్తికపంశవింశతిః - సంస్కృతము.
7. గోదాపరిణయము. (నాటకము శ్రీశైలశ్రీనివాసకవి) - సంస్కృతము.
8. గోదాపరిణయచంపూః. (వేదాధినాథ) - సంస్కృతము.
9. గోదాపరిణయము - నాటకము. సుందరరాజాచార్య - సంస్కృతము.
10. గోదాపరిణయచంపూః - డా. కేశవనాథ - సంస్కృతము.
11. గోదామహిమ - (గోదా పూజావిధానముగల వ్రతగ్రంథము).
12. గోదాంబావ్రతోత్సవ పదావళీ - (శ్రీధరాచార్యకవితా - బృందావనమ్).
13. గోదా చతుశ్లోకీ.
14. గోదాలహరీ (ఖండరాజ దీక్షితస్య).
15. గోదాస్తుతిః (వేదాంతదేశికః).
16. గురుపరంపరాప్రభావమ్ - (అరవము) (Vadagalae) Printed in Telugu Type Madras).
17. వడగల గురుపరంపరాప్రభావము. ఆంధ్రపరివర్తనము. కొ. అనంతాచార్యులు. 1885.
18. తిరుప్పావై - ఆంధ్ర టీకాతాత్పర్యములు.
19. తిరుప్పావై - ఆంధ్ర పద్యగేయ పరివర్తనములు.
20. తిరుప్పావై - సంస్కృతానువాదములు.
21. తిరుప్పావై - ఆంగ్ల పరివర్తనములు.
22. Alvar Saints—Shuddhananda Bharati, 1942.
23. శ్రీవ్రతము (తిరుప్పావు) - పద్యములు. శ్రీ యన్. కూరత్తాళ్వార్ అయ్యంగార్. 1930.
24. తిరుప్పావై, యన్. వకుళాభిరామన్‌గారిది; తెలుగు ప్రతిపద టీకా సమేతము-తాత్పర్య స్వాపదేశార్థపదములు. 1931.
25. Date of Andal—M. R. Ayyangar. April 1927.

26. Contemporaries of Periyalvar—K. G. Shankar. 1927 October.

27. Date of Tiruppavai—K. G. Shankar. 1927 April.

28. Periyalvar and Andal—K. R. Srinivasa Ayyangar. 1954

29. 'Āndāl' (from Women Saints). 1955.

30. Kodai (=Āndāl) from Great Women of India. 1953.

31. The Doctrine of Substitution in Religion and Mysticism (Dr. K. C. Varadachari). 1941.

32. 'Divine Lady or a Maid's Vow' (Dr. K. C. V.). 1941.

33. Andal (in Tamil; Appreciation of the Poetess and her works) by P. Sri.

34. The Holy Lives of the Azhwars or Dravida Saints. (A. G. A. Mysore).

35. Divine Wisdom of Dravida Saints. (A. G. A. Mysore).

36. Hymns of the Alvars (J. S. M. Hooper). 1929.

37. The Phlosophy of Visistadwaita (P. N. S.). 1943.

38. 'దివ్యసూరిచరితమ్' సంస్కృతము. 1885.

39. పరమయోగి విలాసము (తిమ్మభూపాలుడు) 1912.

40. పరమయోగి విలాసము - ద్విపద.

41. ప్రపన్నామృతమ్. సంస్కృతము. 1877.

42. సుప్రతము (తిరుప్పావై) Drama (S.T.P.R.) 1936.

43. జయు స్త్రీమాలా (సంస్కృతము).

44. Sri Andal Charitam (in Malayalam).

45. Tiruppavai beautifully annotated by P. Sri.

46. Divya Prabandhasaram (in Tamil—ed. P. Sri).

47. Part played by women ascetics like Mira, Andal and Saradadevi. Vol. II. Women of India, Publications Division. Delhi-8.

48. దివ్యసూరి చరిత్రము (తెలుగు S. T. V. రాఘవాచార్య. ప్రపన్నామృత ఆధారముగా). 1926.

## 27. ఉపసంహార నీరాజనము :

'ద్వాభ్యాం య న్న హరి స్త్రిభి ర్న చ హరః స్రష్టా న చైవాష్టభి
ర్య న్న ద్వాదశభి ర్గుహో న దశకద్వంద్వేన లంకాపతిః,
య న్నేంద్రో దశభిఃశతై ర్న జనతానేత్రై రసంఖ్యై రపి
త త్ప్రజ్ఞానయనేన పశ్యతి బుధ శ్శైచ్ఛకేన వస్తు స్ఫుటమ్'

అనుసూక్తి ననుసరించి ప్రజ్ఞాచక్షువు లగు పండితప్రకాండులు పరిమితము లగు నాతెలివియెఱుకల కందక యాముక్తమాల్యద యందు నిలీనము లైన కవితావైదుష్య విశేషములను గుర్తింతురుగాక.

† శ్లో. 'గోదైవ ధన్యా కిల కన్యకాసు
యా మాదరాత్ సంప్రతి పర్యగృహ్ణాత్,
ఉపేక్ష్య రంగేందు రురోగృహిణ్యాం
పద్మాలయాయాం ప్రణయాతిరేకమ్'

శ్లో. 'అర్చావతారేషు సురానతేషు
శ్రీరంగధౌరేయక ఏవ ధన్యః,
యం పాణిదామార్పణతోవరిష్ఠ
గోదా పమక్షం సకలామరాణామ్'

శ్లో. 'స్వాహేవ వహ్నే ర్గిరిజేవ శంభోః
ఛాయేవ సూర్యస్య శచీవ జిష్ణోః,
రతి ర్యథా పంచశరస్య గోదా
శ్రీరంగిణశ్శ్రీరివ వల్లభాऽభూత్' †

హేమలంబ - హేమంతము
11-12-1957
రాజమహేంద్రవరము.

సహృదయ విధేయుఁడు
ఈయూణ్ణి వేంకట వీరరాఘవచార్యుఁడు.

† దివ్యసూరిచరితము. XIII. 17-19 (పు. ౨౭).

మ. ప్రభువౌరాయలకావ్యమున్జదివి
విద్వాంసుల్ ప్రశంసింప త
త్ప్రభవాఖ్యాన్వితులై వెలార్చితివి
పర్యాలోకనంబందు ; సా
రభముల్ జొన్పెను రాఘవార్యాకృత
సర్వాంగీణ సాహిత్యా సా
రభ ; మీ యుర్వరబ్రోచు గోదపతి
శ్రీరంగేశు డెప్పట్టునన్.

—"హిమధామ."

మ. సరసుండొక్కఁడు కావ్యమున్నదివి
తత్సారస్యము న్గ్రోలినన్
పరమార్థం బుపలబ్ధమయ్యెనని
సంభావించె శ్రీకంఠు డు
త్తరరామాయణ రూపకంబున ;
విదగ్ధప్రాభవాలంకృతుల్
సరసుల్ సత్కవిపుంగవుల్ తమ
రసజ్ఞామోదము న్దెల్పఁగన్
పరితోషించి తలంచెద న్భగవతీ
ప్రాసాద భాగ్యంబుగా.

— వెల్దండ.

## సవరణలు - చేర్పులు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 4 | సరంభంబున | సంరంభంబున |
| 20 | 8 | కవితావనితా... | నిరాశ్రయా న శోభంతే పండితా వనితా లతా |
| 26 | 11 | పరిశీలించమని | పరిశీలింపుమని |
| 26 | 28 | హరిసర్వోపవాసం | హరిసరోపవాసం |
| 27 | 26 | నీపీమోక్ష | నీపీ మోక్షణ |
| 29 | 25 | అసంబద్ధవాదన | అసంబద్ధవాదము |
| 39 | 30 | యామునాచార్యునిముత్తాత | పితామహుడగు నాథమునికిఁ బ్రశిష్యుడు |
| 39 | 15 | పరాజ్ఞ్ముఖుడు | పరాఙ్ముఖుడు |
| 41 | 29 | యాటవ | యావట |
| 49 | 29 | కామియైగాని | కామిగాక మోక్షకామిగాఁడు |
| 57 | 6 | సాకవితా సావనితా | సా కవితా సా వనితా యస్యాః శ్రవణేన దర్శనే నాపి। కవి హృదయం, యువ హృదయం సరళం తరళం చ సత్వరం భవతి. |
| 57 | 2 | 'పదలాలిత్యము' | ఈ పద్యము కవిలోకబ్రహ్మ పెదపాటి సోమనాథ కవిది.<br>I చూ. నన్నిచోడుని కూమారసంభవము I-అ 40 పద్యము. కవిత మదనాగ తుల్యమట.<br>II చూ. ప్రౌఢకవి మల్లన రుక్మాంగద చరిత్ర I-అ 24 పద్యము. కవితవార వనితయట. |
| 65 | 2 | శైలి నాతికఠినము | శైలి యంత సరళముగాదు |
| 65 | 16 | 'ఆచార్యస్య' | ఆచార్యస్తు హరి స్సాక్షా స్చరరూపో |
| 66 | 28 | భహూభాషా | బహూభాషా నసంశయః |

| | | | |
|---|---|---|---|
| 83 | 8 | యోగరతోవా | యోగరతో వా భోగరతో వా। సంగరతో వా సంగవిహీనః (భజగోవిందం - 21) |
| 88 | 7 | నైఘంటిక పదాను యాయి యని రూఢి | నైఘంటిక పదానునయ నిరూఢి |
| 118 | 4 | ఇతరదేశ రాయబారులు | వైదేశికులగు రాయబారులు |
| 136 | 4 | రాజసాంద్రుడ | రాజచంద్రుడ |
| 142 | 18 | 'అభ్యుత్థాన మధర్మస్య' | అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ |
| 143 | 28 | రాజసాంద్రునకు | రాజచంద్రునకు |
| 144 | 23 | 'ముముక్షునక్తుడై' | మోక్షాసక్తుడై |
| 145 | 30 | ఉపాసనాశక్యము | ఉపాసన యశక్యము |
| 149 | 29 | కాంచన నేత్రము | కాంచనవేత్రము |
| 152 | 3 | ప్రాబల్యముగా | ప్రబలముగా |
| 153 | 7 | మల్లిఖార్జునుడు | మల్లికార్జునుడు. |
| 160 | 5 | యావృత్తి | యావృతి |

సరస్వతీ చతుర్ముఖాభ్యాం నమః

శ్రీరంగం బొక పుణ్యభూమి యనుచున్
శ్రీవిష్ణుచిత్తాత్మజన్
సరంభంబున పెండ్లియాడి విదపన్
సద్భృత్తునిన్ మోదమున్
పారావారమునందు తేల్చి మహిమ
ప్రాశస్త్యమున్ జూపు నా
శ్రీరంగేశుని సంతతంబు దలతున్
సిద్ధింప సంకల్పముల్.

"సహస్రాదిత్యసంకాశం
సర్వశత్రు నిబర్హణం
రామశక్తిమయమ్ ధ్యాయే
దమోఘం రామసాయకమ్."

# 1 తొలిమాట

శ్రీకృష్ణరాయల యాముక్తమాల్యదను పర్యాలోకనచేయుటకు మొదలాంధ్ర సాహిత్యచరిత్ర కొంతయరయుటత్యావశ్యకము. ఏలయన కృష్ణరాయని ప్రౌఢప్రబంధము సాంగోపాంగముగ జీర్ణించుకొనవలసివచ్చినప్పుడు సాహిత్యచరిత్ర తెలిసికొనుట ప్రశస్తము. ఆంధ్రసాహిత్య స్రష్టయగు నన్నయభట్టారకుడు పంచమవేదమనంబరగు వేదవ్యాసుని సంస్కృత మహాభారతమును నారాయణభట్టు, భారత మహాసంగ్రామమందు నారాయణు డట్లు సాయముచేయ కూర్చినాడు. గీర్వాణ సాహిత్యమునకు భిక్షపెట్టిన మహనీయుడు ప్రాచేతసుడు. ఆ మనీషివర్యుడే యాదికవి. అమ్మహామహుని కవితానిర్ఝరి రామాయణ మహాకావ్యమైనది. అయితే నన్నయ భట్టారకుని మహాభారత సంహిత మహాకావ్యము కాలేదు. ప్రప్రథమమున పౌరాణికయుగ మాంధ్రసాహిత్యమున ప్రారంభమయినది. తరువాత రెండుదశలు మారిన తరువాతగాని ప్రబంధయుగము రాదు. వాగనుశాసనుడగు నన్నయభట్టారకుడు సశేషముగా తెలుంగుబాస రచించిన మహాభారత సంహితను తరువాతివారగు తిక్కన, యెఱ్ఱనలు పూరించినారు. నన్నయ కవిత్వము సంస్కృత భాషాభూయిష్ఠమై, సమాసాడంబరముతో, పదగుంభనలతో, నుయ్యాలలూగించు శైలితో వెల్లివిరియుచున్నది. ఈ పౌరాణికయుగము తరువాత నాచనసోము డుత్తర హరివంశమను మహోత్కృష్టమగు కావ్యమును రచించెను. ఇతః పూర్వమే తిక్కన తాను వ్రాసిన భారతమును "ప్రబంధమండలి" యని పేర్కొన్నను నాతడు ప్రబంధకారుడు కాలేదను కొరత యతనిని బాధించుచునే యుండెను. తత్కారణమున నిర్వచనోత్తర రామాయణమును వ్రాసి యా కొరత తీర్చుకొనెను. ఇట్లు పూర్వోపోద్ఘాతమున్నను ప్రబంధధోరణికి నాందివేసినవాడు సాహిత్య రసపోషణ సంవిధానచక్రవర్తి బిరుదాంకితుడు నాచనసోముడే. ఎఱ్ఱన వ్రాసిన హరివంశముతో సంతృప్తిజెందక యుత్తర హరివంశమును రచించెను. ఉత్తర హరివంశమునకు పూర్వము పౌరాణిక యుగమునకు జెందును. మన సౌకర్యార్థ మాంధ్ర సాహిత్య చరిత్ర నీ క్రిందియుగములుగా విభజించుకొనవచ్చును.

| | |
|---|---|
| 1. పురాణకవిత్వ యుగము | 1000 — 1200 |
| 2. శ్రీనాథుని యుగము | 1200 — 1500 |

3. శ్రీరాయల యుగము 1500 – 1800
4. ఆధునిక యుగము 1800 – ?

పౌరాణికయుగము తరువాత శ్రీనాథుని యుగ మరుదెంచెను. దీనినే సంధి యుగమని కూడ నంద్రు. ఈ యుగమందే భాస్కరుడుకూడ వచ్చెను. ఆతడు రామాయణ మహాకావ్యము నాంధ్రీకరించెను. అయితే భాస్కరుని రామాయణము మక్కికి మక్కి యనువాదముమాత్రము కాదు. రామాయణ మందలి కథాసంవిధానము ప్రధానముగా మనమందిడుకొని రసవత్తర శైలిలో స్వచ్ఛందసరళిలో రచించినాడు. ఈ విషయము మున్ముందుకాని తేలదు. ఏలయన నీ భాస్కరుని రామాయణము మూలము ననుసరించి లేదనియే తరువాతి వారలగు శ్రీగోపీనాథ వేంకట కవీంద్రులు గోపీనాథ రామాయణము రచించిరి. అయితే దాని ప్రసక్తి మన కనవసరము. ఆంధ్రీకరణమునకు దారితీసి ప్రాణముపోసి యతి చతురతతో నెలకొల్పినవాడు శ్రీనాథ కవిసార్వభౌముడు. సహజపాండిత్య పోతనామాత్యుడు భక్తి వైరాగ్యముల మెప్పించిన మేటిఘనుడు. ఆతడే మహాభాగవతము నెల్లరికిని భావగతముగ నొనరించినాడు. శృంగారరసమును ప్రధానముగ మెప్పించినవాడు సకలవిద్యాసనాథుడు శ్రీనాథుడు. శ్రీనాథుని కవిత్వము సంస్కృతపద సమాస పదభూయిష్ఠమై యలరారుచున్నది. పౌరాణికయుగ కవిత్వము విషయప్రధానము; అనగా కథాసంవిధానమునకే యెక్కుడు ప్రాముఖ్యము, శ్రీనాథుని యుగమునుండి కవిత్వమందు రసప్రాధాన్యము, భావనాప్రాశస్త్యము ముఖ్యములు. శ్రీనాథుని శృంగారనైషధ మహాకావ్య మొక ప్రౌఢ ప్రబంధము. అయితే శ్రీహర్షుని గ్రంథానువాదమైనందున ప్రథమ ప్రబంధము కాలేదు. సంస్కృత మహాకావ్యమే తెనుగు ప్రబంధము. తరువాతిది ప్రబంధయుగము. ఆంగ్లసాహిత్యమందలి (Romantic Revival) మన ప్రబంధ యుగముతో సరిపోలును. ప్రబంధసాహిత్యమునకు నాంది శ్రీనాథుని శృంగార నైషధము. అనగా రెడ్డిరాజుల కాలమున శ్రీనాథుడు పురాణా ద్యనేకగ్రంథములనుండి కొన్నిభాగములను గ్రహించి వన్నెచిన్నెలు చేకూర్చి వాటిని కావ్యములుగా నల్లినాడు. ప్రబంధ సాహిత్యము విజయనగర ప్రభువుల యాస్థానమందే జనించినది; అందేవికసించినది; పరిణతి జెందినది. నన్నయభట్టు కాలమున రాజరాజనరేంద్రుని ప్రాపున గోదావరీతీరమందు వెలసిన సరస్వతి విజయనగర ప్రభువుల కాలములో తుంగభద్రాతీరమునకు తరలివచ్చినది. విజయనగర సామ్రాజ్య మవిచ్ఛిన్నముగా నున్నంతకాలము విద్యానగర రాజవీథులలో నాంధ్ర భాషామతల్లి లీలావిహారము

చేసినది. అందు కానాడున్న ప్రభువుల పోషణ, సాంఘిక వాతావరణము సర్వతో ముఖాభివృద్ధియే కారణములు. ఈ సందర్భమున విజయనగర సామ్రాజ్య చరిత్ర కూడ కొంతయరయు టవసరము.

విజయనగర సామ్రాజ్యము 300 సంవత్సరములు విరాజిల్లినది. బహమనీ రాజ్య సంస్థాపనతోపాటు మహమ్మదు తుగ్లక్ కాలమున హరిహరుడు బుక్కరాయ లను సోదరు లిరువు రీ విజయనగర సామ్రాజ్యమును తుంగభద్రాతీరమున స్థాపించిరి. దీనికొక చిన్న కథకూడ కలదు. అయితే ఆకథ చారిత్రకముగా ధ్రువ పడినదో లేక యైతిహ్యామో తెలియదు. కాని యది సమంజసమనియే తోచెడిని. మాధవ విద్యారణ్యు లఖండమగు తపస్సుగావించి లక్ష్మీదేవిని ప్రసన్నురాలిని జేసు కొని యామె ననంతధన మిమ్మని వరమడిగెను. అందుల కామె నీకు రాబోవు జన్మమందు లభించగలదని చెప్పెను. తనకోరిక యీడేరనందున నాతడు సన్య సించెను. సన్యసించినవెంటనే యతనికి లక్ష్మీకటాక్షము లభించినది, మాధవ విద్యా రణ్యులు సన్యసించినపిదప మధ్వాచార్యులైనారు. వారి కీ ధన మేమిచేయుటకుపాలు పోలేదు. సరిగా నదేసమయమున దక్షిణాపథమందు వైష్ణవమతము ప్రబలి యుండెను. అప్పుడు శ్రీమ ద్వేదాంత దేశికులకు మధ్వాచార్యులు తనవద్దనున్న ధనము గైకొనుమని సందేశమంపెను. అందుల కాతడు శ్రీరంగని పాదద్వయ ములే నాకు పెన్నిధియైయుండ సువర్ణము నా కేలయని నిరాకరించెను. అదే సమ యమున హరిహరుడు బుక్కరాయలు మధ్వాచార్యులవద్దకువచ్చిరి. మధ్వాచార్యులు హరిహరునిచేతను బుక్కరాయలచేతను తుంగభద్రాతీరమందు విజయనగర సామ్రాజ్యమును స్థాపింపజేసెను. అదియే విద్యానగరము. విద్యానగరమునుగూర్చి విపులముగా మరొకచోట చర్చింతును. విజయనగర సామ్రాజ్యమును నాలుగు వంశముల రాజులు పాలించిరి. అందు శ్రీకృష్ణదేవరాయలు తుళువ వంశమునకు చెందినవాడు. అతని కాలమందే యీ ప్రబంధయుగము ప్రారంభమయినది. కృష్ణ రాయలు రాజ్యమేలు కాలమునాటికి శత్రువులపోరాటములేక ప్రశాంతముగానుండెను. కృష్ణదేవరాయల సామ్రాజ్యము కటకమునుండి కన్యాకుమారివరకు పశ్చిమమున తుంగభద్రానది సరిహద్దుగానుండెను. అట్టి యాపదాంధ్రమేలిన కృష్ణరాయలకు దేశ మంతటను శాంతిభద్రతలు నెలకొన్నపిదప స్వభాషానురాగము పొటమరించినది. దేశభాషలపై నభిమాన మెక్కువయినది. మాతృభాషానురాగ మురకలెత్తినది. తేంఢ్లు సారస్వత ప్రియులై విద్వాంసులై మెలగినారు. విజయనగర సామ్రాజ్యమును కృష్ణరాయలు పాలించిన కాలము రెండు దశాబ్దములు. అయినను నింత స్వల్ప

కాలమందే తెలుగు భాషా పురోభివృద్ధికి మంచి యవకాశము లభించినది. కృష్ణ దేవరాడ్భూమీశానుడు గీర్వాణాంధ్ర కర్ణాటకభాషలం దఖండ పాండిత్యముగల ధిష ణాహంకారుడు. మంచికవి. సంస్కృతమున సత్యావధూ ప్రీణనము, రస మంజరి, జాంబవతీ పరిణయము నాదిగాగల గ్రంథములు వ్రాసిన మేటి ఘనుడు. కృష్ణరాయలు రెండుదశాబ్దములుకూడ నరిరాజ భయంకరుడై, నిజ ప్రజానురంజ కుడై, యమానుష మహాసత్వాఢ్యుడై, పండితజన కమలాకర ప్రభాకరుడై, సాహిత్య ప్రియుడై యలరారెను. ఆ సార్వభౌముని బృహత్ప్రబంధముపై ప్రస్తుత విమర్శ. ఇట్టి విద్వత్కవులు సార్వభౌములై సరస సంస్కృతాంధ్ర శృంగార భక్తికావ్య రసైకలోలు రయినప్పు డాంధ్రభాషాసాహిత్యముల కేమికొదువ ? అప్పుడే కృష్ణ రాజేంద్రుడు తనదేశమం దంతటను

తెలుగదేలయన్న ? దేశంబు దెలు గేను
దెలుగు వల్లభుండ, తెలుగొ కండ
యెల్ల నృపులు గొలువ నెఱుగవే బాసాడి
దేశభాషలందు తెలుగు లెస్స.

యని యుచ్చైస్స్వరముతో నవయుగ వైతాళికుడై చాటించినాడు. శ్రీరాయల యుగమునకు కావ్యప్రబంధ కవిత్వ యుగమను నామాంతరముకూడ కలదు. ఆంధ్ర సాహిత్య చరిత్రలో కృష్ణరాయలయుగ మొక సువర్ణయుగము. కృష్ణరాయల యాస్థానమం దష్టదిగ్గజము లనబరగు నెనిమిదిమంది కవీశ్వరులుండుట జగద్విది తమే. ప్రజా సామాన్యముగూడ సారస్వతమే యాహారముగ గ్రహించుచుండెను. కృష్ణరాజేంద్రుని యాస్థాన మలంకరించిన యాంధ్ర కవితాపితామహుడగు నల్లసాని పెద్దనామాత్యుని మనుచరిత్ర ప్రథమ ప్రబంధము. ఆ వరుసనే కొన్ని ప్రబంధ ములు వెలసినవి. అవి మహోత్కృష్టము లనదగినవే. ఇంక ప్రబంధములనుగూర్చి ప్రశంసాలేశము:

సంస్కృత మహాకావ్యశబ్దమునకు పర్యాయపదము ప్రబంధము. అయితే సంస్కృతమందు మహాకావ్యములు వెలువడినవి. ఆంధ్రమందు ప్రబంధములు వెలువడినవి. మహాకావ్య లక్షణములే ప్రబంధ లక్షణములైనవి. ప్రతాపరుద్రీయ మందు మహాకావ్య లక్షణము లీ విధముగా నున్నవి.

నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనం
ఉద్యాన సలిలక్రీడా మధుపాన రతోత్సవాః

విప్రలంభో వివాహశ్చ కుమారోదయ వర్ణనం
మంత్రద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయా అపి
ఏతాని యత్రవర్ణ్యంతే తన్మహాకావ్య ముచ్యతే
ఏషామష్టాదశానాం యైః కైశ్చిదూనమ పీష్యతే.

పౌరాణిక యుగమునన్న గతిని విషయ ప్రధానముగాక యిందు రసభావములు రెండు ప్రధానములు. చిన్న విషయము నితివృత్తముగా గైకొని దానికి నిర్దిష్టమైన 22 వర్ణనలు సందర్భోచితముగా కూర్చి యేడెనిమి దాశ్వాసములతో కావ్యము వ్రాయుట. సంస్కృతమందలి సర్గలు తెనుగున యాశ్వాసములయినవి. అయితే యీ ప్రబంధేతివృత్తమల విషయమై వసుచరిత్రకారుడగు రామరాజభూషణుడు "కేవల కల్పనాకథ"లను పద్యములో వివరించినాడు. పౌరాణిక కథలు వావిరిపుట్టు రత్నములు. కేవల కల్పనాకథలు కృత్రిమ రత్నములు. ఈ రెండింటిని సమ్మేళనము చేసి సానలదీరిన జాతిరత్నములుగా చేసిన యది ప్రబంధమగును. అల్లే తదను యాయు లాయన యడుగుజాడలలో మెలగినారు. ఈ విషయ మట్లుండనిచ్చి విజయ నగర సామ్రాజ్యమును గూర్చి ప్రశంసాలేశము:

విజయనగర సామ్రాజ్యమునకురెండు రాజధానులుండెనని చెప్పవచ్చును. మొదటిది విద్యానగరము. తుంగభద్రా తీరమందున్న ప్రస్తుత హంపీ క్షేత్రము. రెండవది పెనుకొండ. ఈ రెండు రాజధానులనుగూర్చి కొంత తెలుసుకొనినకాని విజయనగరాస్థాన మలంకరించిన యష్టదిగ్గజముల ప్రబంధములలో నిర్దేశించిన వర్ణనలు, ఘట్టములు కొన్ని యర్థము కానేరవు. మొదట పెనుకొండను గూర్చి ప్రస్తావింతును.

రాయలసీమ రత్నాలసీమయని యనాదినుండి సుప్రసిద్ధము. ఈ రాయలసీమ యని పేరువచ్చుటకు కారణము కృష్ణదేవరాయాది భూమీశానను లా నేల నేలు టయే యయియుండనోపు. పెనుకొండకును కృష్ణరాజేంద్రుని పాలనమునకు నవినా భావ సంబంధము కలదు. ఈ విషయమును "దేశభాషలందు తెనుగు లెస్స" యను పద్యపాదమందు ఘంటాపథముగ శాసించి కృష్ణరాయలు సువర్ణాక్షరములలో లిఖించినాడు. శత్రుభయము లేనందున ప్రజలు కడుపులోచల్ల కదలకుండ శాంతి సౌఖ్యముల ననుభవించుచుండిరి. షడ్రసోపేతమగు భక్ష్య భోజ్య చోష్య లేహ్యముల కడుపార ననుభవించుచు, సరససల్లాప సాహిత్య విద్వద్గోష్ఠులతో, విజయనగర పౌరులు భూతలస్వర్గ మనుభవించుచుండిరి. ప్రశాంత సమయమున సాహిత్య చర్చలే జరుగుచుండెను. అట్టియెడ సాహిత్యముపై నెక్కువ మోజనిన తప్పేమి?

కృష్ణరాయలు భోజునివలె కవియై కవిపండిత ప్రకాండుల నాదరించినాడు. ప్రబంధ రచనకు వాతావరణము కల్పించిన దీ పెనుకొండ కొండయే. కృష్ణరాయలు తాను రాజ్యమేలు కాలమున విజయనగర సామ్రాజ్యమునకు రెండు రాజధాను లేర్పాటు చేసికొని యాయా కాలములందు నివసించినాడు. మొదటిది పెనుకొండ. రెండవది విద్యానగరము.

ప్రస్తుతపు పెనుకొండ యనంతపురము జిల్లాలోని తాలూకా మాత్రమే. దూరముగ నున్న కొండలే యీ పెనుకొండకు హద్దులుగ నుండెననియు, 365 దేవాలయములు కూడ గలవనియు నచ్చటి వాస్తవ్యులు నొక్కి వక్కాణింతురు. ఇప్పటికి నా దేవాలయముల శిథిలములు సుస్పష్టముగా గాన్పించుచు యాగంతుకున కొక్కు మ్మడిగా పూర్వ స్వరూపమును స్ఫురింపజేయుచున్నవి. కొన్ని కాల గర్భమున సంపూర్ణముగ జీర్ణించిపోయినవి. మరికొన్ని మండపములపై మసీదులు వెలసినవి. రాయలసీమ యందలి సుప్రసిద్ధ కవిసత్తముడగు శ్రీమాన్ కుంటిమద్ది శేషశర్మగా రీ విషయము నీ పద్యములో వర్ణించినారు.

హైందవశిల్ప నైపుణము లచ్చునబోసినయట్టు లొప్పి యా
నంద నిదాన ముక్తిలలనాప్తికి మార్గము సూపు దేవతా
మందిర మేమి చెప్పుదు, నమాంతముగా మటుమాయమైన గో
విందుడు, తాను హైందవము వీడి మసీదుగ మారె నక్కటా !

తురుష్క ముష్కరులవలన కలిగిననష్టము చెప్పనక్కరలేదు. ఈ దేవాలయములో పూర్వము ప్రతిదినమొక్కచో భగవత్కల్యాణములు జరుగుచుండెను. అనగా సంవత్సరమంతయు తప్పనిసరిగా ప్రతినిత్యము క్రమముదప్పక నాధ్యాత్మిక వాతావరణ మెల్లెడల వ్యాపించియుండెను. ఈ యుత్సవములకు రాజేంద్రుడు తా నున్న కాలములో తప్పక వేంచేయుచున్నాడు. ఈ దేవాలయములం దీ విధముగా జరుగు నుత్సవముల కగు వ్యయ మసంఖ్యాకముగా నా పురిలోనున్న వారవిలాసినీబృంద ముపై విధించెడి విలాసపుపన్నుతో సరిపోవుచుండెను. (ప్రస్తుత మీ విలాసపుపన్ను విధించుపద్ధతి బొంబాయిలోకలదు.) దానివలన నానాటి వారాంగనల సంతోషాంబుధి నోలలాడించు విలాస పురుషుల, భోగలాలసుల సంఖ్య నూహింపవచ్చును. కుప్పతిప్పలుగానున్న మల్లెపూబందిరు లసంఖ్యాకములు. ఇప్పుడు సరియగు పోషణలేక కొన్ని గతించినవి. కొన్ని కృష్ణరాజేంద్రుని స్మరించుచు నిట్టూర్పులు నిగిడించుచున్నవి; యాతాయాత పథికుల దృష్టి నాకర్షించుచున్నవి.

పెనుకొండయని పేరువచ్చుటకు కారణ మచ్చట నుండు పెద్దకొండయే. తూర్పుదెసనున్న మరొక కొండపైనుండి తిలకించిన యాజానుబాహువగు మను జుడు నిదురించినట్లుండును. అతడే వసుచరిత్రకారుని కోలాహలుడు. దానిచెంత నున్న ముత్యాలచెరువే శుక్తిమతీనది. వసుచరిత్రమును, చరిత్రలోని సన్నివేశము లా కొండయందలివే. ప్రబంధ వాతావరణము కొంతవర కాకొండకు సంబంధించి నవే. వసుచరిత్రలోని దేవాలయ మీ కొండయందలిదే. దట్టమగు గిరిమొల్లల చేతను, పరిమళించుచున్న సంపెంగ కుసుమములతో నీ కొండ యలరారుచున్నది. ఈ కొండయం దచ్చటచ్చట గుప్త ప్రదేశములు, గుప్తద్వారములు కన్పించుచున్నవి. విజయనగర సామ్రాజ్యముపై తురుష్కులు దండెత్తివచ్చినప్పుడు వారి దృష్టిని తప్పించుటకుగాను యేడుపందల యొంటెలపై సువర్ణ మచ్చటికి వచ్చినదనియు యది యా గుప్త ప్రదేశములందే భద్రపరచబడినదని ప్రతీతి. అచ్చట భూగర్భము లోనికి చొచ్చుకొనిపోవు నీ గుప్త ప్రదేశములను సూచించు బొగ్గు గీతలవలన యీ విషయము కొంత స్పష్టముగా తెలియవచ్చును. ఇది ప్రబలతార్కాణమని యొప్పుకొనక తప్పదు. ఇందు సువర్ణ ముండినదనియే కొందఱు స్థానికవ్యక్తు లీ ప్రదేశమందు త్రవ్వగా వారికి మంచి శాస్తి జరిగినది. ఈ కొండయందు స్థానే స్థానే మంచి గచ్చుచేసిన యిండ్లుగలవు. రాత్రులందు భయంకర మృగముల రోష భీషణ గర్జనలనుండి తలదాచుకొనుట కేర్పరచబడినవి. ఈ కొండలయందు కొన్ని జలాశయములున్నవి. ఇందలి నీ రతిస్వచ్ఛముగా నుండుటేగాక యతి శీతలముగా నుండుటచే "అతి స్వచ్ఛతాస్పర్శానుమేయం హిమజడం" అను బాణునివర్ణన జ్ఞప్తికి తెచ్చుచున్నది. ఇం దొక నృసింహస్వామి యాలయ మున్నది. దీని కిప్పటికిని వారమున కొకమారు దేవతార్చనలు జరుగుచున్నవి. ఈ కొండయం దెత్తైనభాగ మొండు కలదు. దానిపైనుండి చోరులను వారివారి నేరములను నెల్లరకు తెల్లమగు నట్లు తెలుపుచు శతథాభిన్నమగునట్లు విసరివైచుచుండిరట. ఇది కొంత యమానుష మగు శిక్ష యనిపించినను దీని ఫలితముగ నందఱికి భయము కలుగుటచే చౌర్య ములు తగ్గుచుండెను. ఈ కొండ క్రింద నెల్లెడల దానిమ్మపొదలు, ద్రాక్షావృక్షము లును గలవు. ఈ కొండపైన వర్షాకాలమున మేఘ గర్జనల కలరి నృత్యముచేయు భుజంగభుగ్నిచయ క్రేంకారములు సుస్పష్టముగా విననగును. ఈ కేకారావములు యాతాయాత యాత్రికుల నాహ్వానించినట్లుండును. ఈ కొండ ప్రక్కనే చిన్న కొండ మరొకటి కలదు. ఈ రెండుకొండల మధ్య నున్న యంతరమే పెద్దనాదులు వర్ణించిన కోన. ఇచ్చట నిల్చి త్ర్యక్షరశబ్ద ముచ్చరించిన ప్రతిధ్వనించును. ఈ

పెద్దకొండ పైన రెండు గుప్తద్వారములున్నవి. మొదటిది పెనుకొండక్రింద నున్న గగన మహలులోనికి, రెండవది తుంగభద్రాతీర మందున్న విద్యానగరమునకు (ప్రస్తుత హంపీ శిథిలములకు) పోవును. రెండవ గుప్తద్వార మొంటెలపై మనిషి సవారిచేయుచు పోగల వెడల్పుగలదిగా నున్నది. అయితే యిప్పుడివి వాడుకలేనందున దుర్గంధపూరితములై సామాన్యముగా చొరశక్యముగాకున్నవి. ఇట్టి వింకెన్నియో యున్నవనియందురు. కాని వాటిని గుర్తించుట దుస్తరము. రెండవ గుప్తద్వారము సరిగా హంపీలో నున్న మరొక గుప్తమార్గము నుండి రాజమహలునకు పోవును. కాని నా మతమున యీ పెనుకొండ గుప్తద్వారము కొన్ని మైళ్లతర్వాత బయలుగా మారి, మరల హంపి దగ్గరగా నున్న మరొక గుప్తమార్గము లోనికి చొచ్చుకొనిపోవునని తలంతును. ఏలయన వందలాదిమైళ్లు వెలుతురు, గాలిసోకని ప్రదేశములో ప్రయాణముచేయుట కష్టసాధ్యము. ఈ పెనుకొండకు చొరశక్యము గాని దుర్గమొండుండెడిది. అయితే యిప్పుడు దాని నామమాత్రావశిష్టమగు శిథిలములుమాత్రమే కలవు. కోటగోడకూడ కలదు. పూర్వ మీకోటకు శత్రువులదాడులకు రక్షణగా మంత్రపూతము గావించబడిన శక్తులచే రక్షింపబడు ద్వారములుండినవి. కాని కొంతకాలమున కా మహిమ వెడలిపోయి, యిప్పుడాకోట శిథిలమైపోయినది. ఈ పెనుకొండ యందు పెద్దగొట్టము లచ్చటచ్చట గాన్పించుచున్నవి. శత్రువులు దండెత్తివచ్చు కాలమున దాడుల సూచించు Fire alarms గా వీని నుపయోగించుచుండిరి. అనగా నొకటి ముట్టించగా నొక్కదాని వెంట మరొకటి చొప్పున విజయనగర సామ్రాజ్యమం దంతట ముహూర్తములో శత్రువుల దండయాత్ర సూచింపబడుచుండెను. ఎల్లరును సంసిద్ధులై మాతృదేశానురాగ మినుమడింప శత్రువుల నెదుర్కొని వారిని చెల్లాచెదరు గావించుచుండిరి. ఇట్టి వింకెన్నియో విశేషములు గలవు.

ఈ కొండ ప్రక్కనే మరొకగుట్ట కలదు. దీనిని వీరన్నగుట్ట యని హిందువులు, బాబయ్య గుట్ట యని ముసల్మానులు పిల్చుచుందురు. ఇట్లనుట కట రెండు పాద చిహ్నములు కలవు. ప్రతి చైత్రమాసమం దుత్సవములు జరుగును. అఖిల భారతదేశము నలుమూలల నుండియు ముసల్మానులు తండోపతండములుగా వచ్చి యీ యుత్సవములందు పాల్గొనుచుందురు. ఈ గుట్టయం దత్యద్భుత జలాశయములు రెండు కలవు. ఆ జలాశయముల కిరుప్రక్కల బాగుగా గచ్చుచేయబడినది. ఇందుండు జల మతిశీతలమై యీ గుట్టయందుండు వారల కొక సంవత్సరమువరకు సరిపోవును. "ఉరుదరీకుహర సుప్తోత్థ శార్దూలముల్ ఘురవారి శోణితశంక ద్రావ"

అను పెద్దనార్యుని పద్య పాదమునకు సరియగు వృక్ష్యమీ జలాశయ తీరమున కలదు. అచ్చట పరుండిన శార్దూలములకు కలిగిన యనుభవమే యది. ఈకొండపై నుండి క్రిందికి పోవుటకు గుప్తద్వారము మరొకటి కలదు. అయితే యిది కోన లోనికి పోయి, యచ్చటి నుండి ముఖ్యమగు పెద్దకొండ వెనుక నున్న మార్గములో కలియును. ఇదియును వాడుకలేమి దుర్గంధభూయిష్ఠ మైయున్నది. ఈ గుట్టప్రక్కనే కాలువ యొకటి కలదు. అది యానాడు పెన్నానదీ జలమును గొనివచ్చుట కుద్దేశించిన మార్గమని చెప్పుదురు. వర్షించి కట్టుకాలువ వచ్చినప్పు డా లోయలో నుండి వెడలి వీచు మందమారుతపరంపర కేవల మనుభవైకవేద్యమేగాని వేఱొండుగాదు.

ఈ పెనుగొండలో బావు లత్యంత గభీరములు. ఈ గభీరతనుగురించియే యచ్చటి స్త్రీలు (పితంతువులు) కన్నడభాషలో మోటు సామెతయొకటి చెప్పుకొను చుందురు. ఆ సందర్భమును శ్రీకృష్ణరాయలు కొన్ని పద్యములలో చక్కగా వర్ణించినాడు. ఇవిగాక మంచినీటి తటాక మొండుగలదు. జల మత్యంత రుచికర ముగా నుండుటచే దూరముగానున్నను జను లీ తటాకవారి పూరములను వాడుదురు. సాయం సమయమున నా తటాకతీరమున నెందరెందరో యువకులు చతుర్ముఖ పారాయణమో, కాక నితంబినీజనముఖవిలాసవీక్షణమో, భావ గీతముల నాలాపన జేయుచు, కూనిరాగములు తీయుటో సలుపుచుందురు. కుప్పతెప్పలుగ నున్న సంపెంగపూల వాసనలతో, వికసించిన గిరిమల్లెల పరిళముతో నా తటాక తీర మలరారుచుండును. దాని నచ్చటినివాసులు పెనుకొండ బీచి యని తృప్తిపొందు చుందురు. నీలాటిరేవున కరుదెంచు విలాసవతుల కులుకు బెళుకులనుకూడ తిలకించుటకే యసంఖ్యాకులగు యువజను లరుదెంతురు. పెద్దనార్యుడు వర్ణించిన మావులు ద్రాక్షగుళుచ్ఛంబు లా తీరమున పెక్కు కలవు. ఇట్టి ప్రకృతి సౌందర్యమున కాటపట్టగు పెనుకొండ పెద్దనాదుల ప్రబంధమునకెక్కుటకు సందియమేమి? అచ్చటి భావవిభూతిని, ప్రకృతి సౌభాగ్యమును, భావగత మొనరించుకొని, జీర్ణించుకొని, పొంగిపొరలివచ్చు సంతసము నణగద్రొక్కలేక యుచ్చైస్స్వరమున నాటి కవు లాంధ్ర సరస్వతిని కీర్తించినారు. అచ్చట హెచ్చుగానున్న పల్లేరు చిగిరింత కూడ ఆముక్తమాల్యదా గ్రంథస్థమయినది. పెనుగొండను గూర్చి పరిశోధన చేసినవారు సంగీత సాహిత్యమూర్తులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు. వారి రాయలనాటి రసికత మరిం కెన్నియో విశేషములు వివరించును. యాత్రిక మర్యాదతో రెండువేల మైళ్ళు ప్రయాణముచేసి. గీర్వాణ సాహిత్యాభ్యాసమునకై యీ పెనుగొండచేరి యందొక్కబ్దమొక సాహిత్యాచార్యుని సేవించు భాగ్యము లభించి

నందున పైవిశేషములన్నియు ప్రత్యక్షముగాచూచి వివరించు నవకాశముకలిగినది. ఇట్టి యవకాశమే హంపీ సందర్శనమునకు కారణ భూతమయినది. ఇక హంపిని గూర్చి ప్రశంసాలేశము.

విద్యానగరమే విజయనగర సామ్రాజ్యమునకు రాజధాని. ఆ విద్యానగరము ప్రస్తుతము తుంగభద్రా నదీతీరమున జీర్ణ హంపీక్షేత్రమున కనతిదూరమున నుండెడిది. హంపికూడ విద్యానగరమంచలి భాగమే. కాని కాలగర్భమున జీర్ణమైపోయి మిగిలిన వీ హంపీశిథిలములే. హంపి పూర్వవైభవములు రాజప్రాసాదము లాముక్తమాల్యదా గ్రంథ సమన్వయమునకు దోడ్పడును. హంపిని గూర్చి లాంఘర్స్టు అను నాంగ్ల చరిత్రకారుడు విరివిగా వర్ణించినాడు. Swell కూడ తన 'విస్మృతసామ్రాజ్య చరిత్ర' మందు హంపీ శిథిలములనుగూర్చి బహుళముగా చర్చించినాడు.

భర్తృహరి కాలప్రశంసచేయుచు 'సర్వం యస్య వశాదగాత్ తస్మై కాలాయ నమః' యని కాలమూర్తికి నమస్కార మాచరించినాడు. ఈ కాలమే సామ్రాజ్యము తారుమారు గావించినది. తత్ఫలితముగా కొన్ని సామ్రాజ్యములు విస్మృత సామ్రాజ్య శ్రేణిలో చేరినవి. 'విస్మృత సామ్రాజ్య'మను పేరిట స్వెల్ వ్రాసిన చరిత్ర గ్రంథము విజయనగర సామ్రాజ్యము నుద్దేశించి వ్రాసినదే. విద్యానగరము ప్రస్తుతపు విజయనగరము కాదు. హంపీ విరూపాక్షమువద్ద నుండిన ప్రస్తుత కుగ్రామము మాత్రమే.

హంపి హోసపేటకు పదిమైళ్ళదూరములోకలదు. వీటి రెంటికి మధ్య కామలాపుర మనుగ్రామ మొకటికలదు. ఇందు తుంగభద్రా నదీజలముచే పారుదలగుచున్న భూములుగల వైష్ణవస్వాము లున్నారు. వీరు సామాన్యముగ నచ్చటికివచ్చు నాగంతుకుల కందరి కాతిథ్యమిచ్చుచుందురు. హంపి విజయనగర రాజన్యులకు చలికాలపు రాజధానిగా నుండెను. పెనుకొండ వేసంగి రాజధాని. కొందఱు పాశ్చాత్య యాత్రికులు కృష్ణరాయల కాలమున విద్యానగరమును సందర్శించి రోము నగరమునకన్న పెద్దదని వర్ణించినారు. తుంగభద్రా నదీజలముల గలగలతో, కమ్మని పిల్లతెమ్మరల ప్రభావముతో హంపి యెల్లర నాకర్షించుచున్నది. విజయనగరచరిత్రకొరకే కాక పితృవాక్పరిపాలనార్థము దండకాటవి కేగి ప్రియురాలింబాసి యామె నన్వేషించుచు నీప్రదేశమున కరుదెంచి హంపి కనతిదూరమున నున్న పంపాసరోవరమువద్ద హనుమత్సహాయమున సుగ్రీవుని మైత్రిని సాధించి రావణ సంహారమునకు వలసిన సాధన సంపత్తిని సేకరించెను. ఇప్పటికిని పంపాసరోవరము, కిష్కింధ చక్కగా కన్పించుచున్నవి. వాల్మీకి హృదయ గహ్వ

రమునుండి వెలువడిన రామాయణమం దభివర్ణింపబడిన శ్రీరామచంద్రు డీ తుంగ భద్రాతీరమున కోదండరామస్వామియై వెలసినాడు. వాలిని సంహరించిన స్థలము కూడ కన్పించును. ఏలనన నొక శిలపై బాణము ననుసంధించు సమయమున నుండు పాదద్వంద్వ స్వరూపము చక్కగా చిత్రించబడియున్నది. శబరి శ్రీరామ చంద్రుని సేవించి జన్మరాహిత్య మొందిన దీ ప్రస్థలముననే. ఈ స్థలమున గ్రుమ్మరుచున్న సమయమున ప్రతి యాగంతుకున కేదో యద్భుతానుభూతి కలు గును. ప్రస్తుతము కంటకావృతమయిన రాజమార్గము లిప్పు డీ దశావిశేషమునకు జెందిన గతి స్మృతిపథమునకు వచ్చినప్పు డాహృదయము పులకాంకితమగును. రామాయణమందు వాలికి సంబంధించి వర్ణించబడిన మతంగపర్వతము, ఋశ్య శృంగపర్వతము, హేమకూటము మొదలగున వీ ప్రదేశమున నున్నవే.

హంపీలో రెండు పెద్ద దేవాలయములు కలవు. మొదటిది కోదండ రామ స్వామి యాలయము, రెండవది విరూపాక్షస్వామి యాలయము. దీని యధి దైవము హంపీ విరూపాక్షస్వామి. ఇప్పటికిని దినేదినే యీ దేవాలయములలో సక్రమముగా నర్చనలు జరుగుచుండును. విశేషముగా చైత్ర పూర్ణిమకు విరూ పాక్షస్వామి యాలయమునకు సంబంధించిన జాతర జరుగుచుండును. కోదండ రామస్వామి యాలయమున కిట శరన్నవరాత్రులలోను చైత్రమాసమందును రామాయణ పారాయణము జరుగుటేగాక యత్యంత వైభవములతో భోగములు జరుగుచుండును. వేలాదియాత్రికు లీ విరూపాక్షస్వామి జాతరకు వత్తురు. విరూ పాక్షస్వామి గొప్పరథము నొకదానిని అలంకరించి యందుత్సవ విగ్రహమును భక్తుల జయజయ ధ్వానములతో నూరేగింతురు. ఈ కోదండ రామస్వామి యాల యమువద్దనున్న తుంగభద్రా తోయము లంత స్వచ్ఛమయినవి కావు. దీనినే చక్ర తీర్థమనికూడ పిలుతురు. ఇట్లు పేరు వచ్చుటకు కారణము తుంగభద్రానది వలయా కారముపొంది చిందరవందర పథ మనుసరించి ప్రవహించుటయే. ఈ వలయాకార పథ మనుసరించుటచే నందందున్న జీర్ణపత్రములు వ్రాలి నీటికొక నీలిమను సృజించినవి. ఈ జలములు విశేషముగా ద్రావిన మలేరియాజ్వరము సంసిద్ధ మగును.

ఈ క్షేత్ర ప్రాముఖ్యమే మన విజయనగర సామ్రాజ్యమున కొక యంగ రక్షగా నుండినది. ఆనాటి రాజన్యు లనగా కృష్ణరాయలవరకు వారు చేసిన యన్ని దానములు "విరూపాక్షస్వామి ప్రీత్యర్థమ్ కరోమి" యని చేయుచుండెడివారు. మాధవ విద్యారణ్యులు స్థాపించిన విజయనగరసామ్రాజ్య మిచ్చటనే. హరిహరుడు

బుక్కరాయలు తమ గురువగు మాధవ విద్యారణ్యుని యాజ్ఞ నమసరించి తమ సామ్రాజ్యము నీ తుంగభద్రా తటమందే పాలింపదొడగిరి. ఈ క్షేత్రమును దర్శించునప్పు డప్పటి వైభవమంతయు కన్నులకు గట్టినట్లుండును. కాలగర్భమున నా వైభవమంతయు జీర్ణమై నామమాత్రావశిష్టముగా హంపి యీనాడు వెలవెల బోవుచున్నది. ఈ విషయమును శ్రీ కొడాలి వెంకటసుబ్బారావు తన హంపీక్షేత్ర కావ్యమందు

శిలలు ద్రవించి యేడ్చినవి జీర్ణములైనవి తుంగభద్రలో
పల గుడిగోపురంబులు సభాస్థలులైనవి కొండముచ్చు గుం
పులకు చరిత్రలో మునిగిపోయిన దాంధ్ర వసుంధరాధిపో
జ్జ్వల విజయ ప్రతాప రభసం బొక స్వప్నకథా విశేషమై.

యని విలపించినాడు. హంపీ క్షేత్రము సందర్శించిన ప్రతి సహృదయుని కిది యనుభవసిద్ధమే.

హంపిలో సందర్శించవలసిన విలాసము లెన్నియో కలవు. ప్రప్రథమమున కృష్ణరాయల తులాభారము. రెండుపెద్దశిలల కొక పెద్దతూనిక వ్రేలాడుచుండెడిది. అయితే యిప్పుడున్నవా రెండు శిలలే. ఈ తులాభారమందు శ్రీకృష్ణునివలె కృష్ణ రాయ లొకవైపు తన దేవేరులతో తూగెడివాడు. ఇట్లు చేయుటకు కారణము లేక పోలేదు. శ్రీకృష్ణుని తులాభారము జగద్విదితమే కదా ! అట్టియెడ ముక్కుతిమ్మన్న పారిజాతాపహరణము శుద్ధాంత నితంబినీజనముచే ప్రభువులకు కల్గిన యవమాన పరిహారమునకే వెలువడినదనుట విద్వజ్జన విదితము సమ్మతమే కదా. శ్రీకృష్ణ తులాభారము మనకు పరోక్షము, కృష్ణరాయుల తులాభారము ప్రత్యక్షము.

ఈ తులాభారమున కనతిదూరములోనే విఠలేశ్వరాలయమున్నది. ఈ దేవా లయమందు ప్రాచీన శిల్ప మెంతో రమణీయముగ నున్నది. అయితే పూజావిధులు లేక పాడుబడి పల్లేరుగాయలతో బ్రహ్మరాక్షసి పొదలతో కంటకావృతమైయున్నది. ఈ దేవాలయమందు రమణీయమగు రాతి రథ మొండు కలదు. ఈ రాతి రథము చూడ సొంపుగా నున్నది. ఈ రథ మాకారమున చిన్నదై ముద్దులు గులుకుచున్నది. దీని కిరుప్రక్కల నొక్కొక్క రాతియేనుగు కలదు. ఈరథమంతయు నొకే రాతితో నిర్మింపబడిన ట్లగపడును. ఏలయన నెచ్చట నతుకులు గానిపించవు. శిల్ప మంతటా వ్యాపించియున్నది. అతికినట్లున్న నచ్చటచ్చట రాయి విరిగినదని చెప్పుట కవకాశముండెడిది. ఈ రథమునకు బలిష్ఠమైన రాతి యిరుసులు కలవు. అచ్చటికి వెళ్లి విఠలేశ్వరాలయము సందర్శించు యాత్రికులా తేరిచక్రములు త్రిప్పు

చుందురు. యట్లు చేయుటవల్ల సుకృతము లభించగలదని వారి యాశయము. యాతాయాత యాత్రికు లీ చక్రమును త్రిప్పుటచే నా రాతి యిరుసు లోరవడిమూలముగా సన్నగిల్లినవి.

ఈ విఠలేశ్వరాలయ చరిత్ర చాలా పెద్దది. కృష్ణరాజేంద్రుని కాలమున నీయాలయ నిర్మాణము ప్రారంభమైనను దాని నిర్మాణము పూర్తికాలేదు, తరువాత తరువాత తళ్లికోట యుద్ధమున తురుష్కముష్కరులచే విజయనగర సామ్రాజ్యమంతరించినది. నిర్మాణము పూర్తిగాకున్నను గర్భగుడి మొదలగునవి కృష్ణరాయల కాలంలోనే. ఈ విఠలేశ్వర దేవాలయము వద్దనే మరొక దేవాలయమున్నది. కాని పేరు తెలియదు. శిథిలమైనది.

ముఖ్యమైన దేవాలయములలో నుగ్రనారసింహ మొకటి. ఈ దేవాలయము కూడ శిథిలమైనది. ఆచ్ఛాదన లేనందున సూర్యచంద్రులు తాండవమాడుచుందురు. ఈ నృసింహమూర్తి కడు భయంకరముగా నుండుటచే యుగ్రనారసింహుడని పిలుతురు. ఈ దేవాలయ మహోబిల నారసింహాలయమును జ్ఞప్తికి తెచ్చుచున్నది. ఈ విగ్రహ మిరువదిరెండడుగుల యెత్తు గలదు. కాని తురుష్కముష్కరులు రణక్రీడా విజృంభణమున దానిని వికలాంగము గావించినారు. ఇట్టి విగ్రహములు కల దేవాలయము లనేకము గలవు. ఇందు కొన్ని నామరూపములు లేకుండ పోయినవి. కొన్ని జీర్ణములయి భూగర్భమున ప్రచ్ఛన్నమై శాశ్వతసమాధి నొందినవి. ప్రస్తుతము మంచిదశలో నున్న రెండు దేవాలయములు మొదటనే వర్ణించితిని. ఈ రెండు దేవాలయములను దైవమే రక్షించుచుండునట్లు తోచెడివి. ఏలనన ఇందు దివ్యత్వ మున్నది. ఈ పరిసరముల పర్యటించి, ప్రతి ప్రయాణికునకు కొంత దివ్యానుభూతి, యచంచలాత్మ విశ్వాసము కలిగినటులే కాక యాధ్యాత్మిక వాతావరణములో మెలగినట్లుండును. అందుకు కారణము వామలూరు తనయుడు చిత్రించిన శ్రీరామచంద్ర సార్వభౌము డీ ప్రదేశములలో రామానుజ సమేతుడై సీతాన్వేషణకై వచ్చి కొంత కార్యసాధనపొందిన పుణ్యభూమి హంపి. ఆ చరిత్ర మిప్పటికిని వర్తమానము వలె స్ఫురించును. రెండవ కారణ మేమన, విజయనగర సామ్రాజ్యము కటకము నుంచి కన్యాకుమారి వరకు వ్యాపించి యుండినది. ఇంత విస్తృతమైన విజయనగర సామ్రాజ్యమునకు తుంగభద్రా తటమందు వెలసిన హంపీ విరూపాక్షస్వామి, కోదండ రామస్వామి వికుంఠాపురి నున్న జయ విజయుల పగిది సంగరక్షకులైనారు. అయితే కాలమూర్తిప్రభావము వల్ల అన్ని సామ్రాజ్యముల వలెనే విజయనగర సామ్రాజ్యము కూడ నంతరించినది,

ఆకాలమున నేడున్న సర్వసౌకర్యము లందుండెననుట కెన్నియో నిదర్శనములు గలవు. గచ్చుచేసిన సభామంటపములు, రహదారు లుండినవి. ఏనుగు మొగసాలలు నైత మాగంతుకుల దృష్టి నాకర్షించుచున్నవి. అవి పాలు త్రావుట కుద్దేశింపబడిన దోనెలు కూడ నొకే రాయితో మలిచియుండుట వల్ల నితరుల కచ్చెరువు కల్గించుచుండును. అవరోధజనము, స్నానమాడు ప్రదేశము లీనాడు ఎడారిగా మారిపోయినవి. ఆనాడు సంగ్రామములు జరుగునప్పుడు శత్రుసేనలు ముట్టడించు విషయము తెలుగుట కుద్దేశింపబడిన Clock towers కలవు. వాటి నుండి వాష్టరించుచున్న శత్రుసేనలను సమీక్షించుచు, నవసరమగు సమరసన్నాహములు, యూథ విభజనలు చేయుచుండిరి.

రాజసభా మంటప మత్యద్భుతముగా నున్నది. ఇచ్చట నొకమూల గుప్త ద్వార మున్నట్లగుపించును. ఆపత్సమయముననే విజయనగర ప్రభువులు తమ ప్రాణము కాపాడుకొనుటకు దాని ద్వారా తప్పించుకొనిపోవుచుండిరి. ఈ మార్గ మనంతపురము జిల్లాలోని పెనుకొండలో నున్న గగనమహాలు హర్మ్యములోనికి కలదని యైతిహ్యము. పెనుకొండ హంపికి సుమారు రెండువందల మైళ్లు. ఇంత దూర ముండియుండదని నా మతము. అదియునుం గాక గుప్తద్వార ముపయోగము లేకుండుటవలన దుర్గంధభూయిష్ఠమై చొర శక్యము గాకున్నది. ఇవిగాక యాస్థాన మంటపము, నీటికొలను, మజ్జన స్థలము, కృష్ణరాయల సమాధి యివన్నియు నీ ప్రదేశమునకు సంబంధించినవే. ఈ ప్రదేశమున కనతిదూరముననే సుగ్రీవుని గుహ, పంపా సరోవరము, ఆనెగొంది కలవు. పంపా సరోవర మతి స్వచ్ఛముగ నిప్పటికిని ప్రేక్షకుల కానందము గొల్పుచున్నది. విదేశ యాత్రికు లీ ప్రదేశము సందర్శించి, హంపిని గూర్చి వేనోళ్ల చాటినారు. తమ పర్యటన విశేషములను, వృత్తాంతములను క్రోడీకరించినారు. కృష్ణరాయల దుర్గము లిస్బన్ దుర్గము కన్న దిటవుగా నుండెననియు, విదేశమునుండి యతిథులు వచ్చినప్పుడు వారి కన్ని రకముల సౌకర్యములును, నివాసమున కనుకూలమగు మందిరములు వారి వారి యర్హతలను బట్టి కల్పింపబడుచుండెననియు, నెటు చూచినను రోమునగర మున్నంత విశాలముగ నుండెననియు, రోమునగరము ప్రపంచమందు గొప్పదని చాటుటకు విజయనగరమును చూడకపోవుటే కారణమని సుస్పష్టముగా నుల్లేఖించినారు. ఈ పూర్వ వైభవచ్ఛాయ లిప్పు డెక్కడను గానరాకున్నవి. తళ్లికోట సంగ్రామము ముగిసి దాదా పైదువందల సంవత్సరములు గడచినవి. అప్పుడు మణి మంత్రౌషధముల బలముచే కట్టుదిట్టము గావింపబడినవి. హంపీ విరూపాక్షము

సప్తప్రాకార పరీతము. విజయనగర రాజేంద్రులకు పెనుగొండ, హంపి, చంద్రగిరి కూడ నొక రాజధానిగా నుండెనందురు. చంద్రగిరి చిత్తూరు జిల్లాలో కలదు. చంద్రగిరి దుర్గము ప్రాచీనమైనది. శత్రుసైన్యములను డీకొనుట కనువుగా నున్నది. అయితే చంద్రగిరి కూడ కృష్ణరాయలకు రాజధానిగా నుండెనా యను నది వివాదాంశము. చంద్రగిరిలో నొక రాజమహలు కలదు. అది నేటికి చెక్కు చెదరకుండ నున్నది. నా డాస్థాన మలంకరించిన యష్టదిగ్గజముల కీ ప్రాంతము లన్నియు కవితావస్తువులైనవి. సమకాలీన భావములు, పరిస్థితులు కవిత్వములో ప్రతిఫలించుట సహజము. పెద్దన సమకాలీన భావప్రతినిధి. ఈ రాజధానులలోని సుందర దృశ్యజాతము వారి కవిత్వమునకు మూలకారణమైనవి. మతంగ హేమ కూట ఋశ్యమూక పర్వతములే కోలాహల హిమాలయములైనవి. పెద్దనార్యుడు వర్ణించిన కోన, వసుచరిత్రకారుడు వర్ణించిన దేవాలయము పెనుగొండకు సంబంధించినవే. ముత్యాలచెరువు శుక్తిమతీ నదియైనది. తుంగభద్రా నదీజల ములు సెలయేళ్లయినవి. ఈ కవితా వస్తువులన్నియు గ్రంథస్థమైనవి. ఇట్టిపరిస్థి తులు, వాతావరణము కవితాకన్య కనుకూలముగ నుండుటవల్లనే ఆంధ్ర కవితా పితామహు డల్లసాని పెద్దనామాత్యుడు

"నిరుపహతి స్థలంబు, రమణీప్రియ దూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె, మాత్మకింపయిన భోజన, ముయ్యెల మంచ మొప్పు ద
ప్పరయు రసజ్ఞు, లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకినగాక యూరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే ?"

యనినాడు,

ఇట్లొనగూడిన సాంఘిక వాతావరణమున సరససల్లాప సాహిత్యలక్ష్మి కను వగు నాలవాలము కలిగినప్పుడు శ్రీకృష్ణదేవరాయ లరిరాజభయంకరుడై, నిజ ప్రజానురంజకుడై, యమానుష మహాసత్వాఢ్యుడై, కావ్యభాషా శృంగార రసైక లోలుడై, గీర్వాణాంధ్ర కర్ణాటసాహిత్య వైదుషీభూషణుడై, విద్వద్గోష్ఠీలోలుడై, పండితజన కమలాకర ప్రభాకరుడై, సాహితీసమరాంగణ సార్వభౌ మాంధ్రభోజ బిరుదద్వయ శోభితుడై విజయనగర సామ్రాజ్యమేలుచున్న కాలమున నాతని యాస్థాన మలంకరించిన యష్టదిక్పాలకులంబోలు అష్టదిగ్గజములు ప్రబంధరాజ ములు రచించి యశఃకాయులైనారు. ఈ ప్రబంధయుగ మొక్కమ్మడి సాహిత్య చరిత్రయం దవతరించలేదు. ఇతః పూర్వము పూర్వకవులు చేసిన కవితావ్యాయా మము, వ్యాసంగము ఫలించి కృష్ణరాయల కాలమునకు పరిపక్వదశకు వచ్చెను.

ఇది దైవికము. రామరాజభూషణుడీ విశేషమును తన వసుచరిత్రమందీ పద్యమున పేర్కొనినాడు.

మహిమున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు ద
న్మహనీయ స్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా
మహులై సోముడు భాస్కరుండు వెలయింపన్ సొంపువాటించు నీ
బహుళాంధ్రోక్తి మయ ప్రపంచమున దత్ప్రాగల్భ్య మూహించెదన్.

ప్రబంధయుగమున పెక్కు ప్రబంధములు వెలసినవి. దాని కాంధ్ర కవితా పితామహుడు పెద్దనార్యుని మనుచరిత్రయే నాంది. "నమస్తేభ్యః పథకృద్భ్యః" యని తరువాతి ప్రబంధనిర్మాత లతని కంజలిఘటించినా రనుటలో సందియము లేదు. ప్రబంధములు పెక్కు వెలసినను కొన్నిమాత్రమే వాటివాటి ప్రత్యేకతలకు ప్రశంసనీయములై యలరారుచున్నవి. తరువాతివి పిల్లప్రబంధములు, పిల్లవసుచరిత్ర లని పేరుగాంచినవి. వైజయంతీవిలాసములో విప్రనారాయణుని ప్రేమవలె "పూవై తన్మకరందమై కరగె పోపో నీళ్లకుంబల్చనై" కరిగిపోయినట్లు శిథిలపద బంధముకాని, రసపోషణగాని, భావనాపటిమగాని సుస్పష్టముగా తరువాతి ప్రబంధములలో వ్యక్తము కాలేదు. మొదట అష్టదిగ్గజముల నామధేయము లుల్లేఖించి వారి ప్రబంధరాజముల పేర్కొందును.

1. అల్లసాని పెద్దన్న .... మను చరిత్రము.
2. రామరాజభూషణుడు .... వసుచరిత్రము, హరిశ్చంద్ర నలోపాఖ్యానము, నరసభూపాలీయము,
3. తెనాలి రామకృష్ణుడు .... పాండురంగ మాహాత్మ్యము.
4. పింగళి సూరన .... కళా పూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము, రాఘవ పాండవీయము.
5. ముక్కు (నంది) తిమ్మన్న .... పారిజాతాపహరణము.
6. అయ్యలరాజు రామభద్రుడు .... రామాభ్యుదయము.
7. మాదయగారి మల్లన్న ... ఏకాదశీ మాహాత్మ్యము.
8. ధూర్జటి .... కాళహస్తీశ్వర మాహాత్మ్యము, కాళహస్తీశ్వర శతకము.

మను ఛరిత్ర ద్రాక్షాపాకమునం దుండుట వల్ల ప్రశస్తము. ముద్దు పలుకులతో ముక్కు తిమ్మన పారిజాత మలరారుచున్నది. పింగళి సూరన కళాపూర్ణోదయమనల్పకల్పనా పటిమకు తార్కాణము. అయ్యది కల్పిత కథాకావ్యము. భట్టు

మూర్తి వసుచరిత్ర శ్లేషకు ప్రసిద్ధి. ప్రౌఢకవి మల్లన్న రుక్మాంగద చరిత్ర, ధూర్జటి కాళహస్తీశ్వరమాహాత్మ్యము భక్తిరసప్రధానములు. పింగళి రాఘవపాండవీయము ద్వ్యర్థి కావ్యము. తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము ప్రౌఢపద బంధమునకు గీటురాయి. వీటిలో కళాపూర్ణోదయమున కొక విశిష్టత గలదు. అందువల్లనే దానిని గూర్చి యొక కవిపుంగవు డీవిధముగ ప్రశంసించినాడు.

"....కళాపూర్ణోదయ
మది మొదలుగ నింతదనుక నంతకు మున్ని
ట్టిది పుట్టలేదు తెల్గున
విదితంబిది వివిధకావ్య విజ్ఞాతలకున్.

కన వినరాని వింతలగు గాథల బుద్ధినిదేర్చు కల్పనం
బునఁ జవులూరునట్లు వినముచ్చట యయ్యెడి పాత్రభాషణం
బున హృదయంబు భావముల బొంగగజేయు రస ప్రసాదనం
బున మన యీ మహాకృతికి బోలికలేదిది నిక్కమెంతయున్."

ఇక నాముక్తమాల్యదను గూర్చి ప్రశంసింతము. ఆముక్తమాల్యద ప్రౌఢ ప్రబంధరాజము. ఉద్దండ పండిత ప్రకాండ గోష్ఠీ ప్రస్తుత భవ్యరసాయనం బని చెప్పనొప్పు. కృష్ణరాయల కాలమునాటి ప్రబంధేతివృత్తముల సరణిని రామరాజ భూషణుడు వసుచరిత్రలో నీవిధముగ సూక్ష్మీకరించినాడు. ఆనాటి ప్రబంధరాజ ముల కిది మూలసూత్రముగా నుండెను.

కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము, లాద్య సత్కథల్
హావిరి పుట్టురత్నము లవారిత సత్కవి కల్పనా విభూ
షావహ పూర్వరత్నములు సానలదీరిన జాతిరత్నముల్
కావున నిట్టి మిశ్రకథగా నొనరింపుము నేర్పుపెంపునన్.

కావున నాటికవు లితివృత్తము పౌరాణిక గ్రంథరాజములనుండి గ్రహించి దానిని తమ స్వకీయ కల్పనా ప్రతిభతో నభూతపూర్వ మహాకావ్యములు సృష్టించి నారు. మనుచరిత్రేతివృత్తము మార్కండేయ పురాణము నందున్న 111 పద్య ములే. దానిని పెంచి సుమారెనిమిది వందల పద్యములతో రమణీయ ప్రబంధ రాజముగా పెద్దనామాత్యుడు కూర్చినాడు. వ్యాసప్రోక్త భాగవతాంతర్గములగు నాల్గు శ్లోకముల నాధారము చేసికొని కృష్ణరాయలకు చిన్నమదేవివలన కలిగిన యవమానమును స్వానుభవమును సమ్మేళనముచేసి ముక్కు తిమ్మన్న పారిజాతా పహరణము నల్లినాడు. కళాపూర్ణోదయమునకు మూలమెచ్చటను లేదు. వసు

చరిత్రకు మూలము భారతములోని కొన్ని పద్యములు మాత్రమే. అయితే యివన్ని యిట్లుండ కృష్ణరాయ లాముక్తమాల్యద కితివృత్తమును 'గురు పరంపర' 'ఆచార్య సూక్తి ముక్తావళి'యను వైష్ణవ మత గ్రంథద్వయమునుండి గైకొనబడినది. విష్ణు చిత్తీయ నామాంతరమగు నాముక్తమాల్యదలో కొన్ని చిట్టికథలు మాత్రమే కలవు. ఈ చిరుకావ్యములను క్రోడీకరించి పూర్వాపర సందర్భములు సమకూర్చి సమ్యక్కావ్యరచనా పటిమతో కృష్ణదేవరాయరా ర్భూమీపాలు డీ బృహద్గ్రంథమును రచించినాడు.

"కవితా వనితా లతా నిరాశ్రయా నశోభంతే" యను నాభాణకమును వితథము గావించకుండ కృష్ణరాయ లాంధ్రభోజుడై తన యాస్థాన మలంకరించిన యష్టదిగ్గజముల నాదరించి తానును భోజునివలె కవియై "ఆంధ్రభోజుడు, సాహితీ సమరాంగణ సార్వభౌము" డను బిరుదద్వయము గాంచెను.

## ఆముక్తమాల్యద రచనా కాలము

క్రీ.శ. 1512 లో రాయల దక్షిణ దిగ్విజయయాత్ర ముగిసినది. 1513-15 లో పూర్వ దిగ్విజయయాత్ర ముగిసినది. గజపతుల ప్రాబల్యము మంటగలసినది. కృష్ణరాయలు వేంగీ మండలమును గెల్చి సింహాచలములో దిగ్విజయ స్తంభము నాటి వెనుదిరిగెను. అప్పుడే శ్రీకాకుళక్షేత్ర స్వామిని సందర్శించి యాముక్త మాల్యదా రచన కుపక్రమించెను. మనుచరిత్ర పిదపనే యాముక్తమాల్యద వ్రాయబడెను. అట్లు కానిచో మను చరిత్రకారుడు తన ప్రభువగు కృష్ణరాయల నా గ్రంథకర్తగా స్మరించియుండును. అదియునుగాక కృష్ణరాయలు తానీ గ్రంథమందు "మున్నే కళింగదేశ విజిగీషామనీషం దండెత్తిపోయి విజయవాటిం గొన్ని వాసరములుండి శ్రీకాకుళ నికేతనుండగు నాంధ్ర మధుమదను సేవింపబోయి హరి వాసరోపవాస మచ్చట గావించిన నప్పుణ్యరాత్ర చతుర్థయామంబున'' నని నుడివినాడు. అదియునుగాక కుందూరి యీశ్వరదత్తుగా రాముక్తమాల్యద వ్రాయబడిన తేదీని స్థిరపరచిరని శ్రీ వేకుమళ్ల యచ్యుతరావుగారు తెల్పియున్నారు. క్రీ॥శ॥ 1519 జనవరి 26 వ తీదీని రాత్రి సుమారు పది ఘడియలకు కుంభసంక్రమణ కాలము. ఆ దినము మాఘ బహుళైకాదశి కాబట్టి 27-1-1519 తేదీన శ్రీ రాయ లాముక్తమాల్యదా ప్రబంధరచనకు గడంగెను. ఇంతటితో నీ కావ్యరచనా కాలము తేలినది,

ఈ గ్రంథమున కొక గ్రహచారము పట్టినది. కృష్ణరాయలీ గ్రంథమును వ్రాసినను వ్రాయలేదని. దానిని రెండవ ప్రకరణములో వివరించుచున్నాను. ఇట్టి

యవస్థయే భాస్కర రామాయణమునకు కూడ సంభవించినది. అందు మంత్రి భాస్కరుడు, హుళక్కి భాస్కరు లనువార లిద్దరిలో నెవరు వ్రాసిరను వాదము ప్రసిద్ధమే. ఇట్టి యసంబద్ధ ప్రలాపములను లేవదీయుటకు కారకులైన ప్రాజ్ఞుల యాదర్శమేమిటో తెలియరాకున్నది. ఇవి వారి యభూతకల్పనలై యుండును. ఇట్టి యభాండములువేయుట ప్రాజ్ఞుల లక్షణము కాదు. ఇట్టి యభాండములు, నసంబద్ధ ప్రలాపములు నాధునిక సాహిత్య యుగమున విమర్శనములు బయలు దేరిన పిదప పెక్కు బయల్వెడలినవి. బాణు డుల్లేఖించిన విధమున ప్రతిగృహ మున నపరిణత విజ్ఞానము. ప్రతిభావ్యుత్పన్నతలు గల విమర్శకులు కవులు "శ్వానఇవ సంతి గృహేగృహే" యున్నప్పు డిట్టివి రాకతప్పవు. ప్రథమ విమ ర్శన గ్రంథము రచించినవారు డా. కట్టమంచి రామలింగారెడ్డిగారు. వారి కవిత్వ తత్వవిచారమే మనకు నాంది. అంతవరకట్టి సందియములు గ్రంథకర్తృత్వముపై నొదవినట్లు గాన్పించదు. సునాయాసముగ కీర్తి ప్రతిష్ఠల నార్జించుట కీయభాండ ములు చాల దోహదమయినవి. కాకమాను రామరాజభూషణుడు వసుచరిత్రము, నరసభూపాలీయము, హరిశ్చంద్ర నలోపాఖ్యానములను రచించెను. ఈ సందర్భ మున మూర్తికవి యొకడనియు నతడే భట్టుమూర్తి యనియు కొందఱును, కవులిద్ద రని మఱికొందఱును సృష్టించి కుశంకలు లేవదీయుటకు కారకులై విమర్శకుల, పండిత ప్రవరుల తర్జనభర్జనలకు గురియగుచున్నారు. ప్రౌఢ ప్రబంధమైన యాముక్తమాల్యదను సమగ్రముగా జీర్ణించుకొనుటమాని యిట్టి యభాండములు వైచి సాహితీజగతిలో వెల్గొందుట కిది యపూర్వావకాశము.



శ్రీకృష్ణదేవరాయ లేతద్గ్రంథరాజమును వ్రాసినను వ్రాయలేదనియు, యితరు లెవరో వ్రాసి విశేష ధనసంపత్తిని ప్రత్యామ్నాయముగా గొని యాతని పేరు పెట్టిరనియు వదంతులు పెక్కుగలవు. రాయ లాశ్వాసాంత పద్యములందు భట్టహర్షుడు శ్లోకములలో వ్రాసినట్లుగా తానే వ్రాసితినని కంఠోక్తిగా నొక్కి వక్కాణించెను. విమర్శకుల మతమున రాజులు భోగలాలసులు. రాజ్యభార నిర్వ హణమం దనవరతముండుట వినోదార్థము శుద్ధాంతనితంబినీ విలాసములం దవిలి యుండుటవల్ల వారికి తీరిక యుండదు. అంతేగాక యాలోనామృతమగు సాహిత్య మందు పాండిత్య ముపార్జించి. యందును సంస్కృతాంధ్రములందును మేటులై కవులై ప్రౌఢకవనమల్లుట కవకాశము చిక్కదు. పేరు ప్రఖ్యాతులకొరకు ధన మిచ్చి యేవిద్వత్కవులతోనో వ్రాయించి తమ పేరు పెట్టుకొందురు. ఇదిసర్వ జనసామాన్యము. రాజులేడ ? గ్రంథరచన యేడ ? అందును మహాపటుత్వ కవిత్వ మహత్వ సంపదతో రాయలీ ప్రౌఢప్రబంధ మేరీతివ్రాయగల్గెను? సర్వజనసామాన్య మగు నీధర్మసందేహమే వారి వాదమునకు మూలకారణము. కృష్ణరాయ లష్టదిగ్గజ ముల నాదరించినందుల కాతని కాంధ్రభోజ బిరుదము లభించెను. సతతమతని యాస్థానమంటపమున విద్యావినోదములు, కావ్యచర్చలు, జరుగుట విద్వద్విదితమే. పూర్వజన్మసంస్కారమువల్ల భస్మసంవృత మహాగ్ని కణంబుమాడ్కి నతనిలో నిక్షిప్తమైన యీ కవితాప్రతిభ యష్టదిగ్గజములువ్రాయు ప్రబంధరాజములచే మేల్కొ లుపబడెను. కృష్ణరాయలు కవి కాడనియే కొందఱి సుస్పష్టాభిప్రాయము. కృష్ణ రాయలు కవిగానిచో తన యాస్థాన మలంకరించిన యష్టదిగ్గజముల కవితాప్రతిభను గుర్తెఱింగి వారి వారి కవితా తారతమ్య పరిశీలనచేయు శక్తి యుండుట కల్ల.

కవితాకన్య మనింటి యాడుపడుచా కాకున్న యిల్లా లనే
కవశంబందున నుండు వారవధువా ? కాదట్టులన్ పూర్వసం
భవ జ్ఞానంబున గాక యేరికిని సంప్రాపింప దెందేని మా
నవు డెన్నేవిధుల న్దపించినను చెంతన్జేర దొక్కింతయున్.

అని కవనమునుగూర్చి యొకకవి వాకొనినాడు. సంస్కారములేనిది కవన మబ్బదు. ఈ సంస్కారమునే మమ్మటాచార్యుడు శక్తి యని నిర్వచించినాడు. ఇదిలేనిది కవిత్వము ప్రసరించదనికూడా సుస్పష్టముగా వాకొనినాడు. దేనియందు పఠిత రససాక్షాత్కృతిలో నిమగ్నుడగునో యదియే సాహిత్యము. ఏది జీవిత

పరమావధికి బంధవిముక్తికి హేతువో యదియే సాహిత్యము. అట్టి సాహిత్యమున కలంకార ప్రధానము లయిన సంస్కృత గ్రంథములను తానే వ్రాసితినని యీ పద్యములో వాకొనినాడు.

సీ. పలికి తుత్ప్రేక్షోపమలు జాతి పెంపెక్క
రసికులౌనన మదాలస చరిత్ర
భావధ్వని వ్యంగ్య సేవధిగాగ జె
ప్పితివి సత్యావధూ ప్రీణనంబు
శ్రుతిపురాణోప సంహితలేర్చి కూర్చితి
సకల కథాసార సంగ్రహంబు
శ్రోత్రఘచ్ఛటలు విచ్చుగ రచించితి సూక్తి
నైపుణి జ్ఞానచింతామణి కృతి
మరియు రసమంజరీ ముఖ్యమధురకావ్య
రచన మెప్పించికొంటి గీర్వాణభాష
నంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
కృతి వినిర్మింపు మిక మాకు బ్రియముగాగ.

ఇందు పేర్కొన్న సంస్కృత గ్రంథము లన్నింటి మాట యటుంచుడు. ఇటీవలనే కృష్ణరాయలు గీర్వాణభాషయందు రచించిన జాంబవతీ పరిణయ నాటకము లభించినదని దానిని ప్రకటించుటకుగాను కొంతకాలము క్రితము శ్రీ భావరాజు వేంకట కృష్ణారావు పంతులుగా రాప్రతిని కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారి కొసగిరట. దానివిషయ మిప్పుడేమయినదో యనూహ్యము. పై పద్యములో కృష్ణరాయ లొకొక్క సంస్కృత గ్రంథమం దొక్కొక్క ప్రత్యేక విశిష్టతతో గీర్వాణికి వరివస్య గావించెననికలదు. మనము ప్రత్యక్షము కానంతవరకు విశ్వసించవలెనేగాని పెద్దనార్యుడు మనుచరిత్రము స్వప్రతిభా విశేషములతో వ్రాసెననుట కాధారము లేమున్నవి ? ప్రబంధకాలము మరికొంతకాలము విలంబ మగుట కవకాశము లేదా ? పెద్దనార్యుడు వేఱొక్క కవిచే వ్రాయించి తాను దానికి పారితోషికముగా ధనమిచ్చియుండకూడదా ? అదియునుంగాక కావ్యమక్షర సముదాయము. ఏకళయైనను సాంగోపాంగముగ నిష్కృష్టంబుగ వ్యాసంగము చేయని దెటులర్థమగును ? అటులనే సాహిత్యమందు మంచి ప్రవేశముండినగాని కవితా ప్రవృత్తి యొరుల కర్థముకాజాలదు. కృష్ణరాయ లీగ్రంథమును వ్రాసె

ననుటకు పరోక్ష తార్కాణముకలదు. కృష్ణరాయల తనూజాత తన గ్రంథమగు మారీచీపరిణయ కావ్యమందలి

"అకలుష మాధురీకలితమై యలసాని కవీశుబోలె న
ల్లికజిగి, ముక్కు తిమ్మకవి లీలను ముద్దగు బల్కు, పాండురం
గ కవిగతిన్ పదక్రమము గల్గు కవిత్వముతోడ విష్ణు చి
త్తుకథ రచించు మజ్జనకు దోరపుబత్తి నుతించి మ్రొక్కెదన్"

అను పద్యములో కృష్ణరాయలు విష్ణుచిత్తీయము రచించెనని ఘంటాపథముగ ఘోషించినది. కృష్ణరాయలు నిస్సంశయముగా మహాకవి. ఆతడే యాముక్త మాల్యదా మహాకావ్యమును రచించెను. కృష్ణరాయలు కవిగాకుండినచో

మా కొలది జానపదులకు
నీ కవితా రీవి యబ్బునే కూపనట
ద్భేకములకు గగనధునీ
శీకరముల చెమ్మ ! నంది సింగయ తిమ్మా !

యను పద్యమందు మూడవ పాదమందలి 'గగనధునీ' విశేషణమును 'నాకధునీ' యని మార్చజాలడు. పాండిత్యములేనిది కవితారసా స్వాదనము కల్ల. ఇంకను కృష్ణరాయల కర్తృత్వమును విమర్శించువారు రాజు లంతఃపురమం దెక్కుడుగా నుందురు. విద్యావకాశము కవితాభ్యాసముల కనువుగాదు. అందును పల్లెటూళ్లలో నుండు సామాన్యజనుల జీవితమును గ్రుచ్చియెత్తి వ్రాయుట దుస్తరమని తమ వాదమును దృఢపరతురు. దీనికొక చిన్న కథకూడ కలదు. కృష్ణరాయల కూతురు కవితాభ్యాసము చేయుచు నొక శృంగారరస భూయిష్ఠమగు పద్యమును రచించెను. దానిని జూచి యామె తన సాహిత్యాచార్యునితో ప్రేమకలాపము జరుపుచుండెనని శంకించి యయ్యాచార్యునితో నర్మగర్భముగా ప్రస్తావించెను. అందుల కాతడు మిన్నకుండి కృష్ణరాయలు రచించిన విష్ణుచిత్తీయమందు గ్రామ జీవితమునకు సంబంధించిన యొక పద్యమును ప్రస్తావించి నీవు దరిద్రుడవు, సార్వభౌముడవు కావని ప్రత్యుత్తర మిచ్చెను. అందుల కా సార్వభౌముడు కించపడి తన తప్పిద మును గ్రహించి కవిత్వము కేవల మనుభూతివల్ల నుదయించినది మాత్రమే కాద నియు, భావనాశక్తి ఫలితమనియు సిద్ధాంతీకరించిన యయ్యాచార్యుని క్షమాభిక్ష వేడికొనెను. పోతనను లాక్షణిక సమ్మతుడుకాడని తిట్టి యప్పన్న యనిపించు కొన్న యప్పకవి 'కృష్ణరాయ లాముక్తము వ్రాయలేదు. అల్లసాని పెద్దన్న వ్రాసి కృష్ణరాజేంద్రుని పేరు పెట్టె'నన్నంత మాత్రమున కృష్ణరాయని గ్రంథము కాక

మానునా ? డా. చిలుకూరి నారాయణరావుగారు కూడ కృష్ణరాయలే యాముక్త మాల్యదను రచించిరనిరి. దానిపై నోరుగంటి నీలకంఠశాస్త్రిగారు భారతిలో తీవ్ర ముగ విమర్శించిరి. ఈ విమర్శనలు ప్రకటితమైన సాహిత్య మాస పత్రిక సాహిత్యవేత్తలకు సంగ్రామరంగమైనది. రాజులు పూర్వమున గ్రంథములువ్రాసిరి. అంతేగాక కొందఱు రాజన్యులు "రాజ్యాంతే నరకం ధ్రువ" మ్మని నమ్మి సదా చారసంపన్నులై యిష్టదైవము నారాధించుచు నిజప్రజానురంజకులై "నా విష్ణుః పృథివీ పతిః" యను నానుడిని సార్థకము గావించుచు రాజ్యమేలిరి. సంస్కృత మున భోజుడు, భర్తృహరి, చాళుక్య సోమేశ్వరుడు, కేలాది బసవరాజు, హర్షుడు మొదలగువారు గ్రంథములు రచించిరి. ఆంధ్రమున నన్నెచోడుడు, తిమ్మభూపా లుడు, రఘునాథ భూపాలుడు, మొదలగువారు గ్రంథములు వ్రాసిరి. కాటయ వేమారెడ్డి వ్యాఖ్యానము రచించెను.

రాజులు పల్లెటూరి ప్రజల జీవితముల నెట్లుగ్రహించి రనుదానికి మనము ప్రత్యుత్తరించవలసియున్నది. సామాన్యముగ దండయాత్రలకుగాని మృగయా వినోదములకుగాని రాయలు దేశమంతట పర్యటించువాడు. ఇట్లు పోవుచున్నప్పుడు ప్రజలు తమ ప్రభువును సందర్శించు కుతూహలముతో నతనిని దర్శించి, తమ తమ కష్టనిష్ఠురములు చెప్పుకొను నాచారముకలదు. అంతేగాక వేగులవాండ్రవల్లను, ప్రధానామాత్యుడగు నప్పాజీ ముఖతః రాయలు గ్రహించియుండును. వేమేల? కవియైన వానికి భూతభవిష్యద్వర్తమానములు కరతలామలకములు. నేటి కవుల విషయము ప్రస్తావించుటలేదు. వైష్ణవమత ప్రాబల్యమునకుగాను తిరుమల తాతా చార్యు లాచార్యపీఠము వహించి కృష్ణరాయల యాస్థానమందుండెను. తిరుమల తాతాచార్యులు కృష్ణరాయల సమకాలికుడా కాడాయని శంకించినను కాల విపర్యాస దోషమున్నను నట్టి గురువులుండినట్లు ప్రబలమగు తార్కాణములు గలవు. కృష్ణ రాయలు శ్రీశైలాది శైవక్షేత్రములు సేవించెను. అట్టివా డీ వైష్ణవమత గ్రంథ మెట్లు వ్రాయకలిగెనని కూడ సందేహము. శివకేశవులకు భేదములేదను విషయము సర్వజన సమ్మత మేగదా!

ఇంకొక విశేష మేమన పెద్దనామాత్యుడే రెండు గ్రంథములు వ్రాసినచో రెండింటియందును కొన్నిపోలికలు తప్పక యుండితీరును. పెద్దనార్యుని మను చరిత్ర ద్రాక్షాపాకము, కృష్ణరాయల విష్ణుచిత్తీయము నారికేళ ఫలపాకము. కృష్ణ రాయల కాలము ప్రబంధములలో విష్ణుచిత్తీయము, పాండురంగ మాహాత్మ్యము, వసుచరిత్ర యీ మూడు గ్రంథములు పాషాణత్రయము. పాండిత్యమునకుగాని,

సాహిత్యపటిమకుగాని గీటురాళ్లు. మనుచరిత్రకును విష్ణుచిత్తీయమునకును పోలి కలు లేవు. కవియైనవా డెన్నిపోకడలతోనో ప్రబంధరచన చేయవచ్చును. సందర్భానుసారముగ కొన్నిచోట్ల క్లిష్టమగు శైలిలో కలము నడుపవలసివచ్చును. అట్టి కఠినమగు పద్యములు మనుచరిత్రయందు రెంతుమాత్రమే గానిపించును. కృష్ణరాయ లాముక్తమాల్యద రచించెననుట నిస్సంశయము. ఈ సందర్భమందు మఱొకవిషయము విచారించవలెను. కృష్ణరాయ లాముక్తమాల్యద రచించి తన యాస్థానమందున్న పలువురు కవులకు చూపింపక యాప్తుడగు పెద్దనామాత్యునికి చూపించి తప్పొప్పరయవలసినదని యభ్యర్థించియుండును. ఏలనన "నహి సర్వ స్సర్వజ్ఞః" యను నానుడి కలదుగదా. ఇదినేడును జరుగుచున్నది. అపరిణతప్రజ్ఞ గల పిల్లకవులు పెద్దవారికి చూపించి నెరసుల సవరించుకొను నాచారము నేడు కూడ కలదుకదా! పెద్దనామాత్యుడు తనను పరిశీలించమని కోరిన విష్ణుచిత్తీయ మును సమగ్రముగా పరిశోధించి వీలున్నతావుల కృష్ణరాయల శైలితో తులతూగు ఫణితిలో కొన్ని పద్యపాదములు సవరించియుండును. వీలుగానిచోట్ల వదలివేసి యుండును. అందులకే కొన్ని వ్యాకరణదోషములు, మారుమూలపదప్రయోగములు మనకు గానవచ్చుచున్నవి. సవరించినచో భావము చెడునను తలంపుతో పెద్దన రాయల నొప్పించి యట్లుచేసియుండును. వైష్ణవ మతగ్రంథమగుటవల్లనో, ప్రౌఢ తర నారికేళ ఫలపాకమందుండుటవల్లనో, విష్ణుచిత్తీయము చాలప్రచారములోలేదు. ఈ గ్రంథము వైష్ణవ పండితులవద్ద విరివిగా ప్రచారములో కలదు. అందును నాకు తెలిసినంతవరకు మేడేపల్లి వేంకట రమణాచార్యులు, ఈయుణ్ణి వీరవెంకట రాఘవాచార్యులు, శ్రీనివాససోదరులు, పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, రాళ్లపల్లి యనంతకృష్ణశర్మ మొదలగు వైష్ణవ విద్వత్పుంగవులు విష్ణుచిత్తీయము రాయల కృతమనియే తమ దృఢాభిప్రాయము వెల్లడించిరి. సంగీత సాహిత్య ఖనియగు రాళ్లపల్లివారు మాత్రము విష్ణుచిత్తీయము రాయల కృతమేననియు, నెరసుల సవ రించుటకుగాను పెద్దనామాత్యుని పరిశీలనార్థ మీయబడియుండునని యూహించు చున్నారు. వారి యూహతో నే నేకీభవించుచున్నాను.

కృష్ణరాయలు "కళింగదేశ విజిగీషామనీషన్ దండెత్తి పోయి విజయ వాటిం గొన్ని వాసరంబులుండి శ్రీకాకుళ నికేతనుండగు నాంధ్ర మధుమథను సేవింపబోయి హరి సర్వోపవాసం బచ్చట గావింప నప్పుణ్య రాత్ర చతుర్థయా మంబున" నని తన యాముక్తయందే నుడివినాడు. కృష్ణరాయలు భగవత్సాన్ని ధ్యమున కల్లలాడ వలసిన యవసరమేమి వచ్చినది? కృష్ణరాయల కర్తృత్వ

మును శంకించువారు తమ వ్యాస ప్రకటనార్థము కల్లలాడుటతప్ప వేఱు మార్గాంతరము లేదు. కాని కృష్ణరాయల కగత్యమేమున్నది ? కందుకూరి వీరేశలింగముగారును, గురుజాడ శ్రీరామమూర్తిగారును కృష్ణరాయలే విష్ణుచిత్తీయమును రచించెనని నొక్కి వక్కాణించిరి. నాకు సాహిత్యభిక్ష పెట్టిన ప్రధాన సాహిత్యాచార్యులగు విమర్శకాగ్రేసర శ్రీ కురుగంటి సీతారామభట్టాచార్యులవారు కూడ తాము రచించిన 'A Hand Book of Telugu Literature' లో నీవిధముగ వ్రాసినారు.

"Krishna Deva Raya was himself a great poet. His Amukta Malyada or Vishnuchitteeya is an unique work in its own sphere. His deep study of human nature and naturalness of description give to his work an 'Exalted Place' in the History of Andhra Literature. The customs prevailed in those times are vividly described in it. It is a work which stood the test of times and ranks with the greatest of the Telugu Kavyas."

కృష్ణరాయలే యాముక్తమాల్యద రచించెననుటకు ముక్కు తిమ్మనార్యుడు కృష్ణరాయిలను "కవితా ప్రావీణ్య ఫణీశా"యని కృష్ణరాయని వర్ణించుటచే నీ విషయము లోకమునకు సువ్యక్తమైనది. అంతేగాక విద్వత్సభలగూర్చియు కవిసన్మానోత్సవములను గూర్చి తిమ్మన స్పష్టపరచెను.

క. ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవి నికర గుంఫిత కావ్య
స్మృతి రోమాంచవిశంకిత
చతురాంతః పురవధూ ప్రసాధన రసికా :

ఆముక్తమాల్యద పెద్దన కృతమా కృష్ణరాయ కృతమా యను వాదముండ మరొక కొత్తవాదము బయల్దేఱినది. కవికాలము గ్రంథకర్తృత్వమును చర్చించుట ప్రధానము గాదు. రసాస్వాదనము వదలి యీ విషయముపై పరిశోధన చేయువారు "నీ వీమోక్ష వేళాయాం, వస్త్రమూల్య విచారణ" మ్మను న్యాయమును పాటించుచున్నారనుటలో సందియము లేదు. ఈ కుశంకలను విచారించుటావశ్యకము కాకపోయినను నేతద్గ్రంథముపై నేదో విమర్శనము వ్రాయుచున్నప్పుడా మూడవ వాదమునుకూడ పరిశీలించు టవసరమైనది. ఇక మూడవ వాదమును వివరింతును.

## సన్నిధానము వారికి ప్రతివచనము

బ్రహ్మశ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రులవారు మొదట విష్ణు చిత్తీయము కృష్ణరాయ కృతమేనని భారతిలో వ్యాసము వ్రాసిరి. తరువాత పెద్దన కృతముకాదు, కృష్ణరాయల కృతముకాదు, వేఱొక ద్రావిడవీరవైష్ణవుడు వ్రాసెనని చిపురుపల్లిఅప్పయ్యశాస్త్రిగారి సంపాదకత్వమున వెలువడు దివ్యవాణివిజయసంచికలో (10–10–1940) విమర్శనమొండు వ్రాసిరి. దానిలో వారు

శ్రీ వేంకటగిరి వల్లభ
సేవా పరతంత్ర హృదయ చిన్నమదేవీ
జీవిత నాయక కవితా
ప్రావీణ్య ఫణీశ కృష్ణరాయ మహేశా !

యని ముక్కు తిమ్మన పారిజాతములో వ్రాసిన స్తుతికి రాయలెంతమాత్రము తగడట. కవు లతిశయోక్తిగా వర్ణింతురు గావున నది యట్టిదేయట. ఇది యసమంజసము - ఏలయన కృష్ణరాయలు కవికాడేని యాతని యాస్థాన మలంకరించిన అష్ట దిగ్గజముల గ్రంథముల పరిశీలించి వారినెట్లు గౌరవింపగల్గును ? అందును నల్ల సాని వానికిచ్చిన యాంధ్ర కవితాపితామహ బిరుదము చాల పెద్దది. శ్రీ శాస్త్రిగారు పెద్దన కా బిరుదమే యివ్వలేదందురేమో ? కవి కానివాడు యింకొకని కవితా చమత్కృతులను గుర్తెఱుంగజాలడు.

కవిరేవ విజానాతి కవేః కావ్య పరిశ్రమమ్
నహి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనామ్

పైనానుడి విద్వజ్జనవిదితమే కదా. ఆముక్తమం దరవ జాతీయము లెక్కుడుగా నున్నవట. దానివల్ల దీనిని వ్రాసినవాడు ద్రావిడ వీరవైష్ణవుడట. ఒకకవి బహు భాషాకోవిదుడు కాకూడదా ? శ్రీ శాస్త్రిగారు ఖడ్గతిక్కనలో 'మైదాన' మను హిందీ శబ్దమును ప్రయోగించినారు. దానివల్ల ఖడ్గతిక్కన వీరి కృతము కాదన వచ్చునుగదా. ఆముక్తమాల్యద యుత్తమకావ్యము కాదట. ఉత్తమకావ్య లక్షణము లందేమియును లేవట. ఇక్కాలమున పాఠ్యగ్రంథములుగా నిర్ణయించబడినచో మొదటి ముద్రణ నోచుకొను గ్రంథములవలె గాక సుమారైదువందల సంవత్సరముల నుండి నిశితకాల పరీక్షలకాగి నేటికిని ప్రౌఢ గ్రంథముగా గౌరవింపబడుచే యాముక్తమాల్యద యుత్తమ కావ్యమని చెప్పకచెప్పెడిని. పాపము శాస్త్రిగారి కావ్యములే యుత్తమ శ్రేణివని భ్రమయయి యుండును. ఆముక్తమాల్యద యుత్తమ కావ్యమేకాకున్న నిట్టి యవకతవక విమర్శనములు వ్రాయుటకు వారికేల స్ఫురించినదో, శాస్త్రులవారికి రాయలు స్వప్నమందగపడి శాస్త్రిగారి వాదమును బల

పరచిరేమో ? ఐదు శతాబ్దముల క్రితం వ్రాయబడిన యీ గ్రంథమే పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడకున్నను యీనాటికికూడ నిలిచియుండగలుగుటే యేతద్గ్రంథ ప్రాశస్త్యమును వేనోళ్ల చాటుచున్నది. ఉత్తమ సాహిత్యమున కావశ్యకమయిన సార్వకాలికతా సార్వజనీనతాముద్రలు దీనికి లభించినవి.

ఇంతకు నీ గ్రంథకర్తృత్వములపై శంకలుప్పతిల్లుటకు కారణము, క్రీడాభిరామము వల్లభామాత్యునిదా, శ్రీనాథునిదా యన్నటులనే బయలుదేరినది. కాని పై వాదములో మంచి బలమున్నది. ప్రౌఢ ప్రబంధ కావ్యరచన చేసిన శ్రీనాథు డిట్టి తగ్గురకము కవిత్వము వ్రాసెనాయని సందియము కలుగకుండ తాను వ్రాసి వల్లభామాత్యుని పేరు పెట్టియుండుటకు కొంత యవకాశము కలదు. ఆ పరిస్థితిలోకూడ గ్రంథము వ్రాసినవాడు శ్రీనాథుడే యని స్పష్టమగుచున్నది. కాని యీ రాయల కర్తృత్వమును శంకించు వాదములో యెవరో యీ గ్రంథమును వ్రాసి కృష్ణరాయల పేరు పెట్టినారని - ముద్రణాది సౌకర్యములు, ప్రచారములకు సాధన సంపత్తిలేని యక్కాలమున జీవితమంత యంకితముచేసి వ్రాసిన బృహద్గ్రంథముల కందులో పద్యకావ్యమునకు వేఱొకరి పేరుపెట్టుట కెవ్వరిచ్చగింతురు ? ఆనాడు రాజాస్థానములే కవులకు సాహిత్యపోషణకు శరణ్యములు. అట్టి రాజాస్థానములలో కూడ యేకొన్నింటిలో నిష్పాక్షిక దృష్టితో న్యాయసమ్మతమగు సత్కారములు జరుగుచుండెను. కాదేని రాజాస్థానములు మదమాత్సర్యములకు, ఈర్ష్యామర్షములకు పుట్టినిండ్లు. కృష్ణరాయల యాస్థానములోనికి ప్రవేశము లేకుండ కావ్యములు వ్రాసిన కవులుండకపోరు. నాడు రాజాస్థానము లుండినవి. నేడు పరస్పరాభినందన సంఘములు పెక్కు వెలసినవి. వీటినే పాశ్చాత్యులు Mutual Admiration Socities యను ముద్దుపేరుతో వ్యవహరించుచున్నారు.

శ్రీ శాస్త్రిగారు గ్రంథమంతయు నోజోగుణ భూయిష్ఠమనిరి. కొన్ని కొన్ని స్థలముల సందర్భోచితముగ పాండిత్య ప్రకర్షకల పద్యము లున్నవికాని గ్రంథమంతయు నటులలేదు. అథవా, కాకున్నను నోజోగుణము కావ్యలక్షణము కాదా ? లాక్షణిక సమ్మతము కాదా ? ఇదికేవల మసంబద్ధవాదన. అందు కుదాహరణముగ నీపద్యములను తిలకింపుడు,

నేడు మహామతీ మధుర నీవు రయంబున జొచ్చి యందు పాం
డీడు దివాణమున్నెఱయనించిన బ్రేలెడు దుర్మదాంధులన్
ఫోకిమి మాన్చి మన్మహిమమున్ ప్రకటించి హరింపు శుల్కమున్
వాడును రోసినా డిహము వైష్ణవుగా నొనరింపు సత్కృపన్.

ఎక్కడి రాజ్యవైభవము ? లెక్కడి భోగము ? లేటి సంభ్రమం
బక్కట ! బుద్బుదప్రతిమమైన శరీరమునమ్మి మోక్షపుం
జక్కిగణింపకుంటి; యుగసంధుల నిల్చియు గాలుచేతి బల్
త్రొక్కుల నమ్మను ప్రభృతులున్ దుద రూపరకుండనేర్చిరే.

* * *

విను మొకమాట రాత్రిచర వేగిరమేటికి ? నిన్ జయింతురే
యనిమిషులైన ? భాజనగతాన్నము నేనిక నెందుబోయెదన్ ?
బెనగక ప్రాణరక్షణ ముపేక్ష యొనర్చుట పాపమిందుకై
కనలకు, నాకు మేనియెడ గాంక్షయులేదిది పోవుచేయగున్.

* * *

విను కేశిధ్వజ ధాత్రి వేడమికి నావేదించెదన్ హేతు; వ
జ్ఞానకుంగాక వివేకి కేలజనియించున్ సౌఖ్యమెందున్ ? రణం
బున బాడిన్ రిపుగూల్చు వాడియుఁ బ్రజాపోషంబు ధర్మంబు రా
జునకౌ; నైన నశక్తు త్వద్విజితరాజ్యా న్న న్నఘంబంటునే ?

* * *

దీనిలోని చండాల బ్రహ్మరాక్షస సంవాదము, యామునాచార్య చరిత్రము, గోదాదేవి చరిత్రములు ఖండకావ్యములట. ప్రబంధయుగమున ఖండకావ్యముల ప్రస్తావనేలేదు. ఆధునిక కవిత్వయుగములో మాత్రమే ఖండకావ్యముల ముమ్మర మెక్కువగా నున్నది. తమ కావ్యములు ఖండకావ్యములు కావని నిరూపించుటకు పై పద్యభాగములు శ్రీ శాస్త్రులవారు ఖండకావ్యము లనినట్లున్నారు. మరొకచో ఖండకావ్యములందు రసముండదని వచించినారు. శ్రీ శాస్త్రులవారి ఖండకావ్య ములు వారు నిర్వచించిన పలుకుల నన్వర్థము చేయుచున్నవేమో ? పై పద్యభాగ ములు ఖండకావ్యములు కావు. ముది మదిదప్పకున్నప్పుడు సర్వేంద్రియ సమర్థత యున్నప్పుడే కృష్ణరాయ లాముక్తమును రచించి విద్వజ్జనుల ప్రశంసల నందెను. ఆముక్తమాల్యద ప్రౌఢప్రబంధరాజము. పూర్వకవులు వాగ్దేవీదత్త వరప్రసాదులు- వారు సత్కావ్యములు వ్రాయబూనినచో నేకధాటిగా వ్రాయగలశక్తి సామర్థ్యములు పూర్వజన్మ సంస్కారమువల్ల యబ్బినవే. నేటికవులవలె పదక్రమమునకుగాని యన్వయక్రమమునకు గాని యతి గణ ప్రాసలకు గాని కాలహరణము చేయవలసిన యవసర మేమియులేదు. ఈనాడు నట్టికవులున్నారు. సంస్కృతాంధ్రములం దుపజ్ఞ గాంచి, గురువరులగు చెళ్లపిళ్ల యంతేవాసులు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారా

యణగా రట్టి కవులు. ఆముక్తమాల్యదయందు మూడు విధములైన భక్తిభావములు సూచించబడినవి. మొదటి ఘట్టము మూఢభక్తిని, రెండవ ఘట్టము జ్ఞానసంబంధ మగు భక్తిని, మూడవ ఘట్ట మనురాగసంబంధమగు భక్తిని వ్యక్తపరచుచున్నవి.

శాస్త్రులవారు గొప్ప విమర్శకులు. నరసభూపాలీయమునకు వారు వ్రాసిన వ్యాఖ్యాన ముత్తమ గ్రంథములోనికి వచ్చును. అట్టి సహృదయులు తమ విమర్శనముపై ప్రతి విమర్శనము వ్రాసిన యేల కోపగింతురో తెలియరాకున్నది. వీరి విమర్శకు ప్రతివిమర్శనము వ్రాసినందులకు నన్ను నిండుసభలో (1944 సెప్టెంబరు లో) మీరేనా వెల్దండవారు, బాగుగ వ్రాయండని వీపు చఱచి చెప్పినారు. 'స్పర్ధయా వర్ధతే విద్యా' యను న్యాయము ననుసరించియే ప్రప్రథమమున వ్యాసముగా వ్రాయదలంచిన యీ విమర్శ యింత పెద్దగ్రంథమయినది. ఆనాటి సభకు శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణగారు, కాటూరి వెంకటేశ్వరరావుగారు, వేదాల తిరువేంగళాచార్యులవారు. శ్రీ కురుగంటి సీతారామయ్యగారు, శ్రీ బూర్గుల రామకృష్ణామాత్యులు హాజరైనారు. అధ్యక్షులుగానున్న శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణగారు సాహిత్య కల్యాణ మంటపము కురుక్షేత్ర సంగ్రామ మగుచున్నదని వాపోయి వారి నుపన్యాసమునుంచి విరమింపజేసినారు. వారి విమర్శకిది ప్రతి విమర్శ. అందుకు వారు కినియనేల ? తమ నరసభూపాలీయ వ్యాఖ్యానములో యెవరో వ్రాయించినారని వాపోయినారు. ఇట్టి తెరచాటుపద్ధతి యనవసరము. పరిణత ప్రజ్ఞలేనిది వ్రాయుట నాకిచ్చగించదు. దానికితోడు ఏతద్గ్రంథ రచనకు దోహదమిచ్చి తన సంపాదకత్వముక్రింద వెలువడు నొక తెలుగు దినపత్రికలో ప్రతి యాదివారపు సంచికలో నీగ్రంథమంతయు ప్రచురించిన కీ. శే. అడివి బాపిరాజుగారి ప్రోత్సాహము మరువలేను. వారిచ్చిన శీర్షికనే నేను స్వీకరించితిని. విమర్శకులందరికి నిశ్చితాభిప్రాయముండదని శ్రీ శాస్త్రిగారు తెల్లముచేసినారు. ఏలయన వారికి మొదటి యభిప్రాయము మారి భారతిలో వ్రాసినదానికి వారే దివ్యవాణిలో ఖండన వ్రాసుకొన్నారు.

సన్నిధానమువారి వ్యాసమువలన రాయలు కర్ణాటుడని తేలుచున్నది. మూలములో చోళరాజని కలదట. కాని దీనిలో రాయలు పాండ్యరాజనినాడట. దానికేమి? కవి రసానుగుణముగా నిచ్చవచ్చినట్లు మార్పులుచేయవచ్చును. కవిత్వము చరిత్రవలె శల్యపుంజముకాదు. ఈవిషయ మిటులుండ శాస్త్రిగారి సాహిత్యాచార్యులగు శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులవారు హైద్రాబా దాంధ్రసాహిత్య పరిష

ద్వాత్రింశోత్సవమున కరుదెంచి ప్రసంగవశమున యాముక్తమును గూర్చి యిట్లుపన్య సించిరి.

"ఆముక్తమాల్యదను రచించినది శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముడే. ఇది నిర్వివాదాంశము. అది యయోమయ మందసములో దాచిపెట్టబడిన సాహిత్యసంపద. దానిలోని యలంకారములు, దానిలోని భావగాంభీర్య మెచ్చటను లేదు. ఆంధ్ర సాహిత్యమందంత ప్రౌఢ ప్రబంధము లేదని నొక్కి వక్కాణించు చున్నాను. దాని యర్థమిదమిత్థమ్మని చెప్పనలవిగాదు. దీని యర్థము విప్పిచెప్పువార లెప్పుడు వత్తురో మన మీ కావ్యరసంబు గ్రోలుదుమోలేమో తెలియజాలము."

పైవాదోపవాదములవల్ల కృష్ణరాయలే యాముక్తమాల్యద రచించెనని తెలియ వచ్చుచున్నది. పెద్దన యిటువంటి ప్రౌఢ ప్రకృష్ట ప్రబంధరాజమును వ్రాయుటకు తగడేమో యని సందియము కలుగుచున్నది. ఏలయన మనుచరిత్ర శృంగార రస ప్రధానమగు కావ్యము. విష్ణుచిత్తీయము భక్తిరస పూరితమగు కావ్యము. పెద్దన, శ్రీ రాయలు తమ కథానాయకులపై వ్రాసిన పద్యములలో పోలికలున్నను శైలీ కాఠిన్యతయే వీటిలో ప్రత్యేకత. వంశావతార పద్యములు మనుచరిత్రయందును విష్ణుచిత్తీయమందును నుండుటవల్ల కూడ కృష్ణరాయలు వ్రాయలేదని కొందరను చున్నారు. కృష్ణరాయలు తన వంశమును గూర్చి పెద్దనార్యుడు రచించిన పద్య ములనే వాడుకొన్నాడు. ఇప్పుడింకను శ్రీ రాయ లాంధ్రుడా, కర్ణాటుడా యని వాగ్వాదములు తర్జనభర్జనలు జరుగుచున్నవి. కృష్ణరాయలు తాను తెలుగువల్లభుండ నని సుస్పష్టముగా నాముక్తమందు విశదీకరించినందున నందీత డాంధ్రుడు కాడని మనము శంకించవలసిన యవసరము కనపడదు. విజయనగర సామ్రాజ్యము కర్ణాటదేశము కాదు. శ్రీనాథుడు భీమేశ్వర పురాణమున "నా కవిత్వంబు నిజము కర్ణాటభాష" యనెను. దానంజేసి శ్రీ అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు శ్రీనాథుని కర్ణాటుడనియెను. సంస్కృతాంధ్రములు చక్కగా సమ్మిశ్రితమై విన సొంపైన భాష కర్ణాట భాషయని శ్రీనాథుని యభిప్రాయము. కృష్ణరాయల కుల మును గూర్చి వాదోపవాదములు గలవు. ఆతనిని కొందఱు దాసీ పుత్రు డందురు. కాని మొదటి కులమేమైనను పూర్వజన్మ సంస్కారజనిత విష్ణుభక్తివల్ల పునీతుడై జ్ఞాననిధులగు నాచార్యులను సేవించి సాహిత్య కవిత్వ సంపదల నలవర్చుకొని విష్ణుచిత్తీయము వ్రాసి దివమలంకరించెనని జన్మరాహిత్యము పొందెనని యెల్లర కును తెల్లమగును.

లలితోద్యాన పరంపరా పికశుకాలాపములతో ప్రతిధ్వనించుచు, మిన్నులతో రాయు సువర్ణ సౌధరాజములతో, నారికేళఫలవృక్ష నివహముతో, వైజయంతమును మించు ప్రాసాదములతో, చైత్రరథమునుమించు రమణీయోద్యానములతో, దివ్య ప్రబంధయుగాస్యలగు ద్రవిడ నితంబినీజన చతురపరిహాస విలాసోక్తులతో లక్ష్మీ నారాయణుని యపూర్వములగు కోవెలలతో, విదుషీమణులైన వారనారీజనంబులతో, రమణీయమధురసుగంధపుటరటులతో, పోకమ్రాకులతో, తియ్యమామిడి తోటలతో, దేవాలయమందు ప్రతి సాయంకాలమును మ్రోగింపబడు ఘంటా నినాదముల పటపటాత్కార క్రేంకారములతో, శ్రీవిలిబుత్తూరు పాండ్యనగరోర్వీ రత్న సీమంతమై దక్షిణాపథమున నొప్పారుచున్నది. ఏవంవిధ గుణగణ విశిష్టమగు విలిబుత్తూరులో ద్వయసద్మపద్మవదనుండు, నద్వంద్వుడును, ఛందోబృంద తదంత వాగపతనా సంజాత తజ్జన్య నిష్పందాద్వైత సుసంవిదాలయుడును, నిష్ఠా గరిష్ఠుండును, నశ్రాంతయోగాందూబద్ధ మధుద్విషద్విరదుడును, వైష్ణవోత్తముడు నగు శ్రీ విష్ణుచిత్తుడు నివసించుచుండెను. ఆతడు శ్రీరంగధామపాదారవింద కందళితాంతరంగుడై, ప్రాలేయాచలపద్యా యాతాయాత వైష్ణవావలికెల్లను "అభ్యాగతః స్వయం విష్ణుః" అను నాచార్య న్యాయ మనుసరించి న్యాయార్జిత విత్తంబున వారి మజ్జనభోజనాదులకు తగు సౌకర్యములను గావించుచు, ప్రత్యహము భక్ష్య భోజ్య చోష్యలేహ్యములతో వారి నవ్వారిగాగ నిష్టమృష్టాన్నసంతృప్తుల గావించుచు, వారి నమందానందసాగర నిర్మగ్నులజేయుచు, నాగేంద్రశయాను దివ్యప్రబంధానుసంధానధ్యానములతో పాపపరిహారము గావించుచు జీవయాత్ర సాగించుచుండెను. అతని యాతిథేయ సత్కార పూజాధిక్యతజేసి యాతని గేహసీమకు నఖిలకల్మషహరంబగు శీతల గంగాస్నానంబు గావించుకొని యనుష్ఠానాది కార్యక్రమముల చక్కగా నిర్వర్తించుకొనుచు వేలాది వైష్ణవోత్తములు ప్రతిశనివారము వచ్చుచుండిరి.

ఇది యిట్లుండ కనకముక్తాకవాట గోపురావేదితోచ్ఛ్రితాక్షోభ్య వప్రములతో తామ్రపర్ణీతటమందు దక్షిణాపథములో మధురానగర మలరారుచుండెను. ఆ ధరణీస్థలి నేలు రాజన్యు డరిరాజభయంకరుడై నిజప్రజానురంజకుడై విషయసుఖాస్వాద లోలుడై భటనికరకరవిలసితాసితోత్పల వనవాటిలో ద్రిమ్మరు లక్ష్మిని కైవసము

గావించుకొని రాజ్యమేలుచుండెను. ఇట్లు సామ్రాజ్యవైభవముల ననుభవించుచున్న కొంతకాలమునకు కాలక్రమమున శాల్మలీ విదళనముచే నిదాఘము ప్రారంభ మయ్యెను. అట్టి గ్రీష్మసమయమున మధురానగరిలోజరుగు 'తెప్పోత్సవము'నకు పెక్కు యాత్రికులు వచ్చిరి. ఆ యాత్రికులతోపాటు వైదేశిక విప్రు డొక డానగరి కేతెంచెను. అతడు సుందరబాహుస్వామిని సేవించి మగుడ నిజదేశమునకువెడలు నవసరమున వైఘానదీ పవిత్ర జలములతో సంధ్యావందన మాచరించి తాను బస చేసిన పురోహితునింటివద్ద పండువెన్నెలలో తదితర బ్రాహ్మణోత్తములగోష్ఠిలో నార్యావృత్తములు చదువనుండెను. సరిగా నిదే తరుణమున నా మధురానగరి నేలు మత్స్యరాజేంద్రుడు ఘుమఘుమస్ఫాయత్ ఘుసృణమృగనాభి సుగంధద్రవ్యముల నలదికొని కేలస్వర్ణత్సరువు వాడివాలు మెఱయ, తలవరులు ముందునడువ భోగినీ మందిరమునకు బోవుచుండెను. ఆ మార్గమధ్యమున నీ వైదేశికుడు బ్రాహ్మణుల గోష్ఠిలో నీ పద్యమును చదివెను.

వినియె నెలన్చతుర్ద్వయిని వృష్టిదినాళికి, రాత్రికై దివం
బున, జరకై వయస్సునను బూని పరంబున కిప్పు డుద్యమం
బనువుగ జేయగావలయు నంచుఁ బురోహితధర్మ మాత్మ గీ
ల్కొన నల విప్రు డాద్విజులలోన సుభాషితము న్పఠింపగన్.

భోగిని కడ కేగుచున్న యా భూపాలుడు భూరివిధ చింతాక్రాంతాంతః కరణుడై పై పద్యమందలి యర్థమును గ్రహించి యా భోగాంగన వద్దకు బోవుట మాని మోక్షమును గూర్చి చింతింపక వృథా కాలహరణము చేసితినని పశ్చాత్తప్త హృదయుడై ముముక్షుయత్తచిత్తుడై ఇప్పటికైనను పరలోకానందమున కుద్యమింతునని నిశ్చయించుకొని గృహోన్ముఖుడయ్యెను. మరునాడు తన కొలువు కూటమందున్న నిఖిలమత విద్వాంసుల రావించి "మీ మీ శాస్త్రంబులలో నెవ్వడు మోక్షంబెలయించునో చూచి నిశ్చయింపుడటంచున్" ఆజ్ఞాపించెను. అంతేగాక శుల్కము నొసంగుదునని వరాల సంచిని గూడ వ్రేలాడగట్టెను. దాని వల్ల మోక్ష కారులలో హరుడొకడని, హరి యొకడని వారు చేయు కోలాహలములకు, వాదోప వాదములకు, సిద్ధాంత రాద్ధాంతములకు నా రాజన్యుని కొలువుకూటము ప్రత్యక్ష నరకమయ్యెను. నిశ్చయముగ నిర్ధరించి యొక్కరు నేకాభిప్రాయమునకు రాజాల కుండిరి.

ఇదేకాలమున పెరియాళ్వారగు విష్ణుచిత్తుడు శ్రీవిల్లిబుత్తూరునందు నిత్యా నుష్ఠానములను దీర్చుకొనుచు నష్టాక్షరీమంత్ర పురశ్చరణము చేయుచున్న

సందర్భమున తన్మంత్రాధిదేవతయగు శ్రీమన్నారాయణు డా భక్తశిఖామణి నుద్దేశించి "ప్రావృషేణ్య పయోధర ధ్వాన గంభీరంబైన యెలుంగున" "నీవు మధురానగరికేగి పాండ్యుని రాజసభాభవనంబును ప్రవేశించి వాదుల నోడించి వైష్ణవమత ప్రభావముం బ్రకటించి ప్రపంచపరాఙ్ముఖుడైన యారాజన్యుని వైష్ణవుగా నొనరింపు" మని కోరెను. అందులకు విష్ణుచిత్తుడు వినయ వినమ్రుడై సాష్టాంగ ప్రణామము లాచరించి తా నితఃపురాపఠిత శాస్త్రగ్రంథ జాత్యంధుడని, నారామక్ష్మాఖననఖనిత్ర గ్రాహితోద్యత్కిణస్తోమాస్నిగ్ధకరుడని, భవద్భవన దాసుడని, వాదిగా పంపినచో నా భూమీభృత్సభ నోట మైన నా యపయశంబులు తమకే యని భగత్సేవ దక్క నన్య మెఱుగడని, యేతత్కార్యముల కన్యుల నియోగింపవలసిన దని పలుమారా దివ్యపురుషుని ప్రార్థించెను. అందులకా భక్తచింతామణి భక్తుని మనస్థైర్యమునకు మెచ్చుకొని తన ప్రక్కనున్న లక్ష్మీకటాక్షమును గ్రహించి వాది నితనితో గెలిపింతునని యామె నుద్దేశించి పలికి విష్ణుచిత్తునితో "నీవు మిన్నక పొమ్ము, నిను మెప్పింతు నవల నేనున్నాడ నని" యభయహస్తమిచ్చి యంతర్హితు డయ్యెను. విష్ణుచిత్తుడా శ్రీకైవల్యనాథుని యానచొప్పున మధురకేగుటకు దారి బత్తెమును సేకరించుకొని పాథేయవంతములగు పొరివిళంగాయలను మూట గట్టుకొని బయలుదేరెను.

ప్రతినిత్యము వాదములు జరుగుచున్నందున ప్రతీహారి యేయడ్డంకి లేకయే విష్ణుచిత్తునికి రాజసభాప్రవేశము నిచ్చెను. రాజుచే నానీతుడై తనకు ప్రత్యేకించిన హేమసింహాసనమునం దుపవిష్టుడయి, రాజాతిథ్యము గ్రహించిన పిమ్మట వాదము లాడువారి నాపి నేను వాదములో పాల్గొందునని వారికి తెలియబరచెను. విష్ణుచిత్తుని ప్రతిభ యాతని మొదటి వాదసరణిబట్టి గ్రహించి తాము వాదించుచుండ రాజును మధ్యవర్తిగా నుండుమని కోరి వారి నందుల కంగీకరింపజేసెను. "సర్వమ్ విష్ణుమయమ్ జగత్" అను వాక్యము నాధారము గావించుకొని యన్యమతము లేవిధముగా మోక్షమార్గము జూపజాలవోనిరూపించి "శ్రీమన్నారాయణుడేసత్యము. సర్వము మిథ్య"యని "ఏష సర్వభూతాన్తరాత్మా ఉపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణో హరిః" యను నుపనిషద్వాక్యము ప్రమాణంబు గావించి విశిష్టాద్వైతమత సిద్ధాంతము సప్రమాణముగా నిరూపించి వైష్ణవమతస్థాపనము గావించెను. ఈ మతమునకు ప్రాతిపదిక యనంబడు నొకానొక వాదమును రాజునకు విష్ణుచిత్తు డీవిధముగ వినిపించెను.

పూర్వము నిమివంశాలంకారుడగు దర్మజుడను భూమీపాలునకు కృత ధ్వజుడు, మితధ్వజుడను తనయు లుండిరి. వారిలో మొదటివానికి బ్రహ్మజ్ఞాని యగు కేశిధ్వజుడును, రెండవవానికి ఖాండిక్యుడను కర్మఠుడును జన్మించిరి. వారు పరస్పర రాజ్యకాంక్షచే ప్రజలు తల్లడిల్ల పెక్కు దినంబులు సంగ్రామ రంగంబున పోరాడిరి. చివరకు ఖాండిక్యుడు కేశిధ్వజున కోడి యడవిలో గుడిసె వేసికొని యందు నివసింప దొడగెను. కేశిధ్వజుడు తనకు ప్రాప్తించిన రెండు రాజ్యములను పాలించుచు సంసారసాగర తాపత్రయ ఘోషలనుండి విముక్తి కాంక్షించి జన్నంబు సేయు నుద్యోగంబున నుండ యజ్ఞగవి శష్పకబళములం దినుట కడవికేగి పులి వాత బడెను. కేశిధ్వజుడు దీనికి ప్రాయశ్చిత్త మేమని ఋత్విక్కుల నడుగ వారు తమ కేమి తెలియదనియు ఖాండిక్యుని పృచ్ఛచేయుమనియు ప్రత్యుత్తర మిచ్చిరి. దానిపై నాతడు నేను నిష్కృతి వేడబోయిన ఖాండిక్యుడు నన్ను హతమార్చినను నాకు యజ్ఞఫలము దక్కును, కాక నిర్మత్సరుడై నిష్కృతి చెప్పినను యజ్ఞము పూర్తియగు. నెట్లయినను నిరుదెరంగుల నుభయతారకమని తలంచి రథాధిరూఢుడై ఖాండిక్యు డున్నచోటు డాయం జనిన ఖాండిక్యు డతనిని శంకించి "యో రాజాధమా! రెండు రాజ్యము లపహరించినదిగాక మరల నీవు ప్రశాంతవేషమున జింకతోలున నాచ్ఛన్నుడవై తాటకేయ పలభుక్కూటాకృతిని నన్ను హతమార్చుటకు వచ్చు చుంటివా నిన్ను నాత్మసంరక్షణార్థము సంహరింతునని చెప్పెను. దానికి కేశిధ్వజు డెగ్గెత్తి "నే చంపవచ్చిన వాడనుగాను. యజ్ఞముచేయుచున్న యవసరమున యజ్ఞ పశువు పులికి గ్రాసము కాగా నేను ఋత్విక్కుల నిష్కృతి నడుగ వారు తమ కేమి తెలియదనియు నిన్నడుగుమనగా నే వచ్చితిని నీవు నన్ను హతమార్చినను యజ్ఞఫలము దక్కును, కాక నిర్మత్సరుండవై నిష్కృతి చెప్పినను యాగఫలం బిర్వురకును దక్కు నెట్లయినను నాకు మేలే" యని ప్రత్యుత్తరం బిచ్చెను. ఈ వృత్తాంతమును విని ఖాండిక్యుడు తన మంత్రితో మంతనముచేయ జ్ఞాతివధ యవ శ్యము చేయవలెనని వా రుద్బోధించిరి. దానికి ఖాండిక్యుడు వానిని జంపిన యాత నికి స్వర్గము మనకు రాజ్యము వచ్చు టేమి ఫలంబని వాదించి

'బద్ధాంజలిపుటు దీనుఁ
గ్రుద్ధుండై శరణుఁజొరగ గూల్చుట కడు గీ
డుద్ధతి పరలోకార్జన
బుద్ధికి' నను కణ్వవాక్యములు దలపరొకో!

యని వారిని సమాధాన పరచెను. అట్లని యుత్తరక్షణమే ఖాండిక్యుడు కేశిధ్వజునకు ప్రణామ మాచరించి యాతనివల్ల వృత్తాంతం బంతయు తేటతెల్లంబుగా గ్రహించి దానికి సరియగు నిష్కృతి తెలిపెను. కేశిధ్వజుడు క్రతువును సక్రమముగా పూర్తి గావించి సఫలీకృత మనోరథు డయ్యెను. కేశిధ్వజుడు బ్రాహ్మణులకును, యాగసమాప్తికి తోడ్పడినవారి కెల్లరకును భూరిదక్షిణ లొసంగెను. గురుదక్షిణ నీయకుంటినే యని వితర్కించి మరల ఖాండిక్యునివద్ద కేగి తాను గురుదక్షిణ నీయవచ్చితినని యామేర తీర్చుమని యాతని నభ్యర్థించెను. దానికి ఖాండిక్యుడు తన హితులను గురుదక్షిణ యేది కోరవలెనో తెలుపుమని యడిగెను. దానికి వారు చతురుదధివేలావలయితంబైన సామ్రాజ్యమడుగుమని సలహానిచ్చిరి. దానికి ఖాండిక్యుడు లేత నవ్వాననసీమదోప మీ రతి చంచలమగు సామ్రాజ్యలక్ష్మినే కోరుచుందురు. మీరు మోక్షమార్గ నయ విచారణ కోవిదులుకారు, నేనతిచంచలమగు రాజ్యలక్ష్మి నేవిధమున కోరగలవాడ? కాన పరమార్థమునే కోరుదును. తాను పరమార్థమును కోరుటకు నిశ్చయించుకొని మేము నిమివంశోత్పన్నులము, రాజ్యము మాకు లక్ష్యము కాదని పలికి యా కేశిధ్వజుని గారవించి గ్రుచ్చి కవుంగిలించుకొని నే నడిగినది గురుదక్షిణగా తప్పక నీయవలెనని యాతనిచే వాగ్దానము గావించుకొని సకల భవక్లేశ సంక్షయమగు విద్య బోధింపుమని యడిగెను. అందుల కా కేశిధ్వజుడు నివ్వెరపోయి క్షత్రియులకు రాజ్యమే ముఖ్యము. దానిని గోరక యిది యేల యడిగితివనియెను. దానికి ఖాండిక్యుడు కేశిధ్వజు నుద్దేశించి "ఓయీ! నేనీ క్ష్మాభాగమును గోరకుండుటకు హేతు వావేదించుచున్నాను. రాజ్య కాంక్ష యవివేకికి గాని వివేకికి జనించదు. మరి పరాక్రమంబున సంగ్రామ రంగంబున వైరులంగూల్చుట రాజునకు ధర్మమేయైనను నట్లు చేయని దోషము నీచేత విజిత రాజ్యుడనైన నన్నంటదు. రాజ్యమును గోరుటకు నే నంగీకరింపను. అహంకార మమకారము లుడిగిన నాకేల రాజ్యకాంక్ష?" దానికి ప్రీతుడై కేశిధ్వజు డిట్లు మారు పల్కెను. "నిమివంశోత్పన్నుడవగు నీకీ పరతత్వకాంక్ష గలుగుట మన భాగ్యమే. కావున నీకు నా విద్యావిధానమును బోధింతునని

ప్రాణికోటికెల్ల బంధంబు మోక్షంబు
చేరుటకును మనసు కారణంబు
విషయసంగియైన విను బంధకారి ని
ర్విషయమైన ముక్తివిభవకారి.

యని సూక్ష్మముగా నాత్మ జ్ఞానోపదేశము గావించి శ్రీమన్నారాయణుని స్థూల సూక్ష్మ రూపంబుల సోపపత్తికముగా నాతని కెఱింగించెను. ఖాండిక్యు డీయుపదేశ సారమును గ్రహించి తాను ధన్యుడనైతినని వాకొనెను.

విష్ణుచిత్తు డీ కథను ముగించునంతనే యేదేనొక యదృశ్యమగు శక్తి వరాలసంచి త్రాటిని విజయసూచకముగా త్రెంపివైచెను. అదేసమయమున దేవతలు సంతసమున విరులవాన గురియించిరి. పాండ్యరాజగు మత్స్యధ్వజుడు తన యాస్థానమందు చెలరేగిన వాదములో పాల్గొన్నవారి కందరికి, జయాపజయములు దైవాధీనములని గుర్తెఱింగి, యథోచితముగ పారితోషికములిచ్చి వారిని సాగనంపెను. విష్ణుచిత్తుడు తన వాదమహిమచే పాండ్యుని పరస్త్రీ పరాఙ్ముఖుని గాను మోక్షోన్ముఖునిగాను మార్చెను. విష్ణుచిత్తుని విజయమునుగూర్చి దేవత లాకాశమందు బళిబళీ యనిరి. పితరు లహో యనిరి. సిద్ధు లాహో యనిరి. విద్యాధరులు కలియుగము కృతయుగమైనదనిరి. కిన్నరులు దుర్మతులకు పొంగినపొగరు నాశనమయినదని సంతసించిరి. వాదమునం దోడినవారు తమకుదోచిన విధముగా వ్యాఖ్యానముచేసి చెప్పుకొనుచు యథేచ్ఛముగా తమతమ నెలవుల కరిగిరి. పాండ్యునిచే సెలవుపొంది గజారూఢుడై విష్ణుచిత్తుడు మగుడ తన పురమునకుజను నవసరమున భక్తశిఖామణి యాతనికి సాక్షాత్కరించెను. విష్ణుచిత్తుని సందర్శించుటకేతెంచిన త్రయస్త్రింశత్కోటిసుర లాభగవంతుని కెరగిరి. భగవద్దర్శనమునకు సంతుష్టాంతఃకరణుఁడై యాతని నాభక్తుడు దశావతారములలో స్తుతించెను. అందులకు ప్రసన్నుడై యా భక్తజన మందారుడు పాండ్యుడొసగిన ధనముతో విష్ణ్వాలయ కైంకర్యము చేయుమని యానతిచ్చి తిరోహితుండయ్యె. అంత విష్ణుచిత్తుడు విజయభేరి మ్రోగించుచు, విలిబుత్తూరు జనుల స్వాగతము లందుకొనుచు నిజపురి కరుగుదెంచెను. తానుగాంచిన గౌరవమర్యాదలు విజయ మరవిందలోచనుని ప్రసాదవిశేషఫలితమే గావున తొల్లిటికన్న శతగుణము లధికముగా భాగవత పూజాప్రవణుండై యుండెను.

ఒకనాటి మధ్యాహ్నకాలంబున శ్రీరంగనాథుండు గరుణాయత్త చిత్తుడై యపాంగ కటాక్ష వీక్షణమున లక్ష్మి నీక్షించి, విష్ణుచిత్తు నుద్దేశించి యీ విష్ణుచిత్తుడును యామునాచార్యుడును నా కృపావిశేషమున వైష్ణవమతము నుద్ధరించిరనెను. అందుల కయ్యిందువదన యా యరవిందలోచనుని నాతనిచరిత్ర చెప్పుమని వేడగా నాతడు వల్లెయని యిట్లు చెప్పదొడంగెను,

తొల్లి నన్నారాధించెడి భక్తుడొక డుండెను. అతడు బాల్యమాదిగా నాచార్యుల నాశ్రయించి వేదశాస్త్రముల నభ్యసించుచుండెను. ఆ కాలమున నీ పాండ్యుని పూర్వు డొకడు శైవమత ప్రాబల్యముపై వ్యామోహము కలవాడై శివుడే పరతత్వ మని జంగమదేవరలచే పురాణోపనిషత్తుల నాలకించుచు విష్ణ్వాలయములలో జరుగు నుత్సవములకు విముఖుడై యుండెను. శివలింగముల ధరించి యేపాప మొనరించినను వారి నాదరించుచు తన పద్ధతి నంగీకరించువారి కగ్రహారము లిచ్చుచుండెను. అందుండు బ్రాహ్మణులు కూడ శైవమత విముఖులైనను నుదర పోషణార్థము త్రిపుండ్రముల ధరించుచు రుద్రాక్ష మాలలను కూడ వేసికొని యథేచ్ఛముగ రాజగౌరవ మర్యాదలకు పాత్రులగుచు వచ్చిరి. ఇది యిట్లుండ నాతని రాజ్ఞి వైష్ణవ మతస్థురాలై యేకాదశీ వ్రతము చక్కగా నిర్వర్తించుచుండెను. 'నదీనాం సాగరో గతిః' అన్ని మతములు భగవత్సాన్నిధ్యమునకు చేర్చునవేకద. ఆ రాజు గర్వాంధుడై మామకీన భక్తుల నవమాన పరచుచుండెను. ఆ విప్ర కుమారుని మనస్సులో శైవమతము నోడించి వైష్ణవమత సంస్థాపన చేయవలెనని తలంపు కలిగింప నతడు పడమటి ద్వారంబు చేరి పట్టమహిషి నుద్దేశించి యేను నై దేశికుండ; నీ భర్త వైష్ణవమత పరాఙ్ముఖు డాతనిని వైష్ణవునిగా నొనరించెద; నేదేని నుపాయమున నన్ను లోపలికి రానిమ్మని యామెను ప్రార్థించెను. ఆ రాణి తన ప్రాణేశ్వరునితో నీ వృత్తాంతమును చెప్పెను. ఆరాజు "ఏమీ శైవము నోడించ వచ్చెనా ? రమ్మను" మనియెను. మరునాడు యామునాచార్యుడు రాగి వృక్షమును సాక్షిగా గొనుచు రాజసభాస్థలి ప్రవేశించి యా రాజదంపతుల కెఱిగిన రాజిట్లని యెను. "నీవు చూడగా చిన్నవాడవు. వాదమం దోడిన నీకు లింగము కట్టెద" ననియెను. "నా మత మోడిన భస్మము రుద్రాక్షలు మాని మురఘస్మరచక్రాంకితుడ గాగలవాడ"నని రా జంగీకరించెను. యామునాచార్యుడు నృపాల పుంగవునితో పరిహాసముగా "నన్నెవ్వడు ప్రేరేపించెనో యతని సహాయముతో నేను గెలుతును. జయాపజయములు దైవాధీనములు. అతడే బొంకిన నేనేమి చేయగల వాడను ? కాని యమ్మ దెచ్చిన విద్వాంసుడనని యామెను గేలిసేయవ"ద్దని వేడు కొనెను. వాదసరణిలో యామునాచార్యుడు శైవమతస్థుల నోడించి వైష్ణవ మత స్థాపనము చేసెను. దానికి రాజు మెచ్చి యతనికి తన కడపటి చెల్లెలినిచ్చి వివాహము చేసి యతని కర్ధ రాజ్యమిచ్చెను. యామునాచార్యుడు రాజ్యభోగముల ననుభవించుచు దిగ్విజయయాత్ర జేసి జన్నములు కావించి భగవంతుని విస్మరించి భోగలాలసుడై యుండెను. యామునాచార్యుని ముత్తాత శ్రీరామమిశ్రాఖ్యు డీతని

మనఃపరిణామమునకు చింతనొంది ముండ్లముచ్చింతకూర ప్రతి దినము తెచ్చి యిచ్చి వండిపెట్టుమని యాదేశించెను. రాజును బ్రాహ్మణుడు తెచ్చినదని విని సంతసించి యారగించుచుండెను. ఒకనాడు యామునాచార్యు డా కూర నంజు కొనుచు యీ కూర తెచ్చియిచ్చిన భాగవతుని నా దర్శనము చేయుట కాదేశింపు డన యాతడు వచ్చెను. వచ్చిన ప్రయోజనమడుగ నతడు మీ పెద్దల నిక్షేపము చూపవచ్చినాడనని చెప్పి నీ కొక్కనికి మాత్రమే చూపవలెననిన యామును డతనితో గూడి శ్రీరంగక్షేత్రమున కరిగెను. అందు కావేరియం దఘమర్షణ స్నానము గావించిన పిదప శ్రీరంగని పాదపద్మముల యాతనిపెద్దల నిక్షేపముగా చూపించెను. దానికి యామునుడు విస్మయమంది తన పూర్వావస్థను స్మరించి తన యధోగతికి పశ్చాత్తప్త హృదయుడై యా శ్రీరామమిశ్రుని తన పితామహుండగు నాథముని ప్రశిష్యునిగా నెఱింగి తాను సన్యసించి భగవన్నామ స్మరణము గావించుచు కాలక్షేపముచేయువాడై తన నగరికి మగుడ తిరిగివచ్చి తన కుమారుని పట్టాభిషిక్తుని గావించి యతనికి రాజనీతి యంతయు గఱపి, రాజ్యము గావింపు మని యతని నియుక్తుని గావించి సన్యసించెను. ఇది మదీయభక్తుని వృత్తాంత మని చెప్పెను.

ఇంతలో వసంతకాలము వచ్చెను. వనలక్ష్మి నూతనశోభతో నలరార జొచ్చెను. ప్రతివారికి నాశలు చిగుర్చుకాలమది. ఆ కాలమందు విష్ణుచిత్తుడు విశాల మైన వృక్షవాటియందు నొక తెల్లతామర కొలనువద్దనున్న తులసికోటయం దొక పాలగచ్చువద్ద నొక యాడనిసుగును గాంచెను. అనపత్యునకు ముకుందుడే యీ నిసుగును తనూజాతగా ప్రసాదించెనని తలంచి సంతోషముగాగొని తన పత్నికి పెంచుటకిచ్చెను. ఆమె దినదిన ప్రవర్ధమానయై క్రమముగ శైశవముజారి యౌవన వతియయ్యెను. ఆమె కురు లత్యంతసుందరములై నారాయణునిగూడ మోహింప జేయునవిగా నుండెను. ఆమె యాటలం దన్వహము బొమ్మల కల్యాణములు గావించుచుండెను. ఆ కల్యాణములకువచ్చు వైష్ణవ వధూటులు లక్ష్మీ కల్యాణ గీతములు పాడుచుండ వాటిని నశ్రాంతము వినుచుండుటవలన నా శ్రీమన్నారాయ ణునే పెండ్లియాడ వలెనను ప్రబలమగు కోరికకల్గెను. విష్ణుచిత్తు డా వనమాలికై సిద్ధముచేసిన పూలమాలలను ప్రతిదినము నబ్బాలికారత్నము మెడలోధరించి బావిలో తన నీడనుచూచి సంతసించి మురియుచు నొకక్షణ మటులుండి తరువాత యథాస్థానమున నుంచుచుండెను. దీనివల్లనే యామె కాముక్తమాల్యద యని పేరు వచ్చినది. అనగా నొకసారి ధరించి తీసి మరల యిచ్చునదని శబ్దార్థము.

శ్రీమన్నారాయణార్పిత మానసాంబుజయైన నప్పాల యనిశము భగవంతుని యవతారములం దతడు గావించిన దుష్కార్యముల నన్నింటిని దూరుచు నీవిధముగ భగవన్నామస్మరణము చేయుచుండెను. ఈ సంగతిని గనిపెట్టి యామె చెలి యలు విరహతాపముననున్న నితంబినీజను లిట్లే యేదో మిషచే తమ నాథులను సంకీర్తనముచేతురని యెన్నియోమార్లు గేలిసేయుచు వచ్చిరి. అందుల కామె వారిపై నలిగి వారి కెడమొగముగా పెడమొగముగా నుండజొచ్చెను. పైకి వారు కోపించినను లోలో భగవంతునిపై యనుదినము విరహవేదనాభరమున గ్రుంగు చుండెను. "అట్లిగుగా మది మోహముండినన్." అదియునుంగాక యశ్రాంతస్వప్న వ్యాపారపారీణతలో నాగకన్యలను దేవకన్యలనుగాంచి తానును దివ్యాంశసంభూత యయినట్లెటింగి యా గోవిందరాజస్వామి లీలలనే స్మరించుచుండెను. ఆముక్త మాల్యద విరహతాపమునుగూర్చి విష్ణుచిత్తుడు చింతించుచుండ యది యే తపమో యని భావించుచుండెను. తన కూతురి వృత్తాంతమంతయు భగవంతునకు నివే దించెను. దానికి నారాయణుండు నవ్వి విష్ణుచిత్తునకు మరొక భక్తునికథ చెప్ప దొడగెను.

నా భక్తుడు మాలదాసరి యొకడుండెను. అతడు పూర్వము వామనావతార మున నేను వసించిన యాశ్రమమునకు మూడామడలదూరమున నొక గ్రామములో వసించుచుండి ప్రతిదినము బ్రాహ్మీముహూర్తమున యిచ్చటికివచ్చి నా స్తోత్రములు మంగళకైశికిరాగమున పాడుచుండెను. వాడు నా ప్రీతికొఱకు తన జాత్యోచిత ధర్మ మును దప్పకుండ శుచిగానుండుచుండెను. ఆ దాసరి బ్రాహ్మణాద్యుత్తమజాతి వార లను చూడగానే దూరముగాబోవును. శీతాతపవాతములనక స్వామి సంకీర్తనము విని యుక్తమగువందాక వేచియుండి పిమ్మట యెవ్వరేని యతనిభక్తికి మెచ్చి ప్రసాదమిచ్చిరేని దానినారగించి యేగుచుండెను. ఒకనాటి యర్ధరాత్రమున చెంత నొక పొరుగింట పిల్లిచొఱగా దానికి భయపడి గృకవాకముకూయగా బ్రాహ్మీ ముహూర్తమాయెనని యెంచి వెంటనే తనకుతానేలేచి నన్ను సంకీర్తనచేయుటకు వచ్చుచు కంటకావృతమయిన నొక మార్గమున దాటుచు పోవుచుండెను. ఆ విష్ణు భక్తు డాగతినిపోవుచు నిర్జనారణ్యమందొక వటక్ష్మాజమునుగాంచెను. దానికి రెండేసి క్రోశములు నిడివిగల యూడలుండెను. వానిపైగములనిండ కొమ్మలు మొలిచినవి. వాతాహతిఁ యావృక్షము యాకులలోనిగీరలు నావద్దకురాకుడు, నాచెంత బ్రహ్మ రాక్షసుడున్నాడని వారించుచున్నవోయన నొప్పుచుండెను. ఆదాసరి యాటవక్ష్మజ మునుగాంచి యిందెవ్వరో యున్నారని సంశయించు నవసరమున బ్రహ్మరాక్షసు

...ి దాతనికి ప్రత్యక్షమయ్యెను. బ్రహ్మరాక్షసుడు నిలునిలు చిత్రవధచేతునని యతనివారించి బంధించెను. మాలదాసరి కొంతవేగు పెనగి గత్యంతరములేక జంప నుంకించుచున్న బ్రహ్మరాక్షసుని గని 'ఓయీ ! ని న్ననిమిషులైనను గెల్వ జాలరు. నీవు నన్నుచంపుట మంచిదే. చంపినచో యీ చండాలజన్మము తొలగును. వైకుంఠప్రాప్తి కలుగును. నే ననిమిషుడ నగుదు' ననియెను. అందులకా బ్రహ్మ రాక్షసుడు "ఓ మాతంగీ ! నేనును చదువుకొన్నవాడనే. నేను చదువనిశాస్త్రములు, శ్రుతులుగలవా? అదినమ్మవేని 'ప్రథమాం పిబతే వహ్ని'యను ప్రమాణము తప్పదు గదా" యనియెను. దీనికా మాతంగి 'ఓ బ్రహ్మరాక్షసుడా' నీకు నాదేహమర్పింపక మానను కాని నేనుప్రత్యహ మొనరించు వ్రతం బొందుగలదు. దానినిచేయుట కనుగ్ర హింపు'మనెను. అంతకు నాబ్రహ్మరాక్షసుడు నమ్మకుండిన నామాలదాసరియిట్లనెను.

ఎవ్వని చూడ్కి-చేసి జనియించు జగంబు, వసించు నిజ్జగం
బెవ్వని యందు డిందు మరి యెవ్వనియం దిది యట్టి విష్ణుతో
నివ్వల నొక్క-వేల్పు గణియించిన పాతకి నౌదు నేడు నే
నెవ్విధియైన నిన్నదియనేని యన న్విని బంధ మూడ్చినన్.

బంధములు సడలించిన పిదప నా మాలదాసరి విష్ణుభక్తి సంకీర్తనము గావించి మరల నా రాక్షసునివద్ద కేగి నన్ను భక్షింపుమని యడిగిన యందుల కాతం డెంతయు సంతసించి మాతంగున కిట్లనెను.

"ఓ మహాత్మా ! నీకెన యెవ్వరు. నీ మధురమైన స్తోత్రగాన తరంగ భంగికలవలన సంసారసాగర ముత్తరించుచున్నాను." దీనికి సంభ్రమపడి మాల దాసరి "ఓ రాక్షసా ! నేను దేహ మర్పించుచున్నను గ్రహింపని కారణమేమి" యని యడిగెను. దానికి రాక్షసుడు "నీవంటి భాగవతోత్తముల జంపిన నాకేమి లభించును. నీవు పాడిన భక్తిగీతముల ఫలిత మీయు"మని యడిగిన నియ్యనని ప్రత్యుత్తర మిచ్చెను. తుద కానాటి ప్రాతఃకాలమున పాడిన భక్తిగీతముల ఫలి తము మాత్ర మీయుమని యాతని పాదములపై బడిన యతం "డట్లు కానిమ్ము, లేలెమ్ము. నీకీ రూపము వచ్చిన విధానము సెలవి"మ్మని యడిగిన నేను ఘంటా కర్ణుని కన్న యెక్కుడు పాప మాచరించలేదు. నా పూర్వ వృత్తాంతము వినిన కీటపడగలదని యాతని పూర్వచరిత్ర యాత డిట్లు చెప్ప మొదలిడెను.

"నేను బ్రహ్మరాక్షసుడను. కుంభజాను సంజ్ఞుండను. ఒక్క-క్రూరకర్మచే నాకీరూపము వచ్చెను. నేను సోమశర్మయను భూబర్హిర్ముఖుండను. చోళదేశమునం దొక పల్లెలో నుండి వాజ్ఞైపుణ్యమున తార్కి-కుల గెల్చుచుంటిని. శ్రౌతక్రియా

నిపుణుల పొరపాట్లు బయటవేయుచు స్మార్తకర్తల ప్రయోక్తలు ఖండనకారికా పుస్తకములు విప్పగానే వారిని పరిహాసము చేయుచుంటిని. జల్పవాదినై సుఖీ మండలి గ్రాంథికత్వ మవమానము చేయుచుంటిని. ఇన్నడవక ప్రభిన్నగండంబగు వేదండంబువోలె మదాంధుండనై, దీక్షితులం జూచి యుచ్చపొడమీ ప్రవ్యాఖ్యాతినై మధురకుం బోయి నానాదుర్విధముల ధనమార్జించి కోమటివద్ద వడ్డికిచ్చి యింకొక యూరి కేగదలచి యా ధనమును గైకొంటిని. మాదిగవాడలో క్రొత్తచెప్పులజోడు కొని నూనె పట్టించుకొని పెరిగిన పలితకేశములకు క్షురకర్మంబు గావించి మీసం బును దిగగొరిగి ప్రయాణమును సాగింప దలచితిని. నా తోటి ప్రయాణీకులతో నేను సంభాషించు విధము గ్రహించి యొక దొంగ మా ప్రయాణపు తెఱ గెఱింగి మా జట్టులో చేరి తన వారిని మమ్ముల నడ్డగించుటకు ముందు పంపి తా నొక పథికుడుగా నగపడి మాతో పరుండి రాత్రి యొక పెడమార్గము పట్టించి యుత్తరము వైపు తీసికొనివెళ్ళెను. పోయి పోయి సెలయేటిలోనికి తీసికొనివెళ్ళెను. దొంగలు వచ్చి మీ మీ ధనమిత్తురేని మిమ్ముల జంపమనిరి. వారట్లు దోచుకొనుచుండ నేను పలాయన మంత్రము పఠించితిని. ఇంతలో నన్నెఱిగిన మొదటిదొంగ నన్ను వెంటాడి మద్ధనమంతయు హరించి నన్ను తెగటార్ప నుంకించు సమయమున బాటసారుల గుంపొకటి యరుదెంచెను. వాడు కొట్టిన దెబ్బలకు నేను మిగుల గాయపడితిని. ఆ గుంపులో నా యిల్లాలి బంధు వొకడు నన్నానవాలు పట్టి పల్లకి యొకటి తెచ్చి దానిలో నన్ను పరుండబెట్టి నీరు ద్రావ బోయెను. అంతలో నేను చనిపోతిని. దాని వెంటనే నా కీ బ్రహ్మరాక్షసుని రూపము వచ్చెనని చెప్పుచుండ గానే యాతడు సోమశర్మ యయ్యెనని భగవంతుడు విష్ణుచిత్తునకు జెప్పెను. దాని పిదప భగవానుడు నీకు గలిగిన యాడుశిశు వాముక్తమాల్యద. ఆమె శ్రీరం గేశుని వలచియున్నది. నీ వామెను శ్రీరంగక్షేత్రజ్ఞునకు నివేదింపుమని యానతిచ్చి తిరోహితుండయ్యెను.

స్వామి యాజ్ఞానుసారము విష్ణుచిత్తుడు తన కూతును వెంట నిడుకొని శ్రీరంగమున కరిగి యా కోవెలయందు స్వామి కైంకర్యంబులు గావింప నియో గించెను. అంత నొక్కనా డామె రూపవిభవ విభ్రమాది సౌశీల్యంబులకు మనం బెంతయు చలింప చక్కెరవింటివాని శరపరంపరల కాగలేక తనలో నైక్యము చేసికొనియెను. విష్ణుచిత్తుడు తన తనయను గాంచక భగవంతుని మందలించెను. తనకూతును కానలేక పలు విధముల వాపోయి, యింత వేడుకయిన పరిణయ మాడుట కీయనా ? నన్నవమానించుట యేల యని ప్రార్థించెను. దానికి భగవాను

'డోయీ! ముదిమదితప్పి పలుకుచుంటివా నీతనయను నీయింట పదిలముచేసి వచ్చి నన్ను దూరెదవేల ? నీ యింట గాన్పింపకుండిన నన్ను నిందింతువు గాని పొ'మ్మనియెను. విష్ణుచిత్తుడు తన గేహమునకుఁ జని యామెను జూచి సంతస మందెను. శ్రీరంగనాథుడా కన్యను కోరుటకు బ్రహ్మరుద్రాదుల నంపెను. విష్ణుచిత్తుడు తన యంగీకారమును తెలిపెను. రంగనాథుడు తదితర గణములతో విలిబుత్తూరికి వచ్చి గోదాదేవిని పరిణయమయ్యెను.



ఆముక్తమాల్యద యితివృత్తము ద్రవిడ సాహిత్యమునుండి యుద్ధృతము. ఇతివృత్తము పురాణగ్రంథములనుండి గైకొనుట యానాటి ప్రబంధముల యాచారముగా సూత్రప్రాయముగా రామరాజభూషణుడు తన వసుచరిత్రలో పేర్కొనినాడు.

కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరిపుట్టు రత్నము లవారిత సత్కవికల్పనా విశే
షావహ పూర్వవృత్తములు సానలదీరిన జాతిరత్నముల్
కావున నట్టి మిశ్రకథగా నొనరింపుము నేర్పుపెంపునన్.

మనుచరిత్రకు మూలము మార్కండేయపురాణము. వసుచరిత్రకు భారతమాధారము. పారిజాతమునకు వేదవ్యాసుని భాగవతమందలి మూడు శ్లోకములాధారములు. రాఘవపాండవీయమునకు భారతరామాయణగాథలాధారము. రామాభ్యుదయమునకు రామాయణగాథ మూలము. పౌరాణికగాథలను గ్రహించి తాము దానికి తోడగు ప్రతిభావిశేషంబును జోడించి ప్రబంధరచనసేయుట ప్రశస్తమని యానాటి కవులు భావించినారు. ఆముక్తమాల్యద కూడ యందుకు తీసిపోవునదికాదు. వైష్ణవుల మతగ్రంథములు తమిళమందు గలవు. గురుపరంపర యట్టిదే. వడగల వైష్ణవులు దక్షిణాపథమందు విరివిగా వెలసినారు. అంతేగాక ప్రసిద్ధులైన పన్నిద్దరాళ్వారు లందరూ నందే యవతరించినారు. కులశేఖరాళ్వారు వ్రాసిన మతగ్రంథములుగూడ ప్రసిద్ధములు. ఆముక్తమాల్యదలోన విష్ణుచిత్తునిగాథ యభివర్ణితమైనది. విష్ణుచిత్తుడు పెరియాళ్వార్ యనికూడ పిలువబడును. ఇత డా పన్నిద్దరాళ్వారులలో నొకడు. ఇతని తనూజాత గోదాదేవి. ఈమెకు నామాంతరము "శూట్టిక్కొడుత్తాళ్" ఈమెకూడ పన్నిద్దరాళ్వారులలో నొకర్తె. ఆముక్తమాల్యదలో యిట్లీ పరమభాగవతోత్తముని చరిత్రము గోదాదేవి కల్యాణము నభివర్ణితములైనవి. గోదాదేవి చరిత్రము తమిళసాహిత్యమున శూట్టిక్కొడుత్తనాంచియారు వైభవమనుపేర ప్రసిద్ధికెక్కినది. గురుపరంపరలోని కొంతభాగమును పన్నిద్దరాళ్వారుల చరిత్రమును గైకొని శ్రీ నంబూరి కేశవయ్యంగా రాచార్యసూక్తిముక్తావళి యనుపేర నొక వైష్ణవమత గ్రంథమును వ్రాసినారు. చండాల బ్రహ్మరాక్షస సంవాదము వరాహపురాణాంతర్గతమగు గాథ. చండాల బ్రహ్మరాక్షస సంవాదము, యామునాచార్య చరిత్రము, ఖాండిక్యకేశిధ్వజ సంవాదములను నీ కథాత్రయములలో నలతిమార్పులు గావించి శ్రీ విష్ణుచిత్తుని కథకు గోదాదేవి యుదంతముల కవినాభావ సంబంధము

కల్పించి దాని నాముక్తమాల్యద బృహత్ప్రబంధముగా రచించినాడు రాయలు. శ్రీ నంబూరి కేశవయ్యంగారి యాచార్యసూక్తిముక్తావళిలో పెరియాళ్వారు చరిత్ర తొమ్మిది పద్యములలో కలదు. గోదాదేవి సోది యిరువది నాలుగు పద్యములలో కలదు. ఇవియే దీనికి మాతృకలు. ఆముక్తమాల్యద నీ యైదు ఘట్టములలోనికి విభజింప వచ్చును.

1. విష్ణుచిత్తుని కథ.
2. గోదాదేవి చరిత్ర.
3. యామునాచార్య చరిత్రము.
4. చండాల బ్రహ్మరాక్షస సంవాదము.
5. ఖాండిక్య కేశిధ్వజ సంవాదము.

ఇందు మొదటి రెండు గాథలే ముఖ్యములు. వీటిని గ్రుచ్చి కార్య కారణ సందర్భములు కల్పించి కృష్ణరాయ లాముక్తమును రచించెను. రాజనీతి యను పేరుచే నీతిపద్యములువ్రాసి విద్వన్మణులు వల్లెయన గీర్వాణాంధ్రనికషోపలముగ జేసినాడు. మాతృకకు నాముక్తమునకు గల మార్పులను కొంత చర్చింతము. మొదటి రెండు ఘట్టములు కాక మిగిలిన మూడు ఘట్టములును సంకలనము చేయుటలో రాయలు తనకొక లక్ష్యము పెట్టుకొన్నాడు, ఈ ప్రచారమంతయు భక్తిపూరితమైనదేగదా ! దీనిలో భక్తి త్రివిధములుగా నెట్లు పరిణతి చెందింప బడినదో నిరూపింపబడినది. యామునాచార్యునిది జ్ఞానసంబంధమగు భక్తి. బ్రహ్మరాక్షసునిది మూఢభక్తి. గోదాదేవిది యనురాగ పూరితమగు భక్తి. కవితా కన్య కవశ్యంబగు భావవస్తు రచనల నన్నింటిని పాటించి కృష్ణరాయలు విజృంభించినాడు.

నంబూరి కేశవయ్యంగారి యాచార్యసూక్తి ముక్తావళి తమిళశూడి కొడుత్తాళ్ కాంధ్రానువాదము. అందు పురవర్ణన మొక పద్యములో కలదు. కాని శ్రీకృష్ణరాయలు విలిబుత్తూరు పురవర్ణన పేరిట నిరువది యారు పద్యములు రచించెను. వర్ణనాబాహుళ్యము, భావవిస్తారములే యీ ప్రబంధమందలి విశిష్టత. ఆచార్యసూక్తిముక్తావళిలో విష్ణుచిత్తు డొక పద్యములో వర్ణింపబడినాడు.

సీ॥ ఆ పట్టణము నందు శ్రీపతి తుల్యుండు
పరమ వైదికుడునౌ బ్రాహ్మణుండు
మహనీయ మగు జ్యేష్ఠ మాసము నందున
స్వాతి కారతి యందు సకల వేద

మయు డైన శ్రీ గరుత్మంతుని యంశము
చేబుట్టె నే విష్ణుచిత్త సూరి
అమ్మహా మహుడు బ్రహ్లాదుని పోలిక
జన్మ వైష్ణవు డయ్యె శౌరి కృపను
అట్టి శ్రీ భట్టనాథుండు హరికశేష
శేషతాకృత్యముల యందు శ్రేష్ఠమైన
దాస్య మెయ్యది యని మది దలచె ననుచు
వాది భీకర గురుడనె మోద మలర.

ఇంక కృష్ణరాయల విష్ణుచిత్తుడు :-

అందుండున్ ద్వయ సద్మ పద్మవదనుం డవ్వంద్వు దశ్రాంతయో
గాండూ బద్ధ మధు ద్విషద్విరదు డన్వర్థాభిధానుం డురు
చ్ఛందో బృందతదంతవాగపరనా సంజాత తజ్జన్య ని
ష్పందాద్వైత సుసంవిదాలయుడు నిష్ఠ న్విష్ణుచిత్తుం డనన్.

ఇంతేగాక నితని గుణగణములను, యితని యింటి దృశ్యములపై ఎనిమిది పద్యములను రచించెను. ఈతని యింటి పావనతను కూడ బాగుగ వర్ణించినాడు. వైష్ణవమత ప్రాశస్త్య మాముక్తమాల్యదలో నడుగడుగున కాన్పించును. పిండి వంటలను, చారులను, తిమ్మనములను, చేమరుక్కాను నేతిని గూడ వివరముగా విరివిగా వర్ణించినాడు. ఆతిథేయ సత్కారము, భాగవత కైంకర్యములు, నాతిథ్య సత్కారములు కూడ నభివర్ణితము లైనవి. ఈ వర్ణనములలో నీ పద్యము లగ్రగణ్యములు.

ఆ నిష్ఠానిధి గేహసీమనడురే యాలించినన్రోయు నెం
తే నాగేంద్రశయాను పుణ్యకథలుఁ దివ్యప్రబంధాను సం
ధాన ధ్వానము నాస్తిశాకబహుతా నాస్తుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదన సౌష్ఠవంచ కృపయా భోక్తవ్య మన్మాటలుఁ.

గగనము నీరుబుగ్గకెనగా జడివట్టిననాళ్లు భార్య క
న్బొగ నొరకుండ నారికెడపుం బొరియల్ దగిలించి వండన
య్యగ వలముంచి పెట్టు గలమాన్నము నొల్చిన పప్పునాలుగే
న్పొగపినకూరలు న్వడియము ల్వరుగు ల్పెరుగు న్ఘృత ప్లుతిఁ.

తెలిమలి వెచ్చయోగిరము దియ్యనిచారులు దిమ్మనంబులుఁ
బలుచని యంబళు ల్చెఱకుపాలెడనీళ్ల రసావళు ల్ఫలం
బులును సుగంధిశీతజలము ల్వడపిందెలు నీరు జల్లయు
న్వెలయగ బెట్టు భోజనము వేసవి చందన చర్చ మున్నుగన్.

పునుగుందావి నవోదనంబు మిరియంపుం బొళ్లతో జట్టిచు
య్యను నాదారని కూరగుంపు, ముకుమంద్రైయేర్చు నావం జిగు
రొ్కను పచ్చళ్లను, బాయసాన్నములు, నూరుంగాయలుఁ జేసుఱు
క్కను నేయుం జిఱుపాలు వెల్లువగ నాహారంబిడు న్బ్రీతునఁ.

వైష్ణవులు మొదటి పద్యమును తరచుగా స్మరించుచుందురు. విశిష్టాద్వైత మతమున కేవలము దాసభావము కలదు. 'అడియేన్ దాసోఽహం. శ్రీమతే రామానుజాయ నమః' యని తరుచుగా వాడుచుందురు. ఈ భావమునే శ్రీ కులశేఖరాళ్వారు తన ముకుందమాలలో "తద్భృత్య భృత్య భృత్యస్యభృత్య యితిమాం" యని వాకొనినాడు. కృష్ణరాయ లొకప్పుడు తన యాస్థానమందున్న యష్టదిగ్గజముల ప్రబంధములలో నెయ్యది శ్రేష్ఠతరమో నిర్ధరింపుమని తత్కాల బిరుసు విమర్శకుడగు తెనాలి రామకృష్ణుని కోరగా నతడు మనుచరిత్రలోని 'పాటున కింతు లోర్తురె' యను పద్యమును, వసుచరిత్రలోని 'ఆ జాబిల్లి వెలుంగు' యను పద్యమును, పారిజాతమందలి 'ఈసున బుట్టి' యను పద్యమును వేర్వేరుగా చదివి యల్లసానివా డట్లట్లు నేడ్చినాడు, రామరాజభూషణుడు బావురుమని యేడ్చినాడు, ముక్కుతిమ్మన ముద్దుగా నేడ్చినాడు; అందరి యేడ్పులు వారి యంతస్థుల బట్టి సమంజసముగా నున్నవని తీర్పునిచ్చినాడు. అంతటితో నూరుకొనక తనను తీర్పుయియ్యమన్న ప్రభువు నుద్దేశించి విష్ణుచిత్తీయములోని 'ఆ నిష్ఠానిధి' యను పద్యమును చదివి పిండివంటలు లేవు, పప్పులేదు, కూరలేదు, వరియన్నములేదు, కృపయాభోక్తవ్యమని యనినవాడు, తినేది వాడి పిండాకూడా ? యని యవహేళన చేసినాడు. భాషాసౌష్ఠవము లేనిది భావప్రకటన రాణించదు. మేలిమి సువర్ణము మెరుగుపెట్టనిది వన్నె కెక్కునా ? చందనకాష్ఠము రాచినకొలదియే కదా బాగుగ గుబాళించును ? నంబూరి కేశవయ్యంగారు విషయప్రధానముగా చాటంత గ్రంథము వ్రాసినాడు. అందు పెక్కుగాథలు కలవు. కొద్దిభాగమునే గొని రాయ లాముక్త మాల్యదను కూలార్చి సప్తాశ్వాస కావ్యముగా 870 పద్యములు వ్రాసినాడు.

మూలములో మధురాపురవర్ణనములేదు. ఈ కవి తత్పురవర్ణనమును పుష్పలావికల నర్మగర్భములతో పద్యసంఖ్య 38 వరకు పెంచినాడు. ఈ పురాధీశుడు వల్లభరాయ డని కలడు. మూలములో రాజు భోగినివద్దకు పోవుటలేదు కాని శ్రీరామచంద్రుని పగిది మారువేషమున నగరీ పరిశోధనమున కరుగుచుండ వైదేశికుండైన నొక విప్రు డొక గృహాంగణంబున నిద్రించుచుండ మహాత్మా! మీ నామం బెయ్యది మీ రెచ్చట కేగుచున్నారని యడుగ నత దేను గంగాతీర్థముల గ్రుంకివచ్చితి, నిప్పుడిం కొక క్షేత్రము కేగదలచినాడనని యనగా నిది యాలకించి నాతనితో "దేశాటనమ్ పండితమిత్రతాచ" గనుక మీకు దోచిన శ్లోకమొండు పఠింపుమని యడిగెను. అంతనతడు:

> వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్ నిశార్థం దివసే యతేత
> వార్థక్య హేతో ర్వయసానవేన పరత్ర హేతో రిహజన్మనా చ.

యను శ్లోకమును చదివెను. మనుజుడు వర్షాకాలమునకు వలసిన సామగ్రి మిగిలిన యెనిమిది నెలలలోను, రాత్రికి వలయు దానిని పగటిపూట, ముదిమిలో వలయు దానిని యౌవనములో చేకూర్చుకోవలయును. అట్లే పరలోక సుఖమునకు సాధన మయిన యుపకరణముల నిహలోకమందే సమకూర్చుకొనవలెను. ఈ శ్లోక తాత్ప ర్యమును గ్రహించి రాజు మోక్షమార్గోన్ముఖు డయ్యెనని మూలమందుగలదు. కృష్ణ రాయలు, పాండ్యుడు భోగిని కడకేగుచు నొక పంచపై బ్రాహ్మణ బృందములో నున్న బ్రాహ్మణుడు ప్రసంగవశమున పై శ్లోకార్థము వచ్చు తెనుగు పద్యము చదివెనని మార్చెను. ఈ పద్యముచదువుట రాజు భోగినికడ కేగుటయు నొక్కు మ్మడి కాకతాళీయముగా సరిపోయినవి, ఇది దైవికమని చెప్పనొప్పు.

> వినియెనెల నృతుర్ద్వయిని వృష్టి దినాళికి రాత్రికై దివం
> బున జరకై వయస్సునను బూని పరంబున కిప్పు డుద్యమం
> బనువుగ జేయగావలయు నంచు బురోహితధర్మ మాత్మ గీ
> ల్కొ_న నల విప్రు డాద్విజులలోన సుభాషితము న్పఠింపగన్.

ఇట్లీపద్యమును విని దాని సారాంశ మెఱిగి యందును యిది తన ప్రస్తుత కార్యము నకు వర్తించు టెఱిగి రాజు గృహోన్ముఖుడగుట సమంజసము. ఈపద్య మానాటి రాజన్యుల విషయ సుఖాస్వాదలోలుపత్వ శీలమునే తెల్పుచున్నది. ఈ సంఘటన కృష్ణరాయల వ్యక్తిగత జీవితమునకు సంభవించినదై కూడ యుండియుండనోపు. "కామియై గాని మోక్ష గామిగాడు" యను సూత్రప్రకారమున తనివిదీర భోగము లనుభవించిన తరువాత భోగాపేక్ష కలుగదు. ఇట్టి వైరాగ్యమే శ్రేష్ఠమయినది.

వేమన కిట్టిదే కల్గినది. భోగి వేమన యోగి వేమనగా మారిపోయెను. అతడు భోగియె కాకుండినచో యోగి కాకుండెనేమోయని సందియ మొదవుచున్నది. పరమార్థమే లేదని యజ్ఞానాంధాఽహంకారమున కామినీలోలుడై నేదే నొక్క యాఘాతమువలన జీవితగతి మారి పారమార్థిక చింత కలుగుట స్వతస్సిద్ధము. అందుకే "వాడును రోసినా డిహ" మని నాడు. అట్టిదే కృష్ణరాయలకుకూడ కల్గి నట్లు మనము గ్రహింపవచ్చును.

మూలములో విష్ణుచిత్తునికి శ్రీమన్నారాయణుడు స్వప్నమందగపడి మధుర కేగుమని యాదేశించెను. కాని విష్ణుచిత్తీయములో విష్ణుచిత్తుడు పరమేశ్వరునకు మాలికవేయునపుడు మధురకేగుమని శాసించినాడు. భగవంతుడు భక్తపరాధీను డగుటవల్ల భక్తుడే తన గౌరవమును కాపాడవలసిన యగత్యమేర్పడినది. మూలములోగల వచనమిది: "మహాత్మా! నీవు మధురాపురంబునకుం జని, వల్లవదేవ రాయనింగాంచి, యమ్మహీపతి విద్వత్సభయందు బరపక్షవిక్షేపణ పూర్వకంబుగా సర్వవేదాంత ప్రతిపాద్యంబగు పరతత్వంబు నిర్ణయించి, స్వపక్షంబు స్థాపించి విద్యాశుల్కంబగు నర్థనంబు తెచ్చుకొమ్మనిన నా హరికి విష్ణుచిత్తుం డిట్లనియెను. సర్వవేదాంత ప్రతిపాద్య వేదశాస్త్రాధ్యయనాది జనిత జ్ఞానవాసనాహీనుండనగు నే నెట్లు హరింతుననగా యా శ్రీహరి జయమ్మగును సర్వనిర్వాహకుండనైన నేను భవన్మానస పద్మంబునం గనపడుచుండ నీకొక కొఱత సంభవింపదు గావున మద్వాక్యంబులు విశ్వసింపందగునని యానతిచ్చి సర్వేశ్వరుం డంతర్హితుండయ్యె."

హృద్యమగు భావము పద్యమునకు ప్రాణము గావున కృష్ణరాయ లీభావము వచ్చునట్లు హృదయంగమమగు రెండు పద్యములు వ్రాసినాడు.

శా॥ స్వామీ నన్ను నితఃపురాపఠిత శాస్త్రగ్రంథ జాత్యంధు నా
రామక్ష్మా ఖననక్రియా ఖరఖనిత్రగ్రాహి తోద్యత్కిణ
స్తోమాస్నిగ్ధకరు న్భవద్భవనదాసు న్వాదిగా బంపుచో
భూమీభృత్సభ నోటమైన నయశంబు ల్మీకు గాకుండునే?

మ॥ గృహసమ్మార్జనమో జలాహరణమో శృంగార పల్యంకికా
వహనంబో వనమాలికాకరణమో, వాల్లభ్య లభ్యధ్వజ
గ్రహణంబో, వ్యజనాతపత్రధృతియో, ప్రాగ్దీపికారోపమో
నృహరీ వాదము లేల? లేరె యితరు ల్నీలీలకుం బాత్రముల్.

ఎంత భక్తుడైనను యహంకార మమకారము లుడిగినపుడు సహజముగా భగవంతునియెడ సర్వసాధారణ మానవమాత్రునిగా పరిగణించికొని పలువిధముల

విన్నవించుకొనును. ఇదియే సంపూర్ణశరణాగత స్వభావము. అప్పుడే భగవంతుడు భక్తులకు స్వస్వరూపమును గనపరచును. అదియునుంగాక విశిష్టాద్వైత మత సిద్ధాంత ప్రకారము దాసభావమెక్కువ. లౌకికముగా కూడ 'నడియేన్ దాసోఽహం, శ్రీమతేరామానుజాయనమః' యని వాడుదురు. భగవంతు డర్జునునికి 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" యనినాడు. దీనికి ప్రత్యుపకారముగా "సర్వ పాపేభ్యో అహం త్వా మోక్షయిష్యామి" యని వాగ్దానమిచ్చినాడు, ఈ భావము వచ్చు శ్లోక మొకటి వాల్మీకి రామాయణమందుగలదు. రాముడు విభీషణుడు తనను శరణుజొచ్చినప్పుడు హితులు శత్రువును చేరదీయవలదని నివారించుచున్నప్పుడు

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేతద్వ్రతం మమ" యన్నాడు.

శ్రీరామచంద్రుడు వైష్ణవుడే. ఏలనన యిక్ష్వాకులకులధనమగు రంగధామము నజస్రము పూజించుచుండెను. తాను పట్టాభిషిక్తుడై నపిదప యా రంగనాథునే విభీషణునకొసంగి శ్రీరామచంద్రసార్వభౌముడు తనభక్తుని యభీష్టమునెరవేర్చెను. కాని యతడా భగవంతుని తీసుకపోవుచు చేసిన తప్పిదమునకే శ్రీరంగ మవత రించినది. ఇట్టి యర్థము కలదే విశిష్టాద్వైతమతానుయాయులగువారి కజస్రము పునశ్చరణ మొనరింపదగినది చరమమంత్ర మొందుగలదు. విశిష్టాద్వైత సిద్ధాంతము ప్రతిపాదించిన రామానుజుడే యష్టాక్షరీ, ద్వాదశాక్షరీ మంత్రములను బట్టబయలు చేసినాడు. చరమ మంత్రమును నీవిధముగా నున్నది.

"శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే
శ్రీమన్నారాయణ శ్శరణం మమ."

కృష్ణరాయలు వ్రాసిన రెండవ పద్యములో వైష్ణవభక్తులు భగవంతునికి చేయు సేవలను వివరించినాడు. అవియును క్రమ బద్ధములై యున్నవి. దేవళ మూడ్చుట, నీళ్ళు తెచ్చుట, పల్లకినిమోయుట, పూలమాలికలు కట్టుట, కోవెలలో దీపము ముట్టించుట- ఇవి యుదయమునుండి, సాయంత్రమువరకు చేయు సక్రమ మగు విధులు. పైగా యీ విధులు తప్ప మరొక్కటి చేయజాలని వానిని నన్ను దిగ్విజయమునకై పంపినచో నోటమికల్గిన నానపయశము మీకు (భగవంతునికి) కాదా యని వాపోయినాడు. ఆత్మాభిమాన మేనాడో వదలిపోయినవాడు భగవంతుని కపశయము కలుగకూడదని కోరి యీ విధగముగ నభ్యర్థించినాడు, ఖాండిక్య కేశిధ్వజవాదము, యామునాచార్య చరిత్రములు, సంస్కృత విష్ణుపురాణమునుండి గ్రహింపబడియెను. చండాల బ్రహ్మరాక్షస సంవాదము వరాహపురాణమునుండి

గ్రహింపబడియెను. ఆముక్తమాల్యద చరిత్రము "శూడికొణ్డుత్తాళ్" యాచార్య సూక్తిముక్తావళినుండి గ్రహింపబడినది. ఆముక్తమాల్యదలో గోదాదేవి తులసి వనముదగ్గఱ యరుగుమీంద లభించినట్లు కలదు. మూలములో తులసివనంబు ద్రవ్వ నొక బాలికామణి గానపడెనని కలదు. ఈ మార్పు కేవలము క్వాచిత్కమే. ఆముక్తమాల్యదలో గోదాదేవి కేవలము భగవంతునికై చేయబడిన సౌరభ భరిత ములైన ప్రసూన మాలలను ధరించు టెఱుగదు. మూలములో దీనిని తెలిసికొని పెరియాళ్వారగు విష్ణుచిత్తుడు మాధవునకు మాలిక లర్పింపకుండిన యాభక్తవత్స లుడు స్వప్నమం దగపడి "భక్తాగ్రగణీ! నీవు మాల లేల యర్పింపవైతివి. నీ తనయ వలచినవే మాకు పావనములు. ఆమె శ్రీ మహాలక్ష్మి. శ్రీరంగేశ్వరుని వలచి యున్నది. ఆమెను శ్రీరంగమునకు గొంపోయి శ్రీరంగేశ్వరున కర్పింపు" మనియెను. కాని యాముక్తమాల్యదలో భగవంతుడు విష్ణుచిత్తునకు విష్ణుభక్తి ప్రతి పాదకమగు వరాహపురాణాంతర్గతమగు చండాల బ్రహ్మరాక్షస సంవాదమును చెప్పెను. ఇంతియే భేదము.



## 5 సంఘటనాసంవిధానము

ఈ కావ్యమందలి సంఘటన లైదు. విష్ణుచిత్తుని కథ, ఖాండిక్యకేశిధ్వజ వాదము. యామునాచార్య చరిత్రము, చండాల బ్రహ్మరాక్షస సంవాదము, గోదా దేవిచరిత్ర. వైష్ణవభక్తులు పన్నెండుగురు. వారినే తమిళములో పన్నిద్దరాళ్వారు లందురు. వారిలో విష్ణుచిత్తు డొకడు. అతనిదే ప్రధానమైన గాథ. దానివల్లనే యాముక్తమాల్యదకు విష్ణుచిత్తీయమను నామాంతరము వచ్చినది. విష్ణుచిత్తుడు పెరియాళ్వారు, భాగవతోత్తముడు. విష్ణుచిత్తుడు న్యాయార్జిత విత్తంబున భాగవతోత్తముల కైంకర్యంబుచేయుచు గోవిందపాదారవింద కందళితాంతరంగుడై జీవయాత్ర గడుపుచుండెను. అతనికి దైవికముగా గోదాదేవిలభించినది. అనపత్యునకు లభించిన యా యాడు నిసుగును తన కూతురుగా పెంచుచుండెను. ఆమెలేనిదీ కావ్య మసమగ్రము. ఇందు కథానాయకుడెవరో చెప్పుటకు వీలులేకున్నది. దానివల్ల యిద్దరు నాయకులను గ్రహింపవలసియున్నది. విష్ణుచిత్తుడు, శ్రీరంగనాథుడును నాయకులుగా మనము పరిగణించవలెను. విష్ణుచిత్తుని గాథ గోదాదేవి కథతోనే యీ కావ్యము పూర్తియైయుండిన మహాకావ్యము కాదని యెంచి వైష్ణవమత ప్రాశస్త్యము కల ముగ్గురు భక్తుల గాథలను సందర్భోచితముగ పూర్వాపర సంబంధములు కల్పించి యేతన్మహాకావ్యమును కృష్ణరాయలు రచించినాడు. విష్ణుచిత్తుడు వైష్ణవమత మహిమను పాండ్యునకు బోధించుటకుగాను ఖాండిక్య కేశిధ్వజవాదము నల్లినాడు. గోదాదేవి యయోనిజ. ఆమె లక్ష్మియవతారము. శ్రీరంగని పెండ్లియాడుటకు విష్ణుచిత్తుని కూతురుగా జన్మించినది. దానివల్ల బాల్యమాదిగా భగవత్కల్యాణములను చేయుచు భక్తిగీతముల పాడుచు తనతండ్రి భగవంతునికై యొనర్చిన పూమాలలను తాను ధరించి తన సౌందర్యమును జలాశయమందు గాంచి మురిసి సంతృప్తినొంది పిదప భగవంతుని కర్పించుచుండెను. విష్ణుచిత్తుడు నిరాడంబర జీవి. తాను పంచభక్ష్యపరమాన్నములను భాగవతోత్తముల కనిశము పెట్టుచున్నను "నాస్త్యత్ర శష్కులీ నాస్త్యపూపో నాస్త్యోదన సౌష్ఠవంచ కృపయా భోక్తవ్య" మనేవాడు. ఇటువంటి నిరాడంబర భక్తుని పాండ్యుని దివాణమునకేగి వైష్ణవమత ప్రతిష్ఠాపన జేయుమని భగవంతుడాతని కోరి యాతని నంగీకృతునిగా జేసి తాను తెరచాటున నుండి యతనిని విజయలక్ష్మి వరించునట్లుచేసినాడు. విష్ణుచిత్తుడుకూడ మతచర్చలు,

వేదాంతచర్చలు సామాన్యముగ విసువుజనించునవి గావున వాటిని యష్టాక్షరీ మంత్రాధిదైవముగా నారాయణుని నిరూపించి, ఏకోనారాయణోహరిః యను సిద్ధాంతము నంగీకరించునట్లు చేసినాడు. పురాకృత పుణ్యపరిపాకము వల్లనేమి భాగవత కైంకర్యములవల్లనేమి భగవంతుని భావగతమొనర్చు కొన్నందువలన నేమి, భక్తిపారవశ్యమువల్లనేమి యాతని మన్ననలకు ప్రాప్తుడై యాతని తన జామాతగా నొనరించుకొన్నాడు. నేటికి శ్రీవిలిబుత్తూరు దక్షిణాపథమునందు వర్తిల్లు వైష్ణవ క్షేత్రములలో నొక్కటై వర్తిల్లు చున్నది. పాండ్యనగరోర్వీ రత్నసీమంతమై యలరారిన శ్రీవిలిబుత్తూరు కోవెల ప్రాధాన్య మట్టిదే.

ఖాండిక్యుడు కేశిధ్వజుడు నిమివంశాలంకారులు. రాజ్యకాంక్షచే నిరువురు పోరాడిరి. అందు ఖాండిక్యు డోడిపోయెను. కేశిధ్వజునకు రెండు రాజ్యములు సంప్రాప్తించెను. ఖాండిక్యు డడవిలో నొక గుడిసె వేసుకొని యుండెను. కేశిధ్వజుడు జన్నముచేయ దలపెట్టిన సమయమున యజ్ఞగవి పులివాతం బడెను. దానికి ఋత్విక్కులను నిష్కృతియడుగ వారు ఖాండిక్యుని యడుగుమని యాతనికి ప్రత్యుత్తరం బిచ్చిరి. అతడు ఖాండిక్యు డున్న ఘోరాటవి కేగుచు నాతడు నిష్కృతి చెప్పెనా జన్మము పూర్తియగును, కాక నన్నంత మొందించెనా తత్ప్రయత్నమందుండుటవల్ల నా జన్నము చేసిన ఫలము తనకు దక్కునని తలంచుచుండును. ఖాండిక్యుడు వచ్చి యాతనిని జంపనుంకించు సమయమునకూడ యీ మాటలే చెప్పెను. దాని కాతడు తన సోదరునికి నిష్కృతి జెప్పెను. కేశిధ్వజుడు జన్నము పూర్తిజేసి గురుదక్షిణ యిచ్చుటకు ఖాండిక్యునివద్దకు వచ్చెను. ఖాండిక్యుడు రాజ్యము నడుగుటమాని ముముక్షాసక్తుడై పరమార్థమును గోరిన, దానికి కేశిధ్వజుడలరి యాతనికి దానిని సమగ్రముగా సోపపత్తికముగా నిరూపించెను,

యామునాచార్యుడు పిన్ననాటినుండియే భక్తుడై విష్ణుపద సేవానిరతుడై యుండెను. అట్టియెడ నొక రాజన్యుడు శైవమతాభిమానియై వైష్ణవుల నెల్లరను బాధించుచుండెను. అంతేగాక సమయానుకూలముగా నూర్ధ్వపుండ్రములు ధరించి నంతమాత్రముననే వారి కగ్రహారము లిచ్చుచుండెను. ప్రతివారికిని శిత లింగమును కట్టుచుండెను. ఇట్లుండ దైవికముగా నాతని పత్ని విష్ణుపక్షపాతి యయ్యెను. ఆ రాజు శైవ దురభిమానమును కీటడగింప, యామునుని బ్రేరేపించి వైష్ణవమతము స్థాపన చేయుమని భగవంతుడాదేశించెను. అతడు రాజపత్ని సహాయముతో రాజసభాప్రవేశము పొంది తానోడిన లింగము ధరింతునని తాను గెల్చిన నితరులకు చక్రాంకితము చేసెదనని ప్రతినచేసి వైష్ణవమతమే శ్రేష్ఠమని ప్రతిష్ఠించెను. ఆ

రాజుకూడ యర్ధరాజ్యము నిచ్చుటేగాక తన చెల్లెలినిచ్చి పెండ్లిచేసెను. ఆతడు రాజభోగములలో భగవంతుని స్మరించుట విస్మరించెను. భగవంతుడు భక్తపరాధీను డగుటవల్ల యాతనికి చింతలుకూడ మెండు. తానొకసారి కానిపించినచో భక్తులు మరల తనను స్మరించరని చివరివరకు వారికి దర్శన మీయడు. ఈ భావమునే సహజపాండిత్య పోతనామాత్యుడు భగవద్వాక్కులో చెప్పించినాడు.

మ॥ ననుసేవించుచున్న వారలకు నేనా రూపముం జూప, జూ
చిన జాలించి మదించి వారు మఱి నన్ సేవింపరో యంచు ని
ర్ధనికుం డాత్మధనంబు పెద్ద నెపుడుం దత్పారవశ్యంబు దా
ల్చినభంగిన్ నను బాసి మత్ప్రియుడు దా జింతించు నా రూపమున్.

యామునాచార్యుని మరల భోగలాలస పరాఙ్ముఖుని చేయుటకు భగవంతుడు మార్గమాలోచించి నొక మనుష్యునితో యన్వహము కూర పంపించుచుండెను. ఆరాజది రుచికరముగా నుండుటచే భుజించుచుండెను. ఒకనా డాతడు రాకుండిన మరల వచ్చినప్పుడు తనవద్దకుగొనితేవలసినదని యాదేశించెను. అతడు వచ్చి మీ పెద్దల నిక్షేపము చూపించవలసియున్నదని యాతని శ్రీరంగమునకు గొంపోయి శ్రీరంగని పాదద్వయమును చూపించి యిదియే నిక్షేపమని చెప్పిపోయెను. యామునుడును తన తప్పిదమునకు విచారించి తన కుమారునకు రాజనీతి యుపదేశించి రాజ్యభారమంత నతని కప్పగించి సన్యసించి శ్రీరంగము చేరుకొని భగవద్ధ్యాన పరాయణుడయ్యెను.

మాలదాసరి భగవద్భక్తుడు, అన్వహము బ్రాహ్మీముహూర్తమున లేచి భగవంతుని గీతముల పాడుచు జాత్యుచితధర్మమును పాటించుటకు నగ్రకులజుల చూచిన దూరముగా పోవుచు వారు దయతో నిచ్చిన తీర్థప్రసాదముల గ్రహించుచు జీవయాత్రగడపుచుండెను. ఒకనాడు వేఱొకకారణమున కూసిన కోడికూతకు వేకువయయ్యెనని తలంచి యర్ధరాత్రమున నడవివెంబడి పోజొచ్చెను. కాని కొంత దూరమేగినపిదప నొక భయంకరమగు వటవృక్షమును గాంచెను. దానిచెంత కేగునంతనే నొక బ్రహ్మరాక్షసుడు సాక్షాత్కరించి నిలునిలుమని వారించెను. మాలదాసరి యాతనినుండి బంధవిముక్తి పొందజాలక నేను, ప్రతిదినము చేయు వ్రతమొండుగలదు. దానినాచరించి వచ్చి నీ కాహూతియయ్యెదనని ప్రతిజ్ఞ చేసెను. అందులకా బ్రహ్మరాక్షసుడు వల్లెయనిన మాలదాసరి భగవత్సంకీర్తనము చేసి మగుడవచ్చి నా రజనీచరునివద్ద తనను భుజింపమని నిలుచుండెను. బ్రహ్మరాక్షసుడా మాలదాసరిని నీ వీ ప్రాతఃకాలమున పాడిన భక్తిగీతముల ఫలమిమ్మని

యర్థించెను. దానికి మాలదాసరి వల్లెయని నీవెవడవు నీ పూర్వజన్మ వృత్తాంత మామూలాగ్రముగా చెప్పుమని యడుగ నాత డిట్లు చెప్పెను.

బ్రహ్మరాక్షసుడు పూర్వజన్మమున సోమశర్మయను బ్రాహ్మణుఁడు. ఆత డుద్ధతుడై తార్కికులను వాగ్గరిమచే గెలుచుచు భూబృందారక బృందంబుల గేలి సేయుచు నుద్దండుడై విహరింపదొడగెను. కొంతకాలమునకు ధనమార్జింపవలె నన్న కుతూహలము కలుగగా మధురాపురి కేగి యనేక దుర్విధముల ధనమార్జించి కోమటివద్ద వడ్డికి వైచెను, మరల నిజపురంబునకు జనువాడై నభ్యంగనము గావించుకొని, క్షురకర్మంబు గావించుకొని మాలపల్లెకు వెళ్ళి కొత్తపావరక్షలజత కొని ప్రయాణము చేయనున్నప్పు డాతని వాలకము గాంచిన దొంగయొక్కడు తన యనుచరులను ముందుగా వారి నడ్డగింపబంపి కొంతదూర మేగినపిదప నుత్తర మేగవలెనని యందఱిని పెడమార్గము పట్టించి నొక సెలయేరులోనికి గొంపోయెను. అచ్చట ముందుగా వెళ్ళిన దొంగలు వారి న దరి నడ్డగించిరి. వారట్లు దోచుకొనుచుండ సోమశర్మ పలాయనమంత్రము పఠించుచుండ యతనితో మొదటవెళ్ళిన దొంగ యాతనిని తరిమి తద్ధనమును దోచుకొనుటకుగాను దేహ శుద్ధి చేయుచుండెను. ఇంతలో బాటసారులమూక యొకటి వచ్చి యాతనిని రక్షించెను. అందులో సోమశర్మభార్యబంధు వాతని నానవాలు పట్టి నొక పల్లకియందు పరుండబెట్టి నీరు ద్రావుటకు వెళ్ళెను, ఆతడు తిరిగివచ్చునంతలో సోమశర్మ పరలోకగతుడగుటయు బ్రహ్మరాక్షసరూపము వచ్చుటయు నొక్కుమ్మడి జరిగినవి. బ్రహ్మరాక్షసుడు తన కథచెప్పుట ముగించునంతలోనే నిజస్వరూపమువచ్చి సోమశర్మ యయ్యెను, విష్ణుచిత్తీయమందలి సంఘటనలైదును భక్తిప్రాశస్త్యమును చాటుచున్నవి. మిగిలిన వుపాఖ్యానములై ప్రధానకథకు బలమాపాదించుచున్నవి.



ఉత్తమకవిత్వ లక్షణము లీరీతిని పేర్కొనబడినవి:

పదలాలిత్యము వర్గశుద్ధియును శబ్దస్థైర్యముఁ మంగళా
స్పదభావంబును రాజ్యయోగ్యతయు దోషస్ఫూర్తి రాహిత్యముఁ
సదలంకార విశేషముఁ కలిగి విశ్వప్రాణ సౌభాగ్య సం
పదమై తేజియపోలి క్రాలవలదా ! పద్యంబు హృద్యస్థితిన్.

అంతేగాక 'సా కవితా సా వనితా యస్యా దర్శనేన హృదయం, సరళం, తరళంచ భవతి' యనిగూడ పేర్కొనినారు. కృష్ణరాయల కవిత్వము సార్వభౌముని ఠీవితో నలరారుచున్నది. అంతేగాక నప్పకవి యాముక్తమాల్యద కవిత్వము నీ విధముగ నున్నదని వాకొనినాడు.

ప్రౌఢదీర్ఘసమాస పదములుగూర్చి శ్రీ
నాథుండు గూలార్చె నైషధంబు
దాని తల్లిగ నల్లసాని పెద్దన తెల్పె
ముది మదితప్పి యాముక్తమాల్యద

ఇందు పెద్దన వ్రాసినదనుమాట దప్ప, కృష్ణరాయల విష్ణుచిత్తీయము పాండిత్యమునకు నిస్సందేహముగ నికషోపలము. కృష్ణరాయల గ్రంథకవనమును పరిశీలించునపు డాతని సమకాలికుల గ్రంథములను పోల్చి నాయా సందర్భములలోని పోకడలను వర్ణనలను తారతమ్య పరిశీలన చేయుట సమంజసము. నేను తారతమ్యపరిశీలన చేసి కృష్ణరాయల కవితాప్రాశస్త్యముగ్గడించుకొనదలచిన గ్రంథములివి. కొందఱు కవులు రాయల యాస్థానమందు లేరను కాలవిపర్యాస దోషమును బలపరచినను నా మతమున వారు రాయలకాలమం దుండినవారే.

1. అల్లసాని పెద్దనామాత్యుని మనుచరిత్రము.
2. రామరాజభూషణుని వసుచరిత్రము.
3. తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము.
4. పింగళిసూరన కళాపూర్ణోదయము.
5. ముక్కుతిమ్మన పారిజాతాపహరణము.

కొంత విపులముగా కృష్ణరాయల వర్ణనలను పై పంచకావ్యముల నుండి నాయా సందర్భములందుగల పద్యముల నుదహరించి పేర్కొందును. తెనుగున నీ యైదే పంచకావ్యములని నా నిశ్చితాభిప్రాయము. మొదట పురవర్ణనమును పరిశీ

లింతము. ప్రబంధమున కితఃపూర్వ ముల్లేఖించిన సంస్కృతమహాకావ్య లక్షణము లనువదింపబడినవి. అయితే సంస్కృతమహాకావ్య లక్షణములు పదునెనిమిది. తెనుగు ప్రబంధలక్షణము లిరువదిరెండు.

పెద్దనామాత్యు డరుణాస్పదపురంబును, పింగళి సూరనార్యుడు ద్వారకాపురిని, కృష్ణరాయలు మధురానగరమును, విలిబుత్తూరును, తెనాలి రామకృష్ణుడు వారాణశి నగరంబును, రామరాజభూషణు డధిష్ఠానపురంబును వర్ణించిరి. వాటి నిట యుదహరింతును.

మనుచరిత్రలో

వరణాద్వీపవతీ తటాంచలమునన్ వప్రస్థలీ చుంబితాం
బరమై సౌధ సుధాప్రభాధవళితప్రాలేయ రుఙ్మండలీ
హరిణంబై యరుణాస్పదంబనగ నార్యావర్త దేశంబునం
బురమొప్పున్ మహికంఠహారతరళస్ఫూర్తిం విడంబించుచుం.

వసుచరిత్రలో

వరసుమనోభవ్యతరుల కావాల మ
త్యలఘుకలాపాలి కలరు ధరణి
సరిలేని తెలిముత్తె సరుల కటారు క
ల్యాణ పరంపరల తొలుదీవి
సురచిరమణుల కాకరసీమ శ్రుతిహిత
భాషిత ద్విజకోటి పట్టుగొమ్మ
సరసుల కారామ సరణి శ్రీరంగ గే
హక్రోడవాసిని కాటపట్టు
వెలయు నావరణాంబు సంవీతహాట
కాండ మోహద పరిఖావృతాంఘ్రి వప్ర
దంతురప్రాంత గంగా నిరంతరాగ్ర
భూరి వరణం బధిష్ఠాన పురవరంబు.

కళా పూర్ణోదయములో

శ్రీలకు నాకరమై వి
ద్యాలతలకు నాలవాలమై హరికి సదా
కేళీభవనంబై మహి
జాలన్ ద్వారవతి యొప్పు సౌభాగ్యములన్.

పాండురంగ మాహాత్మ్యములో

శీతాహార్య సుతాళినీ వికచరాజీవంబు విశ్వేశ్వర
జ్యోతిర్లింగ విశుద్ధ రత్నఖని మోక్షోపాయ దుగ్ధాబ్ధి వే
లాతీరావని దుండినామక గజాలానంబు గంగామృత
స్రోతోనిస్సృతి చంద్రగోళమన మించున్ గాశి శ్రీరాశియై.

పారిజాతాపహరణములో పురవర్ణనమేలేదు. కృష్ణరాయలు విష్ణుచిత్తీయ మున శ్రీవిలిబుత్తూరు నగరమును, మధురాపురి సిగతిని వర్ణించినాడు.

మ॥ లలితోద్యాన పరంపరా పికశుకాలాప ప్రతిధ్వానము
ల్వలభీనీల హరిన్మణీ పికశుక స్వానభ్రమంబూన్ప మి
న్నులతోరాయు సువర్ణసౌధముల నెందుంజూడ జెన్నొంది శ్రీ
విలిబుత్తూరు సెలంగు పాండ్యనగరోర్వీరత్నసీమంతమై.

సీ॥ ఏవీటసతుల పాలిండ్లపై గంబూర
నవహారములచిప్ప కవుచు మాన్పు,
మలయజం బేవీట దొలుచెక్క డులిచి మే
డల కిడ్డ మిగులు ధూములకు డిగ్గు
గలచు నేవీటి సింహళ గజంబుల గాలి
చైత్రవేళ మదగ్నిశాగజంబు
దాల్తు రేవీటి ప్రాక్తనభూప నిర్మాల్య
మరకతంబులు పెఱధరణీ పతులు
కపివరనియుక్తగిరి సదృగ్గహన నిలయ
గాత్రగాహిత కనకముక్తాకవాట
గోపురావేదితోచ్చతాక్షోభ్యవప్ర
దనరు దక్షిణమధుర సాంద్రద్రుమదుర.

మనుచరిత్ర యందలి 'యంబరచుంబి' యను పదమునకు 'మిన్నులతోరాయు' యను పదమును, 'మహీకంఠహార'మను పదమున "కుర్వీరత్నాసీమంత" మను పదమును వాడినాడు. మధురానగర వర్ణనములో వసుచరిత్రకారునివలె సీసపద్యమును రచించినాడు. కళాపూర్ణోదయ కారుడు ద్వారకాపుర వర్ణనము 22 పద్యములలో గావించినాడు. కృష్ణరాయలు శ్రీవిలిబుత్తూరు వర్ణనకు 25 పద్యములు వ్రాసినాడు. విలిబుత్తూరు వర్ణనములో

శయ పూజాంబుజముల్ ఘటిం దడబడన్ జన్దోయి లేగౌనుపై
దయదప్పన్ బసుపాడి పాగడపు బాదంబొప్ప జెంగల్వ డి
గ్గియనీ రచ్యుతమజ్జనార్థము గటింగీలించి దివ్యప్రబం
ధయుగాస్యల్ ద్రవిడాంగనల్ నడుతు రుద్యానంపు లోత్రోవలన్.

అను పద్య మగ్రగణ్యము. వసుచరిత్రకారు డధిష్ఠాన పురవర్ణన సందర్భములో

అలఘుస్యందనకోటి వీటిమణి రథ్యావాటికాహాటకా
కలితక్షోణుల నేగుచో జటులచక్రక్షుణ్ణ తత్తోదముల్
గలయంబర్వి సుపర్వలోకనదిలో గాంగేయ పంకంబు జొ
బ్బిలజేయం దఱుచైజనించి యచటం బెంపొందు పొందామరల్.

యని యొక పద్యము రచించినాడు. అనగా నాయధిష్ఠానపురమున రథములు పోవుమార్గములందు బంగారు నెలకట్టులు విశేషించి యున్నవనియు లెక్కకుమీరి కలవనియు వానినుండి రేగు దుమ్ము లాకాశము నంటుచున్నవని సారాంశము. ఇట్టి పోలికల పద్యమొకటి కృష్ణరాయ లాముక్తమాల్యదలో శ్రీ విలిబుత్తూరు పురవర్ణన సందర్భమున రచించినాడు.

ద్రవిడకుటుంబిను ల్పసుపు రాచిన రత్నపుదాపక్రింద నం
బువు దెరవాఱగా నిదురబోయి గరుత్తతి పచ్చబాఱినన్
భవనసరోమరాళములు భర్మమయచ్ఛదగుచ్ఛ విస్ఫుర
ద్దివిజధునీమరాళవితతిభ్రమబూన్చు బురిన్భ్రమించుచున్.

కృష్ణరాయలు మధురాపుర వర్ణనము గావించుచు పుష్పలావికల విలాసముల నీ మూడు పద్యములలో చక్కగా వర్ణించినాడు. వారి నర్మగర్భములుకూడ చాల చమత్కృతితో కూడియున్నవి.

సీ॥ వెలది, యీనీదండ వెలయెంత ? నాదండ
కును వెలబెట్ట నెవ్వని తరంబు ?
కలువతావులుగాన మలికదంబకవేణి ?
కలువతావులు వాడకయ కలుగునె ?
కడివోదు నాకిమ్ము పడతి యీగేదంగి
ననకడివోమి ముందఱికి జూడు
జాతులే వంబుజేక్షణ ? పద్మినులు సైత
మును నున్నయెడ జాతులునికి యరుదె ?

యనుచు దొలినుడి నభిలాష లెనయ మూగి
పలుకుతోడనె నర్మగర్భంబుగాగ
నుత్తరము పల్లవశ్రేణి కొసగు చలరు
లమ్ముదురు పుష్పలావిక లప్పురమున.

చ॥ సరసుల నర్మ మింపుల నొసంగ గవంబవు దండగట్టుచో
గరగుట దెల్పు దృక్తరళకాంతులు నుత్తరమిచ్చు నంతరాం
తరముల నవ్వుల న్గలువతండము మొల్లలునంచు మిన్ను గ్రు
చ్చి రహిని రిత్తనూలొసగి సిగ్గువహింతురు పుష్పలావికల్.

సీ॥ పద్మాస్య, పురిననుభవితకు నీవ యె
త్తులుపెట్టెదనగ రావలసె నిటకు;
దెలుపుమా, జాముండు నలరింపొ ఘటికాద్వ
యం బుండు నలరింపొ కంబుకంఠి ?
యేవేడుటకు నీవు ఋతువేల చెప్పెద ?
వువిద, మే మందాక నోర్వగలమె ?
చేరగారాదె, బాసికము గేల్సోకిన
యంతనె చెడునె యేణాయతాక్షి ?
యనుచుఁ బరిభాషబోలె దమ్మోస దొరల
నాడ, మోవిజెలంగిడి, యూగునవ్వు
కంటనిగుడ, పరుల్నాన్పు కరణి జల్లు
సరసపు జలంబె జాణల పురుఁ కొలుపు.

పుష్పలావికల విలాసములు మనుచరిత్రమునగాని పాండురంగమాహాత్మ్యము నందుగాని లేవు. వసుచరిత్రమందొక సీసపద్యముకలదు. కళాపూర్ణోదయమందు కూడ పుష్పలావికల వర్ణనలేదు. వసుచరిత్రలోని సీసమును కూడ నుదహరించెదను.

సీ॥ పొన్నపూవొడి నేల బొదివితే చెలి యది
పొడమె బల్దివిపై బొదువవలదె ?
చెలువ మాటితివేల కలువ చాలదియు గ
గప్పగరాదె మిన్నుల బావికడది

మొగడతమ్ములనేల మూసితే సతి మాయ
దగదె మానస ఘానిధానములవి
తరుణి పూరెమ్మ యెత్తవదేల యది హేమ
శిఖరిదాపుది బయల్ సేయదగునె
యనుచు రస మర్మ సరసోక్తు లాడునట్టి
జట్టికాంద్ర యథోచిత సరసవచన
రచనదేల్చుచు వివిధ విభ్రమము వఱల
విరుల విలుతురు పుష్పలావికలువీట.

వసుచరిత్రకారుడు సూక్ష్మముగా పోనిచ్చెను. కాని కృష్ణరాయలు విపుల ముగా వర్ణించి విద్వజ్జనుల రసికుల మన్ననల నందుకొనియెను.

అయితే వసుచరిత్ర పద్యములో నతిశయోక్త్యలంకారమైనది యిందు దత్తాలంకారమైనది. ఆ పిదప నాయకుని వర్ణనమును పరిశీలింతము. మనుచరిత్ర కారుడు పురవర్ణనము రెండు పద్యములలో ముగించెను. ఇట్లు పరిణతి నొందిన వర్ణనాబాహుళ్యమును పరికించిచూడ ప్రబంధరచన పరిపక్వమయిన పిదపనే విష్ణు చిత్తీయము రచింపబడెననుట తెల్లమగును. మనుచరిత్రలో నాంధ్రకవితాపితా మహుడగు నల్లసాని పెద్దనామాత్యుడు ప్రవరుని వర్ణించెను. తెనాలి రామకృష్ణుడు పాండురంగ మాహాత్మ్యములో నిగమశర్మను వర్ణించెను. రామరాజభూషణుడు వసుచరిత్రయందు వసురాజును నాయకునిగా వర్ణించెను. పెద్దనామాత్యు డేడు పద్యములందు తన కథానాయకుని వర్ణించెను. రామరాజభూషణుడు వసురాజు నెనిమిది పద్యములలో వర్ణించినాడు. తెనాలి రామకృష్ణుడు నిగమశర్మ నారు పద్య గద్యములలో వర్ణించెను. కృష్ణరాయలు విష్ణుచిత్తుని వర్ణించుచు తొమ్మిది పద్య ములను వ్రాసెను.

మనుచరిత్రలో ప్రవరుడు

"ఆపురిబాయకుండు మకరాంకశశాంకమనోజ్ఞ మూర్తి భా
షాపరశేషభోగి వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మదీ
క్షాపరతంత్రు డంబురుహగర్భకులాభరణం బనారతా
ధ్యాపనతత్పరుండు ప్రవరాఖ్యు డలేఖ్య తనూవిలాసుడై".

యను పద్యమందు వర్ణింపబడినాడు.

వసుచరిత్రలో రామరాజభూషణుడు వసురాజును

సీ॥ తన యశోవిశద ముక్తాసౌధపాళికి
నంబుదాయనము వాతాయనముగ
దన శౌర్య శిఖిశిఖా తతికి జాంబూనద
భూధరం బపరంజి పూదెగాక
దన బలోద్ధత రజోదంభకుంభినికి దా
రాగ్రహంబులు గర్భరత్నములుగ
దన దానధారాఖ్య వనధికి మిన్నేఱు
కల్లోల ధుతవారి కణముగాగ
దన వినూతన గుణసంతానవల్లి
సముదయంబున కంభోజ సంభవాండ
భాండము లఖండ ఫలపరంపరలుగాగ
వఱలు భవ్య విభా విభావసుడు వసుడు.

పై సీసమం దభివర్ణించినాడు.

తెనాలి రామకృష్ణుడు కూడ నిగమశర్మను సీసమందే వర్ణించినాడు.

సీ॥ ఉష్ఘాని హోమాగ్ని నూదనొల్లడు గాని
విరహజ్వరార్తుడై వెచ్చనూర్చు
సంధ్యకు బ్రార్థనాంజలి ఘటింపడుకాని
యెరగు నీర్ష్యా కషాయితల కర్థి
నాగమవాదంబు లౌగాదనడుగాని
విటవాదములు తీర్చు వేగిలేచి
కంబుభృత్పాదోదకంబు గ్రోలడు కాని
యౌవతాధర సీధువాని చొక్కు
బుణ్యచిహ్నంబు లపఘనంబున ఘటింప
సిగ్గుపడుగాని కరనఖ శిఖరలిఖిత
జాత నూత్న క్షతాంకముల్ సమ్మతించు
నారజము మీరి యా దుర్విహారహారి.

రామరాజభూషణుని నాయకుడు రాజేంద్రుడు. తెనాలి రామకృష్ణుని కథానాయకు డగ్రజాతిభ్రష్టుడయిన జారుడు. పెద్దనామాత్యుని ప్రవరుడు నిష్ఠాగరిష్ఠుండు,

ఇంక కృష్ణరాయల కథానాయకుని పరికింతము.ఇతడు పన్నిద్దరాళ్వారులలో నొకడు. వైష్ణవశ్రేష్ఠుండు. నిష్ఠాగరిష్ఠుండు.

శా॥ అందుండుం ద్వయ సద్మ పద్మవదనుం డద్వంద్వు డశ్రాంతయో
గాందూబద్ధ మధుద్విషద్ద్విరదు డన్వర్థాభిధానుం డుదు
చ్ఛందోబృంద తదంత వాగపరనా సంజాతతజ్జన్య ని
ష్పంద ద్వైత సుసంవిదాలయుడు నిష్ఠ న్విష్ణుచిత్తుండనన్.

క॥ న్యాయార్జిత విత్తంబున
నాయోగీశ్వరుడు వెట్టు నన్నం బాప్రా
లేయ పటీరాచల ప
ద్యాయతాయాత వైష్ణవావళి కెల్లన్.

ప్రవరుడు నిత్యాగ్నిహోత్రి. తన గేహసీమకరుదెంచు నభ్యాగతుల కాత డాహారాది సౌకర్యంబులు చేయుచు వారియొద్దనుండి క్రొంగ్రొత్త విషయంబులు గ్రహించుచు కాలక్షేపము చేయుచుండెను. విష్ణుచిత్తుడు భాగవతోత్తముల నాదరించి తన గేహమం దన్వహము నాగేంద్రశయాన దివ్యప్రబంధ సంధాన ధ్యానముచే కాలక్షేపము చేయుచుండెను.

సాహిత్య దృష్టితో శ్రీ కృష్ణదేవరాయలు మనకు చిరస్మరణీయు డదియు నుంగాక కవి సృష్టి బ్రహ్మసృష్టికన్న విలక్షణమని లాక్షణికులు వర్ణించిరి. షెల్లీ Poets are unacknowledged legislators of the world యన్నాడు. అనగా కవులు ప్రశంసనొందని ప్రపంచశాసన కర్తలని యభిప్రాయము. కృష్ణరాయలు నాటికాలపు రాజనీతి నాముక్తమాల్యదలో నేదో సందర్భము తెచ్చిపెట్టి చౌసీతిపద్య ముల ఘట్టమును జొప్పించినాడు. శ్రీనాథ కవి సార్వభౌముడొక్కడే దేశకాల పాత్రముల ననుసరించి పురవర్ణనమాదిగాగల వర్ణనలను వ్రాసెను. దానిని గాంచియే కృష్ణదేవరాయ సార్వభౌము డాముక్తమాల్యదలో విద్యానగర వైభవముట్టిపడునట్లు పురవర్ణనములో నావిశేషములను ప్రతిభతో చమత్కరించినాడు. ఏతద్గ్రంథ ప్రౌఢిమ పరికింపవలెనవిన కవనము పరికింపవలెను. ఆంధ్రసాహిత్యములో శ్రీనాథుని శృంగార నైషధ మొక ప్రౌఢమహాకావ్యము. ఇంచుమించుగా విష్ణు చిత్తీయము శృంగార నైషధముతో తూగగల గ్రంథము. ప్రౌఢమనగా భావము నకుగాని భాషాపాటవమునకు గీర్వాణ సాహిత్య పాండిత్య ప్రకర్షకు గాని యీ రెండు గ్రంథములు సమయుజ్జీలు. సంస్కృతపద దీర్ఘసమాస భూయిష్ఠ మగు రచన శ్రీనాథునికి భారతీ ప్రసాదము. కృష్ణరాయలాతని ననుకరించెను.

శ్రీనాథుని శైలి దీర్ఘ సమాస భూయిష్ఠమయ్యును సరళము. కృష్ణరాయల శైలి నాతికఠినము. విష్ణుచిత్తీయములో కూడ సగముకన్న యెక్కుడుభాగము సంస్కృతముకలదు. శ్రీనాథుని శృంగారనైషధము భట్టహర్షుని ప్రౌఢవాక్పాటవమునకు నికషోపలమగు సంస్కృత నైషధమునకు స్వేచ్ఛాంధ్రీకరణమయ్యు స్వతంత్ర గ్రంథమట్లు భాసించెడిని. శ్రీనాథుని శైలి మధురము. కష్ణరాయల శైలి కొన్నిచోట్ల కఠినము. శ్రీనాథుని శైలి ద్రాక్షాపాకము, కృష్ణరాయల శైలి నారికేళఫలపాకము. భట్టహర్షుడు తన నైషధమహాకావ్యమును ప్రస్తావించుచు దాని నిర్మాణమునుగూర్చి యొక శ్లోకమును వ్రాసినాడు, కృష్ణరాయల బృహత్ప్రబంధమగు విష్ణుచిత్తీయ ముద్దండ పండితులకు కూడ కొఱుకుడుపడని యయఃపిండము.

గ్రంథగ్రంధి రిహ క్వచిత్ క్వచిదపి న్యాసిప్రయత్నాన్మయా
ప్రాజ్ఞమ్మన్యమనా హఠేనపఠితో మాస్మిన్ ఖలఃఖేలతు
శ్రద్ధారాద్ధగురుశ్లథీకృత దృఢ గ్రంధిః సమాసాదయః
ఏతత్కావ్యరసోర్మి మజ్జనసుఖవ్యాసజ్జనః సజ్జనః,

సారస్యమున్న స్థలములలో ప్రయత్నపూర్వకముగా ముడులు పెట్టితిని. అవి సామాన్యముగ బోధపడవు. పండిత పుత్రులు పండితంమ్రులు లిందలి పద సౌష్ఠవమును గాంచి భ్రమించి రమింతురుగాక, కాని కావ్యరసైకలోలురగు సత్ప్రాజ్ఞులు "ఆచార్యస్య హరిః సాక్షా న్నరరూపేన సంశయం" యను నానుడి ప్రకార మొజ్జలపజ్జ శుశ్రూష చేసి వారి వద్ద నిక్షిప్తమైన జ్ఞాననిధుల సేకరించుకొని యేతద్గ్రంథమందలి ముడుల నర్థము చేసుకొని సాహిత్యపటిమ నార్జింతురుగాక. ఆముక్తమాల్యద శైలి నారికేళ పాకము. ద్రాక్షాపాకము నారికేళపాక మని కవనమునకు పాకములు రెండు.

"ద్రాక్షాపాకోభవేత్యోఽయం బహిర న్తః స్ఫురద్రసః
బహిః ఖలో నారికేళపాక స్త్వ న్తర్మృదు ర్భవేత్"

అని యేతల్లక్షణములు సాహిత్యరత్నాకరములో నుల్లేఖించబడినవి. నారికేళపాకము బయటికి కఠినముగాను లోపల మృదువుగా నుంతునని లక్షణకావ్యార్థము. వేదము వేంకటరాయ శాస్త్రులవారి సంజీవనీవ్యాఖ్య లేకుండిన నయోమయ మందనమగు విష్ణుచిత్తీయము సామాన్యుల కర్థమగుట కల్ల. ఈ సందర్భమున మరొక విషయమును స్పష్టముచేయు టవసరము. వాల్మీకి రామాయణమునకు సరియైన యనువాదము గోపీనాథవేంకటకవీంద్రుల రామాయణము. దీనినిచూచియే శ్రీ చదలవాడ సుందరరామశాస్త్రులవారు వాల్మీకమునకు విశేషార్థ తాత్పర్యములు

వ్రాసినారు. వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిలవారు వేదమువారిని తూలనాడినను వారి సంజీవనీవ్యాఖ్యలేని దాముక్తమాల్యద సుబోధకమగుట కల్ల.

సాహిత్యశాస్త్ర లక్షణప్రకారము కావ్యాదియం 'దాశీ ర్నమస్క్రియా వస్తు నిర్దేశ'ములను మూడింటిలో నెద్దియో యొకటి చేయవలెను. కృష్ణరాయ లాముక్త మాల్యదకాదియందు నమస్క్రియారూపకమగు మంగళాచరణమునే గావించినాడు. తన్నమస్క్రియా రూపకమగు మంగళాచరణమే కృష్ణరాయల కవితానిర్ఝరికంగ రక్షగా నిల్చినది. కృష్ణరాయల నమస్క్రియ యివ్విధముగా నున్నది.

శ్రీ కమనీయ హారమణి జెన్నుగ దానును గౌస్తుభంబునం
దా కమలా వధూటియు నుదారతదోప బరస్పరాత్మలం
దాకలితంబులైన తమ యాకృతు లచ్యుత బైకి దోప న
స్తోకత నందు దోచెనన శోభిలు వెంకటభర్త గొల్చెదన్.

ఇట్లు వేంకటభర్తను గొల్చుటకుకారణము కృష్ణరాయలు తనకున్న భగవదా దేశమును పాటించెనని యీ పద్యము వల్ల తెల్లమగుచున్నది.

క॥ అంకితమో యన నీ కల
వేంకటపతి యిష్టమైన వేల్పగుట దదీ
యాంకితము సేయు మొక్కొక
సంకేతము కాకతడ రసన్నే.గానే.

అందువల్లనే యిప్పటికిని తిరుమలపై కృష్ణరాయల విగ్రహము కూడ కలదు. అంతేగాక భగవంతుడే కృష్ణరాయల నాముక్తమాల్యద వ్రాయమని యాదేశించెనని యీ క్రింది పద్యమువల్ల తేటబడుచున్నది.

ఎన్నినుగూర్తు నన్న విను మేమును దాల్చిన మాల్యమిచ్చు న
ప్పిన్నది రంగమందయిన పెండిలి సెప్పుము మున్నుగొంటి నే
వ న్ననదండ యొక్క మగవాడిద నేను దెలుంగు రాయడ౯
గన్నడరాయ యక్కొదువ గప్పు ప్రియా పరిభుక్త భాక్కథన్.

గోదాదేవి కాముక్తమాల్యద యను పేరెట్లువచ్చెనో యీ శ్లోకము తెల్పుచున్నది.

శ్లో॥ ఆముక్తమాలికా యేన విష్ణవే గోదయార్పితా
ఆముక్తమాల్యదానామ తస్యా స్తే నాభవ ద్భువి.

కృష్ణదేవరాయలు బహుభాషాప్రవీణుడు. మొదట గీర్వాణమున పెక్కు గ్రంథములను రచించెను. అందు నొక్కొక్కదానిలో నొక్కొక్క విశిష్టత కలదు. అందులకే యీ రాజచంద్రున కంధ్రవిష్ణువు గనపడి సంస్కృతమం దిన్ని

గ్రంథములు రచించితివి, యంధ్రభాష నీకసాధ్యమా ? యని యతనిని నీ మహా కావ్య రచనకు పురిగొల్పినాడు. ఆంధ్రవిష్ణువు కృష్ణరాయల నుద్దేశించిన పద్యము నిందు బొందుపరచుచున్నాడను.

సీ॥ పలికి తుత్ప్రేక్షోపమల జాతి పెంపెక్క
రసికు లౌనన మదాలస చరిత్ర
భావ ధ్వని వ్యంగ్య సేవధిగాగ జె
ప్పితివి సత్యావధూ ప్రీణనంబు
శ్రుతిపురాణోప సంహిత లేర్చి కూర్చితి
సకలకథాసారసంగ్రహంబు
శ్రోత్రపుచ్ఛటలు విచ్చుగ రచించితి సూక్తి
నైపుణీ జ్ఞాన చింతామణీకృతి
తే॥ మఱియు రసమంజరీ ముఖ్య మధురకావ్య
రచన మెప్పించికొంటి గీర్వాణభాష
నంధ్ర భాష యసాధ్యంబె యందునొక్క
కృతి వినిర్మింపు మిక మాకు బ్రియముగాఁగ.

సంస్కృతమం దిన్ని కావ్యములు రచించినవాని కంధ్రభాష యసాధ్యమా, తనకు బ్రియమగున ట్లొక కృతి వినిర్మింపుమని భగవద్వాక్యము. దానిని కృష్ణ రాయ లెట్లు త్రోచిపుచ్చగలడు ? అంతేగాక కృష్ణరాయలు మధురకావ్య రచన మెప్పించుకొన్న మేటిఘనుడు.

ఏతత్కావ్యమం దోజోగుణ భూయిష్ఠమగు పద్యములు చాల కాన్పించు చున్నవి. ఓజోగుణ మనగా గీర్వాణ సమాస భూయిష్ఠమగు నశిథిల పదబంధము. దీని కుదాహరణముగా కొన్ని పద్యము లనువదింతును.

శా॥ ప్రాతర్వేళల నట్టిపెట్ట సొగసై పాటిల్లె గుంభోంభనో
ద్భూతాంబుధ్వని వాద్యమై మరుదథః పుంజీభవత్పాటల
వ్రాతామ్రేడిత సిక్త భూ సురభి శారామాంబు కుల్యా బహు
స్రోతస్పంధుల నంధుయంత్ర నతికృత్త్రోప్యద్గీత గేయౌఘముల్.

శా॥ అర్థావాగ్విబుధ, మ్మహోవచనకవ్యాహార, మాహోవచ
స్సిద్ధ మ్మాః కృతతాంగతః కలిరితి శ్రీసూక్తి విద్యాధర
మ్మిద్ధార్థత్యమగాల్లయం హి కుధియా మిత్థం వదత్కిన్నర
మ్మద్ధీరాగ్రణి గెల్పు టుత్సవమునం దయ్యె న్నభం బంతయున్.

సీ॥ స్యందనస్థిత బిడౌజః క్షత్త్రజాద్య కృ
జ్జంయూమరుద్గరుజ్ఝాత్కృతములు,
క్రవ్యాశిరాగ్రాత్ర కనదసృగ్గాహన
స్ఫుట శల్యహవ్యభుక్ఛూత్కృతములు,
యోధవర్మితహృత్పు టోత్క్రాంత నిజపాత
సాలాశ్మకృత ముహుష్ఠాత్కృతములు,
పతితోగ్ర రక్షః కబంధభారభృశార్తి
భుగ్నభోగ ఫణీంద్ర ఫూత్కృతములు
క్రాంతరథ్య నిరంతరచ్ఛాయదములు
దిత్య తావక కార్ముకోత్ప్రేరితములు
కలుషము లడంచుగాత లంకాపురాంగ
ణాంబర చరత్కలంబ కదంబకములు.

మ॥ చని కాంచె న్విరజాభిధాంతర వపుస్సహ్యోద్భవాతీర నం
దనవాటీ వలయద్రుమావళి దళాంతర్దృశ్యపాపాళిభం
జన చాంపేయ సుమాయమాన విషమస్వర్ణావృతివ్రాత ర
శ్మి నభస్స్పృక్ఛిఖరాళి దీపకళికా శృంగంబు శ్రీరంగమున్.

శా॥ కాంచెన్వైష్ణవు డర్ధయోజన జటా ఘాటోత్థశాఖోపశా
ఖాంచద్ఘోట చరన్మరుద్రయ దవీయః ప్రేషితోద్యచ్ఛదో
దంచత్కీటకృత వ్రణచ్ఛలన లిప్యాపాదితాధ్వన్యని
స్సంచారాత్త మహాఫలోపమ ఫల స్ఫాయద్వటక్ష్మాజమున్.

మ॥ మదనస్యందనతా స్వవృత్తి దెలిపెం బాటీర భూభృద్వల
న్మృదువాతం బతిపక్వ పాదప లతా వృంతావళీ మూలరం
ధ్రదళత్పంకజకర్ణికాగణ హరిద్రా భంగ భాభాసుర
చ్ఛదనచ్ఛద్మ వివర్తి కాంచనకనచ్చక్రచ్ఛటా ఛీత్కృతిన్.

ఈ మహా కావ్యమందు ప్రసాదగుణము కూడ కలదు. ఏ కావ్యముగూడ పూర్తిగా నోజోగుణ భూయిష్టముగా నుండదు. అట్లుండుటవలన నది రసస్ఫూర్తికి లోపము కల్గును. ఇంక ప్రసాద గుణమున కుదాహరణముగా కొన్ని పద్యము లను వదింతును. రాయల కర్తవ్య వాదమును శంకించువార లేతత్కావ్య మంతయు నోజోగుణ భూయిష్ఠమనిరి. ఏ గ్రంథముకూడ నట్లుండదు. అట్లు వ్రాయుటకు వీలుపడదుకూడ.

ఉ॥ నేడు మహామతీ మధుర నీవు రయంబున జొచ్చి యందు దాం
డీడు దివాణము న్నెఱయనించిన ప్రేలెడు దుర్మదాంధులన్
బోడిమిమాన్చి మన్మహిమముం బ్రకటించి హరింపు కుల్కుమున్
వాడును రోసినా డిహము వైష్ణవుగా నొనరింపు సత్కృపన్.

చ॥ విను మొకమాట రాత్రిచర, వేగిర మేటికి ? నిన్జయింతురే
యనిమిషులైన? భాజనగతాన్నమ నేనిక నెందుబోయెదన్
బెనగక ప్రాణ రక్షణ ముపేక్షమొనర్చుట పాప మిందుకై
కనలకు నాకు మేనియెడ గాంక్షయు లేదిది పోవుచే యరున్.

ఉ॥ ఎవ్వని చూడ్కిచేసి జనియించు జగంబు, వసించు నిజ్జగం
బెవ్వనియందు, డిందు మరి యెవ్వనియం దిది, యట్టి విష్ణుతో
నివ్వల నొక్క వేల్పు గణియించిన పాతకి గాదు నేఁడ నే
నెవ్విధినైన నిన్గదియనేని యన న్విని బంధమూడ్చినన్.

మ॥ 'తరుణుల్ ల్లియొజ గ్గుచంబు లనుపం దచైత్యముల్ దీములై
పెరరేపం జనుదెంచెగాక రవి దీప్తింగ్రుంకి పాతాళగ
హ్వరముందూఱినవారి నీయదుకు ద్రాక్షా తెచ్చు' నా దీర్ఘత
చ్చిర కృష్టిం గనునట్టి శైతమలరించె న్నూతులం దత్తటిన్.

చ॥ అనవుడు నల్ల నవ్వి మనుజాధిపు డిట్లను మీర లర్థ సా
ధన పరతంత్రకోవిదులుదక్క మహాసుఖదాయి మోక్ష మా
ర్గనయ విచార కోవిదులు గా రతి చంచల రాజ్యలక్ష్మి యే
మని చని వేడువాడ బరమార్థము వేడక య మ్మహామతిన్.

చ॥ మలయపుగాలి రేలు వనమాలి విమాన పతాక పుల్లు మం
చలియ బసిండి మువ్వగమి నొక్కొకమాటు గదల్ప మల్కి మి
న్నలము తదీయ హేమ వరణాంచల చంపక శాఖలందు ప
క్షులు రొదసేయ వేగెనని కూడుదు రల్కలు దీరి దంపతుల్.

ఈగ్రంథమునందు కృష్ణరాయలుయుత్ప్రేక్ష, రూపకము,యతిశయోక్తి, స్వభావోక్తి, యార్థాన్తరన్యాసము, స్వభావోక్తి, పరిసంఖ్య మొదలగు నలంకారములనువాడినాడు.

కలమపు బెండుగు ల్దిరివిడకన్యలు ముంగిట గాచియుండి త
జ్జలరుహనాళగేహ రురుశాబము సారెకు బొక్కులాడ గొం
డెలపయి క్రమ్మ గ్రామ్య తరుణీతతి డించిన పేపగంపలం
దలమగుచున్న చెంగలువ దండల దోలుదు రప్పురంబునన్.

అనగా నా పురమందు యిండ్ల ముంగిళ్ళలో యెండబోసిన ధాన్యమును కాచుచున్న కన్నెలు వెన్నుని దేవళపు కురంగ శాబక మా ధాన్యమును తినుచుండగా దానిని దేనితో వెడలగొట్టుదు రనగా తమకు కొండెలమీద దాల్చుటకుగా నమ్ముటకొఱకు పల్లెటూళ్ళ తరుణులు ముంగిళ్ళం దింపుకొనియున్న బెత్తపు గంపలనిండ నున్నట్టి చెంగలువ దండలతో తోలుదురు. కృష్ణస్వామి గుడి దుప్పి పిల్ల గావున దానిపై గ్రామ్యతరుణీతతి కంత వాత్సల్యమని భావము. ఇందు చక్కని స్వభావోక్త్యలంకారము కలదు. "మలయపు గాలిరే"లను పై పద్యమందు చక్కని భ్రాంతిమదలంకారము గలదు.

మ॥ తల పక్షచ్ఛట గ్రుక్కి బాతువులు కేదారంపు గుల్యాంతర
స్థలి నిద్రింపగ జూచి యారెకు లుషస్స్నాత ప్రయాతద్విజా
వళి పిండీకృతశాటుల న్నవి దదావాసంబు జేర్పంగ రే
వుల డిగ్గ న్వెసబాఱ వానిగని నవ్వు న్శాలిగోప్యోఘముల్.

భ్రాంతిమదలంకార మీ పద్యమందును గలదు. అనగా విలిబుత్తూరులో వరిమళ్ళకు దిద్దిన కాలువలయందు బాతులు వాని స్వభావ గుణముచేత దలలు రెక్కలలో దూర్చికొని నిద్రించుచుండగా దలవరులు వానిజూచి యుషఃకాలమందు స్నానార్థమై యా కాలువలకు వచ్చిన బ్రాహ్మణులు తమ వస్త్రములను బిండి యచ్చటనుంచి మఱచిపోయిరని తలంచి వాని మరల వారివారి గృహములలో నొప్పగించుటకై రేవులలో దిగగానే యాపక్షులు పరచుటచూచి యచ్చట బైరులను గాపాడుచున్న గరితలు తలవరులను బరిహసింతురని భావము. ఉత్ప్రేక్షాలంకారమునకు మరొక పద్యము నుదహరింతును.

అల పర్జన్యుడు భానుడన్కొలిమిలో నభ్రంపు బెన్గొప్పెరన్
జలమాగన్ బిడుగుక్కజాత్యపు టయస్కాంతంబు నత్తున్కలో
పలజూప న్మిహిమీది లోహరజమున్ పైబర్వెనా లేచె వా
త్యల బ్రాగ్దావమషు ల్మొగి ల్మొదల గ్రద్దంతై దివిన్బర్వినన్.

అనగా తొల్దొల్త మేఘము గృధ్రమాత్రమై యంతరిక్షమున నుండునపుడు భూమియందున్న కార్చిచ్చుల మషీ సమూహములు సుడిగాడ్పులచే నెగురగొట్టబడి పై కెగసి యందున్న స్వల్ప మేఘమును గలయునపుడు పర్జన్యుం డను కమ్మరవాడు సూర్యు డను కొలిమియందు మేఘ మను నీళ్ళకాగును నీరు కారకుండుటకై పిడుగుక్కనకు సజాతియైన సూదంటుఱాతి తునకలు లోపల నతుకుబెట్టగా

బడమియందున్న లోహరజఃపుంజము లన్నియు బయికి నెగసి యా మేఘము నావరించి వృద్ధిబొందించున ట్లుండెనని భావము.

కృష్ణరాయలకు శ్రీనాథుని సీసపద్యరచనకూడ యలవడినది. శ్రీనాథుని సీసము లుయ్యాలలూగుచు యే పాదమున కా పాదము విడిపోవును. ఒక భావమును విరివిగా వర్ణించుటలోగాని, సంక్షిప్తముగా వర్ణించుటలోగాని శ్రీనాథునిదే యగ్రతాంబూలము. శ్రీనాథుని పద్యములు రెండు కృష్ణరాయల పద్యములు రెం డనువదింతును.

సీ॥ నిబిడ శైశవ యౌవనీయ సంధ్యావేళ
యానన చంద్రబింబామృతంబు
లపనామృతాంగు బాల ప్రభాజాలంబు
బంధుజీవ లతాంత బాంధవంబు
పరిపక్వ బింబికాఫలవిడంబనముద్ర
విద్రుమద్రుమలతావినిమయంబు
మదన నారాచకోమల హైంగుళచ్ఛాయ
యస్మన్మనోనురాగాంకురంబు
మహిత లావణ్యగుణ జాయమాన బహుళ
మాధురీ చిత్రశోభా సమన్వితంబు
ప్రార్థనాకల్పపాదపప్రాజ్యఫలము
తియ్య పూదేనియల క్రోవి దీనిమోవి.

ఈ సీసము నలుడు దమయంతి సౌందర్యము వర్ణించు ఘట్టములోనిది. ఇంకొక పద్యము నలదమయంతుల విహారములోని దనువదింతును.

సీ॥ ప్రథమానురాగంబు రాజహంసముచేత
దెలిపి యంపినయట్టి దిట్టతనము
బేరోలగంబున బెద్దగద్దియనుండి
దృష్టించి డిగ్గని ధీరతయును
నుత్తర ప్రత్యుత్తరోక్తి నైపుణశక్తి
గర్వంబు సూపిన కలికితనము
వరణావసరమున వాసవాదులమాయ
మాయింపజేసిన మతిబలంబు

నాత్మ దివ్యావతారతావ్యంజకంపు
ప్రౌఢి ప్రచరింప వ్రీడాభరంబు కలిమి
పైశికంబయి యుండు నెవ్వరికిగూడ
గాన లజ్జింప లజ్జించె గమలవదన.

మొదటిదానియందు దమయంతి మోవి సౌందర్యము, రెండవ దానియందు దమయంతి దిట్టతనము, లజ్జ, గుణగణములు వర్ణింపబడినవి.

సీ॥ మరుధూథ మలయాహిగరధూమ్య లనుగళ
న్మనసిజ రథపదాంజనకళికలు
త్రాసధావచ్ఛిశిరత్యక్తబాష్పముల్
పికపంచమస్వరోద్భేదవీణ
లబ్ధాగమన్మరందాసారజంబువుల్
హిందోళ సాక్షిన్మకుందరోచు
లభిసారికాంశుకోద్యన్నీలగుళికలు
జాత్యనుల్లసనాత్త శాపతతులు
చైత్రసంజీవ నౌషధీజాతచేత
నాత్మజని హేతు తరుపునర్యాయి యువతి
కరవిధూత హసంతి కేంగాలచయము
లళుల పంక్తులు వనుల నట్టాడ దొడగె.

ఈ పద్యము వసంతర్తువు వర్ణనమున వ్రాయబడినది. ఇందు వర్ణింపబడినవి తుమ్మెదగుంపులు. శ్రీనాథుడు కాశీఖండమున నొక సీసము రచించినాడు. మయూరుని సూర్య శతకము పాండిత్యమునకు నికషోపలము, అందున్న కొన్ని పద్యములను మనమునసుంచి యీ సీసమును రచించినాడు.

సీ॥ దోర్దండ ఘట్టన త్రుటిత గ్రహగ్రావ
ధూళిపాళి మిళద్ద్యుస్థలములు
ధ్వజపటపల్లవోత్థిత మరుత్సంపాత
పరికంపమానోడుపరివృఢములు
గ్రాసాభిలాషానుగత విధుంతుద పునః
ప్రాప్త చక్రవ్యథోపద్రవములు
శ్రాంతాశ్వ నిబిడ నిశ్శ్వాస ధారాధుత
స్వర్ధునీ నిర్ఝర జలచరములు

తే॥ గగనపదలంఘనైక జాంఘాలికములు
పద్మవన బాంధవుని రథ ప్రస్థితములు
సాగె నది దక్షిణాయన సమయమగుట
దర్దురముమీద మలయభూధరముమీద.

అను పద్యమునకు సరిగా తూగునట్లు తెనాలి రామకృష్ణు డొక సీసమును రచించినాడు.

సీ॥ కఠిన కంఠీర వాక్షత నఖక్షత జర
త్కరి శిరశ్శుక్తి శార్కరిలతలము
లాచాంత జంతుకంఠాసృ గుగ్ర వ్యాఘ్ర
ముఖగుహా ఘాంకార ముఖరితంబు
లశ్వద్విషద్విషాణాగ్ర నిగ్రహ వహ
త్ప్రస్తర ప్రసవ సౌరభమయంబు
లజ్ఞాత రవికర వ్యాపార భూరుహ
చ్ఛాయానపాయాతి శైత్య ఖనులు
గహన ఘంటాపథంబులు గడచి నడచి
యొక్క పక్కణ మీక్షించి యూరకిల్లి
యవరవర్ణస్ను షయు బ్రాహ్మణాధముండు
బోయ కులమున కలసిరి పొలుపు దక్కి.

శ్రీనాథుని సీసమునకు తెనాలి రామకృష్ణుని సీసమునకు సమయుజ్జీగా కృష్ణరాయ లీ సీసమును రచించెను. తెనాలిరామకృష్ణు డయ్యలరాజు రామభద్రుడు రామాభ్యుదయమున రచించిన

"సింహనఖాంకుర చ్ఛిన్నవారణకుంభ
జనితముక్తాఫలశార్కరిలము"

అను పద్యభావమునే పాండిత్య ప్రకర్షతో వ్రాసెను. ఇంక కృష్ణరాయల సీసమును పరిశీలింతము.

సీ॥ స్యందనస్థిత బిడౌజః క్షత్త్రజాద్య కృ
ష్ణంయూ మరుద్గరు జ్ఞాతకృతములు
క్రవ్యాశిరాగ్ధాత్ర కనదసృగ్గాహన
స్ఫుటశల్య హవ్యభు క్స్ఫాతకృతములు

మోధవర్మిత హృత్పుటోత్క్రాంత నిజపాత
సాలాశ్మ కృతము హుష్టాత్కృతములు
పతితోగ్ర రక్షఃకబంధ భారభృశార్తి
భుగ్నభోగఫణీంద్ర పూత్కృతములు
తే॥ క్రాంత రథ్యా నిరంతరచ్ఛాయదములు
దివ్యతాపక కార్ముకోత్ప్రేరితములు
కలుషము లడంచుగాత లంకాపురాంగ
ణాంబర చరత్కలంబ కదంబకములు.

ఈ పద్యము శ్రీ రామావతారమునకు సంబంధించినది. రామ రావణ సంగ్రామమందు వారి పరస్పర బాణప్రయోగ పరంపరలు వర్ణించబడినవి.

ఈ గ్రంథమునకు చంద్రికా పరిణయమునకు పోలికలు బహుళముగా గలవు. చంద్రికా పరిణయమును రచించినది జటప్రోలు సంస్థానాధీశ్వరులు శ్రీ సురభి మాధవరాయ ప్రభుపుంగవులు. ఈ రాజపుంగవుడు వసుచరిత్రకారుని సమకాలికుడు. ఈ రాయలవారు కర్నూలు మండలము నేలుచు

"అనఘతర కందనోలిమహాపురని
శాంతుడగు రామమేదినీకాంతు డలరు"

అని వసుచరిత్రమున చెప్పబడినారు. అయితే రామరాజభూషణుడే తదాస్థాన మలంకరించెనను విషయము కొంతకాలవిపర్యాస దోషమునకు తావిచ్చుచున్నది. శ్రీ సురభి మాధవరాయపుంగవులు వసుచరిత్రమును చదివి శ్లేష గాంభీర్యమును, విష్ణు చిత్తీయమును చదివి కల్పనా ప్రౌఢిమలను తన గ్రంథమందు జొప్పించి యుండె ననుట సమంజసముగానున్నది. ఆముక్తమాల్యదపై శ్రీ మేడేపల్లి వేంకట రమణాచార్యులవా రొసంగిన యమూల్యాభిప్రాయమును పాఠకుల యుపయోగార్థ మిందు బొందుపరచుచున్నాను.

అనేక నిఘంటు వ్యాకరణ సహకారముచే నిరూఢమగు సంస్కృత భాషా పాండిత్యము గలవారికి గాని సామాన్య జ్ఞానముగలవారికి గాని కల్పనలతో గూడుకొన్న పద్యములు దుర్జ్ఞేయములు. కథా భాగమును దెలుపు పద్యములు కొన్ని సామాన్య జ్ఞానము గలవారి కర్థ మగును. మహా కావ్యమున కపేక్షిత ములయిన పుర చాతుర్వర్ణ్య రాజ ఋతు వివాహాది వర్ణన లిందులో నున్నవి. గ్రీష్మవర్షా శరద్వసంతము లిందులో వర్ణింపబడినవి. ఇన్ని ఋతువులు మరి యేప్రబంధమందును వర్ణింపబడి యుండలేదు. చంద్ర సూర్యోదయాది వర్ణనలు

లేవు. అయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయ మందును, పింగళి సూరన కళాపూర్ణోదయమందును, పుష్పగిరి తిమ్మన సమీరకుమార విజయమందును, తక్కు-కవులు తక్కు- ప్రబంధములందును ఋతువర్ణన జేసిరిగాని, యిట్టి యత్యద్భుత కల్పన లెందును గానరావు. కల్పనల యందును సంస్కృతభాషా ప్రాచుర్య మందును దాదాపు దీనికి సరివచ్చునది చంద్రికా పరిణయ మొక్క-టే యని యూహించెద.

ఈ సందర్భమున నితఃపూర్వ ముల్లేఖించినట్లు చంద్రికాపరిణయమును చూచి కృష్ణరాయలు విష్ణుచిత్తీయమును రచింపలేదు. వసుచరిత్రయందలి శ్లేషను, విష్ణుచిత్తీయమందలి కల్పనా ప్రౌఢిమలను జీర్ణించుకొని మాధవరాయ పుంగవులు చంద్రికా పరిణయమును కూర్చెను. ఏలయన మాధవరాయ పుంగవులు కృష్ణరాయలకన్న పూర్వుడుకాని సమకాలికుడుకాని కాడు. కల్పనా ప్రౌఢిమ యందు చంద్రికా పరిణయమునకు విష్ణు చిత్తీయమునకు కొన్ని పోలిక లున్నవని చెప్పక తప్పదు.

శ్రీ రాయల సర్వంకష పాండిత్య స్ఫోరకములగు పదములు చాదా పారు వందలు గలవు. ఆ పదము లన్నియు సామాన్యకవు లుపయోగించినవిగాక స్వప్రతిభాతిశయమున పాండిత్య ప్రకర్ష నాధారము చేసుకొని సాధించినవి. ఈ సందర్భమునమాత్రము శ్రీనాథునికి, తెనాలి రామకృష్ణునకు సరిపోలును. కృష్ణరాయలాముక్తమందు సర్వంకష పాండిత్య స్ఫోరకములు పిండీకృత, బాడబీకృత, ఇరమ్మదీకృత, దుందుభీకృత వంటివి దాదాపు 600. అంతేకాక యేతద్గ్రంథమందత్వసంధి ప్రయోగములు 63, ఇత్వసంధి ప్రయోగములు 23, క్త్వార్థకేకారసంధి ప్రయోగములు 4, తృణతా, తెండ, ఝూటములను నిట్టి యపూర్వ శబ్దములుకూడ కలవు. ఇంవలి షష్ఠ్యంతము లందలి కవనపు బిగువు మరి యే కబ్బమునందును గానరాదు.

ఇంక నిందు బొడమిన నానుడులను, సంప్రదాయాదులను వివరించెదను.

## నానుడులు

1. దేశభాషలందు తెలుగు లెస్స.
2. నాభియు న్నిర్విషంబును దోబుట్టువులయ్యు వేర్పడ గుణంబుల్సాపవే.
3. కుంపటిలో దామరలు.
4. అంగి సుఖియైన యంగంబు లటకు మున్నె చాలసుఖులు.

5. తిర్యక్కృతి గతానుగతిక యోగా.
6. పాఱువారల సుద్ది చెప్పగ నేల.
7. చొచ్చిన యిండ్లను దనయలుండి కాన్పుకు బుట్టినిల్చేరు క్రమము గనమె,
8. ఉత్కటలాభం బిడునె మరి క్షుధ నీర్వట్టున్.
9. బోనములు ప్రజకు జక్కల బోనంబులె యయ్యె.
10. కారణ గుణంబు గలుగదే కార్యమునను.
11. శతాపరాధమును సహస్రదండమును లేవు.
12. ఘనులగువారు నిజార్జవము చేరువారికి నీరే.
13. పాసెం బడిగినవారే పేదలె ?
14. ఇంటిలో నేదుముల్లయ్యె.
15. విధాతకృత్య మది యేలా తప్పు.
16. అకృత్యముచేనగునట్టి పీడయున్ గోచరమౌనె దైవ మనుకూలమునై పరుమేలు దీఱినన్.
17. తల్లిబడి కోల్చెట్ట.
18. దైవికము నెదుట యుక్తులు ఫలించవు.
19. మసిపాత మానికము.
20. అమృతమైనను జవుల జాత్యన్నసమమె.
21. పుణ్య మమ్ముట కప్పురంబు వెట్టి యుప్పుగొనుట.
22. మీన్మ్రింగిన గ్రుక్క న్వారిధికిం గొఱతయె.
23. పుట్టుమఱి నూతుల్ద్రివ్వ బేతాళముల్.

## సంప్రదాయములు

1. ఆరణ్యకధ్వని వినగజేసి గర్భము సుఖచ్యుతముసేత.
2. దప్పిగొన్నవారు పాలు త్రాగరు.
3. రవికరములు చూలుదాల్చును.
4. శరత్తున యగస్త్యార్ఘ్యము.
5. తప్తపాత్రమందున్న పాలు చిక్కనగును.
6. చేప తన జెనను తానే త్రాగును.
7. జమిలి వెండిమీల వెంద్రుక విల్లు.

8. అగస్తి నీటిని తేర్చుట.
9. కంచుటద్దములను బూడిదతో తోముట.
10. వేటకాడు నల్ల గ్రోలనిచ్చి సివ్వంగిం దిగుచును.
11. ఆహార దోషము విజ్ఞాన నాశనముకు మూలము.
12. అంపకోలను మాలను యాజ్ఞ చెల్లును.
13. వ్రాతలో యంచపదము.
14. గజకచ్ఛపోగ్ర కలహము.
15. కాలి తడిసిన ముత్తెము సున్న మగును.
16. చలికాలమున పెదవులకు మైనము పూసుకొనుట.
17. వేగుజామున నిప్ప లలర్చును.
18. శిశువులకు దంతము లుదయించిన తన్మాతాపితలకు సంగమము కలుగును.
19. ఉప్పు చింది ఖునుమడి యగును.

కృష్ణరాయల కవనమందు పూర్వకవి ప్రయోగములు చాలాకన్పించుచున్నవి. దీనివలన నాతని కాయాకవులయం దున్న గౌరవ ప్రపత్తులు వెల్లడియగుచున్నవి. కృష్ణరాయలు పెనుకొండబావులలోతు నీ పద్యములో మనోహరముగ వర్ణించినాడు.

మ॥ 'తరుణు ల్లల్లియొలు స్తనచంబు లునుపం దచ్చైత్యము ల్దీములై
పెరరేపం జనుదెంచెగాక రవిదీప్తిం గ్రుంగి పాతాళగ
హ్వారమున్ దూరిన వారి నీ యదుకుద్రాల్లా తెచ్చు ?' నా దీర్ఘత
చ్చిరకృష్టిం గను నీటి శైత్య మలరించె న్నూతులం దత్తటిన్.

గ్రీష్మమున తరుణులు నీరు చేదునపుడు వారి కుచంబులు దల్లియొర దాకి సూర్యరశ్మి కడుగంటిన నీటి నాకర్షించినవే కాని సామాన్యమగు చేదత్రాడువల్ల నీరు పైకి రాలేదని భావము.

'కూపోదకం వటచ్ఛాయా తాంబూలం తరుణీకుచౌ
శీతకాలే భవే దుష్ణ ముష్ణకాలే తు శీతలమ్' అని శాస్త్రము.

కృష్ణరాయలు న్యాయవైశేషికములందును, పూర్వోత్తర మీమాంసలందును సాంఖ్యయోగ తంత్రములందును, నిరంకుశ పాండిత్యము కలవాడనుట కీ ప్రబంధమే నిదర్శనము.

తే॥ ....ఎండ్రి రవి జేర మూడవయెడకు జేరు
తరణి ధరణి ప్రమోదసంధాయి గాదె"

మ॥ మునుపే చంద్రబలంబు గల్గి మలయంపుంగమ్మలేగాడ్పు దే
రున నేరెంచు లతాంతబాణునకు సూర్యుండు న్మహిం గ్రొత్తగా
ననుకూలించె....

ఈ పద్యములు కృష్ణరాయలకు జ్యోతిష శాస్త్రమందు ప్రవేశముండిన ట్లుగ్గ డించుచున్నవి.

శ్రీకృష్ణదేవరాయలు శ్రీ రామచంద్ర సార్వభౌమునివలె నగరీ పరిశోధనార్థము ప్రచ్ఛన్న వేషమున ప్రజాభిప్రాయమును కనుగొనుటకు వెళ్లుచు నెన్నియో విశేషములను గ్రహించెను. కృష్ణరాయలు సాహితీసమరాంగణ సార్వభౌముడౌట ప్రజల జీవితమును చక్కగా తన కావ్యమందు వర్ణించినాడు.

శా॥ ప్రాతర్వేళల నట్టి వెట్ట సొగసై పాటిల్లె గుంభోంభనో
ద్భూతాంబుధ్వని వాద్యమై మరుదధఃపుంజీభవత్పాటల
వ్రాతామ్రేడిత సిక్తభూ సురభిళారామాంబుకుల్యా బహు
స్రోతస్సంధుల నంధుయంత్రనతిక్ర త్ప్రోద్గీత గేయౌఘముల్.

ఇందారామమునకు నీరు దోడుటకై యేతములు ద్రొక్కుచున్న వారలు పాడు పదములకు బొక్కెనలు ముంచినప్పుడు జనియించినచప్పుడు తాళధ్వనిగలదిగా సొగసుగా నుండుట వర్ణింపబడినది. ఇందు చక్కని స్వభావోక్త్యలంకారము. ఇట్టి గుణగణములతో గూడియున్నను కొందరి కాముక్తము కావ్యమా? యనికూడ సందియ మొదవినది. మద్రాసు విశ్వవిద్యాలయం యమ్. ఏ. పరీక్షలో ఈ ప్రశ్న యొసంగిరి.

"ఆముక్తము కావ్యమా? అట్టయినచో కావ్యలక్షణము లెవ్వి? పరిశీలించునది."

ఇతఃపూర్వము తొలిమాటలో వివరించినట్లుగా సంస్కృత మహాకావ్యమే తెనుగున ప్రబంధమైనది. అందలి సర్గలే యింద్వాశ్వాసములైనవి. సంస్కృత మహాకావ్యములో పదునెనిమిది వర్ణనలుండును. ఆంధ్రప్రబంధమున నిరువది రెండు వర్ణనలుండును. అల్లసాని మనుచరిత్రము ప్రథమ ప్రబంధము. అందీ యిరువదిరెండు వర్ణనలును గలవు. ఆముక్తమందు చంద్రసూర్యోదయాది వర్ణనలు లేవు. ఈ గ్రంథము పాఠకుల నాకర్షింపవలెనని 5, 6 వర్ణనలు లోపింపజేసి ప్రౌఢమగు నారికేళఫలపాకములో భక్తి ప్రధానరసముగా శృంగార మంగరసముగా నీ గ్రంథమును కూర్చెను. కొందరిమతమున నిందు వస్త్వైక్యము లేదని,

కేవలము మూడు ఖండకావ్యముల సంకలనమేయని, యట్టియెడ నిది ప్రబంధమన దగునా యని కూడ సందేహపడుచున్నారు.

ఆముక్తము పెరియాళ్వార్, చూడికొడుత్తాళ్‌యను నిద్దరాళ్వారుల చరిత్రము. వీరు పన్నిద్దరాళ్వారులలోనివారే. దైవికముగా వీరిద్దరు తండ్రి కూతుళ్ళగుట వలన నీ గ్రంథ మింత పెరిగినది. భక్తిప్రధానమగు ప్రబంధమగుటవల్ల కొన్ని తద్వైష్ణవమత ప్రబోధకములగు నుపాఖ్యానములు, ఖాండిక్యకేశిధ్వజ సంవాదము, మాలదాసరికథ, యామానాచార్యుని చరిత్రములతో నవివాహావసంబంధమును కల్పించి మూఢ, జ్ఞాన, అనురాగపూరితమైన భక్తిప్రపత్తులతో విష్ణుచిత్తీయము కృష్ణరాయల యసమాన భావనాపటిమతో, పాండిత్య ప్రకర్షతో వెలసినది. ఇందు వస్త్వైక్యము కలదు. ఈ మూడుపాఖ్యానములు ఖండకావ్యములు కావు. వేర్వేరు కథలు. గోదాదేవి చరిత్రయం దనురాగపూరితమైన భక్తి వర్ణింపబడినది. భగవంతునిపై గల యీదృశానురాగము అమలిన శృంగారమని కూడ పిలువబడును. ఏ విధముగనైనను భగవంతునిపై భక్తి యభివ్యక్త మగుటే శ్రేష్ఠతరము. ఈ సందర్భములో మరొకవిషయ ముల్లేఖించవలెను. పోతనామాత్యుడు భాగవతములో గోపికాలీలలు వర్ణించుచు కృష్ణుడు గోపస్త్రీలోలుడయ్యును సర్వజన సేవ్యుడు నతని కేకలంకము లేదని వర్ణించినాడు. భగవంతుడు భక్తపరాధీనుడు. ఏ యే భావములందు. నే యే రూపములందు కొలిచినను వారల కా యా రూపములందు సాక్షాత్కరించును.

ఘనులై యెవ్వని పాదపంకజపరాగధ్యాన సంప్రాప్త యో
గ నిరూఢత్వముచే మునీంద్రులు మహాకర్మంబులం బాసి బం
ధ నిరోధంబులులేక విచ్చలవిడిన్ దర్శింతు రా దివ్య శో
భను డెట్లుండిన నుండెగాక కలవే బంధంబు లుర్వీశ్వరా!

యామునాచార్యునిది జ్ఞాన సంబంధమగు భక్తి. అతడు వేదవేదాంత శాస్త్రాధ్యయనముచేసి భగవంతుని పంపున పాండ్యుని యాస్థానమున కేగి శైవమతమునోడించి యా రాజుకు వీరశైవముపైనున్న దురభిమాన ముడిగించెను. పిదప రాజభోగము లనుభవించుచు భగవద్భక్తి పరాఙ్ముఖుడైయుండి యొక సన్నివేశమువల్ల మరల మేల్కాంచి తాను చేసిన దానికి వగచి భగవత్సాయుజ్య మొందెను. మాలదాసరి భక్తి మూఢ సంబంధమైనది. అతడు వేగుజామున లేచి భగవత్సంకీర్తనము చేయుచు జాత్యుచిత ధర్మముల నిర్వర్తించుచుండి చివరకు భగవంతుని ప్రసాదమునకు ప్రాప్తుడయ్యెను.

ఆముక్తము భక్తిరసప్రధానమగు ప్రౌఢప్రబంధము. తత్కారణమున తద్భక్తిపూరితమైన యీ యుపాఖ్యానత్రయముతో గ్రంథమునకు బిగువు చేకూరినది. ఇందు పన్నిద్దరాళ్వారులలో నిద్దరాళ్వారుల గాథ యభివర్ణింపబడెను. రాయలటు ప్రసాదగుణ ప్రధాన కవిత్వమును చెప్పగలడిటు సమాస భూయిష్ఠమగు ప్రౌఢ రచనయు జేయగలడు. కొన్ని కావ్యవర్ణనలు లోపించినంతనే కావ్యము కాకుండునా? అట్లయినచో కళాపూర్ణోదయమం దెన్ని వర్ణనలు లోపించలేదు? ప్రబంధ సాహితినిగూర్చి తొలిమాటలో ప్రస్తావించినందున మరల నద్దానిగూర్చి చెప్పుట చర్వితచర్వణ మగును. ఈ గ్రంథకర్త వర్ణించినన్ని ఋతువు లింత విపులముగా మరెవ్వరును వర్ణించలేదు. రాయల ప్రకృతి వర్ణన, ఋతువర్ణనలను మరొకచో వివరింతును.

ఇందున్న ఖాండిక్య కేశిధ్వజ సంవాదముకూడ వైష్ణవభక్తి ప్రాశస్త్యమును నొక్కి వక్కాణించుటకు జేర్చబడినది. ఈ మూడుపాఖ్యానములు ఖండకావ్యములని వేరొక విద్వన్మణి యుల్లేఖించినాడు. అది సరికాదు. ఏలయన భావకవిత్వపు ముమ్మరము ఖండకావ్యముల (కండకావరము) ముమ్మర మాధునిక యుగమున శ్రుతిమించి రాగమున బడినవి. కృష్ణరాయల యుగము ప్రబంధ యుగము. అందుకు సందియ మావంతయు లేదు. ఏతత్కారణములవలన కృష్ణరాయల విష్ణుచిత్తీయము నిస్సంశయముగా నుత్తమ కావ్యము. అతని కవితాచ్ఛాయ లాధునికులలో కన్పట్టినను నట్టి గ్రంథము సాహిత్య పిపాసులవు కందించుటకు మరల కృష్ణరాయలే యవతరించవలెను. తాంబూలద్వయము, సముచితాసనమును బొందిన భట్టహర్షుడు వ్రాసిన తేవనే యీ సాహితీ సమరాంగణ సార్వభౌము డాశ్వాసాంత గద్యములను పద్యములందే రచించినాడు.



ఆముక్తము ప్రౌఢకావ్యమని యితఃపూర్వమే నొక్కి వక్కాణించినాడ. వస్తు ప్రధానములుగానున్న భారత భాగవతము లెక్కడ ? భావప్రధానములుగా నున్న ప్రబంధము లెక్కడ ? ఇట్లనుటవల్ల భారత భాగవతములందు భావవస్తు రచనలు లోపించినవని గాదు. భారత భాగవతములందు వస్తువునకే యెక్కుడు ప్రాధాన్య మివ్వబడినది. వైదికమత ముద్ధరించుటకు భారతము వెలసినది. కలిలో భక్తి సన్నగిల్లుచున్న కాలమున తదుద్ధరణకు భాగవత మవతరించినది. వాల్మీకి రామాయణ మనుస్యూతమగు గంగానిర్ఝరి. సోమనాథుని కాలమునుంచి ప్రబంధ చ్ఛాయలు కన్పించుచున్నవి. వల్కలాజినములు ధరించి కమనీయ భూమి భాగములే శ్రేష్ఠతరములని యెంచిన భక్తుడు వ్రాసినది భాగవతము. రాజభోగముల ననుభవించుచు భోగలాలసులైన ప్రభువులు రచించినది విష్ణుచిత్తీయము. ఈ గ్రంథమునకు గూడ కొంత మతప్రాతిపదిక, భక్తిప్రచారము లేకపోలేదు. ఒక కాలమున కథాగమన మెంత సూక్ష్మముగ సూటిగనుండిన నంత ప్రజాదరణము పొందినది. మరికొంతకాలమునకు ప్రజలు విశ్రాంతి ననుభవించుచు సౌఖ్య పర తంత్రులై పంచభక్ష్య పరమాన్నంబులు సుష్ఠుగా భుజించినపుడు వారికీ సూక్ష్మ మార్గము రుచింపలేదు. ప్రతిభ నవనవోన్మేషశాలిని గదా. కృష్ణరాయల కాలమున ప్రజలు కష్టించి నిష్కృష్టంబుగా సాహిత్యమున వ్యాసంగముచేసి దానియందలి నిమ్నోన్నతములను గుర్తెఱుంగుటకు సిద్ధసంకల్పులై యుండిరి. అందుకు వారికి ప్రాచీనతపై మోజు సన్నగిల్లలేదు. కాని క్రొంగ్రొత్తపోకడలను గుర్తెఱుంగు టకు కుతూహలులై యుండిరి. ఆనాటి పరిసరములుగూడ వారికి తగునుత్సాహము గల్పించినవి. మనకు తెలిసినంతవరకు కృష్ణరాయల యాస్థాన మలంకరించిన యష్టదిగ్గజముల గ్రంథములు వెలసినవి. అందు కేవలకల్పనాకథలు కలవు. కల్పిత కథాకావ్యములు కలవు. ద్వ్యర్థి కావ్యములును కలవు. కవిత్వము కాంతా సమ్మితము. నృప శాసనములైన వేదములుగాని సుహృద్విజ్ఞాపనములగు పురాణ ములుగాని యీ కాంతాసమ్మితమగు కావ్యముల ధాటి కాగజాలకుండినవి. అంతకు మున్నే విష్ణు మార్కండేయ పురాణములు వెలువడినవి. పౌరాణికయుగ మంతకు ముందే ముగిసినది. అప్పుడు కావ్య కవిత్వముదక్క మరొక్కటివచ్చుట కాస్కా రములేదు. అదియే ప్రబంధయుగ రూపముగా నవతరించినది. నాటి ప్రబంధములు

కూడ కొన్నిమాత్రమే వాటి ప్రత్యేకతలకు ప్రసిద్ధినొందినవి. తిక్కనార్యుని యలతి యలంతి తునియల కవిత్వమునకు నాడు ప్రజాదరణము లేదు. ఆనాటి కవిత్వవైఖరిని పెద్దనామాత్యుఁడీ యుత్పలమాలలో చక్కఁగా నుల్లేఖించినాడు.

ఉ. పూత మెఱుంగులుం బసరుపూపబెడంగులు జూపునట్టివా
కైతలు, జగ్గునిగ్గు నెనగావలె, గమ్మన గమ్మన న్వలెన్
రాతిరియుంబవల్ మఱపురానిహొయల్ చెలి యారజంపు ని
ద్దా తరితీపులంబలెను దారసిలన్వలె లో దలంచినన్
బాతిగ బైకొనన్వలెను బైదలికుత్తుకలోని పల్లటీ
కూతలనన్వలెన్ సొగసుకోర్కులు రావలె నాలకించినన్
జేతికొలంది గౌగిటను జేర్చిన గన్నియ చిన్నిపొన్ని మే
ల్మూతల చన్నుదోయివలె ముచ్చటగావలె బట్టిచూచినన్
డాతొడనున్న మిన్నుల మిటారపు ముద్దులగుమ్మ కమ్మనౌ
వాతెఱ దొండపండువలె వాచవిగావలె బంటనూదినన్
గాతలదమ్మిచూలిదొర కైవసపుంజవరాలి సిబ్బెపు
న్మే తెలి యబ్బురంపుజిగి నిబ్బరపుబ్బగు గబ్బిగుబ్బ పొం
బూతల నున్నకాయసరి పోడిమి కిన్నెరమెట్ల బంతి సం
గాతపుసన్నబంతి బయకారపు గన్నడ గౌళపంతుకా
సాతతతానతానలపసం చివుటాడెడు గోటమీటు బల్
మ్రోతలునుంబలెన్ హరువు మొల్లముగావలె నచ్చతెన్గు లీ
రీతిగ, సంస్కృతంబు పచరించినపట్టున భారతీ వధూ
టీ తపనీయ గర్భ నికటీభవ దానన పర్వసాహితీ
భౌతిక నాటకప్రకర భారత భారత సమ్మతప్రభా
పాతసుధాప్రపూరబహుభంగ ఘుమంఘుమ ఘుంఘుమార్భ టీ
జాతకతాళయుగ్మలయసంగతిచుంచు విపంచికా మృదం
గాతకతేహితత్తహిత హాధితదంధణు ధాణుధింధిమి
వ్రాతనయానుకూలపదవార కుహూద్వహ హారికింకిణీ
నూతన ఘల్ఘలాచరణ నూపుర ఝూళఝుళీ మరందసం
ఘాత వియద్ధునీ చకచకద్వికచోత్పలసారసంగ్రహా
యాత కుమారగంధవహ హారిసుగంధ విలాసయుక్తమై
చేతము చల్లజేయవలె జిల్లున జల్లవలె న్మనోహర

ద్యోతక గోస్తనీఫల మధుద్రవ గోఘృత పాయస ప్రసా
రాతిరసప్రసార రుచిరప్రసరంబుగ సారెసారెకున్.

ఈ మాలిక నాటి కవిత్వమున కెల్లగా నిల్చినది. ఇట్టి కాలమున వెలసినది కృష్ణరాయల విష్ణుచిత్తీయ నామాంతరమగు నాముక్తమాల్యద. అందు విష్ణుచిత్తుని భక్తి గోదాదేవిరక్తి రెండును మేళవించి భగవద్భక్తికి నిరుపమానములై నిలిచినవి. విష్ణుభక్తుడు భక్తితో సాధించినదానిని గోదాదేవి రక్తితో సాధించినది. అందులకే శంకరభగవత్పాదులు,

"యోగరతోవా సంగరతోవా భోగరతోవా
యస్యబ్రహ్మణి రమతేచిత్తం నందతి నందతి నందత్యేవ"

యనినాడు. ఒకవంక ముక్కు తిమ్మన ముద్దు పలుకు, మరొకవంక అల్లసాని వాని యల్లిక జగిబిగి, మరొకవంక పాండురంగవిజయు పదగుంభనంబు, రామరాజ భూషణుని శ్లేష, పింగళి సూరన యూహాగానములు కృష్ణరాయల నొక్కుమ్మడిగా నుక్కిరి బిక్కిరి చేసినవి. అందుల కాత డీ గ్రంథములకన్న మిన్నగా వ్రాయ వలెనను తలంపుతో ద్రావిడ సాహిత్యమునకు మకుటాయమానమగు గురు పరంపరనుండి యిద్ద ఱాళ్వారులను కథావస్తువులుగా గ్రహించి యానా డెక్కువ ప్రాశస్త్యములోనున్న వైష్ణవభక్తి ప్రాచుర్యమును వ్యక్తపరచుటకుగాను మరికొన్ని వైష్ణవభక్తి స్ఫోరకములగు లఘూపాఖ్యానముల కవినాభావ సంబంధము కల్పించి పాండిత్యమందున నేమి, భావనాపటిమయం దేమి, కథా గమనమం దేమి తాను సార్వభౌముడై యుండుటవల్ల తనగ్రంథము నగ్రగణ్యముగా సిద్ధముచేసి విద్వన్మణుల మన్ననల నందినాడు. ఇందు మహాకావ్య లక్షణము లన్నియు గలవు. నాడు వెలసిన మహాకావ్యము లన్నింటిలోను కృష్ణరాయల ప్రౌఢ ప్రబంధమున కొక ప్రత్యేకత కలదు. ఇది వాటిలో మిన్న. విజయనగర రాజ్యవైభవము నాటి సభామంటపమున జరుగు విద్వద్గోష్ఠులు, ప్రజల జీవితము కన్నులకు కట్టునటులు వర్ణింపబడినవి. ఆనాటి సంస్కృతి చరిత్రను గ్రహించుటకు నాటి ప్రబంధములలోని కెల్లను విష్ణుచిత్తీయము ప్రతిబింబము, దర్పణము వంటిది.

ప్రతి చిన్న సన్నివేశము చక్కగా వర్ణింపబడినది. రాయల శాస్త్ర వైదుష్యముకూడ నిందు ప్రతిబింబించుచున్నది. సంగర రంగమందు వీర సాహసములను ప్రదర్శించు యోధుని మాడ్కి కృష్ణరాయల ఠీవి, పాండిత్య ప్రకర్ష, భూరి యనుభూతు లీయాముక్తమం దంతర్భూతమై యున్నవి. శ్రీహర్షు డొకప్పుడు భారతీదేవిచే నమోఘవాగ్వరములను బొంది పిమ్మట బోధ్యవాక్కుయి నైషధ

గ్రంథమును సంతరించినాడు. భట్టహర్షుని నైషధము, భట్టమురారి యనర్ఘ రాఘవము, వేంకటాధ్వరి లక్ష్మీసహస్రము గీర్వాణ సాహిత్యమందు వెల్గొందు రత్నదీపికలు. వీటి నర్థము చేసుకోగలవారు నేడు చాలా యరుదనిగూడ ఘంటా పథముగ శాసించగలుగుచున్నాను. ఈ గ్రంథముల నర్థము చేసుకోలేనివా రందఱు వీటికి పాషాణత్రయమని నామకరణము చేసిరి తమ బండారము బయట పడకుండ. ఆముక్త మొక్కటే యీ రత్నదీపికలకు సరియగు గ్రంథము. అతడు మయూరుని భరతము పట్టించినాడు. ఈ రత్నదీపికల నర్థము చేసుకోగల మహానుభావుల కందరికి నా వందనములు.

మారుమూల పదములతో విచిత్రములగు ప్రయోగముజేసి, కృష్ణరాయలు ప్రభిన్నగండంబగు వేదండంబు మాడ్కి, సాహితీ సమరాంగణ సార్వభౌముడై తన ప్రౌఢ ప్రబంధములో తన వ్యక్తిత్వము చక్కగా ప్రస్ఫుటీకరింప జేసినాడు. ఈ గ్రంథరాజమందు సామాన్యవర్ణనలేగాక కొన్ని యనన్య సామాన్య వర్ణనలు జొప్పింప బడినవి. అనితరసాధ్యమగు ఋతువర్ణనలు జొప్పింపబడినవి. రాజనీతినిగాని, ఋతువర్ణనలగాని మరి యేకవియు నింత విరివిగా వర్ణింపలేదు. ఆంధ్ర సాహిత్యమందు బిగువున కాముక్త మగ్రగణ్యము. శ్రీనాథుడు దమయంతి నలంకరించు ఘట్టములో రచించిన "కనకవేది కాంతరంబునం బసిండి పీఠంబున నునిచి పతి ప్రతీకంబు"నను వచనమునకు బ్రతిగా కృష్ణరాయ లాముక్తమం దాముక్తమాల్యద నలంకరించు ఘట్టమున నీ సీసము రచించినాడు.

సీ॥ యావకద్రవమున నరుణాంఘ్రి నఖపంక్తి
        లక్ష్యక్తములుసేసె నతివ యోర్తు
    నయకల వ్రేళ్ళ మట్టియలు బిల్లాండ్లిడి
        పాయవట్టము పెట్టె బడతి యోర్తు
    నెఱిక వట్టి పసిండి నీటివ్రాత చెఱంగు
        వెలిపట్టు రహిగట్టె వెలది యోర్తు
    కటిసీమ గనకమేఖల జేర్చి తార హా
        రములు గీలించె గంఠమున నోర్తు
    కటకములు హస్తసరము లంగదము లంగు
    ళీయకములును బాహువల్లికల వ్రేళ్ళ
    నిలిపి తాటంక నాసామణుల నమర్చి
    చౌనిపె సీమంతవీథి జేర్చుక్క యోర్తు.

శ్రీ రాయ లాముక్తమాల్యదకు యౌవన మంకురించుట నొక సీస పద్యములో వర్ణించినాడు. ఆ పద్య మిం దనువదింతును.

సీ. వాతెఱ తొంటికై వడి మాటలాడదు
కుటిలవృత్తి వహించె కుంతలంబు
లక్షులు సిరులు రా నఱగంట గనుగొనె
నాడించె బొమగొని యాననంబు
ననుగొమ ల్నెగయ వక్ష ముపేక్షగడకొత్తె
బాణిపాదము లెఱ్ఱవాఱదొడగె
సారెకు మధ్యంబు దారిద్ర్యముల జెప్పె
దొచ్చోర్వ కిటు లోగ జొచ్చె మేను
వట్టి గాంభీర్య మొక్కడు పెట్టుకొనియె
నాభి నానాటి కీగతి నాటి ప్రియము
చవుకయైనట్టి యిచ్చట జనదు నిలువ
ననుచు జారిన కరణి బాల్యంబుజాతె.

అంతేగాక గోదాదేవి విరహమును వర్ణించుచు శ్రీనాథుని ననుకరించుచు నొక సీసపద్యము రచించినాడు. శ్రీనాథుడు నలుని విరహమును వర్ణించుచు నీ సీసపద్యమును విసరినాడు.

సీ. జాగరోద్భూత దృగగ్రంబు మాణిక్య
కర్ణకుండలదీప్తి గప్పిపుచ్చు
రాజకార్యపరంపరాభేద మిషమున
నిట్టూర్పు గాడ్పులు నిహ్నవించు
ఘనసార బహుళ చందన విలేపనమున
నాపాండుభావంబు నపలపించు
దోరంతరన్యస్త తార హారంబుల
నంతఃపరీతాప మపనయించు
మాననీయ శశాంక కోమలములైన
యామినీసమయములు బర్యంకములును
సాక్షులుగ నొంచు వలవంత జనవిభుండు
కన్నెకూర్మి ప్రకాశంబు గాకయుండ.

దీని కుజ్జీయైన కృష్ణరాయల సీస మనువదింతును.

సీ. నఖ ముఖోజ్ఝిత పరాఙ్ముఖముక్త బాష్పాంబు
పటిమ దీపపు జిటపటలు దెలుప
బొరి నుపాంశూత్క్రుష్ట పూత్కృతులక్రుశమధ్య
పార్శ్వముహుః ప్రకంపములు దెలుప
నాదవెడు గాద్గద్య మదిరిపాటున బల్క-
రింప బుట్టెడు కేకరింత దెలుప
వలవంత విసువు కాంతలపుట్టు దూషించు
కారణంబుల తొంటికతలు దెలుప
నలత బానుపుపై బొరలాట దెలుప
దెగువ లోలోననే నవ్వు నగవు దెలుప
గలక మామీది పనిలేని కసరు దెలుప
బొలతి రేలు నీయున్కియే పులుగుగాదె,

ఇట్టి వర్ణన లింకెన్నియో కలవు. వర్ణనా బాహుళ్యమందేమి, భావనా పటిమయందేమి, రాయల సర్వంకష పాండిత్య స్ఫోరకములు ప్రతిబింబించుటవల్లనేమి నాడు వెలసిన మహాకావ్యములలో కృష్ణరాయల విష్ణుచిత్తీయము ప్రౌఢ ప్రబంధమై యగ్రస్థాయికి చెందుచున్నది. ఈ ప్రౌఢ ప్రబంధమునకు వేదము వేంకటరాయ శాస్త్రిగారి సంజీవనీ వ్యాఖ్యయే లేకుండిన నీగ్రంథ మిప్పుడున్నంత ప్రచారము బొందజాలకుండెడిది. ఆంధ్ర మద్రాసు విశ్వవిద్యాలయములవారు యం. ఏ., బి. ఏ., విద్వాన్ పరీక్షల కిందులోని కొంతభాగము పాఠ్యభాగముగా నిర్ణయించి కొంతవర కీ గ్రంథ ప్రచారమునకు దోహద మొనరించినారు.

దమయంతి సౌందర్య విలాస విభ్రమాది సౌశీల్యంబులు పంకజాసనుని తనూభవునివల్ల వినినంతనే పాకశాసనాదులకు విరహి విషదాహజ్వరము లారంభమయినవి. దానినే శ్రీనాథ కవిసార్వభౌముడు శృంగారనైషధ కావ్యరాజమందు

మ. పపిసంగంబున దాపమొందిన శచీ ప్రాణేశు కెంగేలికిన్
జివురుంగైదువుజోదు వైద్య ముపదేశించెఁ రహస్యంబుగా
నవనీహార పయోమిళన్మలయజస్నానార్ద్రి పర్యంతమై
యువతాళించు విదర్భరాజతనయా హృద్య స్తనద్వంద్వముఁ.

అను పద్యములో చక్కగా వర్ణించినాడు. ఈ విషయములో కృష్ణరాయ లేమియు తీసిపోలేదు. శచీ ప్రాణేశు కెంగేలికి చివురుంగైదువుజోదు వైద్య

ముపదేశించినాడు. ఇచట మన్మథుడు గోదాదేవి ధైర్యమనుకోట సడలిపోవునట్లు చేసినాడు. ఆపద్యమిం దుదాహరింతును.

మ. తలిరుంగైదువుజోదునానతి వధూ ధైర్యంపు బెన్గోట కం
దళితాహార్మ్యఖ యంత్రకారు డలుక న్నానాటికిం ద్రెళ్ళ గో
మల మార్తాండ మరీచి దీపకళికోష్మం జూడి యేయుం దళ
ద్దళ పాథోరుహ లోహనాళకుహరోద్యచ్చంచరీకాశ్మముల్.

అటు భక్తిని, యిటు శృంగారమును వర్ణించుటకు కృష్ణరాయల దందెవేసిన చేయి.



శ్రీకృష్ణదేవరాయల ప్రతిభావిశేషము లనగానే మరల నాతని ప్రబంధ మందలి రసవద్ఘట్టములనే సోదాహరణముగ పేర్కొని యం దతని కవితాచమత్కృతు లేవిధముగ జాలువారినవో తెలుపవలెను. ఈ ప్రకరణమం దతని చిత్తవృత్తిని, లోకజ్ఞతను, ఆత్మీయతను కూడ పరిశీలింతము.

ఇతఃపూర్వ ముల్లేఖించినట్లు కృష్ణరాడ్భూమీశునకు గీర్వాణాంధ్ర కర్ణాట భాషలందు సర్వతోముఖమగు పాండిత్యప్రకర్ష కరతలామలకము. అంతేగాక కృష్ణరాయలు నైఘంటికపదానుయాయి యని రూఢి. ఏతత్కారణమువల్లనే విష్ణుచిత్తీయ మందెల్లెడలను పాండిత్యస్ఫోరకములగు ప్రతిభావిశేషములు కన్పట్టును. అంతేగాక విష్ణుచిత్తీయమందలి భగవద్వాక్యమువల్ల యీ రాజకవి పెక్కు గ్రంథంబులు సంస్కృతమం దుత్తమకావ్యలక్షణము లన్నింటిని పాటించుచు నొక్కొక్క గ్రంథరాజమునం దొక్కొక్క విశిష్టత ప్రస్ఫురింప రచించెనని తేటపడుచున్నది. మదాలసచరిత్ర స్వభావోక్తి, యుత్ప్రేక్షోపమాలంకారములకు పెన్నిధి. సత్యావధూప్రీణనము గుణీభూతవ్యంగ్యప్రధానము. సకలకథాసారసంగ్రహము సంకలనమునం దందెవేసిన హస్తము. జ్ఞానచింతామణి కథాకథనమునకు ప్రశస్తినొందినది. గీర్వాణ సాహిత్యము మాధుర్యము ప్రశస్తికెక్కినది. 'భాషాసు రమ్యా గైర్వాణీ' యను నాభాణకము విద్వజ్జనవిదితమేకదా! ఆ మాధుర్యము రసమంజరిలో రాశీభూతమయినది. ఇట్టి మహోత్కృష్ట లక్షణములుగల గ్రంథంబులను సంస్కృతమందు వెలయించినవాని కాంధ్రభాష యసాధ్యంబె? తెలుంగుబాసయందు రచింపబడిన గ్రంథ మాముక్తమాల్యద యగుటవలన సంస్కృతంబున పచరించిన సొగసులాంధ్రమునగూడ ప్రస్ఫుటముగా జాలువారినవి. ఏలయన బహులోకకావ్యశాస్త్రాద్యవేక్షణ వలన సముపార్జితమైన యీ సాహిత్యసౌష్ఠవ మే భాషయందు వ్రాయబడిన నాతని కావ్యమందు జాలువారుట తథ్యము. మమ్మటాచార్యులు కావ్యప్రకాశికయందు

శక్తి ర్నిపుణతా లోకశాస్త్రకావ్యాద్యవేక్షణమ్
కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతిహేతు స్తదుద్భవే

యని కావ్యోత్పత్తినిగూర్చి నిర్వచించినాడు. ఈ శ్లోకమందుద్ఘాటింపబడిన శక్తియే ప్రతిభావిశేషము. భూతభవిష్యద్వర్తమానకాలములకు సంబంధించియుండునదిప్రజ్ఞ.

నవనవోన్మేషశాలినియగునది ప్రతిభ. కృష్ణరాయలకు తన యాస్థాన మలంకరించిన యష్టదిగ్గజములు తదితర విద్వన్మణులు కావ్యజ్ఞశిక్షణ ప్రసాదించిరనుటలో సందియములేదు. బహుళగ్రంథకర్తయయియుండుటవలన యీ కావ్యజ్ఞశిక్షణ యింకను పరిణతిచెంది కృష్ణరాయలకు కైవసమయ్యెను. ఇంకను విష్ణుచిత్తీయమందు ప్రతిభా విశేషము లెట్లు వ్యక్తమయ్యెనో పరిశీలింతము. కృష్ణరాయలు మహాకావ్యలక్షణ ములలో కొన్నింటిని విడనాడి విష్ణుచిత్తీయప్రబంధరాజము కూలార్చెనని మొదటనే నొక్కివక్కాణించితిని. ప్రవరుని యర్ధాంగలక్ష్మివలెనే విష్ణుచిత్తుని గృహిణికూడ భాగవతోత్తములకు మజ్జనభోజనాది సౌకర్యములు కల్పించుటయందు వేసారక చిత్తశుద్ధితో వారికాతిథేయసత్కారములు చక్కగా నిర్వర్తించినది. ఆంధ్ర కవితా పితామహుండగు నల్లసానిపెద్దనామాత్యు డల్లిక జిగిబిగితో ప్రవరుని గృహిణి నిట్లు మూర్తీభవింపచేసినాడు.

తే. వండనలయదు వేవురు వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్దియౌ నతనిగృహిణి
నతిథు లేతేర నడికిరేయైన బెట్టు
వలయుభోజ్యంబు లింట నవ్వారిగాగ.

విష్ణుచిత్తుని ధర్మపత్ని తానువండు పదార్థములు పొగవారి చెడకుండ నేవిధముగ నాప్రాలేయపటీరాచలపద్యాయాతాయాత వైష్ణవావలికి భోజనమును సమకూర్చెనో ఆసంవిధానమును కృష్ణరాయలు సమగ్రముగా వర్ణించినాడు.

చ. గగనము నీరుబుగ్గ కెనగా జడి వట్టిననాళ్ల భార్యక
న్పొగ సొరకుండ నారికెడపుంబొరియ ల్దగిలించి వండ న
య్యగపల ముంచి పెట్టు గలమాన్నము నొల్చిన పప్పు నాలుగే
న్పొగపిన కూరలు న్వడియము ల్వరుగు ల్పెరుగు ల్ఘృతప్లుతిన్.

ఇంతేగాక భాగవతోత్తములకు తిరువారాధనముగావించిన తినుబండారముల పట్టికకూడ నీయబడినది. తత్కాల ప్రబంధములలో ప్రతి స్వల్పవిషయము నింత విపులముగా వర్ణించినవాడు కృష్ణరాయ లొక్కడే. కవనమును గూర్చిన ప్రకరణములో నీ కవిచంద్రుని కవితా చమత్కృతులను కొన్నింటి నుగ్గడించియుంటిని. సంజీవనీవ్యాఖ్యాకారులు కీ.శే. వేదము వేంకట్రాయశాస్త్రిగార లాముక్తమాల్యదను గూర్చి యిట్లభిప్రాయపడినారు.

"కృష్ణదేవరాయలు కవివరుడైన శృంగారనైషధ నిర్మాతతో సరితూగగలవాడు. అల్లికబిల్లికలతో నొప్పు నల్లసానిపెద్దన్నగారికన్నను పూర్వోక్తగుణము

లందును న్యూనుడుకాడు. శ్లేషను నవనీతమంజులముగా నాస్వాద్యముంగాంచిన యద్భుత సాహిత్యనిధియగు రామరాజభూషణునికన్న నాగుణంబులలో నధికుడే. మఱి ముక్కుతిమ్మనార్యుని పలుకుల ముద్దును చేమకూర వేంకటరాజు పాకరుచులును పాండురంగ విజయకర్త దిట్టతనము నొరులకు రావు. మఱి స్వాభావిక వృత్తవర్ణనములందు నీ గ్రంథము ప్రతిభాదృష్ట్యేకగోచరములైన వర్ణ్యగుణచర్యాదివిశేషములను నేర్పెడి గురువుగా నున్నది." ఈ చెప్పిన ప్రతిభాప్రభావము లింవలి ఋతువర్ణనలయందును స్వభావవర్ణనములోను గోదాదేవి వర్ణనలోను గానవచ్చును. శబ్దోపదేశమున మనుచరిత్రకన్న విష్ణుచిత్తీయ మగ్రగణ్యము."

వేదమువా రాముక్తమాల్యదను ముక్కుతిమ్మన పారిజాతముతోను, తెనాలి రామకృష్ణుని పాండురంగమాహాత్మ్యముతోను చేమకూర వేంకటరాజు పాకరుచులతో పోల్చదగదని తత్ఫలితముగా నాయా కవుల విశిష్టగుణములిం దవగతము కాలేదని యభిప్రాయపడిరి. చేమకూర వేంకటరాజు కృష్ణరాయల తరువాతివాడు. తిమ్మన్న పారిజాతమందున్న ముద్దుపలుకుల విషయము సందియమే. కాని నా మతమున పాండురంగవిభు పదగుంభనము కొంతవఱ కాముక్తమం దనువదింపబడినది. ఏలయన తెనాలిరామకృష్ణుడు కృష్ణరాయల యాస్థాన మలంకరించిన యష్టదిగ్గజములలో నొకడు. కృష్ణరాయలు తన యాస్థానమలంకరించిన కవుల ప్రతిభా విశేషములను జీర్ణించుకొని నిజ ప్రతిభా వికాసముతో సమ్మేళన మొనర్చి వారిని మించుటకు ప్రయత్నించి సఫలీకృతుడయ్యె ననుటలో సందియములేదు. రామరాజభూషణుడు నిర్వక్ర ప్రౌఢవాగ్వైచిత్రితో వసుచరిత్ర రచించెను. అంతేగాక అతడు జగత్ప్రాణ నందన కారుణ్య కటాక్షలబ్ధ కవితాధారా సుధారాశి సంజనితైకైక దినప్రబంధ ఘటికా సద్య శ్శతగ్రంథ కల్పనుడు. సంగీతకళా రహస్యనిధి. తెనాలి రామకృష్ణ కవిచంద్రుడు కవిజన సహకారావళీ వసంతోత్సవ సూక్తినిధి. సంస్కృతము దెనుంగుగ జేయను దెనుగు సంస్కృతము చేయంగను చతురమతి. చతుర్విధ కవితా పారంగతుడు. ఆశువునందు మేటి. శైవ వైష్ణవ పురాణావళీ నానార్థ రచనా పటిష్ఠైక రమ్యమతి. సరసార్థ బోధ ఘటనా హేలా పరిష్కార శారద రూపముగా గలవాడు. శ్రీనాథ కవిసార్వభౌముడు భారతీసిద్ధుడు. పరమ మాహేశ్వరాచార పరాయణుడు. కృష్ణరాయల ప్రతిభా విశేషముల నుగ్గడించునెడల నీ కవిత్రయముతో తారతమ్య పరిశీలన చేసి ఆయాఘట్టములం దాయా కవుల ప్రబంధములలో తత్కవితా చమత్కృతు లెట్లు జాలు వారెనో నిరూపించుటవసరము. శ్రీనాథ కవిసార్వభౌముడు దమయంతిని చక్కగా వర్ణించినాడు.

అతని వర్ణన శ్రీహర్షుని భావమున కనుకృతియని యభిప్రాయ పడినను యిది స్వతంత్ర రచన పగిది భాసిల్లుచున్నది. అదియె యతని రచనలోని విశిష్టత.

మ. వనజాతేక్షణ యూరుయుగ్మమున లావణ్యంబునం గేళికా
వన సంక్రందన పట్టణ ప్రకట జన్మస్థానలన్ రంభలన్
ధనదాపత్య తపఃఫల స్తనుల నత్యంతాభిరామాంగులౕ
మనుజాధీశ యధఃకరించు; బొగడౕ మాబోంట్లకున్ శక్యమే.

కృష్ణరాయల నాయిక యయోనిజ. విష్ణుచిత్తునకు గోదాదేవి తులసికోటవద్ద లభించినది. కృష్ణరాయలు వర్ణించిన గోదాదేవి నించుక పరిశీలింతము.

శా. సైరంధ్రు ల్పయికెత్తి కజ్జలము బక్ష్మశ్రేణిక న్దీర్ప వా
లారుం గన్నులమీద చూచు తఱి పాలాంచ చ్చతుర్థీ నిశా
స్ఫారేందున్గనె వక్త్రమక్కునుటగా బర్వేందు డాత్మప్రభా
చోరుండుండగ తన్ను తద్గతవిభాచోరం బనుౕ లోకముల్.

ఇట్టి భావము నలుని వర్ణనమున నొండు గలదు. ఱెప్పలు వాల్పక నలుని యనిశము చూచుటచే దేవతల కనిమిషులని పేరు వచ్చెను. శ్రీనాథుడు దమయంతి సౌందర్యమును విపులముగా వర్ణించినట్లే కృష్ణరాయలుకూడ నా కవిసార్వభౌముని యనుకరించినాడు.

శ్రీనాథుని దమయంతి వర్ణన :

సీ. జగము లొక్కుమ్మడి సాధింప నెత్తిన
రతి మన్మథుల విండ్లు రమణి బొమలు
కాంతినిర్ఝర మీదు కామ యౌవనముల
కుంభప్లవము లింతి కుచయుగంబు
నడు మింతయని కేల దొడిగి పట్టిన ధాత
యంగుళిరేఖ లబ్జాస్య వళులు
యువమనోమృగరాజి దవిలింప దీర్చిన
మదన వాగుర లిందువదన కురులు
బాల్య తారుణ్య సీమావిభాగమునకు
నజుడు వ్రాసిన రేఖ తన్వంగి యారు
భాను వరమున బడసిన పఙ్కజముల
యపర జన్మంబు పూబోడి యడుగు లధిప!

ఇటువంటి సీసమునే కృష్ణరాయలు గోదాదేవి బాల్యము వీడి యౌవనమం దడుగిడు సందర్భాన రచించెను. దాని నిందు పాఠకుల పరిశీలనార్థము పొందు పరచుచున్నాను.

సీ. వాతెఱ తొంటి కైవడి మాటలాడదు
కుటిలవృత్తి వహించె కుంతలంబు
లక్షులు సిరులు రా నరగంట గనుగొనె
నాడించె బొమగొని యాననంబు
ననుగొమ ల్నెగయ వక్ష ముపేక్ష గడకొత్తె
బాణి పాదము లెఱ్ఱవాఱ దొడగె
సారెకు మధ్యంబు దారిద్ర్యముల జెప్పె
జొచ్చెర్వ కిటులోగజొచ్చె మేను
వట్టి గాంభీర్య మొక్కడు వెట్టుకొనియె
నాభి నానాటి కీగతి నాటి ప్రియము
చవుకయైనట్టి యిచ్చట జనదు నిలువ
ననుచు జాఱిన కరణి బాల్యంబు జాఱె.

ఇట్లింకెన్నియో సన్నివేశములు గలవు. దమయంతి లజ్జను వర్ణించు తేట గీతి విష్ణుచిత్తుని వేదాంతబోధ చేయు తేటగీతి సమయుజ్జీలు. తెనాలి రామలింగ కవి లింగని నిగమశర్మ శృంగారపురుషుడు. కృష్ణరాయల నాయకుడు పరమ భాగవతోత్తముడు. తెనాలి రామకృష్ణుడు పాండురంగ మాహాత్మ్యమునందు నిగమ శర్మ నీరీతి వర్ణించెను.

మ. వనితామానససూనసాయకుడు జీవత్తాతపాదుండు భూ
జన సన్మాన్య విశుద్ధవర్తను డుదంచత్త్యాగశీలుండు చం
ద్రుని పెన్నుద్ది సమగ్రకాంతిమహిమ౯ నూనూగు మీసాల లే
గొనబుంబ్రాయపు దేజుకూన యత డుత్కోచుండు వాచాలత౯.

ఇతనిని వర్ణించు సీసపద్య మొండు కవనప్రకరణములో నుదాహరించి యున్నాను. కృష్ణరాయలు విష్ణుచిత్తుని 'అందుండు౯' అను శార్దూల వృత్తము నందు వర్ణించినాడు. రామరాజభూషణుని శ్లేషకూడ విష్ణుచిత్తీయమందు జాలు వారక పోలేదు. రామరాజభూషణుని శ్లేషకన్న పింగళిసూరనది మిన్నయైనది. ఇరు వురును వరుసగా హరిశ్చంద్ర నలోపాఖ్యానమును, రాఘవపాండవీయమును రచించిరి. కాని ప్రస్తుత తారతమ్య పరిశీలనము రామరాజభూషణుని వసుచరిత్రకే

పరిమితమైనది. వసుచరిత్ర హరిశ్చంద్ర నలోపాఖ్యానమువలె ద్వ్యర్థి కావ్యము కాక శబ్దశ్లేషతో నలరారు చున్నది. హరిశ్చంద్ర నలోపాఖ్యాన, రాఘవపాండవీయము లర్థశ్లేష భూయిష్ఠములు. విష్ణుచిత్తీయమందు సూర్యోదయాస్తమయ, చంద్రోదయాస్తమయ వర్ణనలు లేనందున నీ కవిత్రయ గ్రంథములం దున్న వర్ణనలతో తారతమ్య పరిశీలనచేయ వలను పడదు. మనుచరిత్ర, వసుచరిత్ర, పారిజాతాపహరణములందు నాయికల రోదనను బట్టి (ప్రణయకలహ రోదన) తెనాలి రామకృష్ణుడు (నాటికాలపు బిరుసు విమర్శకుడు) తద్గ్రంథములపై తీర్పు చెప్పుట మన మెఱుంగనిది కాదు. రాయలు పరమ భాగవతుడు. అంతేగాక ఛందో వ్యాకరణకోవిదుడు. కోశజ్ఞానసమృద్ధియు, నుత్తమ గైర్వాణాంధ్ర ప్రబంధశబ్ద ఫక్కికాపరిచయము గలవాడు. అంతేగాక యుపాసనా సంప్రదాయమందు, భగవద్గీతా రహస్యమందు, రాజనీతియందు మంచి యుపజ్ఞ కలవాడు.

కృష్ణరాయలు దయాసత్యస్వరూపుడు. ఈవిషయ మీతని యాస్థాన మలంకరించిన యష్టదిగ్గజములలో నీతని కంకితమిచ్చిన ప్రబంధములలోని యాశ్వాసాంత పద్యములవల్ల తేటపడుచున్నది, కృష్ణరాయలకు ప్రతిభా చక్షుస్సు ప్రకృష్టము. విష్ణుచిత్తుడు భాగవతోత్తముల కెదురేగి వారికిచేయు సత్కారములు చక్కగా వర్ణించ బడినది.

సీ. ఎదురేగి సాష్టాంగ మెరగి పాద్యంబిచ్చి
నారికేళ కటాసనముల నునిచి
నునుబోకపొత్తి గుట్టిన దొప్పగమితోడ
రంభా విశాల పర్ణములు వఱిచి
శాల్యన్న సూపాజ్యకుల్యా బహువ్యంజ
న క్షీర దధు లర్పణంబుజేసి
వాల్చిన పిదప సంవాహన మంత్రముల
కొనరిచి తాంబూల మొసగి కుశల
మడిగి పోయెద మన్న దవ్వనిచి సిరికి
దగిన సత్కృతిచేసి ఖేదమున మగిడి
యర్చగావింతు రెప్పుడి ట్లతిథులైన
భాగవతులకు నప్పురి భాగవతులు.

ఇందు కృష్ణరాయల చిత్తవృత్తి చక్కగా వ్యక్తమయినది. కష్ణరాయలు తన హృదయమును విష్ణుచిత్తుని చిత్తవృత్తిగా మరుగుపరచి తన స్వభావమునే

తెలిపినాడు. దీనివల్ల యితనికి పండితులపై భాగవతోత్తములపైగల ప్రేమ కనబడు చున్నది, 'ఎదురైనచో దన మనకరీంద్రము నిల్పి' యను పద్యమున పెద్దనామాత్యునిపై నున్న గౌరవము తెలియుచున్నది. ఇందు కవులపైనను, భాగవతులపైనను గల భక్తి ప్రపత్తులు వెల్లడింపబడినవి. ఆముక్తమందభివర్ణింపబడిన మధురాపురాధీశుడగు మత్స్యధ్వజుడు కృష్ణరాయలనియే చెప్పక చెప్పెడిని.

సీ. ద్వివ్వయోపాయ ధీవిద్వద్వ్రతంసంబు
షాడ్గుణ్య చాతుర చక్రవర్తి
క్రీడాచలీకృత శ్రీఖండగిరి రాజు
కనకాద్రి ముద్రణ గ్రంథకర్త
యందూనిబద్ధాబ్ధి బృందవేదండాళి
వననిధి స్తంభ నాథునిక రఘువు
తామ్రపర్ణ్యమల పాథఃకేళి హంసంబు
లంకేశమైత్రీ ప్రియంకరుండు
స్వస్తికృద్వాస్తవస్తుత్యగస్తి మఘవ
మకుట మోటన శరకోటి మంత్రభృత్య
భూత భూతాత్త శాంభవ భూమికుండు
దత్పురంబేలు బాండ్య మత్స్యధ్వజుండు.

ఇందు మొదటి పాదమున పేర్కొన్న "ద్విద్వయోపాయను" అనగానే కృష్ణరాయలు ప్రయోగించెడు సామదానభేదదండోపాయములు స్ఫురించును. కృష్ణరాయలు యీ చతుర్విధోపాయముల తన సామ్రాజ్యమును కటకమునుండి కన్యాకుమారి వరకు విస్తరింపజేసి దాని నేకచ్ఛత్రాధిపత్యముగా నరిరాజ భయంకరుడై రాజ్యమేలిన విషయ మెల్లరకు తెల్లమేగదా. లంకేశ మైత్రీప్రియంకరుం డను విశేషణము వాడినందువల్ల తనకు హాని తలపెట్టిన శత్రువును కైవసము చేసుకొనితీరునని ధ్వనించుచున్నది. ఆనాడు పరిసరములం దున్న తురుష్కరాజన్యులే యీ లంకేశ్వరులని యన్వయింపవలసియున్నది. కృష్ణరాయల శౌర్యప్రతాపము లింకను "పాటీరగిరివనే వాటిగ్రీడించి" యను సీసమందు ధ్వనించుచున్నది. కృష్ణరాయలు భోగలాలసుడు. ఇతని కిరువురు భార్య లుండినను భోగినీలంపటత్వమున్నటుల స్ఫురించెడిని. ఇట్లు కామియై తృతీయపురుషార్థ మనుభోగ్యమైనపిదప ముముక్షాసక్తుడై యిట్లని వితర్కించె.

ఉ. ఎక్కడి రాజ్యవైభవము ? లెక్కడి భోగము ? లేటి సంభ్రమం ?
బక్కట బుద్బుదప్రతిమమైన శరీరము నమ్మి మోక్షపుం
జక్కి గణింపకుంటి; యుగసంధుల నిల్చియు గాలుచేతి బల్
త్రొక్కుల నమ్మనుప్రభృతులుఁ దుద రూపఱకుండనేర్చిరే.

తత్ఫలితముగానే తన యాస్థానమందున్న వివిధమతానుయాయుల నాయా శాస్త్రంబులలో నెవ్వడు మోక్షం బెలయించునొ చూచి నిశ్చయింపుడటంచు ప్రశ్నించుట జరిగినది. దానితరువాతనే చక్రాంకనముచేసి తిరుమల తాతాచార్యుడు కృష్ణరాయల వైష్ణవమతాచార్యుడై యుండెనని తోచెడిని. విశిష్టాద్వైతమత సిద్ధాంతమును పిండితార్థముగ నొక్క తేటగీతిలో యిమిడించగలుగుట యీ కవిచక్రవర్తి భక్తిప్రపత్తులు వెల్లడియగుచున్నవి. రాజనీతియందు యీ కవి తన దినచర్యను చక్కగా వర్ణించుకొనినాడు.

సీ. సౌఖశాయనిక భిషక్పూర్వకము కాల్య
వేళ గార్తాంతిక ద్విజాలగోష్ఠి
జాముప్రోవ నమాత్య సామంతపూర్వకం
బర్థార్జనస్థ కాయస్థగోష్ఠి
దినమధ్యమమున మర్దనమల్లపూర్వకం
బగు సూనసూపకృన్మృగయుగోష్ఠి
యపరాహ్ణమున దేవతార్చనాపూర్వకం
బార్యధర్మాధికృద్యతులగోష్ఠి
తే. భుక్తిమీద విదూషక పూర్వకము పు
రాణ కవిగోష్ఠి చారపూర్వకము సంజ
జాము గాయకగోష్ఠి నిశఁ సుషుప్తి
పూర్వకము ప్రేయసీగోష్ఠి పొసగు బతికి.

ప్రాచీనకవులు పరోక్షులు. నేటి భావకవులు ప్రత్యక్షులు. కనుకనే కృష్ణరాయలు తన దినచర్య రాజుల దినచర్య యిట్లుండవలెనని సూత్రప్రాయముగ సూచించెను. కవనము కేవలమనుభవైక వేద్యమయిన యపూర్వభావకల్పనము మాత్రమే. కృష్ణరాయలు సాహిత్యపోషణము తన విధియని తలంచినందువల్ల తత్తత్కవిచంద్రుల భావవిభూతు లతనికి యాదృచ్ఛికముగ భావగతమయ్యెను.

ఇంక యాతని లోకజ్ఞత నొకించుక పరిశీలింతము. కృష్ణరాయలు బహుకావ్య శాస్త్రాద్యవేక్షణ యొనరించిన మేటియని యితఃపురమే వాకొంటిని. రాజనీతి

లోకవ్యవహారములు చక్కగా గ్రహించినవాడు కృష్ణరాయలు. అట్టి లోకానుభవ మును ప్రకృతివర్ణనమందు, పరేంగితాభిజ్ఞత రాజనీతి వర్ణనయందు, నిత్య నూతన ప్రకృతిశీలతను వసంత శరదృతు వర్ణనములందును చక్కగా వ్యక్తమయినది. ఈ ప్రబంధమం దేతద్విధముగా వ్యక్తమయిన లోకజ్ఞతకూడ విష్ణుచిత్తీయ ప్రాశస్త్యమునకు కారణభూతమయినది. ప్రకృతి పరిశీలన సందర్భములోను మఱొక విషయము చెప్పక తప్పదు. మిల్టను ప్రకృతి రహస్యము లన్నింటిని పుస్తకరూపమున పఠించి భావగతము గావించుకొనియెను. అందువల్లనే యచ్చ టచ్చట ప్రకృతి విరుద్ధముగా వర్ణనములు క్వాచిత్కముగా కన్పట్టును, కాని కృష్ణ రాయల రచనలో యిట్టి లోపములు కాన్పించవు. కృష్ణరాయలు కేవలము గ్రంథావ లోకనమువల్ల ప్రకృతి రహస్యములు తెలిసికొనక లోకానుభవమువల్ల గ్రహించుటే దీనికి కారణము. కవి ప్రతిభావిశిష్టత, రసభంగముగాకుండ, చర్విత చర్వణ రహి తముగా, నవీనవోన్మేష భావప్రపూరిత విషయాభివర్ణనము చేయుటయందే వ్యక్త మగును. అట్టివి, కృష్ణరాయల రచనలో యెప్పట్టునను కన్పట్టును. కృష్ణరాయల లోకజ్ఞతకు యీ క్రింద నుదహరించిన పద్యము చక్కని యుదాహరణము. ఇది సామాన్యమైన విషయమైనను యితడు కటకమునుండి కన్యాకుమారివరకుగల భూ వలయం బేకచ్ఛత్రాధిపత్యముగా పాలించుచుండియు యీ చిన్నవిషయమును క్రమముగా వర్ణించుటే యితని లోకజ్ఞతకు చక్కని తార్కాణము. వర్షాకాలమందు స్త్రీ లుదయమందు నిప్పు రాజవేయుట యీ పద్యమం దభివర్ణితము. ఈ భావము నేటి భావ (అభావ) కవులకు వింతగాతోచును, సంతతము భావనాప్రపంచమున సోపానములను పుష్పక విమానయానముల నూహించుచు సువర్ణసుందరులను సృష్టించుకొను వారికీ విషయము లెట్లవగతమగును ? పైపనులన్ని చేయుచున్నను వారు ప్రజాకవులే ? అందుకు భిన్నములేదు ? ప్రకృతమునకు వత్తును.

సీ. ఇల్లిల్లు దిరుగ నొక్కింతబ్బుశిఖి యబ్బె
నేనింటిలో బూరి యిడి విసరక
రాజదు; రాజిన రవులుకొ ల్పానలె
గాని కల్గదు; గూడు దానగలిగె
నేని కూరగుటయం; దైన బెన్పొగ సుఖ
భుక్తి సేకూర దా భుక్తికిడిన
బ్రాగ్భోక్తలకె తీఱు బహుజనాన్నము; దీఱ
నారుల కొదవు బునఃప్రయత్న

మాజ్యపట ముఖ్య లయమెన్న రాలయాంగ
దారులయ మెన్న రంతికకారజనిక
పచన నాంధోగృహిణీ రామి బడక మరుడు
వెడవెడనెయార్వ నొగిలి రజ్జడిని గృహాలు.

చిన్నచిన్న విషయము నుదాత్తముగా చెప్పుట గంభీరమగు విషయమును ప్రాముఖ్యరహితముగా చెప్పుటకూడతప్పక కవిప్రతిభాతిశయమునకు తార్కాణము.

కృష్ణరాయలు రత్నాకర గుణగంభీరుడు. అంతేగాక యాతడు నిజ ప్రజాను రంజక పరిపాలనా దక్షుడు. ఏతత్కారణముననే వారివారి యోగక్షేమము లరయుచు యొకప్పుడు సామాన్యునివలె యవసరమైనప్పుడు మాత్రమే తన చక్రవర్తిత్వము ప్రకటించుచు సామ దాన భేద దండోపాయములను సక్రమముగా సమయానుకూలముగా పాటించుచు రాజ్యమేలిన మేటి వీరుడు. "క్రియా సిద్ధిః సత్వే భవతి మహతాం నోపకరణే" యను నాభాషణము కృష్ణరాయలయెడ సార్థక మైనది. అతడు భాషాసేవకు, వైష్ణవమత ప్రాపకమునకు కారణభూతు డయ్యెను. అంతేగాక యాసముద్రధరణీమండలము పాలించుచు తన రాజ్య సీమలోనున్న పుణ్యక్షేత్రములకు తగు సహాయ మొనరించుచు తన వితరణ గుణ మును ప్రకటించుకొనెను. కేవలము ప్రతిష్ఠ కొఱకేకాక తన విధ్యుక్త రాజధర్మ ముగా పెక్కు సత్కార్యములు ప్రజోపయోగ కార్యములను నిర్వహించెను. ఆంధ్రుల చరిత్ర సంస్కృతిని సంరక్షించి దానికొక ప్రత్యేక విలక్షణతను చేకూర్చెను. ఈ యవనీశుని రాజనీతి వర్ణనము పరిశీలించిన యీతడు ప్రజారంజన మున కెట్లు పాటుపడెనో తేటతెల్లమగును. ఆపిదప యిట్టి యరిరాజ భయంకరుడు నిజ ప్రజానురంజకుడగు చక్రవర్తి యాంధ్రదేశమును పాలించినట్లగపడదు. అందులకే విజయనగర రాజ్యేందిర రూపుమాసినను నేడుకూడ ప్రజలు తత్స్మృతు లను మరువలేకున్నారు.

కృష్ణరాయ లనన్యసామాన్య ప్రతిభావ్యుత్పన్నుడగుటవల్లను, లోకానుభవ మెక్కుడుగా నుండుటవల్లను తన గ్రంథమునందు రాజుమొదలు రెడ్డివరకు వారి వారి యాచారవ్యవహారములతోను వారి దినచర్యలతోను సర్వాంగ సుందరముగా సంకలనము గావించినాడు. ప్రతిపద్యమం దతని చక్రవర్తి ఠీవి తొణికిసలాడు చున్నది. అటు రాజులయార్భాటములు యిటు సామాన్య ప్రజానీకపు దీనత ప్రస్ఫుటముగా ధ్వనించుచున్నది.

ఈ ప్రకరణములో కాంతాసమ్మితోపదేశమును నాయకాశ్రయమగు రసమును ప్రస్తావింతును. మమ్మటాచార్యుడు కావ్యప్రకాశికలో కావ్యప్రయోజనము గూర్చి యిట్లు వాకొనినాడు.

కావ్యంయశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే.

కావ్యము మొదట తత్కర్తకు యశము చేకూర్చును. పిదప యతని పరిశ్రమకు ప్రత్యామ్నాయముగా ధనలాభము కల్గించును. రాజాదిగతోచితాచారపరిజ్ఞాన మాపాదించును. అమంగళమునుండి రక్షించును. రసానుభూతి కల్గించును. కాంతాసమ్మితోపదేశము చేయును. ప్రస్తుత ప్రకరణములో కాంతాసమ్మితమగు నీతినే ప్రస్తావింతును. సాహిత్యప్రయోజన మొక్కటే. అయితే సలిలమే వివిధరూపములలో వేర్వేరు నామములతో వ్యవహరింపబడుచున్నట్లు, వివిధ రూపములలో వేర్వేఱుగానుండును. సూక్ష్మముగా చెప్పవలెనన్న సాహిత్యము ప్రభు సుహృత్కాంతాసమ్మితము. వేదములు ప్రభుసమ్మితములు. పురాణాది గ్రంథములు సుహృత్సమ్మితములు. కావ్యములు కాంతాసమ్మితములు. వేదములు రాజశాసనములవలె దండోపాయమున నీతిగరపును. పురాణములు స్నేహితుడుచేయు హితబోధవలె నీతి (సందేశమును) ప్రకటించును. ఇన్నింటిలోను కావ్యములకే ప్రాశస్త్య మధికతరము. "అంగనాజన విలాసాలాపలీలాసమ, ప్రాదుర్భావము లౌర కావ్యములు కర్తవ్యోపదేశక్రియా, వాదప్రక్రియ లెన్న కావ్యమహిమల్ వర్ణింపసామాన్యమే" యని నరసభూపాలీయకారు డీభావమును విపులీకరించినాడు. రామాయణ పఠనానంతరము ప్రతి పాఠకునికి "రామాదివ వర్తవ్యమ్ నతు రావణా దివ" యని తప్పక స్ఫురించును. ఆ సందేశము స్ఫురించకున్నచో నా గ్రంథపఠనము శూన్యము. ప్రతి సత్కావ్య మట్టి గుణపాఠమునే యిచ్చును. వాల్మీకి వ్రాసినది రామచరితమే యైనను యీ సందేశము పరోక్షముగా పాఠకునకు స్ఫురించినది. ఆ సంస్కృత కావ్యములే యాంధ్ర ప్రబంధములు. కావ్యములు కాంతాసమ్మితములని వ్యవహరించినారు సాహిత్యశాస్త్రకారులు. సాహిత్యశాస్త్ర మనగా నలంకార శాస్త్రమని నా పర్యాయపదము. అనగా ప్రేయసి తన నాథునికి చేయు హితబోధను మందలించక యనునయాలాపములతో ప్రియుని సన్మార్గవర్తనునిగా చేయును. తత్తుల్యమే కావ్యము. అందులకే కావ్యములు కాంతాసమ్మితములని ప్రతీతి.

కృష్ణరాయని ప్రబంధమందలి కవితారీతులను మొదటనే పరిశీలించితిమి. కాన ప్రస్తుతము విష్ణుచిత్తీయము తెల్పు నీతిని పరిశీలింతము. ఈ నీతి లోక కల్యాణముకొఱకు తత్తద్గ్రంథములద్వారా ప్రబోధింపబడినది.

ఈ గ్రంథమందు విష్ణుచిత్తుడు పరమభాగవతోత్తముడు. భగవద్భక్తుడు. ఆతిధేయ సత్కారములు చేయుటయందు దంది వేసిన హస్తము. ఆతడు న్యాయార్జిత విత్తమున తన యింటికి విందారగింప వచ్చిన యభ్యాగతులవల్ల వారి తెఱుక గల వింతలను విశేషముల నరయుచు భగవత్కాలక్షేపములతో కాలము గడుపుచుండెను. ఈతని చరిత్రము పాఠకునకు న్యాయమార్గమున చరించుచు భగవద్భక్తి కలిగియుండు మని యుద్బోధించుచున్నది. జయాపజయములు దైవాధీనమని తలంచి "షడ్భాగంతు మనుష్యాణాం సప్తమం దైవచింతనమ్" గనుక తమతమ ప్రయత్నములను విడనాడక వాటిని సాధించవలెనని విష్ణుచిత్తోదంతము ప్రబోధించుచున్నది. అంతేగాక రాజస తామసము లుడిగిన విష్ణుచిత్తునకుకూడ, భగవంతుడు గోదాదేవిని తనలో నైక్యము చేసుకొనగానే విసుగుకొనుట మానవులైన వారికి మమకారము సహజమని యది యుడుగనిది మోక్షార్హత లేదని చాటుచున్నది. విష్ణుచిత్తుడు పన్నిద్దరాళ్వారులలో నొకడై యుండికూడ యిట్టి మమకారమునకు లొంగుట దైవలీల దక్క వేఱొం డేమి కలదు ?

యామునాచార్యుడుకూడ భాగవతుడే. ఆతడు వైష్ణవమత ప్రతిష్ఠాపనకు దైవప్రేరణచే పాండ్యరాజు పట్టమహిషి విష్ణుభక్తికలదై యుండుటచే యామె సహాయమున రాజసభాభవనము జొచ్చి యందు శైవమతస్థుల నోడించి తన మతమే మోక్షప్రదాయిని యని సోపపత్తికముగ నిరూపించెను. పిదప నాతడు పాండ్యుని చెల్లెలిని పరిణయమాడి రాజ్యభోగమందు మైమఱచి భగవంతుని నైతము విస్మరించి భోగలాలసుడై స్వైరవిహారి యయ్యెను. దైవికముగా నతనికి జ్ఞానోదయమై భగవత్సాన్నిధ్యము చేరెను. పరమ భాగవతులైనను రాజస తామస సాంగత్యమిట్టి విపత్కర పరిస్థితి చేకూర్చునని, సత్వగుణ సంపన్నులగువారు సంసార సాగర తాపత్రయ నిర్ఘోషలు సోకని దూరదూరాల ద్యావాపృథ్వ్యవసానములలో నుండవలెనని హెచ్చరిక ! అథవా యిట్టి పరిస్థితులు దైవికముగా నసాధ్యమయినచో "అవశ్య మేవ భోక్తవ్యం పురాకృత శుభా ఽశుభమ్" యని మిన్నకుండవలసినదే.

ఖాండిక్య కేశిధ్వజులు నిమి వంశోత్పన్నులు. "జ్ఞాతిశ్ఛేదనలేన కి"మ్మను నాభాషణము సుప్రసిద్ధమేకదా. వా రిరువురు రాజ్యకాంక్షచే పోరాడుట యుభ

యులలో నొకరు రాజ్యభ్రష్టు లగుట, మరొకరికి రెండు రాజ్యములు పాలబడుట జరిగినవి. ఇట్లేర్పడిన పరస్పర వైరుధ్యమే వారిరువురికి తరుణోపాయము కలిగి భగవత్సాన్నిధ్యము చేరుట తటస్థించినది. కేశిధ్వజునకు ఖాండిక్యునివద్దకు వెళ్ళవలసిన యవసరము కలిగినపు డతడు ప్రాణములు తెగించి తన జ్ఞాతివద్దకు వెళ్ళి నిష్కృతి నెఱింగి సఫలీకృత మనోరథు డయ్యెను. దానికి గురుదక్షిణ యిత్తుననగా రాజ్యభ్రష్టుడైనను రాజ్య మడుగక మోక్షమార్గ ముపదేశింపు మని కోరుట, పోయిన పాపపు లంపటత్వము మఱలనేల యను విరక్తి సూచించును. దీనివల్ల జాగరూక మానవుని జీవితగతి మారుట కవకాశములు దైవికముగా తటస్థించునని సూచన లభించును.

మాలదాసరి తన జాత్యుచిత ధర్మప్రకారము భగవన్నామ సంకీర్తనము చేయుచుండెను. కాని యొకనాటి యర్ధరాత్రి యేదో యవాంతరమువలన వేకువ యయ్యెనని తన నిర్దేశిత ప్రదేశమునకు వెళ్ళుచుండగా మార్గమధ్యమందున బ్రహ్మరాక్షసుని పాలబడెను. కాని పిశితాశనుడైన బ్రహ్మరాక్షసునకు కూడ మాలదాసరిపై విశ్వాసము కలిగి యాత డా నాటి ప్రాతఃకాలమున భగవన్నామ కీర్తన చేసిన ఫలము గొని స్వస్వరూపము నొందెను. దీనివల్ల క్రూరుడైనను సన్మార్గుడైన యేదో యొక వింత సంఘటనచే జీవితము తారుమారు కాగలదని భావగత మగును. సోమశర్మకూడ తాను చేసిన పాపముల ఫలితముగానే బ్రహ్మరాక్షసు డయ్యెను. దీనివల్ల మానవుడు చేయు పాప పుణ్యములకు ఫలిత మీ లోకమందే యనుభవింపవలసి యుండవలయును. స్వర్గ నరకములు సత్యమైనను కాకున్నను యిరువురికి ప్రత్యక్షముగా నీ ప్రపంచమం దనుభోగ్యమగును.

గోదాదేవి కూడ పన్నిద్ద రాళ్వారులలో నొకర్తె. ఆమె మరియొక యాళ్వారు తనూజాతగా జన్మించినది. ఆమె రంగనాథుని ద్వితీయ కానున్నది. ఇది దైవికముగా జరుగ నుండినను యామె ప్రియాసంగమమునకు తహతహ లాడినది. ఆమె యనురాగమువల్లనే రంగని దరిజేరినది. "నదీనాం సాగరోగతిః" యన్నట్లు వేఱ్వేఱు మతములు సిద్ధాంతములు ప్రప్రథమమున భిన్నముగా నున్నను యవన్ని భగవంతునిలో లీనమగునవే. సూర్యకిరణము లనంతములైనను యవన్నియు సూర్యునిచే వెదజల్లబడినవే. విష్ణుచిత్తీయములోని కాంతాసమ్మిత మగు నీతి వివిధోపాఖ్యానములలో ప్రబోధింపబడిన దంతయు జగత్కల్యాణము కొరకు ద్దేశింపబడిన దని చెప్పక చెప్పెడివి.

ఇంక విష్ణుచిత్తీయమందలి యఖండత్వమును నాయకాశ్రయమైన రసమును గూర్చి ప్రశంసాలేశము. కావ్యమున కఖండత్వము కల్గించునది నాయకాశ్రయమైన రసంబని సాహిత్యవేత్తలండ్రు. ఆముక్తము కావ్యమైనచో దానిలో యంగిరసమేది? ఈప్రశ్న నొకమారు మద్రాసు విశ్వవిద్యాలయ యం, ఏ. పరీక్ష పత్రములో నొసగిరి. ఆముక్తము కావ్యమా యను విషయ మితఃపూర్వ ప్రకరణములో పరిశీలించి యున్నందున యేతత్ప్రశ్నలోని మొదటిభాగమును గూర్చి ప్రస్తావింతును.

సాహిత్యమున కాయువుపట్టు రసము. రసవాదమున సంఖ్యల విషయమున కొంత భేదాభిప్రాయము కలదు. నవరసములని నిర్ధరింపబడినను భక్తిగూడ రసమని కొందఱి సాహిత్యవేత్తల నిశ్చితాభిప్రాయము. రసవిచారముపై ప్రశంసాలేశము. ఒకరి సుఖదుఃఖములను చూచునపుడు వాసనారూపముగా మనమనస్సులకు నొక వికారము పుట్టుచున్నది. "సుఖదుఃఖాదిభిర్భావై ర్భావస్తద్భావ భావనమ్" ఇట్టి మనోవికారమే భావమనబడును. ఒక స్త్రీ సౌందర్యమును చూడగా యనురాగమును విరూపత్వమును జూడగా హాసమును మనస్సునకు గలుగుచున్నది గదా! మనోవికారములైన యీ యనురాగాదులే భావములు. ఇట్టి భావము సజాతీయములైన భావములచేతగాని, విజాతీయమైన భావములచేతగాని డిందుపడక రసముగా పరిణమించు వఱకు మనస్సున స్థిరముగా నుండునేని యది స్థాయీభావ మనబడును. ఇట్టి స్థాయీభావము పైపయి పర్థిల్లి మిక్కుటమయిన యానంద సంవిద్రూపముగా బరిణమించునేని రసమనబడును.

రతి ర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా
జుగుప్సా విస్మయశమాః స్థాయిభావా నవక్రమాత్
శృంగార హాస్య కరుణ రౌద్ర వీరభయానకాః
భీభత్సాద్భుత శాన్తాశ్చ రసాః పూర్వైరుదాహృతాః.

రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము, శమము లను యీ తొమ్మిదియు స్థాయి భావములు. ఇవియే వృద్ధి నొంది వరుసగా శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానక భీభత్సాద్భుత శాంతము లనంబరగు నవరసములయినవి. ఈ స్థాయి భావములను పుష్టినొందించి రసముగా పరిపక్వముసేయు సామగ్రియు కలదు.

విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమానస్స్వాదుత్వం స్థాయీభావో రసస్మృతః.

అవే విభావములు, అనుభావములు, సాత్వికములు, వ్యభిచారులని నాలుగు విధములు. వ్యంజనాదు లన్నము నెట్లు భోగ్యముగా జేయునో యట్లే విభావాదులును స్థాయిని స్వాద్యముగాజేసి రసము గావించును. ఈ విభావ మాలంబనము, యుద్దీపనమని రెండు విధములు. రత్యాదులకు విషయ భూతులైన నాయికా నాయకు లాలంబన విభావము. ఈ నాయికా నాయకులయొక్క గుణములు, చేష్టలు, యలంకారము, తక్కిన తటస్థములని యుద్దీపన విభావము నాలుగు విధములుగా నుండును. గుణములు రూప యౌవనాదులు. చేష్టలు యౌవనము వలన బుట్టు హావభావములు. ఈ హావభావములు పదునెనిమిది కలవు. అలంకారము నూపురాంగద హారాదులు. తటస్థములు మలయానిల చంద్ర శుకపికాదులు. ఇట్లు నాయికా నాయకు లనెడి యాలంబనము చేతను వారి గుణచేష్టాదులైన యుద్దీపనము చేతను రత్యాది భావములకు స్థాయిత్వము కలుగును. అనగా నా స్థాయి భావమునకు నివియే కారణములగును. ఈ రత్యాది జ్ఞానతాదాత్మ్యము వలననే రసము కలుగును గావున యందువలననే దానికి స్వప్రకాశత్వము నఖండత్వములు సిద్ధించును. స్థాయికి రెండవ సామగ్రి యనుభావములు. ఇవి శరీర జనితములైన కటాక్షము, భ్రూవిక్షేపము మొదలగునవి. ఇవి హృదయ మందలి రత్యాది భావములను వెలిబుచ్చును. ఈ యనుభావములు స్థాయివలన కలుగు కార్యములు. నాయికాదుల చిత్తములందుగల రత్యాదులచే భ్రూవిక్షేపాదులు పుట్టుచు వారి చిత్తములందలి రత్యాదులను, నాయకాదులకు దెలిపి వారికి గూడ నా రత్యాదులను కలిగించుచున్నవి. ఇట్టి మొదటివారి రత్యాదుల కవి కార్యములయ్యు రెండవ వారి రత్యాదుల కవి కారణములగుటచే నట్టి సామగ్రిగా చెప్పబడినవి. స్థాయికి మూడవ సామగ్రి సాత్త్వికభావములు. సత్త్వమనగా పరస్పర సుఖ దుఃఖాదులను భావించుటకు మనస్సు మిక్కిలి యనుకూలముగా నుండుట. పరగత మయిన సుఖదుఃఖాదుల ననుభవింపగా నంతఃకరణము తన్మయమగును. మనస్సునకు గల తన్మయీ భావమే సత్త్వము. సత్త్వముచేత నిర్వృత్తములయినవి గావున సాత్త్విక భావము లనబడుచున్నవి. ఈ సాత్త్విక భావము లెనిమిది. అనుభావములవలెనే సాత్త్వికములును రత్యాది సూచకములు గావున నివియు ననుభావములే యనదగినను నివి సత్త్వమువలన గలుగునవి గావున విశేషించినవని గ్రహింప వలయును. స్థాయికి నాలుగవ సామగ్రి వ్యభిచారి భావములు. ఇవి నిర్వేదము, గ్లాని, శంక మొదలైనవి ముప్పదిమూడు గలవు. ఈ వ్యభిచారులే సంచారులగును. ఇట్లు స్థాయి భావము చతుర్విధ సామగ్రిచే సముల్లసితమై రస

మగును. ఇది రస స్వరూపము. నవరసములు సర్వసుమనస సమ్మతమైనను యిందును రస శ్రేష్ఠతనుగూర్చి భిన్నాభి ప్రాయములు కలవు. భవభూతి కరుణ యొకటే రసమనియు దానికి పరిణామ భూతమయిన వితర రసములని సిద్ధాంతీక రించినాడు.

ఇట్లు రత్యాది జ్ఞానతాదాత్మ్యము వలననే రసము కలుగును గావున యందు వలననే దాని కఖండత్వము సిద్ధించును. ఈ రసము కథా నాయకుని యాశ్ర యించినచో కావ్యమున కఖండత్వము కలుగును. కావ్యమునకు రసము ప్రధానము. ప్రతిపద్య ప్రతిపద రసోదయముగా కావ్య మామూలాగ్రముగా వ్రాయుట దుస్త రము. దానిని మెప్పించినవాడు వాల్మీకి యొక్కడే. ఏ కావ్యమందైనను కొన్ని రసవద్ఘట్టములు మాత్రమే యుండును. ఆ ఘట్టములే మిగిలిన కావ్యమునకు చేవ కల్గించి తత్కావ్యమును పఠన పాఠన యోగ్యముగా నొనరించును. మనుచరిత్ర యందు సామాన్యముగా మొదటి మూడాశ్వాసములే పఠన యోగ్యములుగా నున్నవి. ఆ పిదప భావవస్తు రచనలుండినను పాఠకుని దృష్టి నాకర్షింపజాల కున్నవి. పాఠకుని దృష్టి నాకర్షించు యదృశ్యానుభూతియే రసము.

విష్ణు చిత్తీయమందలి నాయకుడు ధీరోదాత్తుడు. నాయకుడొకడే యనుటలో మిగిలిన వుపాఖ్యానములని ప్రధాన గాథ యొకటేనని నా సమన్వయము. ప్రకృత మునకు భక్తిగూడ రసమని నిర్ధరించి యేతత్కావ్యమందలి రసము నుగ్గడించు చున్నాను. ఈ కావ్యమందలి ప్రధాన రసము భక్తి. అంగిరసము భక్తి. అంగ రసములు శృంగార వీర రౌద్రములు. విష్ణు చిత్తుని జీవితమంతయు భక్తి రస ప్రధానమైన కావ్యము. గోదాదేవి కథయందే శృంగారము కలదు. అంతేగాక వీర భయానక రౌద్ర భీభత్సములు కూడ క్వాచిత్కముగా కలవు.



కావ్యమునకు రస మెంత ప్రధానమో, పాత్రపోషణకూడ నట్టిదే. ఇంక యేతత్కావ్యమందలి పాత్రపోషణ మరయుదము. కొందఱి మతమున నిక్కావ్యమున పాత్రపోషణమేలేదు, పాత్రలందఱు కపటనాటక సూత్రధారిచే నాటకమాడించబడినవారే. వారికి ప్రత్యేక వ్యక్తిత్వము లేదు. శ్రీమన్నారాయణు డొక్కడే యీ కావ్యమందు సర్వాంతర్యామియై యున్నాడని వారి నిశ్చితాభిప్రాయము, ఏతత్కారణము వల్లనే మద్రాసు విశ్వవిద్యాలయము యం. ఏ. పరీక్షకీ ప్రశ్న నిచ్చిరి. "ఆముక్తమాల్యదయందు కవియొక్క పాత్రపోషణ కేవలము నిరూపితము కాలేదు. అందు విష్ణువు సర్వాధికారి, అందలి పాత్రలకు వ్యక్తిత్వము పూజ్యము. ఇందలి సత్యాసత్యములను పరిశీలించునది." ఇతఃపూర్వ ముల్లేఖిం నట్లు విష్ణుచిత్తీయము వైష్ణవమత ప్రాశస్త్యముగల కావ్యరాజము. కేవలప కథాంశమునే చెప్పదలచినచో కృష్ణరాయ లీకావ్యము వ్రాయనక్కఱ లేకుండెడిది. ఏలనన యీ కథాంశములను తెలుపు గాథలు గ్రంథస్థమైనవి. ఏడాళ్వారుల కావ్యము వ్రాయనక్కఱలేదు. రామాయణమంత నొక్క శ్లోకమందు చెప్పబడలేదా ? ఒక మాటమాత్రము వాస్తవము. ఇందలి గాథలన్నియు భక్తి ప్రబోధములే. ఇందు నిరూపింపబడిన యధిదైవము శ్రీమన్నారాయణుడు. షని. పాక ప్రతీకాశమయిన భక్తిసంపదగల విష్ణుచిత్తుడు కూడ పురాకృత పుణ్య విశేషంబున లభించిన జ్ఞానవాసన కలిగియుండుటచే ప్రాక్తన మానవునివలెనే తలంచి తన విధ్యుక్త ధర్మములను ప్రతిఫల మపేక్షింపక యన్వహము గావించుచుండెను. శ్రీరామచంద్రుడుకూడ తాను యవతారమూర్తియయ్యును రామావతారము పూర్తియగువరకును "మానుషం మన్యే దశరథాత్మజమ్" నా తలంచినాడు. వైష్ణవమతమందున్న పన్నిద్దరాళ్వారులుగూడ భగవదంశ సంభూతులే. వారెన్నడును తామొక కార్యార్థమై యవతరించితిమని తలంచలేదు. కాని వారసామాన్యులని వారి యంతరాత్మ ఘోషించుచుండెను. విష్ణుచిత్తునకు పాండ్యు నోడించమని యుపదేశించిన సందర్భము పరిశీలించవలసి యున్నది. భగవంతుడు భక్తులకు తన రూపమును త్వరగా చూపించిన వారు తనను మగుడ భజింపరని యెంచి వారికి తన దర్శనములేకున్న గత్యంతరము లేదని తలంచు వరకు తాను సాక్షాత్కరింపడు. అయితే విష్ణుచిత్తు డట్టివాడుకాడు. పరమ భాగవతోత్తముడు, విష్ణు సాక్షాత్కార మయిన పిదప తొల్లిటికంటె యధికతరమగు

వాడు విసర్జింప వచ్చు వర్ణాచార
లోపంబుచేనగు పాపలేప
మైన నేనిత్తు గొమ్మన గొను ధరణి భో
గమునకు గాక ధర్మమున కగునె
కాన సత్క్షత్రియులకు భైక్షంబు కీడు
మత్త్రప్రధానులు వేడు సామ్రాజ్య మనెడు
పలుకు ధర్మచ్ఛలంపు లోభం బయుక్త
మిది యెఱిగి రాజ్యమడుగనే నిచ్చగింప.

అంతేగాక మోక్షమార్గ ముపదిష్టమైన పిదప తాను కృతార్థుండ నయితినని కేశిధ్వజునకు ధన్యవాదము లర్పించెను.

## కేశిధ్వజుడు

కేశిధ్వజుడు కూడ నిమివంశాలంకారుడు కాని బ్రహ్మజ్ఞాని. ఈతడు మొదట రాజ్యవిస్తరణ కాంక్షచే తన జ్ఞాతి సోదరుడగు ఖాండిక్యుని రాజ్యమును హరించి కొంతకాలము రెండు రాజ్యములను నిరాఘాటముగ నేలెను. పిదప జ్ఞానోదయమై యజ్ఞముసేయ సమకట్టెను. ఇంతలో యజ్ఞగవి పులివాతంబడి యసువులు వాసెను. దానికి నిష్కృతి తెలుపమని ఋత్విక్కుల నడుగ వారు తమ కేమి తెలుయదనియు కర్మఠుడైన యా ఖాండిక్యుని పృచ్ఛసేయుమనిరి. ఖాండిక్యుని తానొకసారి రాజ్యకాంక్షచే నోడించి రాజ్యభ్రష్టుని గావించెను. అతని నెట్లడుగవలె నని వితర్కించుచు నొక నిర్ణయమునకు వచ్చెను. అతడు సధర్ముడై నిష్కృతి చెప్పినచో తన యాగము సక్రమముగా పూర్తియగును. కాక పూర్వవైరము మనసులో ప్రజ్వలింప తనను హతమార్చినను యజ్ఞప్రయత్నముననున్న కారణ మున నా యజ్ఞఫలము దక్కునని యెంచి ఖాండిక్యుని పద్దకువెళ్ళి తాను చెడు తలంపుతో రాలేదనియు, నిష్కృతి వేడుటకు వచ్చితినని నచ్చచెప్పి యాతనివల్ల నిష్కృతి యెఱింగి యజ్ఞము సక్రమముగాచేసి సఫలీకృత మనోరథుడయ్యెను. అంతేగాక యాగము పూర్తిచేసి గురుదక్షిణ మాటమరచి మగుడ ఖాండిక్యుని చెంత కరిగి గురుదక్షిణ కోరుకొమ్మని, యాతడేది యడిగినను ఇత్తునని వాగ్దానము చేసెను. అనగా ఖాండిక్యుడు చతురుదధివేలావలయితంబైన రాజ్యద్వయము ఇచ్చుటకు సంసిద్ధుడయ్యెను. ఐతే ఖాండిక్యుడు రాజ్యముగోరక ముముక్షుసక్తుడై మోక్షమార్గ ముపదేశింపుమని కోరెను, అందుల కత డచ్చెరువొంది యాతని జ్ఞానో

దయమునకు మెచ్చి మోక్షమార్గమును సాంగోపాంగముగ నుపదేశించెను. ఇట్లిద్దరి జీవితములు తరించినవి.

## యామునాచార్యుడు

యామునాచార్యుడు బాల్యమాదిగా విష్ణుభక్తుడు. ఈతడు విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకాచార్యులలో ముఖ్యతముడగు నాథమునికి పౌత్రుడు. ఇతడిట్లు పాండిత్య ప్రకర్షతో ప్రచండ మార్తాండుని భంగి రాజిల్లుచుండ పాండ్యదేశపు రాజొకడు తాను శైవమతస్థుడగుటే కాక బలవంతంబుగ నందఱికిని శివలింగములు కట్టుచుండెను. బ్రాహ్మణోత్తములు తాము విశిష్టాద్వైత సిద్ధాంతపరులయ్యును నా భగవంతునిపై విశ్వాసములేనివారై యుదరపోషణార్థము శైవమతావలంబులై యారాజచంద్రునిచే సముచిత గౌరవములనుపొంది యగ్రహారాదులార్జించి సుఖముగాకాలక్షేపము చేయుచుండిరి. కాని యా రాజన్యుని పత్ని వైష్ణవ మతస్థురాలు. ఆ రాజమహిషిద్వారా తాను వైష్ణవమతము స్థాపించి యారాజును శైవమత పరాఙ్ముఖునిగా చేయవలెనని తలంపు యామునునకు భగవత్ప్రేరణవల్ల కలిగెను. కలిగినదే తడవుగా తానా రాజభవమునకుజని యా పట్టమహిషికి తను వచ్చిన వృత్తాంతమును తన లక్ష్యము సాకల్యముగా నామె కెఱింగించెను. ఆమె వల్లెయని వీలు కలిగినప్పుడు రాజసభా ప్రవేశము కల్గింతునని వాగ్దానము చేసెను. ఆమె సమయముచూచి తన నాథునకు యామునాచార్యుడు శైవమత మోడించుట కరుదెంచెనని తెలిపెను. ఆతడుకూడ తన భార్యమాట త్రోసిపుచ్చజాలక, 'ఇతదేమీ ? శైవమతము గెలువవచ్చెనా' యని గేలిసేసి యాత డోడిపోవునను తలంపుతో వాదమున కంగీకరించెను. రాజోడిపోయిన సురఘస్మర చక్రాంకితుడ కాగలవాడనని చెప్పెను. తానోడిన శివలింగము కట్టుకొనుట కంగీకరించెను. యాముడు రాజన్యునితో 'నేనోడినచో యమ్మదెచ్చిన విద్వాంసుడనని గేలిసేయవలదు. నన్ను ప్రేరేపించిన భగవంతుడే నన్ను బొంకించిన నేనేమి చేయగలవాడ'నని యారాజునకు తన యభిప్రాయమును సుస్పష్టము చేసెను. యామునాచార్యుడు శైవమత మోడించి వైష్ణవమతము ప్రతిష్ఠించెను. ఆరాజతని ప్రతిభావిశేషముల కలరి యర్ధరాజ్య మిచ్చుటేగాక తన చెల్లెలినిచ్చి వివాహము చేసెను. యామునాచార్యుడు రాజ్యభోగముల ననుభవించుచు తృతీయ పురుషార్థ పరుడై యుండెనని చింతిల్లి వీతని పితామహుని ప్రశిష్యుడగు శ్రీరామమిశ్రుడను వైష్ణవోత్తము డీతనిని చూడబోయి రాజసభా ప్రవేశము పొందజాలకుండెను. చివరకొక

యుపాయముచే యాతని దర్శనము చేసికొని మీ పెద్దల నిక్షేపమొకటి చూపింపెద నని శ్రీరంగమునకుం గొంపోయి శ్రీరంగని పాదపద్మములను చూపించెను. యామునుడు గతమునకు విచారించి రాజ్యభారమును తన కుమారున కప్పగించి రాజనీతి బోధించి సన్యసించి జీవితశేషమును గోవిందపాదారవింద సేవలో గడపెను.

## మాలదాసరి

మాలదాసరి కూడ భగవద్భక్తుడు. అతని భక్తి మూఢ సంబంధమయినది. ఈతడు భగవంతుడు వామనావతార మెత్తినపుడు మూడు యోజనముల దూరము గల యూరియందు వసించుచు బ్రాహ్మీ ముహూర్తములయందు వచ్చి మంగళనామ కైశికి యనురాగముచే తిరుక్కురుంగడి పాడుచు కాలక్షేపము చేయుచుండెను, అతడు జాత్యుచిత ధర్మము ననుసరించుచు యగ్రజులను చూచి తొలగుచు, వారు దయతో నొసగిన ప్రసాదములు గొని జీవయాత్ర గడుపుచుండెను. ఒకనాడు మధ్యరాత్రి కోడికూయగా వేగుజా మయ్యెనని పోవుచుండెను. మార్గమధ్యమం దొక బ్రహ్మరాక్షసు డితనిని బంధించెను. అతడు విముక్తిపొందు మార్గాంతరము గానక యా బ్రహ్మరాక్షసుని ఉద్దేశించి 'ఓయీ! నీ కాహార మగుట మానను. కాని నేను ప్రతిదినము చేయు వ్రతమున కనుజ్ఞ యి'మ్మని వాగ్దానము చేసి తన వ్రతము పూర్తియైనపిదప నా రాక్షసునకు తన దేహము సమర్పించెను. ఈతని భక్తి కలరి బ్రహ్మరాక్షసు డాతనిని భక్షింపక తన చరిత్రము నీగతి చెప్ప దొడగెను.

## బ్రహ్మరాక్షసుడు

బ్రహ్మరాక్షసుడు పూర్వము సోమశర్మ యను బ్రాహ్మణుడు. ఒక్క దుష్కర్మంబున రాక్షసు డయ్యెను. చోళదేశమందు పదునాల్గు కళలు నేర్చి వాక్చం డిమతో నందఱిని గెల్చుచు బ్రాహ్మణుల గేలిసేయుచు జల్పవాదియై కాలయాపనము చేయుచుండెను. ఇట్లుండ ద్రవ్య భిక్షార్థియై మధురానగరి కేగి నానా దుర్విధముల ధన మార్జించి నిజపురి కరుగువాడై కోమటివద్ద వడ్డీకి వైచిన ధనమును గైకొని గోదాన మంగళము గావించుకొని కొత్తచెప్పులు కొని ప్రయాణ సన్నాహము చేయుచుండెను. ఈతని ధోరణి గనిపెట్టిన దొంగ యొకడు వీరిగుంపులో బాటసారి వలె గలిసి యర్ధరాత్రమున పెడత్రోవ పట్టించి నొక యేటిలోకి గొంపోయి నంద ఱిని దోచుకొన దొడగెను, ఆ దొంగల గుంపు దోచుకొనుచుండగా సోమశర్మ

పలాయనమంత్రము పఠించెను. ఈతనిని గనిపెట్టిన యా మొదటి దొంగ యితనిని వెంటాడి దేహశుద్ధి చేయుచుండెను. ఇంతలో బాటసారులగుంపొకటి వచ్చి యీతనిని రక్షించెను. ఆ గుంపులో యీతని భార్యవంక చుట్ట మితని నానవాలు పట్టి యొక పల్లకిలోనుంచి జలము త్రాగపోయెను. అతడు తిరిగివచ్చునంతలో సోమశర్మ మరణించి బ్రహ్మరాక్షసు డయ్యెను. ఈ యుదంతమును మాలదాసరికి చెప్పగానే యాతనికి నిజస్వరూపము వచ్చెను. ఈ యుపాఖ్యానము విమర్శనలు చదివిన విప్రునికంటె విష్ణుభక్తిగల మాలదాసరి శ్రేష్ఠు డనుటయేకాక మాలదాసరి వలన బ్రాహ్మణునికి ముక్తి యిప్పించుట యనునది ప్రయోజనము.

కృష్ణదేవరాయలు విష్ణుచిత్తీయ మందలి పాత్రల నన్నింటిని చక్కగా పోషించెను. ఇంకను మత్స్యధ్వజుడు పాండ్యునిరాణి కలరు కాని వారినిగూర్చి విపులముగా చెప్పబడలేదు. పాండ్యుని రాణినిగూర్చి యామె వైష్ణవమతావలంబి యనియు క్రమముగా నేకాదశినా డుపవాస ముండి మూన్నాళ్ళు నాథుని కలయ కుండ నియమముగా నుండెనని కలదు. ఇంకను పాండ్యునిరాణి యామునుని రాజసభా ప్రవేశమునకు కారణభూతురా లయ్యెను.



ఆముక్తమాల్యదకు రాజనీతి ఘట్ట మాయువుపట్టు వంటిది. యామునాచార్యుడు సన్యసించి తన కుమారునికి పట్టాభిషేకము కట్టి యుపదేశించిన రాజనీతి 84 పద్యములవరకు పెరిగినది. ఇట్లేదేని విషయమును విరివిగాగాని సంక్షిప్తముగాగాని చెప్పుట కవియొక్క ప్రత్యేకతను తెలుపును. రాజనీతి రుక్మాంగద చరిత్రలోను, భారతములోను, పంచతంత్రములోను వర్ణింపబడెను. కాని యింత వివరముగా వర్ణింపబడలేదు. అంతేగాక శ్రీ రాయలు వర్ణించిన రాజనీతి కొంత శుక్రనీతిసారములో, భారతభాగవతములలో కలదు. దాని నిట వర్ణించుచున్నాను.

కార్యభారములు కాపురుషులపైనుంచక, నేపట్టునను విసువక ప్రజాపాలనము గావింపవలెను, ఆర్తులైనవారిని వారి మొఱాలకించి రక్షింపవలెను. రాజు నిజ ప్రజానురంజకుడైనచో ప్రజ లారాజు మేలుకోరుదురు. అందువల్ల రాజున కేమి ప్రయోజనమని తర్కించకూడదు. ఏలయన నేకరూపముగా బ్రాహ్మణాది ప్రజలు కోరు కోరికను తదంతర్యామియైన పరమాత్ముడు తప్పక తీర్చును. అడవిగొల్లలు బోయలు లోనకు పాలెగాండ్రకు నడవిలో నాజ్ఞచెల్లును. ఎట్లనగా వా రెవరికైన నభయ మిచ్చినచో వాని చేతికి యంపెకట్టైను గాని నూలుపోగునుగాని గుర్తుగా నిత్తురు. దానిని జూచినచో ప్రజలుగాని దొంగలుకాని వారిని జెనకరని ప్రసిద్ధి. భూమండలమున కంతయు ప్రభుత్వముచేయుచుండు రాజున కెల్లవారును భయముతోగూడి వశంవదులై యుండవలెను. దుర్గాధిపత్యము నాప్తులైన బ్రాహ్మణోత్తములకె నీయవలయును, వారిమీది కెట్టి శత్రువులు వచ్చినను వారిని నిర్భయులై తెగటార్చుటకు వారికి రాజు యనర్ఘళరాజ్యమువలన నా దుర్గములందు వలసిన సేనాదులను సమృద్ధిగా నుంచవలెను. వారికి వలసిన దానికన్న హెచ్చుగా నిచ్చి వారు స్వామిద్రోహము చేయకుండునట్లు చూచుకొనవలయును. ఎంత మంచివానినైనను మొదటనే గొప్పస్థితిలో యుంచి తర్వాత వానిస్థితి తగ్గించినచో వాడా పూర్వస్థితికి రాక మునుపటి తన హీనదశను స్మరింపడు, తన కిప్పుడు స్థితి తగ్గించినందులకై ప్రభువును ద్వేషించును. కావున ప్రతివాని నడవడిని గనిపెట్టుచు క్రమముగా వృద్ధికి తెచ్చుచు సమయములం దెల్ల పనిగొనుచు నుండవలయును. రాజు తన రాజ్యత్వము తనకే దక్కుచుండవలెనని తలంచినచో, నీచ కులజుని, బోయలనడుమ జీవించువానిని, గురుశుశ్రూషచేయనివానిని, యసత్యవాదిని, ధర్మపరాఙ్ముఖుని పరదేశాగతుని దరి జేర్పరాదు. జాతి భ్రష్టుడైన బ్రాహ్మణుని దరి

జేర్పరాదు. బ్రాహ్మణుడై జన్మించినను మద్యమాంసములను మఱగి భ్రష్టుడైన వాడు నిరంతరము దానికై కులాచారములు మొదలగు వానియందు లక్ష్య ముంచక స్వచ్ఛంద విహారుడై వర్తిల్లుచుండును గావున యట్టివాని కధికార మివ్వ రాదు. శుక్రనీతిసారము మొదలగు రాజ్యాంగ గ్రంథములు చదివిన వానిని ప్రతిభావంతుని నాగతా ఽనాగతవేదియగు వానిని మంత్రిగా చేర్చుకోవలెను. ఇట్టి లక్షణయుక్తుం డగువాడు మంత్రిగా దొరకినచో శీఘ్రమున రాజ్య మభి వృద్ధికి వచ్చును. అట్టి మంత్రివర్గంబు దొరకదేని రాజు తనంతకు తానే రాజనీతి ప్రకారం బనుసరించి పనులు చేసుకోవలెను. ఆ పనులు నెరవేరినను నెరవేర కున్నను సరియే పూర్వోక్త లక్షణములు లేని మంత్రి దొరకిన వాడు రాజాజ్ఞకు లోబడక స్వామి ద్రోహమునకు కడంగి స్వతంత్రుడై స్వచ్ఛందముగా వర్తించును. మంత్రి లేకగూడ రాజ్య మేలవచ్చునుగాని గుణహీనుడగు వానిని సచివుని నియ మించరాదు. ఒకడు చేయవలసిన పనికి పలువురను నియమించవలెను. ఇతరులు చేయుపని యంతయు తమపై లేదని హర్షించి వారు తమపనిని సక్రమముగా నిర్వహింతురు. పెద్దపనులన్నియు కేవల ధనసహాయముచే జరుగునవికావు కావున పలువురు దొరలు పనివడి దానిని సాధింపవలయును. ఆదొరలు రాజుకు వశవర్తులై యుండుటకుగాను ధారాళముగా వారికి ధనమీయవలెను. ధనరాసులు సైన్యములు మొదలయిన రాజ్యాంగములు కలిగియుండుటేకాక యెవ్విధంబున నయినను మనుష్యులం గూర్చికొని యుండుట యుక్తము. ఎల్లప్పటికిని బ్రాహ్మణుని గొప్ప యధికారమందు నియమింపవలెను. అట్లొనర్చినచో నాతడు చతురతతో రాజ్యాంగ వ్యవహారములను చక్కబెట్టును. రాజు దేవాలయాధికారమును, పన్ను లార్జించు యధికారములు రెండింటిని విభజించి వేర్వేఱువారి కీయవలయును. ఏలనన దేవాలయములు దేవబ్రాహ్మణ జీవనాధికారములు. పన్నులలో నష్టము వచ్చెనా యొకే యధికారి యీ రెండింటిని చూచుచుండిన దేవాలయమునుండి తద్ధనమును తన్నష్టమునకు బదులుగా జేనియింటికి పంపును. ఆతడు చెడుబుద్ధి పుట్టి దేవాది ద్రవ్యమును హరించెనా యతడే చెడును. కాని యాదేవాది ద్రవ్యము ప్రభుత్వ ధనాగారము చేరదుకావున రాజునకు జెఱుపు కలుగదు. సేద్యగాడు ముందుగా పొలము స్వాధీనముచేసుకొని దానిని సుక్షేత్రముగా చేయుభంగి రాజు ముందు రాజ్యమును స్వాధీనపరచుకొని బయటి భయములేనివాడై తన రాజ్య మందున్న క్షుద్రశత్రువులను నిర్మూలింప వలయును. కొండెగాండ్ర దూలనాడిన రాజునకు రహస్య వృత్తాంతములు తెలియవుగావున వారిని చెదరనాడక పక్షాంతర

ముగా నుంచవలెను. చోర శక్యముగాని పర్వతారణ్య సీమలను స్థితిదప్పిన విదేశ శూరులకు జీవనోపాధిగా నీయవలెను. ఆ సీమలలో రాజ్యమునకు పీడ కలిగించు కిరాతులును యీ విదేశ శూరులు పరస్పర కలహములలో వారేమయినను రాజునకు మంచిదే. ఈ కొండదొరలు స్వతస్సిద్ధముగా స్వల్పకారణముచేతనే దుష్టులగు చుందురు కావున వారిని తగురీతి వశీకరణ చేసుకోవలెను. వారికి స్వల్పముననే స్నేహద్వేషములు కలుగునుకావున జాగరూకుడై చరింపవలయును. సత్యము తప్పనిరాజు కాటవికులు వశ్యులుగా నుందురు. వైరిభూపాలుని దూతను సన్మానించినచో యారాజు చెలిమి వహించును. కాలుబంట్లకు సమయమందు జీవనభృతి యిచ్చుటవల్ల వారు రాజులం దనురక్తులుగా నుందురు. రౌతులకు బహుమానములతో గూడిన కొలువిచ్చుచుండినచో వారు రాజుపై కూర్మి వహింతురు. ఉత్తమాశ్వమును గజమును నృపాలున కాప్తుడగు యోధున కీయవలెను. తత్ఫలితముగా సమయము వచ్చినప్పుడా నరేంద్రునకే మేలుకల్గును. అశ్వశాలను గజశాలను జాగరూకతతో కాపాడవలయును. ఎల్లప్పుడు వాటిని నధికారుల వశమున విడిచిపెట్టరాదు.

ఒక డొక పనిని సరిగా కనిపెట్టి సభలో తెలుపగా వానిపై ద్వేషముచే మరియొకడు కాదనెనేని యా జాడని కనిపెట్టి యీ యిరువురి పలుకుల నంభాలించి సత్యాసత్యములు గ్రహించి మొదటివాడు చెప్పినదానినే గ్రహించిన మేలగును. దుష్టసచివులు తమ రాజుపైకి రాష్ట్రము బయటి రాజులను ప్రేరేపి రాష్ట్రములో దుండగీండ్రను వృద్ధిపరచి రాజు తమ చేతులలో నుండునట్లు చేతురు గావున యీ దుష్టసచివుల స్థానే యోగ్యులగు వారిని మంత్రులుగా నియోగించవలెను. రాజు యెప్పుడును సేనను తన యధీనములో నుంచుకోవలయును. జీవన భంగము చేయక కొలువుదొరలను కాపాడవలెను. ఇక్కట్టులో నెవడు రాజునకు చేటు ప్రయత్నించునో వాడు రాజహస్తములకు దొరికినప్పుడు వాని కీటడగింపవలెనేగాని శిక్షింపకూడదు. వాడు కోఱలు పెఱకిన పామువలె కీడుచేయకనుండును. దేశమెంత విస్తీర్ణమయిన నంత యాదాయము తక్కువ. ఎంత చిన్న నేలయైనను దాని యాదాయమునకు గాను జలాశయములను నిర్మించి పంటకాల్వలు త్రవ్వించవలెను. ఇట్లు చేసియు తక్కువపన్నే విధింపవలయును. అట్లు చేసిన వానిని బాగు పరచిన ధర్మముకూడ రాజునకే దక్కును. నష్టపడి సేద్యములు మాని యిండ్లను, పసులను, ధాన్యములను వదలిపోవు జనుల నధికారుల నుపేక్షచేయకూడదు. వారిని రప్పించి సాయపడి సేద్యమునకు సదుపాయములు కల్పించి వారి నాదుకో

వలెనేకాని వారిని రప్పించి నిరాదరణ చేయకూడదు. రాజు తన యాదాయంబును సమముగా నాలుగుపాళ్ళుచేసి యందు సమృద్ధమైన త్యాగమునకు స్వానుభవమున కొక పాలును, దిగ్విజయ యాత్రలకు చతురంగబల భరణార్థము రెండుపాళ్ళను, సకల ధనసమృద్ధమయిన బొక్కసము నింపించుట కొకపాలు వినియోగించ వలయును. ఆరెకులను బహుమతులతో బుజ్జగించి వారివలన దొంగను తెలిసికొని వెంటనే వానిని దండింపవలయును. అట్లు చేయక వానిని చెఱయందుంచి శిక్షించు టలో జాగొనరించిన వాడు తప్పించుకపోయి మరెవరినైన చెఱసాల నుంతురు. అందువల్ల నిర్దోషికి దండనకల్గును. తత్ఫలితముగా జేని కపకీర్తి కల్గును. రాజెప్పుడును నీతిమార్గమును వదలరాదు. తెలుసుకోదగిన యుదంతములలో మూడు వంతులు రాజే స్వయముగా తెలుసుకోవలెను. శేషించిన నాలవపా లాప్త మిత్రబృందమువలనం దెలిసికొనవలయును. ఇట్లు చేయుచు తన మతమే జరుగ వలయునను దురభిమాన మెప్పుడును వహింపక, తన కాపద కల్గినచో పరాధీను డునుగాక, దండనచేయుటయందు క్రూరుడుగాక నుండెనేని చిరకాలము సుఖముగా రాజ్యమేలును.

రాజు రాజ్యభోగము లనుభవించుచుండినను అప్రమత్తుడై యంతశ్శత్రువు లను, బహిశ్శత్రువులను కనిపెట్టి యుండవలయును. సన్యాసులు జడదారులు మొదలగు నేకాంగులను వారి విద్యకు మెచ్చి ధనములు గ్రామములు నీయరాదు. వా రీభోగములతో గర్వించి బ్రహ్మచర్యము మొదలగు నియమములం బాయుదురు. అట్లు వారు భ్రష్టులగుటవలన రాజ్యమున కరిష్టము చుట్టుకొనును. కావున నట్టి వారిని భూ ధనాదు లీయకయే పూజించవలయును. పట్టువడిన శత్రువును హానికర మని తోచినచో నాతని నప్పుడే దండింపవలెను. రాజు తాను వీరాగ్రేసరు డయ్యును తన కొలువునందుండు దొరలు తమ శౌర్యప్రతాపముల లెస్సగా పల్కి నను సహించవలెను. అట్లు వినని యెడల వారి యుత్సాహము తగ్గిపోవును. రాజు తన దేశమునకు వెలిదేశములనుండి గుఱ్ఱములు, గజములు, రత్న చందన మౌక్తికాదులు వచ్చునట్లు వర్తక మభివృద్ధిపరచి రేవులలో దిగుమతికి సౌకర్య ములు కలుగజేయవలెను. ఈతిబాధాపీడితులగు విదేశప్రజలు తన రాజ్యమునకు వలసవచ్చిరేని వారిని వారివారి జాతికి తగునట్లు రక్షింపవలయును. తన యారా మములను, పసులమందలను, స్వర్ణరత్నాది ఖనులను ఆప్తులు విచారించునట్లుగా పంచి వారి యధీనము చేయవలయును. పరరాజు బలవంతు డాయెనా యాతని సత్కారములను స్వీకరింపవలెను. లేదా సమయము వచ్చినపు డతనిని తుద

ముట్టించవలెను. రాజు పలువిధముల తన రాజ్యమందలి దుండగీంద్రను వెదకి నిర్మూలించి సుఖముగా నుండవలెను. రాజు తనయందు నాల్గు రాజదోషములు లేకుండునట్లు చేసుకోవలెను. రాజులు స్వపక్షమువలననే భయము వచ్చునప్పుడు వానికైనను ప్రియము చెప్పి సగము రాజ్యము కోరినను యిచ్చి స్వపక్షభయమును మాన్పుకోవలెను. వేయిమాటలేల ? రాజెన్ని యుపాయములచేతనైనను తన రాజ్యములోని కంటకులను వెదకి కనుంగొని వారి మదమణగించి సుందరీ బృందంబుమధ్య చరించు మగవానివలె నిర్భయముగా మెలగుచుండవలెను. అట్లు చేయడేని తనకు రాజ్యమువల్ల సుఖము లేమియేగాక దుఃఖముకూడ కల్గును.

బలవంతుడైన రాజన్యుడెవడేని తనకు సాధ్యపడనిచో యతని నల్లైయుంచి సామ దాన భేద దండోపాయములవల్ల నతనిని సమయానుకూలముగా తనవద్దకు వచ్చునట్లు చేయుటే రాజనీతి. రాజైనవానికి దండపారుష్యాది దుర్గుణములు లేక యుండెనేని చిరకాలము రాజ్యసౌఖ్య మనుభవించు చుండును. దివ్యములు నంత రిక్షములు భౌమము లనెడు త్రివిధోత్పాతము లొదవిన తచ్ఛాంతికై రాజు బ్రాహ్మణు లకు భోజనములు, దేవతలకు పూజలు, నగ్నికి హోమములు చేయించుటకు గాను బహు ద్రవ్యములను వినియోగింప వలయును. రాజు తన గొప్ప యధికారు లందును గొప్ప జోదులయందును పరస్పరము పోటీలు కల్పించవలెను. దానివల్ల వారెల్లరును రాజునకు తమతమ ప్రతిభావిశేషములను ప్రదర్శించుట కవకాశము కల్గును. దానివల్ల యెల్లరును రాజసమ్మానములు పొందబడినవారై యతని కహితము దలపెట్టక యుందురు. శత్రులందరిపైకి రాజు తనకుతానై దాడి తీయరాదు. తనకు ప్రత్యామ్నాయముగా నమ్మినబంటునే పంపవలెను. ఆ దొరకు సర్వసమృద్ధమైన దుర్గము దండు గల భూమి నీయవలయును. అట్టి యధికారము బ్రాహ్మణేతరున కిచ్చినచో నాతడు రాజుమీదనే యలుకవహించి తిరుగబడును గాన దానిని బ్రాహ్మణునకే ఈయవలయును. రాజు తన సరిహద్దులలో యడవులను వృద్ధిచేయవలయును. తనదేశము నేమి యడవులను, అందు నెలకొనియున్న దారిదొంగలు బందిపోటుదొంగలు జనులకు బాధ కలిగించకుండునట్టుగా ఛేదించి బయలు చేయించవలెను. అడవిలో దుర్గమ ప్రదేశములందు తిరిగెడు మన్నెపు జనులయందు తప్పిదము లెన్నియో యుండును. మట్టిగోడ నెంత కడిగినను మట్టి నిశ్శేషముగా ప్రక్షాళనము కానటుల వారినెంత దండించినను తప్పిదము నిశ్శేషముగాదు. అందువలన వారికి వస్తువాహనములిచ్చి చెలిమి చేసుకోవల యును. అట్లు చేసికొన్న తాను వైరులపై దాడి వెడలునప్పుడు వారి మన్నెపు

దండు తోడుగావచ్చును. తన వైరులయిన పొలిమెరరాజు భూములను వారిచే కొల్లగొట్టించవచ్చును. దూరముననున్న ద్వీపములందలి వర్తకులకు రాజు తన పట్టణమువారికి గృహారామ ధనవసతి కలుగజేసి వారి గజాదిసంపద శత్రువుల పాలుకాకుండ జూడవలెను. ఇతరదేశ రాయబారులు వచ్చినప్పుడు వారితో సముచితముగా భాషించుచు తాను చెప్పదలచుకొన్నది హెచ్చరికగా మాత్రమే చెప్ప వలయును. అవియును స్నేహపూరితములుగానే యుండవలెను.

రాజు కొత్తగా కొలువులో జేర్చుకున్నవానిని తన మంత్రాంగములోనికి జేర్చుకోకూడదు. అట్లొనర్చినచో నాతడు మన్ననలకుబ్బి తన మిత్రులకుం జెప్పును. క్రమముగా దానికి ప్రచారముకలిగి దేనికై యా మంత్రాంగము జరిగినదో యది కొనసాగకుండ పోవును. మంత్రము బయలుచేసిన యా దొరయుం జెడును. రాజు తనమేలు కోరువారు, మహావిద్వాంసులు, వేదోక్తవిధుల నతిక్రమించక నడచుకొనువారు, శూరులు తనకు కులక్రమాగతులై జీవనము సల్పెడువారు నగు బ్రాహ్మణులను దుర్గాధిపతులుగా నియమింపవలయును. ఆ దుర్గములనుకూడ నూరేండ్లకు సరిపడు సకలపదార్థములతో సంపత్సమృద్ధముగా నింపింప వలయును. ఇంచుకయేని హెచ్చుతగ్గులు రాకుండ భూములీయవలయును. తన భాండాగారమునకు కూడ ప్రజలను పీడింపక యాదాయమును సమకూర్చుకోవల యును. అట్లుచేయు రా జత్యంతసౌఖ్యము లనుభవించుచు నిశ్చింతగా నుండును. గజహయముల వెలకు వానిమేతకు బంట్ల జీతములకు బ్రాహ్మణ సత్కారములకు దేవపూజలకు నాత్మభోగముల కగునట్టి ధనవ్యయమును వృధావ్యయమని తలంప రాదు. ఆ వ్యయమును ధారాళముగానే చేయవలయును. రాజు వైరిపై ప్రతిజ్ఞ చేయకూడదు. జయాపజయములు దైవాధీనములు కావున యనుకూలమగు సమయమువరకు వేచియుండి తనకార్యమును పూర్తిచేసుకోవలెను. రాజైనవాడు రెండుమూడు యాలోచనలకే నిరాశపడి వాని నమ్మియుండక పరహితుడై యోజనలు చెప్పుచున్నవాడో లేక తనకు హితబుద్ధిని జెప్పుచున్నాడో యని వాని వెలినడవడి నితరులచే తెలిసికొనవలయును. తన పొరుగురాజు చెడునేని వానిని చెడనిచ్చుటయే రాజనీతి. చెడకపోయిన వానితో చెలిమి చేయవలయును. వాడు వ్యతిరేకించిన పొరుగురాజు వాని పొగరణగించును. ఆ పొరుగురాజుతో పోరు చున్న యారాజు తనజోలికిరాడు. తన శత్రురాజ్యమును వారి దుర్గములను స్వాధీన పరుచుకోవలయును, వారి యంతఃపురకాంతలు చేజిక్కిన వారికి వారి పుట్టిండ్లలో జరుగు మర్యాదలు చేయవలయును. ఆ శత్రురాజుల రాయబారులముందు

పరుషాక్షరములు వచింపరాదు. కానన పర్వతములచేతను మేరుగిరి సమాన ధన సంపద, యౌషధీసంపద లభించునేని యా దేశమును జయించుటకు నొక సేనా విభాగమునే పంపవలెను.

రాజు తన జీవితకాలమున సుఖముగా రాజ్యమేలుటకుగాను, తెలిసిన వారి వలన తన దేశములో స్వర్ణాదిగనుల లోహములగను లెక్కడనున్నవో కనిపట్టి స్వర్ణాది లోహములను గనుపెట్టి, ప్రజల యాదాయములో కొంచెమే పన్నుగా గొనుచు, పొగరెక్కిన బల్లిదులను దండనచేత నణగద్రొక్కుచు, దయగలవాడై యెల్లవారిని పోషించుచు వర్ణాశ్రమ ధర్మములను దప్పిపోకుండ గాపాడుచు సతతము బ్రాహ్మణులను గౌరవించుచు జనహీన ప్రదేశములకు జనసమృద్ధి కలిగించి, చోటుచాలని ప్రదేశములందలి జనులను జనులులేని ప్రదేశములకుం బంపుచు. క్షుద్రశత్రువులను నాశనము చేయుచు సమృద్ధమయిన రాజ్యమును తన దేహముతో సప్తాంగ సమానముగా కాపాడుకొనవలయును.

రాజులకు దినచర్య యిట్లుండవలయును. ప్రాతఃకాలమున కార్తాంతికుల బ్రాహ్మణోత్తములను దర్శింపవలెను. యామము ప్రొద్దెక్కిన పిదప మంత్రి సామంతులతోను ధనార్జన నియక్తులయిన కరణాలతోను కొంతసేపు గోష్ఠినుండి మంత్రాలోచనాదికము కావించి యాయవ్యయ విశేషము లెఱుంగవలయును. అంగమర్దనము, మల్లురతో వ్యాయామము, వంటవాండ్రతోను వేటకాండ్రతోను తెచ్చిన మాంసములను తేవలసిన వానిని విచారించుకొని తెచ్చినవానిని వండవలసిన ప్రకార విశేషములనుగూర్చి యాజ్ఞాపించవలయును. అపరాహ్ణమున దేవతార్చన సమయమున పెద్దలతోను, ధర్మాధికారులతోను, సన్యాసులతోను సల్లాపము, భోజనానంతరము విదూషకుని వినోదమును, పౌరాణికులతో కవులతో గోష్ఠి. నాలవ జామున చారులకు దర్శనము, పాటకచ్చేరి, రాత్రి సుఖనిద్ర ప్రేయసీ సల్లాపములు.

రాజునకు వైద్యులు, జ్యోతిష్కులు, పండితులు, కవులును, పురోహితులును యెప్పుడును మేలేకోరుచు చేయుచునుందురు. ధనార్జన లోనగు రాచకార్యముల యధికారులు హితులునగుదురు. రాజద్రవ్యము హరించుటచేతను కనిపెట్టి దండించునోయను భయముచేతను నహితులునగుదురు. ఎవరి ధన సమృద్ధిని వారి దుర్వృత్తి నడంచుటకుగాను రాజు స్వీకరించియున్నాడో వారెట్లైన మరల నాతని వలన దానిం బడయుటకు గోరుచు యతనిని మదిలో ద్వేషించియే యుందురు. కావున యీమూడు తెఱగుల యనుచరుల విషయమై తానును హితుడు హితా

హితుడు కేవలం హితుడుగా నడచుచు పైకి హితుడుగా కనపడుచు నేర్పుతో మెలగియుండుట శ్రేష్ఠతరము. పాత్రమయిన వానిని యట్టివాడని చక్కగా గ్రహించి యతనికి ముందుగా నేవిధముగ తెలియనీయక నొక్కుమ్మడిగ తలంపుకు నందనంత ద్రవ్యార్జితము నొసంగి యాతని యాశ్చర్యమగ్నుని జేయుట తగును. హవ్యములకన్న కవ్యములే సూక్ష్మధర్మము లగుటచేత, వేదాధ్యయన సదాచార చాంద్రాయణాది వ్రతములచేత శాంతచిత్తులయిన వైష్ణవులకు శ్రాద్ధములనిచ్చి రాజు తన పితృదేవతలకు నుత్తమగతిం గల్పింపవలెను. అధముల కిచ్చినయెడల శ్రాద్ధము ఫలింపదు. పితరులకు నుత్తమగతి కలుగదు. రాజు ధారాపూర్వకముగా చేయునట్టి షోడశ మహాదానములు బ్రాహ్మణ పోషణమునకును పరతత్వజ్ఞానము తన క్షేమమునను వర్తిల్లినట్లుగా రాజులైనందున జ్ఞానాజ్ఞాన పూర్వక రాష్ట్రకృత స్వకృతాది బహుపాప సముచ్చయము కతంబున రాజునకు రాజ్యాంతమందు తప్పక కలుగునట్టిదైన నరకపాతమునకు నివృత్తికొఱకు శ్రీమన్నారాయణుని చరణములను శరణముం బొందవలెను.

రాష్ట్రమును యథాధర్మముగా పరిపాలనచేయు రాజు సకల భోగములను సదా యనుభవించుచునే యుండవచ్చును. తపస్సు చేయనక్కరలేదు. పుణ్యము చేతను దానములచేతను నార్జించవలయును. రాజభోజనములు మధురాదిరస యుక్తములయిన గురుపదార్థములతో నిండియుండునవిగావున, మధ్యాహ్నముననే గాని, గర్భగోళశుద్ధి చెందిగాని, యాకటితో భుజించుట రాజుకు మిక్కిలి హితకారి. ఆకలిలేక భుజింపకూడదు. ఆకలిగాయున్నప్పుడు భుజించినది చక్కగా జీర్ణమై దేహమునకు బలారోగ్యములు కల్గించును. ధర్మార్థ కామములను మూడు పురుషార్థములకు రాజు సమముగా ధనవ్యయము చేయవలెను. అందు ధర్మార్థమైన వ్యయము హెచ్చైనా యందులకు మిక్కిలి సంతోషింపవలయును. రాజుజ్జ్వలుడై యుండుటకుగా నొక మణిని ధరించవలెను. ఇంతేగాక రాజు వారము వారము వేఱువేఱు రత్నాభరణముల మంచికైసేతచే వెలుంగుచుండవలెను. రాజ్యమేలు వాని కనంతపాపము తప్పదుగదా! రాజ్యమేలనేల? పాపము కట్టుకొననేల? ఆపాప మెన్నాటికి తీరును? దానివలన శాశ్వతనరక మనుభవించుచుండ వలసి నదేగదా? అందుకొఱకా రాజ్యమాశించుట? యని వెనుదీయకూడదు. శక్తి కొలది యధర్మము చొరనీయక రాజ్యము సేయవలయును. తెలియక మించి సంభవించు పాపములకు పరిహారములు పశ్చాత్తాపములు కలవు. వేద మశక్యకరణమును విధించును కావున యాచింత వలదు. వృథాలంపటత్వ మేలనని రాజు విముఖుడు

కాకూడదు. కావున సావధానముగ శక్తికొలది శ్రుతదృష్టంబు లుపేక్షింపక రక్షణ శిక్షణంబు లాచరించుచు నశక్యంబున కార్త శరణాగత రక్షకుండగు పుండరీ కాక్షుపై భారంబిడి యనహంకృతి బ్రవర్తిల్ల నెల్ల సంసిద్ధులు కరస్థంబులగును.

ఇది కృష్ణరాయలు వర్ణించిన రాజనీతి. యామునాచార్యుడు తన కుమారుని కుపదేశించిన విధముగానే కృష్ణరాయలు వర్ణించెను. కృష్ణరాజేంద్రు డిదే రాజనీతిని తాను విజయనగరాంధ్ర సామ్రాజ్యమును పాలించు కాలమున పాటించెనా యను నది పరిశీలింపవలయును. ఇది యామునుడు తన కుమారుని కుపదేశించెననుటలో సమంజసమున్నది. యామునాచార్యుడు పరమభక్తుడు. ఆతడు తానుచేసిన తప్పి దమునకు పశ్చాత్తప్తుడై రాజ్యభోగమును సన్యసించి తన కుమారుని యభిషేకించు సందర్భమున చెప్పెను. కృష్ణదేవరాయసార్వభౌముడు కొంతవరకు యీ రాజనీతినే పాటించెను. ఈ రాజనీతి ఘట్టమునకు మూల మేగ్రంథమందునను లేదు. కావున కొంత శుక్రనీతి సారమునుండి, చాణక్యుని యర్థశాస్త్రమునుండి గ్రహించి యుండ నోపు. కృష్ణరాయలు తానీ రాజనీతి పాటించియే తన గ్రంథస్థము చేసెను.

మహాభారత సంహితలో యుద్యోగపర్వమందు శ్రీకృష్ణుడు పాండవులకు, కౌరవులకు జరపిన రాయబారము కలదు. అందుకూడ రాజనీతి యభివర్ణింపబడి నది. అయితే యీ రాజనీతికి యిందు వర్ణింపబడిన రాజనీతికి వ్యత్యాసము కలదు.



# 12. ఋతువర్ణన - వర్ణనాబాహుళ్యము - ప్రకృతివర్ణనలో విశిష్టత

మహాకావ్య (ప్రబంధ) లక్షణములలో ఋతువర్ణన ప్రశంస కలదు. ఇతర వర్ణనల కెంత ప్రాముఖ్యమో యీ వర్ణనకుకూడ నంతే ప్రాముఖ్యము. కృష్ణ దేవరాయ లాముక్తమందు గ్రీష్మశరద్వసంతవర్షర్తువులను విరివిగా వర్ణించెను. ఋతువర్ణనలో యేతదుద్గ్రంథముతో తూగగలవి తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యమునను, నచ్చతెనుగు రామాయణమందును వర్ణనలు గలవు. అందులకే మద్రాసు విశ్వవిద్యాలయములో యం. ఏ., పరీక్ష కొకమా రీక్రింది ప్రశ్ననిచ్చిరి.

"ఆముక్తమందుగల ఋతువర్ణనలోని విశేషము లెవ్వి ? దీని నచ్చతెనుగు రామాయణమందునను పాండురంగ మాహాత్మ్యమందునుగల వానికి భేదము తెలిపి యా యా సందర్భములలోని యావశ్యకత తెల్పునది.

ఆముక్తమాల్యదలో గ్రీష్మవర్ణన 30 పద్యములవరకు, వర్షర్తువర్ణన 60 పద్యములవరకు, శరదృతు వర్ణన 46 పద్యముల వరకు, వసంతర్తువు వర్ణన 70 పద్యములవరకు పెరిగినవి. ఇంత విరివిగా మరేకవి వర్ణించలేదు. అచ్చతెనుగు రామాయణము 18 వ శతాబ్దమునకు చెందిన కావ్యరాజము. కావున యీ గ్రంథ మాముక్తమాల్యదతో సరితూగజాలదు. తారతమ్య పరిశీలన యొనర్చుట సమంజ సము కాదు. ప్రస్తుతము తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యమును విష్ణు చిత్తీయమును పరిశీలించి తదృతువర్ణనల తారతమ్య మరయుదము.

తెనాలి రామకృష్ణుడు, పాండురంగమాహాత్మ్యమందు చతుర్థాశ్వాసములో రాధ మాధవుడే తనభర్త కావలెనని తపముచేయు సందర్భమున శరదృతువును, వసంతగ్రీష్మవర్షర్తువులను వర్ణించెను. ఆముక్తమందుకూడ గ్రీష్మర్తువు, వర్ష శర ద్వసంతర్తువులే వర్ణించబడినవి. అయితే కృష్ణదేవరాయలు మత్స్యధ్వజుడు భోగిని కడకు పోవుటకు మునుపే గ్రీష్మమును వర్ణించినాడు. ఆ గ్రీష్మర్తువునందే తెప్పో త్సవము వచ్చుటయు పరదేశి విప్రులు వచ్చుటయు సమంజసమయినది. యామునా చార్యుని దిగ్విజయ యాత్రసందర్భమున శరద్వర్షర్తువులను వర్ణించెను. గోదాదేవి విరహసందర్భమున వసంతమును వర్ణించెను. పాండురంగ మాహాత్మ్యమందు గ్రీష్మర్తువు నాల్గయిదు పద్యములందు మాత్రమే వర్ణింపబడినది. కృష్ణరాయల గ్రీష్మవర్ణన 30 పద్యములవరకు పెరిగినది.

కృష్ణరాయల గ్రీష్మవర్ణనలో మొదటి పద్య మీ విధముగా నున్నది.

సీ॥ నిర్ఝర ప్రబలవేణిక లింక జట్రాల
బేరిన ప్రాచి పెన్నీట లెగసె
నెఱుకులు పడియ నీరివుర గువ్వలబట్ట
బోయునీ రాడాడ బొలము నెఱసె
సురగాలి దవదగ్ధ తరు పర్ణతతిరేప
బావురాలని దేగ పదుపు దూఱె
నిద్రితద్రుచ్ఛాయ నిలువక జరుగ వెం
బడిన యధ్వగపంక్తి పొరలు వెట్టె
క్షేత్రపాలున కుదికిన చీరలాఱు
చాకిరేవుల గములయ్యె సకల దిశలు
దెలుపులుగ దోచు నెండమావుల బయళ్ళు
గందె నివి యెండ నన దిఙ్ముఖములు రాజె.

అనగా గ్రీష్మర్తువు ప్రవేశింపగానే సెలయేఱుల ప్రవాహము లింకెనుగాన జట్రాతియందు చేరియున్న ప్రాచిపెన్నీట లెగసెను. పడియలయందు నీరింకియున్నందున బిట్టల బట్టుటకై యెఱుకవాండ్రచేత బోయంబడిన యుదకము పొలములయందు గనుపించును. సుడిగాడ్పు లెండుటాకు లెగురునటుల వీచుచుండ దేగలుచూచి పావురములను ఎదురు దూఱుచుండును. త్రోవనడుచువారు వేడిమిచేత వృక్షములక్రింద బరుండి నిద్రించుచుండ నా వృక్షములనీడ ప్రొద్దుతో గూడ జరుగునపుడు వెంటనే వారును పొర్లాడుదురు. నలుదిక్కులు నెండమావులు వ్యాపించియుండునవి భైరవుడు దిగంబరుడు గనుక నతని కుదికి యారవేయించిన చీరలో యనునటుల దెల్లనై యుండును. ఇందు చక్కని స్వభావోక్తి కలదు. ఈగ్రీష్మర్తువుకు సంబంధించిన 'తరుణుల్ డల్లియొఱ స్గచంబులుపన్' అను పద్యము నితఃపూర్వమే యుదాహరించి యందలి విశిష్టతను పేర్కొనియున్నాడను. ఈ గ్రీష్మర్తువుకు సంబంధించిన మరొక శార్దూలము నుదహరించి యందలి విశిష్టతను తెల్పెదను.

శా॥ తారుణ్యాతిగ చూతనూత్నఫలయుక్తైలాభిఘారస్వన
ద్ధారాధూపిత శుష్యదంబుహృతమాత్స్యచ్ఛేదపాకోద్గతో
ద్గారంపుంగన రార్చుభోగులకు సంధ్యావేళలం గేళికాం
తారాభ్యంతర వాలుకాస్థిత హిమాంత ర్నారికేళాంబువుల్.

ఇందును చక్కని స్వభావోక్తి కలదు. అనగా యా వేసవియందు భోగులు మధ్యాహ్నమున దోరమామిడికాయల ముక్కలతో చుంయ్యని శబ్దాయమానమైన నూనెపోత తాలింపువైచి నీటితడి పోగానే తీసిన చేపబ్రద్దల యిగురుతో భుజించిరి. సాయంకాల మాభోజనము జీర్ణమగునప్పటి కాచేపముక్కల కనరుద్రేన్పులు వచ్చుచుండెనవి. అవి యిసుకలో పెట్టియుండి యప్పుడు పగిల్చిన టెంకాయల లోని చల్లనినీళ్ళను త్రాగుటచే శాంతించినవి. ఇట్టివర్ణన లింకెన్నియో కలవు.

రామకృష్ణుడు గ్రీష్మర్తువర్ణన సందర్భమున శ్లేషార్థగర్భితంబైన నొక సుదీర్ఘ వచనంబొండు రచించె.

వ॥ అప్పు డటు గభస్తి హస్తియుంబోలె బద్మినీ ప్రమోదావహాకర ప్రచారుండై, దవదహనంబు కురుమహీవిభుండునుంబోలె స్వగోత్ర నిర్భేదన నిపుణంబై, మల్లియలపెల్లు కన్నడ కవితావితానంబునుంబోలె షట్పదవిలాస భాసురంబై, సరసులు సరసులుంబోలె వనితావిహార మహనీయంబులై రహివహించె. అంచలంచల జంచలాచపలంబులును, విపులంబులునగు పడమటి పవనంబులు పౌరుగుల యుపవనంబులం జెరుగు కరుపలివారువంబులకు గమనాధ్యయన గురువులుంబోలె వడిమెఱసి సుడిసి, యసితయగు వసుధగాడి, నెఱియలు వాఱినం దదుదర విస్ఫురితాంత్రలతామతల్లికలపెల్లునం బాతాళవ్యాళంబులు గానవచ్చె. పెచ్చుపెరుగు ఖరకరనిపాతంబుల నాతప్తంబులగు నెలవులం దొరగి పరగు వెలది వెన్నెలల నీర్వట్టు వెన్నెలపిట్టలు పొట్టలనిండ నాస్వాదించె. రక్కెన జవ్వనులు మవ్వంపుమచ్చికల నిచ్చట గ్రీడింప నా ప్రీవావతుల యతులనాభీ వివరంబుల నింకినవియుంబోలె నదుల యుదకంబు లింకె. విచికిల మాలికాలంకృత మౌళిభాగులును, నారంజిత ధాతుపటపరభాగులు నగు భోగులబాగున గ్రుడ్డు మోచు నెఱచీమల చాలు చెమ్మయిమ్ములం గ్రుమ్మరందొడంగె, వ్యావహారిక సత్యంబు ప్రకటించు ప్రపంచంబుచేత వంచితులగు నెఱుకలేని కటుటులకరణి హరిణంబులు మరీచికావీచికాపాన వివశంబులై దిశల పరిభ్రమించె, ముంచుకొను సంపెంగల సౌరభంబునకుం దాళని రోలంబులలీల వియోగిలోకంబులు విషయ విముఖంబులయ్యె. ఇసుకమెదవు నెలవులంబన్నిన పసుపుటాకుం జప్పరంబులలోనం గుప్పళించిన కప్పురంబుతోడి కురువేరు పరిమళంబులును, జాజి విరుల వలపును, వట్టివేళ్ళ వాసనలుం గల ప్రపాపాలికాపఘన వర్జితంబులగు కలశోదకంబులు గ్రోలి పేదదీఱి తెరువరులు తాలవృంతానిలంబుల బలుపుకొలిపి మున్ను పరిక్షీణంబులగు ప్రాణపవనంబులం బోసరింపంజేసిరి. ఇటువంటి

శ్లేషార్థ గర్భితమైన రచన భట్టబాణుని కాదంబరిలోను హర్షచరిత్రలోను కాన నగును. కృష్ణరాయల విశిష్టత వేఱు. ఆతడు దేశమంతయు పర్యటించి తత్ఫలితముగ నా భావ విభూతుల నాకళించుకొని వాటిని గ్రంథస్థము గావించినాడు. మండు వేసగిలో మామిడి ముక్కలను చేపముక్కలను తిని వచ్చిన త్రేన్పులను పోగొట్టుటకు టెంకాయ నీరు త్రాగుట యను స్వభావోక్తి యారాజసార్వభౌమునికి తటస్థించి యుండవలయును. తెనాలి రామకృష్ణుని వచనములో శైలీ విశేషము గన్పించును. కాని యిది ఋతువర్ణన యగుటవల్ల దాని కిది తారతమ్యము కాజాలదు. కృష్ణరాయలుకూడ మిగిలిన పద్యములం దెన్నియో విశేషముల వివరించినాడు. రామకృష్ణుడు ప్రౌఢపదబంధనములో దిట్ట.

ఇంక వర్షర్తు వర్ణన పరిశీలింతము. తెనాలి రామకృష్ణుడు పాండురంగ మాహాత్మ్యమునందు వర్షర్తువును వర్ణించుచు నొక సీసమును నొక మత్తేభమును విసరెను.

మ. అద్రి గ్రావము లుర్వి రాల బలి ఘోషాడంబరంబుల్ వియో
గి ద్రోహంబొనరింప వారినిధి కెంగేలంటగా వాహినుల్
భద్రేభప్రతిమానమూర్తి యగుచున్ బాథోధరశ్రేణి కుం
భద్రోణంబుల గ్రుమ్మరించె విమలాంభఃపూర ధారావళిన్.

సీ. పెరిగి సూచీముఖాభేద్యంబులగు నంధ
కార ధారాచ్ఛటల్ గాఱుకొనిన
గర్జజ్వరాపాదకంబులై దంభోళి
గంభీర రవములు గడలుకొనిన
ముజ్జగంబుల ముచ్చుమునిగింపగా జాలు
నీదగాడ్పులును బిట్టెదురుకొనిన
దుర్దమ కర్దమ స్తోమ సంఛన్న భూ
ముల సోనవానలు ముంచుకొనిన
జెదర కఱకాల గన్నువచ్చిన విధాన
నాథ సంకేతములకేగు నడికిరేలు
కాయసంభవ బాధాసహాయమగుచు
స్వైరిణీకోటి నిర్భయ స్వైరధాటి.

మొదటి పద్యమున వర్షాకాలాడంబరము చక్కగా వర్ణింపబడినది. రెండవ పద్యములో వానగా ముసురుగా మారినను, పిడుగులశబ్దము కర్ణకఠోరమై యున్నను స్వైరిణులు నిర్భయముగా తాము మొదలే సంకేతము చేసికొన్నస్థలముల కరిగి తమతమ ప్రియులను కలిసికొనుచుండిరని వర్ణింపబడినది. అంతేగాక వర్షము నిరంతర ధారాపాతముగా నుండుటచే దుర్దినముకూడ యేర్పడినదని ముందుపద్యములలో వర్ణించినాడు. కృష్ణరాయలు ఋతువర్ణనము చాలు చాలను వరకు చేసినాడు. ఇక కృష్ణదేవరాడ్భూమీశానసుని వర్షర్తు వర్ణన పరిశీలింతము.

కృష్ణరాయలు వర్షాకాలారంభము చేయునప్పుడు సూర్యుడు కర్కటరాశికి వచ్చెనని మొదట నుడివినాడు. సూర్యుడు కర్కటరాశికి వచ్చుట వర్షాకాలారంభ మును సూచించును. ఇందుమూలముగా కృష్ణరాయలకు జ్యోతిషమందు ప్రవేశము గలదని కూడ తెలియవచ్చును. ఇట్టి ప్రతిభావిశేషములను వేఱొండధ్యాయమున పేర్కొందును.

వనధిగమనజ గర్భార్క జనితఘృణులు
మఱి ప్రసూతికి నతని ధామంబు జేరె
*ఘనత జొచ్చిన యిండ్లను దనయలుండి*
*కాన్పునకు బుట్టిని ల్చేరు క్రమముగనమె॥*

అనగా సముద్రోదకము సూర్యకిరణముల కావిరియై యెగసి మింటనుండి వర్షము గురియుచున్నదని భావము. దీనినొక లోకోక్తిచే సమర్థించినాడు. లోక ములో స్త్రీలు గౌరవముగా కాపురముచేసి గర్భిణులై కన్నవారియింటికి కాన్పుకు వచ్చుట ప్రసిద్ధము. ఈ లోకోక్తి వాడుటవల్ల యీ పద్యమున యర్థాంతరన్యా సాలంకారము. కృష్ణరాయల కవితలో కాళిదాసు ఛాయలు కొన్ని కన్పించును.

"గర్భాధానక్షణ పరిచయా న్నూన మాబద్ధమాలాః
సేవిష్యన్తే నయన సుభగం ఖే భవన్తం బలాకాః"

యను మేఘసందేశములోని శ్లోక భావమును కృష్ణరాయలు యథేచ్ఛగా "అల జలరాశినీట" యను పద్యమందు వాడుకొనినాడు. నెమళ్ళ కాహారము సర్పములు. ఆసర్పములు మెఱపులకు భయపడి బొఱియలందు దాగినవి. అందు చేత భుజంగభుగ్నిచయము నాట్యమాడుట మానలేదు. ఏలనన నతి సంతోష కారణమున వాటికాహారముపై చింతయే కలుగలేదు. నెమళ్ళు మేఘోదయము కాగానే యాడుట స్వతస్సిద్ధముకదా. ఈ ఋతువర్ణనలో పల్లీయులు తమ భర్తలు పనిచేయు పొలముల కరిగి వారి కంబళ్ళు గొంపోయి వారు భుజించువర కచ్చటనే

యుండి వారిచే నొకమారు స్తనమర్దన సుఖముపొంది యింటికి వత్తురని తెలిపినాడు. కాపుపడుచు లంబళ్లు గొంపోవుట పల్లెటూళ్ళలో స్వతస్సిద్ధము. ఇంత చిన్న చిన్న విశేషములను కూడ కృష్ణరాయలు విడువక వర్ణించినాడు. రామలింగని ఋతువర్ణనలో యిటువంటివి కనపడవు. పల్లీయుల విశేషములేగాక రాజుల కృత్యములను కూడ "మణియష్టి గేలిబర్హిణషడ్జసుధవీను" యను పద్యములో కూడ వర్ణించినాడు. "గురుగుంజెంచలి" యను మత్తేభమందు రెడ్డిరాజుల స్వతంత్ర జీవనమునుగూడ వర్ణించినాడు. తెనాలి రామకృష్ణుడు శరద్వర్ణనము శృంగారముతో ప్రారంభించినాడు.

తత్తాదృజ్మదజృంభమాణ తరుణీ తారుణ్య సంపద్దశా
ప్రోత్తుంగ స్తన నిస్తలోష్మ కవచంబుల్ పూనగా నోచుటఁ
జిత్తానందము కల్గు భోగులకు నిష్ప్రింశోగ్రసంపాతమై
యుత్తాలంబగు సీతుకందువ కరం బుద్వేగ మొందింపగఁ.

అనగా యింతకుపూర్వము స్త్రీలు చలిలేనందున కంచుకములు ధరింపక పోగా వారి ప్రియులు యువతుల పయోధరములను కౌగిలించుకొని యెక్కువ యానందమును పొందుచుండిరి. కాని యిప్పుడు శీతాకాలమగుటవల్ల చలిచే యువతులు వెచ్చని అవికలు ధరింపగా యువకులకు ప్రత్యక్షముగా వారి నగ్న స్తనాలింగన భాగ్యము లభింపలేదు. ఈ పద్య మొక్కటియే శరద్వర్ణనకు సంబంధించినదిగా చెప్పుకోదగినది.

కృష్ణరాయలు మొదటి పద్యమునందే శరదాగమము సూచించినాడు. గంధ సింధురములు నదీ తటములతో పోరాడినవి. ఈ మత్తేభముల పోరాటములు రాజులకు దిగ్విజయయాత్ర కిదే సమయమనికూడ సూచన లిచ్చునట్లుండెను. శరత్కాలపు వెన్నెల ప్రశస్తతరమైనది. మేఘావృతము కాకుండ స్వచ్ఛముగా నుండును. ఆ వెన్నెలను కృష్ణరాయలు చక్కగా వర్ణించినాడు. ఈ వెన్నెల విశిష్టతను కాళిదాసు మేఘసందేశములో, "నిర్వేక్ష్యావః పరిణతశర చ్చంద్రికాసు క్షపాసు" యని నుడివినాడు. శుభ్రాభ్రముల గతిని కృష్ణరాయ లీపద్యములో చక్కగా వర్ణించినాడు.

శా. అప్పు ల్వారిధిచేత బుచ్చికొని, కార్యంబైన, మున్గొన్న య
య్యప్పు ల్దే చనియు న్సవృద్ధికముగా నవ్వార్ధికే తీర్పగా
నప్పుణ్యాతి విశుద్ధజీవులు నిజాచ్ఛాంగంబులం దోచున
ట్లొప్పారె న్మశిబింబగర్జితముల్లై ద్యోచారి శుభ్రాభ్రముల్.

అనగా నీరే ప్రాణముగాగల మేఘములు సముద్రునివలన నీళ్ళను రుణముగా గైకొని సముద్రమునకు దూరముగా మిన్ననెడి దేశాంతరమేగి పుచ్చుకొన్న దానికి హెచ్చుగా యానీటితో రుణము తీర్చినవారై, తత్కారణంబున విశుద్ధాత్ములై వెలుగొందుచున్నారో యనునట్లుగా. చంద్రబింబాధిష్ఠితములై శుభ్రాభ్రములు మింటం జరించుచుండెను. శరత్కాలములో యింకను చెఱకుదోటల యందును, వరిపొలములందుండు కావలి పడంతులను వారి హావ భావ విలాసములనుకూడ "శ్రీలు దారొట నాశ్రిత పద్మకర్ణికా" యను సీసమందు వర్ణించినాడు. శరత్కాలమం దింకను కనిపించు విచిత్రములను కృష్ణరాజేంద్రుడు వర్ణించినాడు.

కృష్ణరాయల వసంతవర్ణన తదితర ఋతువర్ణనల కన్న మించినది. వసంత వర్ణన 70 పద్యములవరకు పెరిగినది. రామకృష్ణుడు వసంతర్తువును 2 పద్యములలో వర్ణించెను.

క. అంత వసంతము జిత హే
మంతము దీపించె మత్త మధుకర కలభా
క్రాంత మురు పుష్పరస వే
శంతము సకలద్రుముల బిసాళము చెలగన్.

ఉ. కెంజిగురాకు డాలు దులకించిన ధాతు పటంబుచాయ జే
యం జదుకెక్క పుప్పొడుల నంటిన తేటులు భూతి భృఙ్జటా
పుంజము బోలగా విపిన భూములలో మధులక్ష్మి పొల్చె నీ
లాంజనవర్ణు గోరి తప మర్లొనరించు మృగాక్షి కైవడిన్.

మొదటి పద్యమందు, మదించిన పుష్పంధ యాక్రమిత శాఖలచే, సకల వృక్షములకు నూత్న వికాసము కలుగునట్లుగా పూవుదేనియలతో, హేమంతమును జయించుచు వసంత మరుదెంచె నని చెప్పబడినది.

రెండవ పద్యమందు, వసంతశోభకు కెంజిగురాకు కాంతి కావి వస్త్రము వలెను, పుప్పొడి యంటిన తుమ్మెదలు విభూతి నలదికొన్న జడలవలె నుండుటవల్ల యా వసంతలక్ష్మి తపస్సు చేయుచున్న రాధతో బోలుచున్నదని కలదు. రామకృష్ణుడు విరివిగా ఋతువర్ణన చేయుట కతని కవకాశము లభించలేదు. కృష్ణరాయలు వసంతర్తువు వర్ణనలో చిగురుటాకులను, తుమ్మెద బారులను. త్రిమ్మరుచున్న తేంట్లను విశేషముగా వర్ణించినాడు. ఈ వసంతర్తువు కూడ

గోదాదేవి విరహమును వర్ణించుటకుగాను చొప్పింపబడినది. మలయ మారుతము లను రెండు పద్యములందు వర్ణించినాడు.

చ. చిలువ సుధారసాధరల చెల్వవు బుక్కిటి తావి దీయనై
వలపులనందు తత్ప్రియుల వక్త్రవిషజ్వలనోష్మ నొత్తునై
వెలువడి తద్గుణ ద్వితయ వేధజుమీయన ప్రాను పట్టుటల్
తలిరులు పుట్టుటల్ గలుగ దార్కొనె జందనశైల వాతముల్.

మ. మదనస్యందనతా స్వవృత్తి దెలిపెం బాటీర భూభృద్వల
న్మృదువాతం బతిపక్వ పాదపలతా వృంతావళీ మూల రం
ధ్ర దళత్పంకజ కర్ణికాగణ హరిద్రా భంగ భాభాసుర
చ్ఛదన చ్ఛద్మ వివర్తికాంచన కనచ్చక్రచ్ఛటా ఛీత్కృతిన్.

మొదటి పద్యమందు చందనశైల వాయువులు వీవ మొదలిడగానే చెట్లముం దున్న యాకులు రాలిపోవుటచే వట్టి మోడు లిగిర్చి సొంపొందుట యెట్లుండెననగా నా వాతపరంపర చందనశైల మందలి చందన వృక్షములయందున్న యాడు పాముల యమృతరసముల మోవినుండి వాని పుక్కిళ్ళ పరిమళముచేత మధురత్వ మొంది యా పరిమళమును తమ ప్రియుల పుక్కిటిదగుటచేత తమితోనానిన వాని యనుంగు మగలయిన పాములనోటి విషజ్వాలలచేత కారమై, యీ రెండు గుణము లా చెట్లకు సోకుటచే యా భూరుహములందు పూర్వోక్తములయిన యాకులు రాలుటయు చిగుర్చుటయు కలిగెనని భావము. ఈ భావమునే రెండవ పద్యమందు విస్తరించినాడు. చందన శైలమునుండి వీతెంచుచున్న మందమారుతము చెట్లనుండియు తీగలనుండియు తమ తొడిమల గండ్లనుండి యూడి, తామర దుద్దుల కాంతితోను, పసుపుగొమ్మును విఱిచిన విఱుపులో మెరసెడి కాంతితో, ప్రకాశించుచున్న పండుటాకులనెడి బంగారపు బండిచక్రములే గిఱగిఱ సుడియుచుం జేయుచున్న ఛీత్కార శబ్దముచేత, తాను మదనునికి రథమయిన తన వ్యాపారము చాటుచున్నట్లుండెను. వసంతమును వర్ణించుచు కృష్ణరాయ లెన్నియో సీసములు రచించెను. అందొక సీసమును మాత్రమే యుదాహరించెదను.

సీ. శైత్యపాండిమలు దుషారాంతమునజేరె
నిరులు కొన్దార్రిష పందిరుల విరుల
వలయగానము లయుక్తల కార్శ్యమునజేరె
మలయంపుగమ్మ వీవలుల నలుల

సౌరభోల్లాసము ల్ద్రాతి గ్రుంగగజేసె
నలరారు కొదమ క్రోవులను నెలను
స్ఫుటజటా పుస్కరంబులు ప్రతిచ్యుతిజేసె
నందన ప్లక్షసంతతుల వృతుల
స్వభృత పరభృత వినుత రసాల పరిష
దహరహః క్లుప్త బహురహః ప్రహర విహర
మాణ మానవతీ పరిమ్లానిమాని
వారి వారిజ వనగంధవాహమొలసె.

వసంతమున మంచు తగ్గినది, దానివలననే చల్లగా ద్రాక్షపందిళ్ల జీబులును, వానివలెనే తెల్లగా పువ్వులును మెండుకొన్నవి. విరహులకు కార్శ్య కారణమున చేతి గాజు లూడిపోయినవి. వారి పాటలు నిలిచిపోయినవి. మలయమాతరిశ్వని వారి వలయములవంటి సుళ్లతో వీవం దొడగినవి. జాజి పరిమళింపక పుష్పింపక యణగి పోయినది. దానికి బదులు గున్నగోరంటలు పూచి పరిమళించుచుండినవి. దాని వికాసమునకు బదులుగా చంద్రుని వికాసము సొంపారుచుండెను. యతులు కామాతురులై వ్రతమును కాపాడుకోలేక జటాబంధనమును, వేణుదండముల నుజ్జగించిరి. వారి జడలకు మారుగా నుద్యానవనములోని జువ్విచెట్ల కూడలు దిగినవి. వారి దండములకు ప్రత్యామ్నాయముగా కంచెలయందు వెదుళ్లు కట్టబడినవి. రసాల వృక్షములు మానవతులు పెంచిన కోకిలలచేత శోభిల్లుచుండినవి. ఆ వృక్షముల నడుమ యా మానవతులు పెక్కు జాముల కాలమును రహఃక్రీడలయందు గడపి యలయుచుండిరి. వారి యలయికను తామర కొలంకుల తావిగాలి తీర్చుచుండెడిది. ఈ సీసముతో సరిపోవు సీసమొండు రామరాజ భూషణుడు వసంతమును గూర్చి రచించినాడు.

సీ. లలనాజనాపాంగ వలనావస దనంగ
తుల నాభికాభంగ దోఃప్రసంగ
మలసానిల విలోల దళసాసవరసాల
ఫలసాదర శుకాలపన విశాల
మలినీగరుదనీక మలినీకృత ధునీక
మలినీసుఖిత కోకకులవధూక

మతికాంత సలతాంత లతికాంతర నితాంత
రతికాంత రణతాంత సుతనుకాంత
మకృత కామోదకురవకావికల వకుల
ముకుల సకలవనాంత ప్రమోదచలిత
చలిత కలకంఠ కులకంఠ కాకలీవి
భాసురము వొల్చు మధుమాస వాసరంబు.

వసుచరిత్రము (ఆ 1. పద్యము 126)

మలయానిలమును గూర్చి శ్రీనాథు డొక శార్దూలము రచించెను. అతడు మలయానిలమును దక్షిణానిల మనెను.

శా. కాలాంతఃపుర కామినీ కుచతటీ కస్తూరికా సౌరభ
శ్రీలుంటాకము చందనాచలతట శ్రీఖండ సంవేష్టిత
వ్యాలస్ఫారఫణీ కఠోరవిషనిశ్వాసాగ్ని పాణింధమం
బేలా నాపయి దక్షిణానిలము పక్షీ సేయు దాక్షిణ్యమున్.

(2-37)

## వర్ణనాబాహుళ్యము

కృష్ణదేవరాయలు వర్ణనయందు భట్టబాణుని, శ్రీనాథుని సరిపోలును. ప్రబంధములు కథావస్తువుపైగాక భావనాపటిమకు ప్రధానములు. ఆముక్తమందలి వర్ణనలు నైషదానర్ఘరాఘవములతో కూడ సరిపోలును. అందులకే కృష్ణదేవ రాయలకు సర్వతోముఖ మగు పాండిత్య ప్రకర్షలు కరతలామలకమని ప్రతీతి.

చ. మలయపు గాలి వేలు వనమాలి విమానపతాక ఘల్లుమం
చులియ బసిండి మువ్వగమి నొక్కొకమాటు గదల్ప నుల్కి మి
న్నులము తదీయ హేమ వరణాంచల చంపక శాఖలందు ప
క్షులు రొదసేయ వేగెనని కూడుదు రల్కలు దీరి దంపతుల్.

ఇందు రాత్రియంతయు కలహించిన సతీపతు లల్కలుదీరి నాలవయామున కూడుదురని చెప్పబడియున్నది. సామాన్యముగ కోడికూత నాలవయా మయినదని సూచన. ఇందు కోవెలలో ధ్వజస్తంభముగంట మ్రోగగా పక్షులు రొదచేసినవి. పక్షులు రొదసేయుట కోడికూత తరువాతగాని జరుగదు. కోడికూత పద్య మొకటి పింగళి సూరనార్యుని ప్రభావతీప్రద్యుమ్న మందు కన్పించును.

మ. సమయాభిజ్ఞత గుక్కుటంబు "వివిధ చ్ఛందస్త్రియామంతు రం
తిమయామో భగవాన్నృషిః కుసుమధన్వీ దేవతా మానినీ
రమణాయాం వినియోగ" యంచు నిది యారంభించె గాబోలు నా
నమరెం దద్ధ్వని మానినుల్ రతికి దామై నాథులం బైకొనన్.
(ప్రభావతీ ప్రద్యుమ్నము - అ. 5 - పద్య 6.)

స్త్రీ వర్ణనములోకూడ కృష్ణరాయలు యే శృంగారకవికిని తీసిపోకుండునట్లు గోదాదేవిని వర్ణించినాడు.

శా. నాసాచంపకత న్సుగంధ మచటన్ రా భృంగముల్ గ్రోల సం
త్రాసంబందియు బల్కుచో నలము వక్త్రించేల నా నేల యం
దే సౌరభ్యము లేదు కుందములుగావే దంతముల్గానినా
డాసక్తిన్ బ్రతిబింబ దంభమున నేలా వ్రాలఁ దజ్జాతికిన్.

కృష్ణరాయలు తన గ్రంథమందు పరదేశి వైష్ణవులను, భాగవతులను, పణ్య యువతులను, వైదేశికుని, పుష్పలావికలను, రాజాస్థానములను, భక్తులను, రెడ్ల వైభవమును, పల్లెటూరి ప్రజల జీవితమును, గ్రీష్మ వర్ష శరద్వసంతర్తువులను వదలక వర్ణించినాడు. ఈ వర్ణనల నాయా ప్రకరణములలో వేత్వేఱుగా ముచ్చటించి యున్నాడను. అందు మిగిలినవి ఇం దుదాహరింతును.

పణ్యా యువతులు :

సీ. ముడివిప్ప నడుగు దమ్ములనె వ్రాలుట దేంట్ల
నెరికురులగుట సందియము గలదె
కన నెంతవాని లో గొనుట నాదర్శంబు
నెమ్మొగం బగుట సందియము గలదె
ఇఱిగొను మింటిపై మెరయుట జక్రద్వి
తయి చన్నులగుట సందియము గలదె
పొలసు దొర్లగ జూచు కలికిచూపుల మీలు
దెలిగన్నులగుట సందియము గలదె
పొలసిననె తావి బుగులుకో నలరు దీగ
తిన్నని శరీరమగుట సందియము గలదె
యనగ జెలువొంది సురత వైయాత్యనిధులు
పణ్యయువతులు పొలుతు రప్పట్టణమున.

రెడ్ల వైభవము :

మ. గురుగుం జెంచలి దుమ్మి లేదగిరిసాకుం దింద్రిణీపల్ల వో
త్కరముం గూడ బొరంటి నూనియలతో గట్టావికుట్టారు గో
గిరముల్ మెక్కి తమి నృసుల్ పొలమువో గ్రేపుల్మెయుల్నాక మే
కెరువున్ గుంపటి మంచమెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్.

త్రిమ్మరుమన్న తేటిపిండు వర్ణనము :

సీ. మరుదూఢ మలయాహి గరధూమ్య లనుగళ
నన్మనసిజ రథపదాంజన కళికలు
త్రాసధావచ్ఛిశిరత్యక్త బాష్పముల్
పిక పంచమ స్వరోద్భేద వీణ
లబ్ధాగమన్మరందాసారజంబువుల్
హిందోళ సాక్షిన్ముకుందరోచు
లభిసారి కాంశుకోద్యన్నీల గుళికలు
జాత్యనుల్లసనాత్తశాపతతులు.
చైత్ర సంజీవ నౌషధీజాత చేత
నాత్మజని హేతు తరుపునర్యాయి యువతి
కరవిధూత హసంతికేంగాలచయము
లళుల పంక్తులు వనుల నట్టాడ దొడగె.

చిగురాకు వర్ణన :

సీ. క్ష్మావశారక్త రాంకవ మరణ్యాని మ
ధూదితారుణిమవల్ల్యురగ రసని
కోద్గతి తరుగరుత్మద్గరు ద్గణ ముద్బి
దాహార్య జీమూత రోహితంబు
నవమిళింద ప్రాహుణక నిమంత్రణ శోభ
నాక్షతప్రతతివాయస విభక్త
పరభృతౌఘ ప్రాప్త పత్త్రిక మాలతీ
త్రాసామయావహార్ద్రి క్షతజము

ప్రమదవన వనదేవతా సముదయాంగ
రాగ మినజ హరిజగత్ప్రాణ శాణ
కషణ దళిత దళాంత సంక్రాంత కాంతి
ఘనమణి శలాక చిగురాకు గలయ మొలిచె.

బ్రహ్మరాక్షసుని వర్ణన :

సీ. మృతమర్త్యు రెంటాన నిడ్డజాలక నెత్రు
రంజిల్లు పెనుపొట్ట ముంజివాని
బల్ల చీమల వక్ర భల్లాతకియు బోలె
నెత్తు దుప్పటి నొప్పు కట్టెవాని
వ్యత్యస్త హస్తిమస్తాభ బాయగు గడ్డ
మును దంష్ట్రికలు బొల్చుమొగమువాని
గడుదుర్ల నిడు త్రుట్టెగతి జోగలో బాండు
రతమించు కపిల కూర్చంబువాని
నెఱకు దెఱవరి గన శాఖ లెక్క జాఱు
ప్రేవు జందెంబు గసరిపై బెట్టువాని
వ్రేలుడగు బొజ్జగల బూరగాలివాని
జెంబుతలవాని నవటుకచంబువాని.

సోమశర్మ వర్ణన :

సీ. స్నిగ్ధత్రిభాగ ముండిత శిరశ్శిఖతోడ
హిమధవళోపవీతములతోడ
బుణ్య షడ్వృత యోర్ధ్వ పుండ్రవల్లులతోడ
దులసికాబ్జస్రగావళులతోడ
గౌపీన కటిసూత్ర కాషాయ యుగితోడ
జలపూర్ణ శుభ కమండలువుతోడ
బాణిస్థ దివ్య ప్రబంధ సంపుటితోడ
నుత్తర వాక్పూర్వకోక్తితోడ

బసిడి జిగితోడ బ్రహ్మవర్చసము పొల్చు
భాగవత లక్ష్మితో ధూమ పటలినుండి
వెడలు శిఖిపోలె నమ్మేను వెడలి చూడ
జూడ వైష్ణవుడై నిల్చె సోమశర్మ.

ఈ పద్యము మనుచరిత్రలోని వియచ్చర ప్రవరుని సీసముతో సరిపోలుచున్నది.

సీ. అర్ధచంద్రుని తేట నవఘళించు లలాట
పట్టితీర్చిన గంగ మట్టితోడ
జెక్కుటద్దములందు జిగివెల్లువలు చిందు
రమణీయమణి కుండలములతోడ
బసిడివ్రాత చెఱంగు మిసిమిదోప జెలంగు
నరుణాంశుకోత్తరీయంబుతోడ
సరిలేని రాపట్టు జాళువామొలకట్టు
బెడగారు నీర్కావి పింజెతోడ
ధవళ ధవళములగు జన్నిదములతోడ
గాశికాముద్ర యిడిన యుంగరముతోడ
శాంతరసమొల్కు బ్రహ్మ తేజంబుతోడ
బ్రవరుడయ్యె వియచ్చర ప్రవరు డపుడు.

ఇట్లింకెన్నియో తారతమ్యములు నిరూపింప వచ్చునుకాని గ్రంథ విస్తర భీతిచే విరమించుచున్నాను.

## రాయల ప్రకృతి వర్ణన విశిష్టత

రాయలు ప్రకృతి వర్ణనమందుకూడ దిట్ట. ఈతని కావ్యము స్వతంత్రమై యుండుటవలన (అనగా యనువాదము కాకుండినందున) యే యే వర్ణనలు వ్రాయ దలంచినను నన్నింటి నేమఱక తన గ్రంథమందు జొప్పించినాడు. ఏలనన నాంధ్రీకరణ మయిన శ్రీనాథుని శృంగార నైషధ మహాకావ్యమం దిట్టివి గానరావు. అది భట్టహర్షునికి సమ యుజ్జీ. రాయల ప్రకృతి వర్ణన సమంజసముగానున్నది. అదియు నుంగాక యతడు బహుళముగా దేశాటనము గావించి యందందు గాన్పించిన భావ విభూతుల నాకళించుకొని వాటిని గ్రంథస్థము చేసినాడు. శ్రీ రాయలనాటి పరిస్థితులు చరిత్రను తెలుసుకొనుటకు విష్ణుచిత్తీయ మగ్రగణ్యము. ఈతడు ప్రతిచిన్న విషయ

మనుస్థూలముగాను, సూక్ష్మముగాను వివరించగలడు. కృష్ణరాయలకు వస్తువర్ణనాభి నివేశ మెక్కువ. కొందరి మతమున ఈ వర్ణనాబాహుళ్య మాముక్తమాల్యద ప్రధాన కథా గమనమున కడ్డువచ్చినదని తలంతురు. ప్రౌఢ ప్రబంధము వ్రాయునపుడు అందును నీ రాజసాంద్రు డష్టదిగ్గజములను పోషించుచు వారికి మిన్నగా నుండ వలెనని తలంచి విష్ణుచిత్తీయము నింత ప్రౌఢతరముగా నొనరించెనని వేఱుగాచెప్ప వలెనా ? ఆతని యాస్థానమందు ముద్దుపల్కు బల్కు ముక్కు తిమ్మన, యల్లిక జిగి బిగికి ప్రసిద్ధుడైన యాంధ్రకవితా పితామహుడు, పద గుంభనంబు కుదయంబస్తన గంబు వరకు శారదరూపముగా పేరొందిన తెనాలి రామకృష్ణుడు, కల్పిత కథాకావ్య రచనాకోవిదుడు పింగళి సూరన, శ్లేషకవిత్వమం దందెవేసినవాడు రామరాజ భూషణుడు మొదలగువార లుండగా వీరందఱిని మించుట కెంత స్పర్థకావలెను ? 'స్పర్ధయావర్ధతే విద్యా, యను నానుడి జగద్విదితమే. ప్రకృతివర్ణన మనగా కేవల సూర్యోదయ సూర్యాస్తమయ వర్ణనములు కావు. ప్రకృతి యనగా మానవ స్వభావ పరిశీలన యనికూడ వ్యాఖ్యానించవలయును. షేక్సుపియరు మహాకవి Poetry is a reflection of nature అన్నాడు. అనగా కవిత్వము ప్రకృతికి ప్రతిబింబ మని సిద్ధాంతము. అయితే ప్రకృతి, బాహ్య ప్రకృతియా, యంతరింద్రియ ప్రకృతియా యను వాదోపవాదము వచ్చును. కావ్యము కేవల ప్రకృతి ప్రతిబింబమే కాదు. ఏలన విశాలమైన ప్రకృతి రామణీయకమును జూచి మన మానందించ వచ్చును. కాని ప్రకృతి ప్రతిబింబమును మాత్రమే చూచి యేల సంతుష్టి నొంద వలెను ? హృదయాహ్లాదకరంబులగు మనోహర ప్రకృతి దృశ్యముల చూచి తన్మయత్వము నందుదుమేకాని ప్రకృతి ప్రతిబింబమును చూచినంత నానందింప జాలము. ప్రకృతిలోని దృశ్యములనే కవీంద్రుడు కళావంత మగునటుల తన కల్పనా చమత్కృతి జూపి జీవిత విమర్శనము చేయు సందర్భమున కేవల మైహిక జీవిత విమర్శనము మాత్రమే చేసి యూరకొనక లోక కల్యాణముకొఱకు విశ్వ శ్రేయస్సుకొఱకు పురోభివృద్ధి కారణమగు మార్గమును సూచించును. పాశ్చాత్య కవులు బాహ్య ప్రకృతినే వర్ణించినారు. కాని రాయల వర్ణనకు సంబంధించినంతవర కంతరింద్రియ ప్రకృతి యని మన మూహింపవలెను. గ్రీష్మ వర్ణన సందర్భమున ప్రాతఃకాలమున తోటలలో యేతము తొక్కువారు సంతోషముగా మిక్కిలి యుచ్చైస్స్వరమున పాడు పాటలను చక్కగా వర్ణించినాడు కవి. ఈ యేతము తొక్కుట వారికి దైనందిన కార్యక్రమ మైనను యా శారీరక శ్రమను మరచిపోవుట కీ పాట లెంతో యుపకరించినవి.

శా. ప్రాతర్వేళల నట్టి వెట్ట సొగసై పాటిల్లె గుంభోంభనో
ద్భూతాంబు ధ్వని వాద్యమై మరుదుధః పుంజీభవ త్పాటల
వ్రాతామ్రేడిత సిక్త భూసురభిశారామాంబుకుల్యా బహు
స్రోతస్పంధుల నంధు యంత్ర నతికృత్ప్రోద్గీత గేయౌఘముల్.

అనగా వేసవియందు ప్రాతఃకాలమున యేతము త్రొక్కువా రెగ్గెత్తి గేయము పాడుచుండగా యేతపు బానలు నీటిలో మునుగునట్టి శబ్దము మృదంగ వాదన ధ్వనివలె నొప్పుచుండ, ఘడవ కాలువల నడిమి ప్రదేశములందు పాటల వృక్షములనుండి రాలిన పుష్పములచేత పరిమళించుచు వాటి మకరందముచేత రెండుమూడు తడులు తడిసిన చలువనేలల యందుండి వినుట మనోహరముగా నుండెను. శ్రావ్యమగుగాన మట్లుండనిచ్చి యీ నీరు తోడునపుడు వారుచేయు పనులు నిశిత ప్రకృతి పరిశీలనమునగాని వ్యక్తముకావు. ప్రకృతిలోని సుందర మగు సన్నివేశములనే గైకొని గ్రంథస్థముచేయుట కవులకందఱికి పరిపాటి. కాని రాయలు తన గ్రంథమందు సుందరముగాలేని సన్నివేశములను గూడ వర్ణించి నాడు, ఇదే రాయల ప్రత్యేకత. విష్ణుచిత్తుడు పాండ్యుని దివాణమందు వైష్ణవ మత మొకటే మోక్షం బొలయించునని సోపపత్తికముగా నిరూపించిన పిదప పరాజయము పొందిన విద్వాంసుల మనస్తత్వమును కృష్ణరాయలు చక్కగా వర్ణించినాడు. జయాపజయములు దైవాధీనములని యెఱింగిన వారికి మానావ మానములు బాధింపవు. వాదమునకు వచ్చునపుడు తామే గెల్తుమని యాడంబర ముతో పల్లకీలో వచ్చిన విద్వాంసులు పరాజయ మందినందున రాజప్రాసాద ప్రాంగణము వదలువరకు తమ యనుచరులకుగాని హితులకుగాని మోముచూప నిచ్చగింపక తలలు వాల్చి యా ప్రాంతము దాటినపిదప తమ పల్లకిమ్రోయు బోయిల నెగ్గెత్తి పిలువ దొడగిరి. తనకు తెలిసినవారెవరైన వాదమేమాయెనని యొకవేళ ప్రశ్నించినచో నారాజున కా పాడు వైష్ణవమతముపై యెక్కువ మక్కువ; అందులకే యది గెల్చినదని సూక్ష్మముగా ప్రత్యుత్తరమిచ్చి వెడలు చుండిరి. ఇట్టిమనస్తత్వ పరిశీలనము కవిత్వమునకు ప్రధానమయినది. ఆ పద్యముల నిట నుదాహరించుచున్నాను.

సీ. సెలవులు నాకుచు వెలియరుంగులు సూడ
కరిగి పాదూవాహు నరయువారు
తమమ్రోలనుండు నందలముగానక దాటి
పేరెలుంగిడి బెస్త జీరువారు

నగరు వెల్వడుదాక డెగిపోయి మఱినిల్చి
తోడి విద్వాంసుల గూడువారు
నెదురైన తమవాని గృహకృత్య మడిగి వా
డనునవి తప్ప నూకొనెడివారు
'వాదమేమాయె ?' నన్న 'భూవరుని పక్ష
పాత మా దాసరికి గల్గి బ్రతికె' ననెడు
వారు; 'నౌలెండిటు విమర్శ దూరమైన
వాకిట వసించు నెవ్వ' డన్వారు నగుచు.

తే. కలసి యొక కొంతసేపు శృంగాటకముల
నగరి దెస జూచుచునె మంతనంబు లాడి
చనిరి విద్వాంసు లిండ్లక జ్జనవిభుండు
రూఢి కతని మహా గజారూఢు జేసి.

వర్షాకాలమున, భాద్రపద మాసమందు కాపు వెలదులు ముసురులో గుడిసెలో నున్న భర్తలవద్ద కంబళ్లు తీసుకొని పోవుట స్వతస్సిద్ధము. ఈ భావమును కృష్ణ రాయ లీ మత్తేభమందు చక్కగా వర్ణించినాడు.

మ. వనతు ల్వెల్వడి వానకై గుడిసె మోవన్ రాక తానాని యే
పనగా నిల్చిన జమ్మిగూడ బొల మంబళ్లోమ్రియుచుం బట్టి పె
న్ముసురందీగెడు కాపు గుబ్బెతల పెన్గుబ్బ ల్పునాస ల్వెలిం
బిసికిళ్లం బిసికిళ్ల హాలికుల కర్పించె న్నభస్యంబునన్.

కాపు పడుచులు తమ నాథుల కంబళ్లు తీసుకపోయి పొలములలోని గుడిసెలలో వారికి పెట్టుదురు. వారు తినుచున్నప్పు డచ్చటనే గుడిసె కడ్డముగా చక్కగా నిల్చుందురు. ఆ గుడిసెలలోపల వారి భర్తలు సజ్జలులోనగు పునాస పంటల కంకులు నలుపుచు గింజలను వేఱుచేయుచుందురు. ఆ చెలువలు రాగానే యా భర్తలు వారు తెచ్చిన యంబలి త్రాగి వారి స్తనములను మర్దించి పంపుదురు. ఇటులనే పాండ్యరాజు సతీమణిని చక్కగా వర్ణించినాడు. పాండ్యుడు శైవమత దురభిమాని. ఆతని మహిషి వైష్ణవమతస్థురాలు. ఆమెనియమములను, మత స్తత్వ మును కృష్ణరాయలు చక్కగా వర్ధించినాడు.

సీ. వింగడంబైనట్టి ఘుంగిట నెలకొన్న
బృందావనికి ముగ్గు పెట్టుదాన
దశమినా డేకభుక్తముచేసి యపలి నా
డోర్చి జాగరముతో నుండు నిట్టు
బారసి పోసీదు పైనిద్ర బాఱు ట
క్కాలు పాడు మత్పుణ్య కథల ద్రోయు
నేమంపు మూన్నాళ్ల కామింప దధినాథు
మఱునాడు కన్నును మనసు దనియ
నారజపువన్నె బ్రియుసెజ్జ కరుగు కూర్మి
నరుగుచో నాభిదుడిచి కప్పురపు నాభి
బెట్టు; నిట్టుల మద్భక్తి పుట్టియును ని
జేశునెడ భక్తి చెడదు మదిష్ట మగుట.

అప్పురంధ్రీ రత్నంబు రాజమహిషియై యుండియు తాను చేయుచున్న విధులను చక్కగా నిర్వర్తించుచుండెను. ఇది భక్తుని నిరాడంబర మనస్తత్వమును వ్యక్తముచేయుటకు ప్రత్యక్ష తార్కాణము. ఇట్టి నిరాడంబర మనస్తత్వమునకు మరొక తార్కాణము కలదు.

తే. ఎవ్వడే సర్వ భూతస్థు డిత్తెఱంగు
నకును బ్రేరేచె, నతని యానతియె తెచ్చె
నెఱిగినవి నాల్గు నొడువ నేమయిన లెస్స
యతడ బొంకిన నేమి సేయంగవచ్చు? 1

తే. పంతమైనను గానిమ్ము పార్థివేంద్ర
యుక్తులను విగ్రహస్థాన మొదవెనేని
యమ్మదెచ్చిన నిద్వాంసు డనగవలవ
దెట్లు గావింపవలయు నట్లట్లచేయు. 2

ఇది యామునుడు పాండ్యున కిచ్చిన ప్రత్యుత్తరము. పాండ్యుడు శైవమత దురభిమాని. యామునుడు భగవత్ప్రేరణచే యా రాజమహిషి వైష్ణవి యగుటం జేసి తద్వారా రాజసభా ప్రవేశముగాంచి వైష్ణవమత స్థాపనకు కడంగెను. యామునుడు పరమభక్తుడు, జయాపజయములు దైవాధీనములని తథ్యముగానెఱింగి తనను ప్రేరేపించిన భగవంతుడే బొంకించిన తానేమి చేయజాలననియు, యేది

యెట్టైనను యమ్మదెచ్చిన విద్వాంసుడని మాత్రము గెలిసేసి యామె నవమాన పరచవద్దని ప్రార్థించినాడు,

గోదాదేవి తానొక యాళ్వారై యుండికూడ సామాన్య కాంతవలెనే విరహ వేదన యనుభవించినది. అశ్రాంతము తిరుప్పావై పాడుచు యా భగవంతుని యవతారములను అయా యవతారములం దాతని భార్యలైన వారిని దూరుచు మీరేమి భగవంతుని గుత్తగొంటిరా ? యని తూలనాడుచుండెను. గోదాదేవి యితర ప్రబంధ నాయికలవలె చంద్రాద్యుపాలంభనములు చేయలేదు. ఈమె రాధను దూరుట కృష్ణదేవరాయలు చక్కగా నిరూపించినాడు,

ఉ. అక్కట రాధ నీకు దగవా మగవారల నత్తమామలం
దక్కి ముకుంద వేణు కలనాదపుటీలకు లేటి మొత్తమై
త్రెక్కొనుకాకచే నడికిరే లరుదెంచిన గోపికావళిన్
బొక్కగజేసి తద్రుచిర భోగము గుత్తగ నీవ గైకొనన్.

ఈమె సత్యాదేవిని దూరిన విధముగూడ చక్కగా నున్నది. ఆడవారికి సపత్నులపై నీర్ష్యయుండుట సర్వజన సహజముగదా.

మ. దివిజద్రుప్రసవంబుగాంచిన సపత్నిం జూచి చూపోప కిం
తవు జిల్గుంబని యంతసేసి మది నీర్ష్యా క్రోధము ల్పొందడిం
ప విరిం బోక ద్రుమంబుగైకొని పతి న్మందన్న మ్రానెల్లదే
నవధిం బెట్టిన సత్య పీ వహహ ! కావా భామినీ నావుడున్.

ఇట్లింకెన్నియో సందర్భముల కృష్ణరాయలు సూక్ష్మముగా వారి మనః ప్రవృత్తులను పరిశీలించి సువ్యక్తమగునటుల వ్రాసినాడు. ఈమెపడు బాధలను చూచి యచ్చెరువొంది యీామె యేతపము చేయుచుండెనోయని పెరియాళ్వారు వెరగంది భగవంతునికి నివేదించెను. అతడా భక్తశిఖామణిని రంగధామ మరిగి యామెను శ్రీ రంగనాథున కర్పింపుమని యానతిచ్చెను.



ఇతఃపూర్వ ముల్లేఖించినట్లు విష్ణుచిత్తీయము విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారమునకు గా నుద్దేశించబడిన ప్రబంధరాజము. ఏలనన పన్నిద్దరాళ్వారులలో ప్రసిద్ధులగు పెరియాళ్వార్, శూడికొడుత్తునాంచియార్ వైభవము చరిత్ర వర్ణింపబడినది. అందును దైవికముగా వా రిరువురు తండ్రికూతుళ్లై యుండుట సంభవించినది. ఇప్పటికిని శ్రీవిలిబుత్తూరు వైష్ణవ భక్తులకు భగవద్ధామమై దక్షిణాపథమందు వర్తిల్లుచున్నది. ఇంక శ్రీరంగక్షేత్ర విషయము వేఱుగా చెప్పనక్కఱయేలేదు. కావేరికి విరజైక్యము కల్పించబడుటచే కలియుగ వైకుంఠమని ప్రసిద్ధి జెందినది. కావేరీ ద్వీపమందు వెలసిన యీ దివ్య క్షేత్రము దైవ ప్రతిష్ఠ యని కూడ ప్రతీతి. ఈ రంగధామమునే ఇక్ష్వాకు రాజచంద్రుడు శ్రీరామచంద్ర సార్వభౌముడు కులదైవముగా పూజించుచు తన పట్టాభిషేక మహోత్సవ సమయమున నెల్లరి యీప్సితార్థములు దీర్చుచు, దివ్యదృష్టితో యేమి యడుగక మిన్నకుండిన విభీషణుని మనోఫలకమందున్న యాశయమును గ్రహించి కులధనముగా నిచ్చెను. అయితే లంకయందు వెలయవలసిన రంగనాథుడు కావేరీ ద్వీపమున చంద్ర పుష్కరిణివద్దనే నిలిచిపోయినాడు. అది దైవ ఘటన. ఈ శ్రీరంగ క్షేత్రమందే పన్నిద్దరాళ్వారులు తమ తుది ఘడియలను గడిపినారు. అందువల్లనే నా యాళ్వారుల సన్నిధు లందు వెలసినవి. కొల్లడము తీర్థము గ్రోలినవారి కీప్సితార్థసిద్ధి కలుగును. ఇది స్వానుభవముకూడ. దైవ పరాఙ్ముఖు డగు మన్మిత్రునికూడ యీ దేవాలయ ప్రాభవము ముగ్ధుని చేసినది. శ్రీరంగని కోవెలకు సప్త ప్రాకారములు గలవు. అందే యీ విషయవాసులు నివసింతురు. వైకుంఠైకాదశి నాడు జరుగు వైకుంఠద్వార దర్శనమునకు దైవభక్తి సన్నగిలిన యీ కాలమందు కూడ దాదాపొక లక్షమంది యాత్రికు లనేక సీమలనుండి వచ్చి తమతమ భక్త్యంజలులు శిరస్యంజలి ఘటించి యీ రంగధామునకు సమర్పింతురు.

ఒకవిధముగ జూచినచో విష్ణుచిత్తీయము శ్రీరంగని గాథయే. శూడికొడుత్తాళ్‌ను కల్యాణ మగువరకా భగవంతుని యవతారము పూర్తికాలేదు. భక్తాగ్రేసరు డగు పెరియాళ్వార్ తనయనే పాణిగ్రహణము చేసినా డా భక్తజన మందారుడు. శూడికొడుత్తాళ్ అయోనిజ. తులసికోటవద్ద పెరియాళ్వారుకు లభించినది. విష్ణుచిత్తీయమందు గల యుపాఖ్యానము లన్నియు వైష్ణవమత ప్రచారమునకు దోహద మొసంగునవే. యామునాచార్యుడు పరమ వైష్ణవుడు. ఆతడొక యాచా

ర్యుడు. మాల దాసరి, బ్రహ్మరాక్షస రూపాంతర సోమశర్మ వీరిరువురు వైష్ణవ భక్తులు. వీరిరువురి యుదంతములు ప్రధాన గాథకు బలముచేకూర్చుట కిందు బొందుపరుపబడినవి. ఇందు పాండ్యుని సభామంటపమున జరిగిన వాద కోలాహలములు చూచాయగా విజయనగర సామ్రాజ్యమున రాయలకాలమందుండిన మత సంఘర్షణను తెల్పును. కృష్ణరాజేంద్రునకు శివకేశవ భేదము లేకుండినను యీ కథా ఘట్టములనే తత్ప్రబంధమం దనుసంధించుటవల్ల యతడు వైష్ణవమత పక్షపాతి యని తప్పక చెప్పక చెప్పును. ఆనాటి పరిస్థితు లట్టివి. ఏ మతమయినను కొంత కాలమునకు భ్రష్టమై బూజుపట్టును. ఆ మతమందున్న సుగుణము లంత రించి చెడుదారులకు తావిచ్చును. శైవము ముదిరి వెఱ్ఱితలలు వేయ మొదలిడి నపుడు దానికి ప్రత్యామ్నాయముగా విశిష్టాద్వైతము వెలసినది. "నదీనాం సాగరో గతిః" యనునట్లు యీ మతము లన్నియు భగవద్ధామము జేరుటకు వేర్వేఱు మార్గములని, వేఱుగా చెప్పనక్కరలేదు. ఇట్లు ద్వైతమునకు విశిష్టా ద్వైతమునకు మధ్యవర్తిగా వెలసి వాటిమధ్య నున్న మేఱను దీర్చినది ప్రాచేతసుని రామాయణ మహాకావ్యము. శివమ్ అను మంగళార్థదాయక పదమును వినుటకు వైష్ణవులు చెవులు మూసుకుందురు. అట్లే తద్విరుద్ధముగా శైవులు శివ శివా యని చెవులు మూసుకొందురు. భగవంతుడుకూడ భగవద్గీత యందు

"యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత !
అభ్యుత్థాన మధర్మస్య సంభవామి యుగేయుగే"

యని వాకొనినాడు. ఏ మతమయినను పతనముగాకుండ భక్తి ప్రచారము చేయు చున్నంతవరకు మరొక మతము వెలయలేదు. పతనమగుట కారంభించగానే పాత యొక రోత క్రొత్త యొక వింత యగుటవల్ల నూతన సిద్ధాంతము ప్రచా రములోనికి వచ్చి మరికొంత కాలమువఱకది యమలులో నుండును. ఇది చక్ర నేమి క్రమమున జరుగుచుండును. ఇంత విష్ణుభక్తి కృష్ణ రాజేంద్రునకు కలుగు టకు కారణములు చాలా కలవు. తిరుమల తాతాచార్యులు యాతేని యాస్థానమందు రాజగురుపీఠ మధిష్ఠించెను. ఆంధ్రకవితాపితామహుడగు నల్లసానిపెద్దనామాత్యుడు శఠకోపతాపసుడను డొక్కశుద్ధి పొందిన వైష్ణవోత్తముని ప్రసాదమున మను చరిత్రము పూరించెను. తెనాలి రామకృష్ణుడు వైష్ణవ స్వీకారార్హుడగు వేదాద్రి మంత్రీశ్వరున కంకితముగా పాండురంగ మాహాత్మ్యమును రచించెను. పింగళ సూరనకూడ తన కళా పూర్ణోదయ కల్పిత కథా మహాకావ్యమును వైష్ణవ

భక్తుడగు నంద్యాల శ్రీ నరసింహ కృష్ణవిభున కంకితమొనర్చినాడు. అట్టి వైష్ణవ సత్సంప్రదాయ మొనగూడిన సభాస్థలి కృష్ణరాయల నుక్కిరిబిక్కిరి చేసిన దనుటలో సందియములేదు. ఇట్టి పరిస్థితులలో కృష్ణరాయలు కూడా పెద్ద వైష్ణ వాగ్రణియై తన సామ్రాజ్యమం దెల్లెడల నింటింట భుజాల్గాల్చి వైష్ణవ మిప్పించి గ్రంథ రచనకు కడంగినాడనుటలో సందియము లేదు.

విష్ణుచిత్తుడు పరమ భక్తుడు. ఆత డభ్యాగతః స్వయం విష్ణువను భావమును మనమం దిడుకొని తన గేహమునకు వచ్చు నాపటీరాచల పశ్చిమాచల వైష్ణవుల కెల్ల భోజనావాస వసతులు కల్గించి వారివల్ల కొంగ్రొత్త విషయముల నెఱుంగుచు రాత్రులందు నాగేంద్ర శయాను దివ్యప్రబంధ సంధానధ్యానములతో కాలక్షేపము చేయుచుండెను. భాగవతోత్తముల సేవ భగవంతున కత్యంతప్రేమ కావున విష్ణు చిత్తుడు వారిని సేవించుచుండెను. భాగవతోత్తముల ప్రసక్తి వచ్చినది గనుక మరొక్క విషయము తెలుపవలెను. కులశేఖరాళ్వారుకూడ పన్నిద్దరాళ్వారులలో నొకడు. అతని నగరమం దాతడు రంగధామ మేగుచుండెనని దినేదినే ఘోషింప బడుచుండెను. అతడు శ్రీరంగమున కరుగ సంకల్పించినను భాగవతోత్తములు వచ్చుటవల్ల, భాగవతోత్తములసేవ భగవత్సేవకన్న ప్రధానమైనది, ప్రశస్తమైనది గావున యానాటికి రంగపురికిపోవు సంకల్పము మార్చుకొనుచుండెను. ఒకప్పు డెవరో భాగవతోత్తములను దూషించినపు డాతడు సజీవ కాలసర్పమును పట్టు కొని వారు పరమపావనులనికూడ నెల్లరికి తెల్లముచేసెను. ఇట్టిదిభాగవతోత్తముల సేవ. ఎవరో "భావే భావే హృదయభవనే భావయేయం భవన్తం" యను శ్లోక మందు కులశేఖరు డిన్ని 'భ' లేల ప్రయోగించెననిన భాగవతోత్తముడు కావున యన్నింటి నుపయోగించెనని విద్వన్మణులు చమత్కరించిరి. ఇట్టి భాగవత సేవ చేయుచున్న విష్ణుచిత్తునకు తనివి తీరలేదు. ఏదోకొఱత సతత మాతనిని బాధించు చుండెను. అట్టియెడ భగవంతు డాతని కవకాశము కల్పించి పాండ్యుని సభాస్థలి జరుగు కోలాహలము మాన్పి వైష్ణవమతమును స్థాపింపుమని యాదేశించెను. పాండ్యుడుకూడ ముముక్షాసక్తుడై యుండుటవల్ల భగవత్ప్రేరణవల్ల విష్ణుచిత్తుడు వైష్ణవమత మొక్కటే మోక్షప్రదాయియని శ్రీమన్నారాయణు డొకడే సతతము సేవ్యుడని నిర్ధరించి యా రాజేంద్రుని మోక్షోన్ముఖుని గావించెను. విష్ణుచిత్తుడా రాజసాంద్రునకు ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానము నుపదేశించి సోపపత్తికముగా విశిష్టాద్వైత మతమును స్థాపించెను. విష్ణుచిత్తుడు ప్రతిపాదించిన విశిష్టాద్వైతమత సిద్ధాంతమును సంక్షిప్తముగా నిందు బొందుపరచుచున్నాను.

సృష్టి ప్రకరణమునందెల్ల జగత్కారణమున కీక్షణక్రియాయోగము చెప్ప బడి యున్నది, ఈక్షణ మచేతనమయిన ప్రధానమునకు సంభవింపదు కావున యది జగత్కారణముకాదు. మఱి తాదృశేక్షణక్షముడు చేతన విశేషము సర్వజ్ఞుడు సర్వశక్తి పురుషోత్తముడు "సదేవ సౌమ్యే దదుగ్ర ఆసీ దేకమేవాఽద్వితీయమ్ తదైక్షత బహూస్యాం ప్రజాయేతి" యిత్యాదులగు శ్రుతులయందలి సచ్ఛబ్దము నకు వాచ్యుడు జగత్కారణము. సృష్ట్యాదియందు శ్రీమన్నారాయణుం డొక్కడే యుండుటంజేసి ఒంటరితనము విలాసమునకు యుక్తము గాకుండుటవల్ల ననేక రూపంబులం బొందెనని సంకల్పించి చిదచిద్వయాత్మకంబయిన ప్రపంచమందు దాను బ్రవేశించి బహురూపము లాయెనని ఛాందోగ్యోపనిషత్తు బోధించుచున్న దనియు, నిదియునుంగాక యంతరాదిత్య విద్యయందు సూర్యునియందున్న పుండరీకాక్షుండు నారాయణుండనుటకు నక్షిణియను ద్వివచనము ముఖ్యసాధకం బనియు బ్రహ్మరుద్రేంద్రాదులలో నెవ్వడు గాదనుటకు నా శ్రుతియే వైలక్షణ్య మును తెలుపుచున్నదని, సాదృశ్యములేని శ్రీహరియొక్క దివ్యస్వరూప దివ్య విగ్రహానంత కల్యాణగుణ దివ్యైశ్వర్యములు నీ శ్రుతియందు స్పష్టమగుచున్నవి. అంతేగాక నారాయణుండే సర్వాంతర్బహిర్వ్యాపకుడై తరుచుగా నున్నవాడనితైత్తిరీ యోపనిషత్తులో కల నారాయణమను నైదవ పన్నము తెలుపుచున్నది. నారుణంబు లందు సామాన్య విశేష న్యాయనుచేత బ్రహ్మేంద్రాది సకల శబ్దములును తుదకు నారాయణ శబ్దమందే పర్యవసన్నములు, "అపహత పాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" యను శ్రుతి వాక్యములమీద నిలిచియున్న యా నారాయణ పదమే శ్రీమన్నారాయణునికంటె నితర మేదైవమును లేదని నిస్సందేహముగానుండ భ్రమాత్మకజ్ఞానజన్య వివాదమునకు తావులేదు. పూర్వకాలమున బరశురామునకు వెఱచి వైరాగ్యము నొందినట్టి దివోదాసాత్మజుండైన ప్రతర్దనుం డనువాడు ముముక్షుసక్తుడై భగవంతునిం గానక యింద్రు నారాధింప యతడు ప్రత్యక్షమై నన్నుపాసన చేయుమనగా మదంతర్యామి నుపాసన చేయుమను భావ మూహింప బడియె. ఎట్లనగా తొల్లి గర్భమునందుండియు దపంబునం దీశ్వరునితో తుల్యుం డైన వామదేవుండను మౌని సూర్యుడు నేన, చంద్రుడు నేన, అగ్నియు నేన యని శరీరవాచక శబ్దము శరీరి పర్యంతము వోవుటచేత నుభయ శరీరకుండయిన పర మాత్మంగూర్చి యనుసంధాన మొనర్చెనని తెలిపి జీవుడైన తా నుపాస్యుండను గానని జ్ఞాన వృద్ధుండగు నింద్రుడు తదనుసంధాన న్యాయంబున నుపదేశించెనని వేదవ్యాస సూత్ర వేదాంత శాస్త్రములయందు కలదు. అంతేగాక బ్రహ్మ, శివుడు,

భూమి, మొదలగు పంచభూతములు కాలమృత్యు ప్రభృతి నిఖిలంబగు చిదచిద్రూప విస్తారంబు లతని శరీరంబులు అయినను శుద్ధంబగు నారాయణ స్వరూపమును దక్క మరియొక స్వరూపమును భజింపగూడదు. బ్రహ్మాదులను ధర్మార్థ కామ కాంక్ష లుపాసన చేయుదురుకాని మోక్షార్థు లుపాసన చేయరని స్మృతులు తెలుపు చున్నవి. జీవేశ్వరులకు నిత్య సంబంధములు. మాతా పితా భ్రాతా వాసి శ్శరణమ్ సుహృద్గతి ర్నారాయణ యని నిఖిలంబు నా నారాయణుండని తెలుపునట్టి కొన్ని శ్రుతులు కలవు. అట్టి పరమేశ్వరుని పొందుటకు సాధకంబయిన యోగంబు కలదు.

ప్రాణులకు బంధ మోక్షములకు మనస్సే కారణము. ఆమనస్సు సవిషయ మైనచో బంధముం జేయును. నిర్విషయ మైనచో మోక్షముం జేయును. మోక్షముకై సాధకుడు శబ్ద స్పర్శాది విషయ భోగమునుండి మనస్సును వెనుకకు లాగుకొని పరమాత్మను ధ్యానించెనేని కత్తిగా, కటారిగా మారునదైన యినుమును సూదంటురాయి యే విధముగా నాకర్షించునో అట్లే యా పరమాత్మ యా ధ్యాయికి తన స్వరూపము నొసంగును. యోగ మనగా యమ నియమాదులచే నిర్మలీకృత మయిన సాత్విక చిత్తవృత్తిని బ్రహ్మము మీదికి నడుపుట. అనగా యితర చింత లేక బ్రహ్మమునే చింతించుటయందు నేర్పు యోగము. అట్టి విశిష్ట బ్రహ్మధ్యాన మేయోగమునం గలుగునో యా యోగముగలవాడే యోగి. బ్రహ్మచర్యము మొద లగు యమములైదును స్వాధ్యాయము మొదలగు నియమములైదును చిత్తశుద్ధి కనుష్ఠింప వలయును. ఇవి కోరికచేత చేసిన పక్షమున విశేష ఫలముల నిచ్చును. కోరికలేక చేసినయెడల మోక్షమబ్బును. భద్రముక్త పద్మసిద్ధ వీరముక్త పద్మ- మను నాసనములలో నొకటి యవలంబించి వాయువును రేచక పూరక కుంభకా భ్యాసముచేత వశపరచుకొన వలయును. ఇట్లు ప్రాణవాయువును వశపరచుకొను టయే ప్రాణాయామము. సబీజంబని బీజంబని యిది ద్వివిధము. శబ్ద స్పర్శ రూప రస గంధములను పంచవిషయములకు బోవు శ్రోత్ర త్వ క్చక్షు ర్జిహ్వా ఘ్రాణము లను పంచేంద్రియంబుల మరల్చుకొనుట ప్రత్యాహారము, ఇది ముముక్షున కవశ్య మాచరణీయము. ఇట్లొనరింప నింద్రియములు మనస్సున కధీనములగును. పిమ్మట శుద్ధంబగు చిత్తంబును పరబ్రహ్మమందు జేర్పవలయును. పరబ్రహ్మమే చిత్త మున కాశ్రయంబు. ఆ పరబ్రహ్మము పరాపర భేదంబుల జెందియుండును. అపరమనగా రూపవత్పరార్థము. పరమనగా రూపవంతము. పరాపరములలో పరము నిరాకారముగాన ముముక్షువులగు జీవుల కుపాసనాశక్యము. అపరమును

సంజ్ఞగల చతుర్ముఖాది బద్ధజీవ సంఘరూపము సాకారమైనను భావనాత్రయ విశిష్టమగుటంజేసి పరిత్యాజ్యము. సాధకునికి శరీరత్యాగ కాలమందు నీరెండు విధము లుపాసనకు తగినవికావు. బ్రహ్మ భావనయు, కర్మభావనయు, బ్రహ్మ కర్మోభయభావనయు ననునవే భావనాత్రయము. ఆ మూడింటియందు సనంద నుడు మొదలగు మహాయోగులెల్లరు బ్రహ్మ భావనాయుతులు. దేవతలు మొదలు పర్వత పాషాణము లాదిగాగల జీవులందఱును కర్మభావనాయుతులు. హిరణ్య గర్భాదులు కర్మ బ్రహ్మోభయ భావనాపరులు. ఈ మూడువిధములవారును త్రిభావ నలతో గూడియున్నవారు. అందువల్ల యీ మూడువిధములగు రూపంబులు సేవింపదగినవి కావు. సనందనుడు మొదలగువారును మునుపటి బ్రహ్మకల్పముల యందు జన్మించుటచేతను, బ్రహ్మభావనచేతను బద్ధులైనవారు.

భావనాస్వరూపంబైన జగత్తుయొక్క యునికికి మర్యాద. దేవతలు మను ష్యులు మొదలగు నానావిధ ప్రపంచముయొక్క జ్ఞానకర్మంబులు నష్టమగుట. యీదృశంబైనట్టి జగత్తై కన్పించునట్టి చతుర్ముఖాదులకంటెను యితరమైనది. పర మను పేరుగలది యది రూపములేనిది. అది యమూర్తం బై యుండును. మున్ను జెప్పబడిన దేవాది భేదంబులు లేనిదై యా భేదము లేకపోవుటచేత యీదృశము తాదృశమని పలుకుటకు విషయముగాక యపక్షయాది రహితమును సచ్ఛబ్ద వాచ్యం బును నాత్మ సంవేద్యంబును, జ్ఞానముచేతనే నిరూపింపదగినదియు నగుచు జ్ఞానశబ్ద వాచ్యంబును బ్రహ్మస్వరూపమౌటచేత బ్రహ్మమను నామముతో వ్యవహరింప బడును. భావనాత్రయాత్మకమైన నీ విశ్వముకంటె వేఱగు చిహ్నముగల యీ రూప మభ్యసింపబడు యోగముగల యోగికి చింతింపశక్యముగాదు. అపరంబని చెప్పంబడిన హిరణ్యగర్భుడు, వాసవుడు, మొదలగు తదితర భూతములు తదు త్పత్తి హేతువులుగా నొప్పుచున్నట్టి ప్రధానాది విశేషాంత చేతనాచేతనాత్మక ప్రపంచభావముగల స్థూలరూపము యోగికి ధ్యానసాధ్యము. అది ధ్యానసాధ్యం బైనను భావనాత్రయ స్వరూపమగుటచేత శుభాశ్రయముగాదు. అనగా మోక్షసాధ నముగాదు. ఏవంవిధ వక్ష్యమాణ సర్వప్రపంచము విష్ణుసమన్వితంబై యాదేవు నకు శరీరముగా నుండును.

ఆ విష్ణుశక్తులు మొదట నిర్వచింపబడిన పరాపరాఖ్య లనువానికి వేత్తైన కర్మా ఖ్యము త్రివిధములుగా నుండును. వాటియందును కర్మమనుపేరుగల శక్తిచేత చుట్ట బడినదై యపరమను పేరుగల పురుషశక్తి జన్మజరామరణాది యనేక సంస్కార తాపముల ననుభవించును. ఆయాకర్మల కనుగుణమగు జన్మము లెత్తి విజ్ఞాన తార

తమ్యంబులపొందును. ఆ క్షేత్రజ్ఞశక్తి ప్రాణరహిత వస్తుజాలమందు కొంచముగా నుండును. ప్రాణరహిత వస్తుజాలముకన్న స్థావర పఙ్త్కులగు పర్వత వృక్షాదులందు ద్విగుణీకృతమై యుండును. తజ్జాతికంటె మన్దిండి మున్నగు సరీసృపములందు, అంతకంటెను పక్షులందు వానికంటెను, మృగసమూహమందు, దంతిగోముఖ పశుతతి నంతకంటెను, మనుష్యసంబంధియైన గుంపులం దంతకంటెను యక్ష గంధర్వ నాగాళియం దంతకంటెను, నిలింపులం దంతకంటెను, హరిహయుని యం దంతకంటెను, దక్షునియం దంతకంటెను ఆద్యుండైన చతుర్ముఖునియందు క్షేత్రజ్ఞశక్తి యుండును.

ఆ విష్ణుం డప్రమేయంబగు నిజసామర్థ్యముచేత నిఖిల భూతములం దాకాశము మాడ్కి నిండి ప్రకాశించును గావుననే తాదృశరూప సహస్రంబు లాదేవుని శరీరపుంజంబు. మున్ను జెప్పిన పరబ్రహ్మమనియెడు బ్రహ్మమునకు రెండవదియై యోగులచేత తెలియదగినదైన మూర్తభిన్నరూపం బొక్కటి విష్ణువను నామము నొందియున్నది. పండితు లారూపమును సత్తను సంజ్ఞతో వ్యవహరింతురు. ఈ రూపమే నానావిధ సామర్థ్యముల కాశ్రయత్వమునొంది పూర్వోక్త జగద్రూపముకంటెను వైలక్షణ్యముం గాంచి కల్యాణగుణ సంపద్గురుత్వముతో నత్యంత మాహాత్మ్యము గలిగి ప్రకాశించుచున్నది.

అట్టి పరబ్రహ్మమే నిజవిలాసముచేత దేవతిర్యఙ్మనుష్య నామచేష్టావదవతరణముల లోకోపకారములకై కల్పించుచుండును. ఆ విష్ణుదేవునియొక్క విలాసక్రియ స్వకీయ కర్మానుభవముకొఱకు కాదు. అతడు తిర్యగాది నిఖిలజాతులయం దుద్భవించినను నితని వ్యాపారవిస్తారంబులు దుష్టులవలన నవ్యాహతములు. అట్టి పరమేశ్వరునకు బద్ధముక్తాదిరూపంబు లనేకంబు లుండినను ముముక్షువునకు జ్ఞానసిద్ధికి బరవ్యూహ విభవాదిరూపంబులే చింతనీయములు. మనంబున నున్న విష్ణువు జాజ్వల్యమానుడగు నగ్ని యెండుపొద నెట్లు దహించునో తద్వత్ యోగుల సమస్త కిల్బిషములను హరించును. కావున సకల శక్త్యాశ్రయుండైన పరమాత్ముని యందు చిత్తంబు నిలుపుట విశుద్ధధారణ యనబడును. నిఖిల వస్తు సంబంధముల చేత చంచలరూపమైన మనమునకు త్రిభావ భావనాతీతుండగు నా దేవుడు శుభాశ్రయుడై ముక్తికరుడగును. ఏతద్వ్యతిరిక్తులగు బ్రహ్మాది దేవతలు కర్మయోనులగుటవలన నశుద్ధులు గావున నాశ్రయింప దగనివారు. అందు నాధారములేని ధ్యానంబు నిలువదు గావున ధారణా ధ్యానవిషయంబై శుద్ధంబగు స్థూలరూపాంతరం బా పరబ్రహ్మమునకు కలదు.

సీ. శరదిందు చకచక స్మయజిత్ప్రసన్నాస్యు
దొడ్డ కెందమ్మి కన్దోయివాని
నతిక్రమగల్లభాగాభోగ ఫాలాఢ్యు
మకరాంత రత్న కర్ణికలవాని
గాంబవోద్యచ్ఛ్రి విడంబి వృత్త శిరోధి
సిరిపొల్చు మచ్చ పేరురమువాని
నతనాభియుతవళిత్రితయ శాతోదరు
జానులంబి చతుర్భుజములవాని
గరివరకరోరు, రుచిర జంఘామనోజ్ఞ
సమతబొందిన పద పల్లవములవాని
హైమవసను, గిరీట హారాంగదాది
కలితు, శంఖ రథాంగాదు లలరువాని.

శ్రీవిష్ణు నీగతి యోగి చింతింపవలయును. ఒక్కొక్క యవయవమును మనంబున కంటునట్లుగా భావించి, యది దృఢముగ గుర్తుగలిగిన పిమ్మట క్రమ క్రమముగ యన్ని యంగములు హృదయమున హత్తుకొనురీతి చింతింపవలెను. అప్పుడు సర్వకాల సర్వావస్థల యందును ధ్యానము మానకయుండిన నా యవ యవములు హృదయమును వదలిపోకుండున ట్లభ్యాసము చేయవలెను. అప్పుడు శ్రీహరి సారూప్యము గలిగి ముక్తుడగును. దేవతలు మొదలగువా రభేదమును గల్పించుచున్న యజ్ఞానము నివర్తించిన పిదప గల్యాణ గుణ సమన్వితుండైన యా విష్ణునకుం దనకును లేని భేదం బెవ్వడేనియు కల్పింపజాలడు. ఇదియే సంసార భవబంధ మోచనకై యుద్దేశించబడిన యంగాష్టకాఢ్య గురుయోగము.

ఇదియే విష్ణుచిత్తీయమందు ప్రతిపాదించబడిన విశిష్టాద్వైత సిద్ధాంతము. యామునాచార్యుడు శైవమత మోడించి, వైష్ణవమతము స్థాపించెనేగాని యద్దాని వివరము లొసంగబడలేదు. మాలదాసరి బ్రహ్మరాక్షస సంవాదమందు వారి భక్తి యుగ్గడింపబడినదే కాని తద్వివరములు కూడ నీయబడలేదు.

విశిష్టాద్వైతమత సిద్ధాంతమందు చిత్తు (జీవుడు), అచిత్తు (ప్రకృతి), యీశ్వరుడని తత్వములు మూడు. చిత్తనగా జీవస్వరూపము శరీరేంద్రియాదుల కంటె విలక్షణమయినది. ఇది మోక్షదశయం దీశ్వరసాధర్మ్యము నొందును. అచిత్తునకు ప్రకృతియనియు, మాయయనియు, నవిద్యయనియు నామాంతరములు

గలవు. ఇది భగవదిచ్ఛచే నానా విధములుగా పరిణమించును. భగవద్విలాసమగు సంసారమున కిదియె మూలము. ఈశ్వరుడు నిత్యుడు. నిఖిలహేయప్రత్యనీకుడు. సకల కల్యాణ గుణాకరుడు. చేతనా చేతనముల కంతర్యామి. పైన చెప్పబడిన చిదచిత్తు లతని కపృథక్సిద్ధ విశేషములు. కారణావస్థయందు పరమాత్మ సూక్ష్మావస్థ నొందిన యీ చిదచిత్తులచే విశిష్టుడై యుండును. కార్యావస్థయందు స్థూలావస్థ నొందిన చిదచిత్తులచే విశిష్టుడై యుండును. కావున నిట్టి యుభయ విధమయిన పరమాత్మల కైక్యమును బోధించుటచే నీ సిద్ధాంతము విశిష్టాద్వైత మనంబరగును. విశిష్టాద్వైతమతము రెండు భాగములుగా విభజింపబడి యున్నది. వానిలో మొదటిది సభలో ప్రతివాదులను జయించుట కుద్దేశింపబడి సాధనమయిన బ్రహ్మ సూత్ర భాష్యము, సిద్ధిత్రయములాదిగాగల యనేక సంస్కృత గ్రంథాదులచే ప్రతిపాదించబడినది. రెండవభాగము పూర్వోక్త సంస్కృత గ్రంథంబును సాకల్యంబుగ ప్రతిపాదించునవియు, స్వగోష్ఠి నిష్ఠములయి కేవల గురుపరంపరా సంప్రదాయ ప్రాప్తంబులయిన యర్థవిశేషముల దెల్పునవియు, భక్తి ప్రపత్తి జ్ఞాన వైరాగ్యాదులను వృద్ధి బొందించునవియు నగు ద్రావిడ గ్రంథములచే బోధింపబడు చున్నది.

అద్వైతమత సిద్ధాంతము మాయ జగత్కారణము, ఆత్మ కాదు. పరమాత్మ యొక్కడే కలడు, ఇతరమేమియులేదు. జీవాత్మ పరమాత్మలకు భేదము లేదు. దృశ్యజాతమెల్లను (నానాత్వమును, భేదబుద్ధియు) యెండమావులవలె యసత్తు. సత్తను బోధచేత యా భ్రమయొక్క యాత్యంతిక నివృత్తియె మోక్షము. అద్వైత సిద్ధాంతము జీవాత్మ పరమాత్మ కైక్యమును చెప్పును. భక్తి సంబంధమగు మతము భాగవత మతము. అయితే వైష్ణవులు భక్తిమార్గమందున్నను శ్రీమన్నారాయణుని తప్ప మరొకని నుపాసించరు. భాగవతమతము విశిష్టాద్వైత మతము లొక్కటే.

ఇవ్విధముగా కృష్ణరాయల విష్ణుచిత్తీయమందు వైష్ణవమత ప్రాశస్త్య మడుగడుగునకు కన్పట్టుచున్నది, మాలదాసరి కూడ యూర్ధ్వపుండ్రంబులు ధరించి జాత్యుచిత ధర్మముం బాటించుచు కుఱుగడి పాడుచు తన జీవితమంతయు నారాయణార్పణము చేసెను. కృష్ణరాయలు తన యిష్టదేవతాస్తుత్యాదికమందు విష్వక్సేనుని కాంచన నేత్రమును, పాంచజన్యమును, నందకంబును, కౌమోదకిని శార్ఙ్గమును, సుదర్శనమును, పన్నిద్దఱు సూరులను వర్ణించినాడు,



ఆంధ్రుల చరిత్ర సంస్కృతు లున్నతములైనప్పటికిని వాటిని సూచించు సమగ్రాధికార గ్రంథ మింతవరకు వెలువడనేలేదు. దానికి కారణము లుగ్గడించుట యిచ్చట సమంజసము. మన సాహిత్యమే మన చరిత్రను సంస్కృతిని తెలుసుకొనుట కుపకరించుచున్నది. నన్నయ యుగములో రాజరాజనరేంద్రుడు పాలించిన రాజమహేంద్ర వైభవము, ఎక్కువకాలములో నెల్లూరు, యేకశిలానగర ప్రాభవము లచ్చుగ్రుద్దినట్లు వారివారి గ్రంథములలో ప్రతిబింబించుచున్నవి. వారి గ్రంథేతివృత్తములు యథామాతృకలైనను స్వతంత్రరచనలై యుండుటవల్ల వారికి శాఖాచంక్రమణకు వీలుకలిగినది. వారు వ్రాయబూనిన గ్రంథము లుత్కృష్టమైనవి. కాని వారు నివసించుచున్న పరిసరములను, వాతావరణముల నెట్లు మరువగలరు? మేఘసందేశమును రచించిన కాళిదాసు డుజ్జయినిని వర్ణించలేదా? పెద్దనామాత్యుడు వర్ణించిన వరూధిని పెనుకొండలోని వేశ్యయై యుండనోపు. రవాణా సౌకర్యములులేని యానాడు పెద్దన హిమవన్నగమును పరిశీలించియే యాకొండను వర్ణించెనా. పెద్దనార్యుని గ్రంథము మార్కండేయ పురాణాంతర్గతోపాఖ్యానమున కనుసరణమయ్యును కొంత స్వైరవిహారమున కతని కాస్కారము లేకపోలేదు. ఆనాటి వాతావరణమునకు పరిసరముల కనుకూలమగు వస్తువును గ్రహించుటయందే వారి భావము ప్రస్ఫుటమగు చున్నది. అల వైకుంఠపురంబులో జరిగిన సత్యాకృష్ణుల ప్రణయకలహము పారిజాత రూపమున దిగుమతి యగుటకు కారణము కృష్ణరాయలకు నతని దేవేరికి కలిగిన తాత్కాలిక వియోగఫలితమే యని వేఱుగా చెప్పవలయునా, అట్లే కృష్ణరాయల విష్ణుచిత్తీయమందు విజయనగర సామ్రాజ్యవైభవము, తత్కాలప్రజల జీవితములు, వారి యాచార వ్యవహారములు యథాతథముగ ప్రతిబింబించుచున్నవి. విజయనగర సామ్రాజ్యమం దెల్లెడల కట్టబడిన సౌధములు, దేవాలయములు, గుడిగోపురము లాంధ్రుల చరిత్ర సంస్కృతులనే సూచించుచున్నవి. అంతేగాక కవులు తమ గ్రంథములందు మొదటి మూడు పాదములందు కథావిశేషమునే యుగ్గడించిన యిట్టి విషయముల నుగ్గడించుట కర్థాంతరన్యాసాలంకార ముంకనే యున్నది కదా. అందులకే పూర్వకవుల కావ్యములు ప్రాచీనాంధ్రుల గుణశీలములకు, వారి చరిత్రకు, సంస్కృతికి సాహిత్య దర్పణములవంటివి. సహజపాండిత్య పోతనామాత్యుడు తాను భగవదాదేశానుసారము పునర్జన్మంబు లేకుండునట్లుగా భాగవతంబుం తెనిగించుచుంటినని ప్రతిజ్ఞ

చేసినను కేవల స్వానుభవైకవేద్యమయిన 'కమనీయ భూమి భాగములు లేకున్నవే' యను పద్యమెట్లు దిగజారినది. ఏకవియైనను తత్కాల పరిస్థితులను తెలుపవలె నన్న యుద్దేశముతో యద్దాని నెంతో బొందుపరతురు. వారు తమతమ స్వస్థలము లను మరువగలరా. "జననీ జన్మభూమి శ్చ స్వర్గాదపి గరీయసీ" యను నానుడి ప్రసిద్ధమేగదా. గద్యముకన్న కావ్యములో నిట్టి యవకాశములు మెండు. ఏలయన కవితావస్తువు బంకమన్ను వంటిది. దానిని కవి యెంతవరకు కావలెనో వినియో గించుకొని దేశకాలపాత్రానుగుణముగా వర్ణనల జొప్పించి మిగిలిన దానిని వదలి వేయును. గద్యమందుకూడ యిట్టివిశేషములను బొందుపరచుట భట్ట బాణునికి, దండికే చెల్లినది. వారిరువురి ప్రతిభావిశేషములే "గద్యమ్ కవీనాం నికషం వదన్తి" యను నానుడిని ప్రచారములోనికి దెచ్చినవి. ఇంక కృష్ణరాయల ప్రబంధ మందు ప్రతిబింబితమైన చరిత్ర సంస్కృతుల నొక్కింత పరిశీలింతము.

తెలుగదేల యన్న దేశంబు తెలుగని చెప్పుటవల్ల కృష్ణరాయ లాంధ్రుడనని తానే చాటించుకొన్నాడు. దీనిపై వాదోపవాదము లున్నను ఈ విషయముపై యాతని ప్రకటనయే తుదితీర్పు. అందువల్ల నాతడు వర్ణించినది యాంధ్రుల చరిత్ర, సంస్కృతు లనే నా మతము. ఏలనన కృష్ణరాజేంద్రుడు పాలించిన విజయనగర సామ్రాజ్యము కటకమునుంచి కన్యాకుమారివరకు వ్యాపించియుండెను. అందు నాత డాంధ్రుడగుటవల్లనే స్వజాతిపక్షపాతముచే వారి యాచారవ్యవహార ములనే వర్ణించెను. ఈనాడు మూడు నాల్గు రాష్ట్రములుగా వెలసిన భూమండలము నాత డొక్క డేకచ్ఛత్రాధిపత్యముగా పాలించెను. సమకాలిక జీవితమును కృష్ణ దేవరాయలు పరిశీలించినంత సూక్ష్మముగ బహుశః మరి యే తెలుగు కవియు నేకాలమందునుకూడ చేయలేదని తెల్పు టతిశయోక్తికాదు.

కృష్ణరాయలకాలమున శత్రుభయములేక ప్రజలు కడుపులో చల్ల కదలకుండ జీవితయాత్ర గడుపుచుండిరి. నిజ ప్రజానురంజకుడైన ఱేడు వారి యోగక్షేమము లరయుచుండ యే కొఱతయు లేక యన్ని విధములగు సౌఖ్యముల ననుభవించు చుండిరి. నాడు నేటివలె నాధునిక సౌకర్యములుండెను. జటిల ద్రాక్షాగుళుచ్ఛములు, దాడిమీవనములు, తీయమామిళ్లు గల యారామములతోను, పెద్ద దేవాలయముల తోను, విజయనగర సామ్రాజ్య మష్టైశ్వర్యములతో తులతూగుచుండెను. మంత్ర పూతము గావింపబడిన ద్వారములతో బలిష్ఠమైన దుర్గములు శత్రువుల దాడిని ప్రతిఘటించుచుండెను. విజయనగర సీమలో నున్నన్ని దేవాలయములును, వాటి

యందు జరుగు వివిధోత్సవములు నిత్యకళ్యాణము పచ్చతోరణములై యుండెను. ఇవి యానాటి ప్రజల యకుంఠిత భక్తిప్రపత్తులను చాటుటకు మేటి తార్కాణము. ఆనాడు వైష్ణవమతము ప్రాబల్యముగా నుండినను శివకేశవులకు భేదములేక ప్రజలు తమ యిష్టదైవతములను ఆరాధించుచుండిరి. ప్రజ లంతఃకలహములను మాని యైకమత్యముతో తమను పాలించు దొరకు విశ్వాసపాత్రులై యుండిరి. ప్రభువులు కూడ భోగలాలసులై, కవులై వాగ్వాద విద్వద్గోష్ఠులతో కాలక్షేపము చేయుచుండిరి. నాటి రాజస్థానములందు తెనాలి రామలింగ కవిలింగని వంటి బిరుసు విమర్శకు లెందఱో యుండిరి. ఎల్లప్పుడు విద్వద్గోష్ఠులకు, సాహిత్య సల్లాపముల కనుకూల మయిన రాచదివాణములుండెను. షట్చాస్త్రములందు ప్రజ్ఞకలవారికి గాని, వేర్వేఱు శాస్త్ర మెఱింగినవారికి గాని విజయనగర తేండ్ల కొలువుకూటము వారి ప్రతిభా వ్యుత్పన్నతల ప్రదర్శనకు తగిన స్థానమై యుండెను. రాజులు కూడ శుక్రనీతి సారము, మనుస్మృతి, చాణుక్యుని రాజనీతి, మరియు నితర పూర్వ రాజ్యాంగ తంత్ర గ్రంథములందున్న న్యాయ సూత్రములను క్షుణ్ణముగా జీర్ణించుకొని రాజ్య పాలనము గావించుచుండిరి. వారు చీలించి పాలింపుమను రాజ్యపాలన సూత్రమును చక్కగా పాటించుచుండిరి. ఆంగ్లేయు లనుసరించిన Divide and Rule విధానము క్రొత్తదికాదు. రాజులు వేగరుల వల్ల ప్రజాభిప్రాయము, శత్రుపక్ష వార్తలను గుర్తెఱుంగుచు, జాగరూకులై సామ దాన భేద దండోపాయములను చక్కగా ప్రయోగించుచుండిరి. అంతేగాక శ్రీరామచంద్రుని పగిది ప్రచ్ఛన్న వేషధారులై నగర పరిశోధనార్థము వెడలుచు, స్వయముగా ప్రజల కష్టనిష్ఠురములను గ్రహించుచు, వారికి తగు సహాయము జరుగునట్లు చూచుచుండిరి. కృష్ణరాయల కాలమున గోవారేవు పట్టణము అతని యధీనమున నున్నందున విదేశములతో వ్యాపారము చక్కగా సాగుచుండెను. తత్ఫలితముగా ప్రపంచమందు వేర్వేఱు స్థలముల లభించు సుందరతరమగు నమూల్య పదార్థములు విజయనగర మందు లభించుచుండెను. వజ్ర వైడూర్య రత్న మాణిక్యముల వ్యాపారము మెరుగుగా నుండెను. విద్యానగరము నాడు వైజయంతముల మించు ప్రాసాదము లతో, ద్రవిడాంగనల చతుర పరిహాస విలాసోక్తుల ముమ్మరముతో కలకలలాడు చుండెను. అరవల పొత్తు మన నానాటి నుండియే వచ్చుచున్నది. అంతేగాక కవయిత్రులగు వేశ్యల సరస సల్లాపములతో, విలాస పురుషుల గోష్ఠులతో, ఆస్థాన విద్వాంసుల వాగ్వాద ప్రళయ ఝంఝూమారుతముతో ప్రావృషేణ్య పయోధరధ్వానవిభంబైన ధ్వనులవలె ప్రతిధ్వనించుచుండెను. పెనుకొండ కేకా

రావములతో యాగంతుకుల నాహ్వానించుచుండెను. చంద్రగిరి తన చెంత నున్న శేషాచల శ్రీనివాసు డందటి కీప్సితార్థము లొసంగుననని యభయహస్త మిచ్చునని భక్తులను దరిజేర్చుచుండెను. చంద్రగిరి, యుదయగిరి దుర్గములు నాడు సుప్రసిద్ధములు. ఉదయగిరి దుర్గ మిప్పటికిని దివ్యౌషధులతో నలరారుచున్నది. శ్రీకృష్ణ పరమాత్మకు జయ విజయు లిద్దఱే యంగరక్షకులు. కాని కృష్ణరాయలేలిన విజయనగర సామ్రాజ్యమున కొకవంక హంపీ విరూపాక్షస్వామి, మఱొకవంక తిరుమల శ్రీనివాసుడు, మఱొకవంక శ్రీశైల మల్లిఖార్జునుడు, వేఱొకవంక యహోబిల నారసింహుడు, వేఱొకవంక రామేశ్వర రామలింగేశ్వరుడు, మఱొకవంక భద్రాచల కోదండరాముడు, కావేరీ తీరమున శ్రీరంగడు యంగరక్షకులై యుండిరి. రవాణా సౌకర్యములుండినను బందిపోటు దొంగలు కూడ విచ్చలవిడిగా నిశాచరులై విహరించుచుండిరని సోమశర్మోపాఖ్యానము సూత్రప్రాయముగా వాకొనుచున్నది. పాండ్యుని సభలో జరిగిన శైవ వైష్ణవమత సంఘర్షణలు కృష్ణరాయల కొలువు కూటములో జరిగినవే యని ధ్వనించుచున్నది. ఆనాడు ప్రజలు న్యాయార్జిత విత్తములో నొకభాగము మాత్రము సుంకముగా నిచ్చుచుండిరి. విప్రోత్తముల వేద వాక్కులకు మంచి గౌరవములుండినవి. బ్రాహ్మణులకు వైష్ణవుల కగ్రహారములు లభించుచుండెను. ప్రతివారు తమ జాత్యుచిత ధర్మముల నిర్వర్తించుచు, యంతః కలహములు మాని మెలగుచుండిరి. నాడు బ్రహ్మరాక్షసులందు మంత్ర తంత్రము లందు నమ్మకముండెను. ఆనాడు కూడ వడ్డీ వ్యాపారములు, దోపిడీలు కూడ ఎక్కువగా నుండెను. సర్వ దుర్విధముల ధనమార్జించు మార్గము లందందు సూక్ష్మముగా గోచరించుచున్నవి. ఆముక్తమం దభివర్ణింపబడిన రాజనీతి విధానము కృష్ణరాయలు చాలవఱకు పాటించెను. ఆనాటి పల్లెసీమలు సస్యశ్యామలమగు సుక్షేత్రములతో కళకళలాడుచుండెను. కృష్ణరాయలు పాత్రమెఱిగి తాను చేయు దానములన్నియు హంపీవిరూపాక్షస్వామి ప్రత్యర్థం కరోమి యని చేయుచుండెను. సంతర్పణలు, యజ్ఞయాగాదులు విరివిగా జరుగుచుండెను. ఆనాటి బందిపోటు దొంగల యాగడము లీ సీసమునందు బొందుపరుపబడినవి.

సీ. పసలేదు నిలరోయి పాతకు లారని
దేవాయుధంబులు రూవువారు
పైడిబాసముచెట్ల పడవైచి దుడ్డు పె
ట్లకు బారుచునె యొలెల్లైవచువారు

బరువుడించి కటారి పరుజించి నిల్పియం
దెందు వచ్చెదరని యెదురు వారు
వస్త్రంబుగొండు దేవర యోయి యిదిచన్న
బస్తని దయపుట్ట బలుకువారు
కలవి మామూక నిప్పింతు దొలగు డొకటి
యాడుదాని జేనంటకు డనుచు బెద్ద
తనము యభిమానమును దెంపు గనగ బలికి
నిలిపి దోపిచ్చువారునై తొలగి రపుడు.



ఆముక్తమాల్యద ప్రౌఢ ప్రబంధ మగుటవలన దీనియందలి కొంత భాగమును తరుచు విద్వాన్, బి. ఏ., యం. ఏ., పరీక్షలకు పాఠ్య భాగముగా నిర్ణయించుట జరుగుచున్నది. ఈ పదేండ్లలో విష్ణుచిత్తీయము గూర్చి యడిగిన ప్రశ్నల జాబితా నొకటి పాఠకుల యుపయోగార్థ మిందు బొందుపరుచుచున్నాను.

1. కావ్య లక్షణములబట్టి యాముక్తమున కాంధ్ర సాహిత్యమం దీయదగిన స్థానమును నిర్ణయించునది.
2. ఆముక్తము, యిమిడికకు బిగువున కాంధ్రవాఙ్మయమం దగ్రగణ్యమెట్లో నిరూపించునది.
3. చండాల బ్రహ్మరాక్షస సంవాదమునకు, యాముక్తమాల్యద ప్రధాన కథకు గల సంబంధమును తెలుపునది.
4. ఆముక్తమాల్యద యాంధ్రంబున ప్రౌఢగ్రంథ మెట్లో నిర్ణయించునది.
5. ఆముక్తమందుగల ఋతువర్ణనలోని విశేషములెవ్వి ? దీనికిని నచ్చ తెనుగు రామాయణ మందునను, పాండురంగ మహాత్మ్యమునందునను గలవానికి భేదము తెలిపి, యాయా సందర్భములలోని యావశ్యకతను తెల్పునది,
6. ఆముక్తము నాధారము చేసికొని శ్రీ రాయల కాలమం దుప్పతిల్లిన కావ్యములు రసపోషకములను సిద్ధాంతమును పరిశీలించునది.
7. "కృష్ణరాయలు లోకజ్ఞానానుభవము కలవాడు"— ఎట్లో నిరూపించునది.
8. కావ్యమున కఖండత్వము కల్గించునది నాయకాశ్రయమైన రసంబని సాహిత్యవేత్తలంద్రు, ఆముక్తము కావ్యమైనచో దానిలో అంగిరసమేది ?
9. కర్మలు చిత్తశుద్ధికొఱకు, నుపాసన యేకాగ్రత కొఱకు, జ్ఞానము మోక్షము కొఱకని యద్వైతులు. ఈ మతమునకు విష్ణుచిత్తుడు ఖాండిక్య కేశిధ్వజ వాదమువల్ల ప్రతిపాదితమైన మతమునకు భేదము వివరించి యీ సిద్ధాంత మెట్లద్వైతుల కుపకారమో తెలుపునది, భాగవత మతములు విశిష్టాద్వైతమతములు భిన్నములా ?
10. "ఆముక్తమాల్యదయందు కవియొక్క పాత్రపోషణ కౌశల్యము నిరూపితము కాలేదు. అందు విష్ణువు సర్వాధికారి, అందలి పాత్రలకు వ్యక్తిత్వము పూజ్యము." ఇందలి సత్యాసత్యములను పరిశీలించునది;

11. అకాండ ప్రకాశమునకు, ప్రసాద రాహిత్యమునకు, శ్రుతికటుత్వ దోషముల కాకర మాముక్తమాల్యద యని కొందఱు అభిప్రాయపడినారు. ఇది యెంతవరకు సత్యమో సోపపత్తికముగ నిరూపించునది.

పైప్రశ్నలకు సరియగు సమాధానములు వ్రాయుటకు నేను కడంగుటలేదు. కాని యీ ప్రశ్నలను గూడ మనసున నుంచుకొని పదునాల్గు ప్రకరణములలో విపులముగా పరిశీలించితిని.

ఇందు 1, 2, 4 వ ప్రశ్నలను 6, 7 వ ప్రకరణములలో (అనగా కవనము, కావ్యస్థానము) పరిశీలించితిని. 7, 8 వ ప్రశ్నలకు 8, 9 వ ప్రకరణములలో(రాయల ప్రతిభావిశేషములు, కాంతాసమ్మితోపదేశము)సమాధానము లొసంగితిని. 5, 10, 9 వ ప్రశ్నలనుగూర్చి క్రమముగా 12, 10, 13 వ ప్రకరణములలో ప్రస్తావించితిని. ఇక 6, 11 వ ప్రశ్నలనుగూర్చి ప్రస్తావింతును. కృష్ణరాయల కాలమం దుప్పతిల్లిన కావ్యములు రసపోషకములను సిద్ధాంతమును పరిశీలింపవలె. తత్కాల ప్రబంధ లక్షణములను పేర్కొని యందందు నిక్షిప్తమైన ప్రత్యేకతలను పేర్కొనవలయును. అంతేగాక లభించినంతవఱకు కృష్ణరాయల తదితర గ్రంథములనుగూర్చి ప్రస్తావించవలయును. ప్రబంధయుగ మవతరించుటకుగల పూర్వపీఠికను కొంతవరకు సంక్షిప్తముగా పేర్కొనవలయును. విషయప్రధానముగా నుండిన భారత భాగవత రామాయణేతిహాసములపై మోజు యేలతగ్గినదో దానికి గల కారణములు సూచింపవలెను. అంతేగాక పురాణశ్రవణమున కలవడిన ప్రజలు తీరికగా భావప్రధానమయిన కవిత్వ మెందుల కభిలషించిరో తెలుపవలెను. దీనికి నాటి విజయనగర సామ్రాజ్యమందలి ప్రశాంతవాతావరణమే కారణము. ఆనాటి శాంతి భద్రతలే ప్రజల సాహిత్యాభిరుచికి దోహదమొనరించినది. భోగలాలసులైన ప్రభువులు వారి సాహిత్యాభిమానముకూడ కొంతవరకు కారణములు. ఈ ప్రబంధయుగమునకు దోడ్పడిన సాంఘిక పరిస్థితులను వాతావరణమును తొలిమాటలో విపులముగా వివరించితిని. ఈ ప్రబంధయుగమే యాంగ్లమున Romantic Revival గా ప్రసిద్ధి నొందినది. ఎం. ఏ. పరీక్షలో కొన్ని ప్రత్యేక యుగము లవశ్య పఠనీయములుగా నుండును. అట్టియెడ కృష్ణరాయల యుగము లేక ప్రబంధయుగము పఠనీయ విషయముగా నుండినచో నిట్టి ప్రశ్న వచ్చుట సంభవించును. అభిప్రాయ భేదమున్నను విమర్శన సహేతుకముగా నడపి తత్కాల కావ్యములందలి లోపాలోపములను నిష్పాక్షికముగా విపులముగా నిరూపింపవలయును. అంతేగాక కావ్యలక్షణములను పేర్కొని ప్రబంధ లక్షణము

లకు, కావ్యలక్షణములకు గల భిన్నతను ప్రస్తావించి యందందుగల రసోత్కృష్ట తనుగూడ నుగ్గడింపవలయును. ఈ విషయములన్ని పరిశీలించినను యీ పరిశీలన కాముక్త మెట్లుపయుక్తమైనదో కూడ వ్యక్తము చేయవలయును. ఏలయన యాముక్తమాల్యదవలన తెలిసిన విషయములను సోపపత్తికముగా నిరూపింపుమని కదా ప్రశ్న. ఆముక్తమందలి కవితాఛాయ తత్కాల ప్రబంధములందు వ్యక్తమయినది. అట్లే ఇతరకవుల పోకడ లాముక్తమం దెట్లు జాలువారినవో నిరూపింపవలయును.

కొంద రాముక్త మకాండ ప్రకాశనమునకు, ప్రసాద రాహిత్యమునకు, శ్రుతికటుత్వ దోషముల కాకరమని యభిప్రాయ పడినారు. కొందఱికి ద్రాక్షాపాకము నచ్చును. మరొకరు నారికేళపాక కవిత్వము నొదలదాల్తురు. "లోకో భిన్నరుచిః." ఏకావ్యమందైనను వస్తుభావ రచనలుగాని, రసముగాని, లోపించినచో దాని నుత్తమ సాహిత్యమనుటకు వెనుకాడవలసినదే. సాహిత్య వేత్తల కాముక్తము పెన్నిధివంటిది. అందున్న పదజాలము, పాండిత్య ప్రకర్ష, జాతీయ పద ప్రయోగములు, నానుడులు మరెందును గానబడవు. నైఘంటిక పదానుసయనిరూఢి కృష్ణరాయలు. సంస్కృతాంధ్ర పదజాల మాతనికి జిహ్వాగ్రగతము. మరి యిట్టి పాండిత్య ప్రకర్ష యాముక్తమందు విపులముగా యనువదింపబడినది. కొన్నిచోట్ల ప్రసాదగుణము కలదు. మరికొన్ని స్థలముల నోజోగుణము భూయిష్ఠముగా గలదు. శ్రుతికటుత్వ మొక దోషము కానేరదు. ఉత్తమ కావ్యలక్షణము లున్నప్పుడు విష్ణుచిత్తీయమును శ్రుతికటుత్వ మున్నదని నిరాకరించు టసమంజసము. ఈ గ్రంథములో సంఘటనల విషయము వేఱొకచో నితః పూర్వమే ప్రస్తావించితిని. అకాండ ప్రకాశన మనగా సన్నివేశములను హఠాత్తుగా కల్పించుట. ప్రధానకథ పెరియాళ్వారుది. ఆ మూలకథను బలిష్ఠముచేయుట కొఱకే కృష్ణరాయ లీ యుపాఖ్యానములను తప్పనిసరిగా త్రివిధములగు భక్తిమార్గముల ప్రచారము చేయుటకు జొప్పించినాడు. ఇతివృత్తమును నిర్ణయించుకొనినప్పుడే కొన్ని సన్నివేశములను వ్రాయ తలపెట్టి వాటికి ప్రధానగాథకు సంబంధ మేర్పరచినపు డకాండ ప్రకాశన మెట్లు కాగలదు. కొందరి మతమున యీ ప్రబంధ మారాశ్వాసములగుటేల యనియు, మూడాశ్వాసములలో వ్రాసియుండినచో బాగుండెడిదని మరికొందఱు నభిప్రాయ పడుచున్నారు. ఇందుగల యైదుపాఖ్యానములు ప్రధానకథకు వైష్ణవమత ప్రతిపాదన విషయములో తోడ్పడుచున్నవి. ఇట్లు శిథిలపథ బంధనతో నల్లిక బిల్లిక బిగితో కూర్చిన యీ యైదు సన్నివేశముల

కకాండ ప్రకాశము వర్తించదు. ప్రసాదగుణముకూడ నందందు సుస్పష్టముగా కన్పట్టుచున్నది. ఈ కవి పాండిత్య ప్రకర్ష యెల్లెడల ద్యోతక మగుచున్నందు వల్ల యెల్లెడల ప్రసాదగుణము కాన్పించదు. మారుమూల పదములు, మాండలిక పద ప్రయోగములుండుటవల్ల కొన్ని పద్యములు కర్ణకఠోరములుగా నుండినను యర్థస్ఫూర్తి యెందును చెడలేదు. ద్రాక్షపాకశైలి నాస్వాదించువారుకూడ రసికులే. కాని నారికేళపాకము నాస్వాదించువారి కోరిమి యుండవలెను. శ్రమపడిన యందలి సారస్యము బహిర్గతమగును. నేఁడుపకారవేతనము గైకొన్నవారికి Hindu పత్రిక యెట్లో యోరిమికలవారి కాముక్తము పెన్నిది. ప్రాజ్ఞమ్మన్యులు విష్ణు చిత్తీయము జోలికిపోరు. అట్టివారికి కల్గిన కుశంకఫలితమే యీ ప్రశ్న.

కృష్ణరాయల విష్ణుచిత్తీయము శ్రీనాథాదుల గ్రంథములవలె భాషాంతరీకర ణముగాక స్వతంత్రరచన. ఆత డుత్తమ కావ్యలక్షణములలో యనవసరమని తలంచిన కొన్ని వర్ణనలను వదలి దేశకాలపాత్రముల ననుసరించి యతని గ్రంథ మును పండితజనకల్పముగా వ్రాసినాడు. అందు సంస్కృత భాషాపాటవమేకాక, జాతీయపదప్రయోగములు, కొంగ్రొత్తపదములు పెక్కు, సర్వంకష పాండిత్య స్ఫోరకములు సుమారు 600 కానవచ్చుచున్నవి. వీటి నన్నింటి నితఃపూర్వమే ఆయా ప్రకరణములలో నుల్లేఖించి యుండుటవల్ల ప్రస్తుతము విరమింతును. భక్తి ప్రధాన మైన విష్ణుచిత్తీయము నా ప్రాజ్ఞులెవ్వరు నిరాకరించరు. తన యాస్థాన మలంక రించిన యష్ట దిగ్గజము లారాశ్వాసముల కావ్యములను వ్రాయుటచే వారిని మించు టకు వర్ణనాబాహుళ్యముతో గ్రంథము నేడాశ్వాసములవఱకు పెంచెను. ఇందు తత్కాల సాంఘికపరిస్థితులు, ప్రజల యాచారవ్యవహారములు రాజులు మొదలు రెడ్లవరకు తుచ యచ్చుగ్రుద్దినట్లు ప్రతిబింబించుచున్నవి. ఇందలి రాజనీతి వసంతవర్షర్తు వర్ణనలింత విపులముగానుండుటచే యితని కొత్తపోకడలు. ద్రవిడగురు పరంపరాగ్రంథస్థేతివృత్తములను తెనుగునకు గొనివచ్చి పెరియాళ్వార్ శూడికొడు త్తాళ్ చరిత్రములను రసస్ఫూర్తితో గానముచేసినాడు కృష్ణరాడ్భూమీశాసనుడు. కటకమునుండి కన్యాకుమారివరకు వ్యాపించిన విజయనగర సామ్రాజ్యమందు గల దాక్షిణాత్య సంస్కృతి నెల్లరికితేటతెల్లము జేసినాడు. ఈనాటికిహంపీ ప్రాంతమందు విరివిగానున్న బ్రహ్మరాక్షసి పొదలను పల్లేరులను కూడ గ్రంథస్థము జేసినాడు. కృష్ణరాయల గ్రంథమందు ప్రతిబింబించుచున్న సంస్కృతిని ప్రజల యాచార వ్యవ హారములను వేఱొకప్రకరణమం దిదివరకే వక్కాణించితిని. కళా పూర్ణోదయము కథాకావ్యము. దానికి వ్యాఖ్యానము వ్రాయుచు మల్లాది సూర్యనారాయణశాస్త్రులవారు

"అదిమొదలుగ నింతదనుక నంతకుమున్ని
ట్టిది పుట్టలేదు తెల్గున
విదితంబిది వివిధకావ్య విజ్ఞాతలకున్"

అని కళాపూర్ణోదయమును ప్రశంసించినారు. ఆ కోవకు జెందినదే విష్ణుచిత్తీయము. పదములొకటే యయినను తత్ప్రదబంధన విధానమందే ప్రత్యేకత కలదు. ఈ యశిథిల పదగ్రథనమే యుత్తమ సాహిత్య మనదగును. కృష్ణరాయల వచనములలో కూడ పద్యములందువలె ప్రత్యేకత కలదు. శ్రుతికటుత్వమే తరుచుగా గాన్పించును. ఇట్టి లక్షణము లుండుటవల్లనే విష్ణుచిత్తీయము స్వతంత్రప్రబంధమై యుత్తమసాహిత్య ముద్ర పొందగలిగినది.



సాహిత్యాచార్యుల యాశీఃప్రభావమున వారు సంప్రసాదించిన సాహిత్య సౌష్ఠవము కతముగా నుత్సాహముకొలది కృష్ణరాయల యయఃపిండమగు విష్ణు చిత్తీయముపై యోపినకొలది నాకుగల జ్ఞాన లవలేశమును నీపదునైదు ప్రక రణములలో వీలైనంత విపులముగ నుగ్గడించితిని. ఇందు ప్రధానముగా మొదటి యావృతికన్న కవన విషయములో కూలంకషముగ పరిశీంచి 46 పుటలకు పెంచి తిని. మరల సింహావలోకనములో నితఃపురోద్ఘాటిత విషయములను ప్రస్తా వించుట చర్వితచర్వణం బగుసు.

ఇంతటి దీర్ఘ విమర్శ వ్రాయుటకు కారణము లనేకములు గలవు. రసా శ్రయమగు నేసత్కావ్యమైనను నాకు శిరోధార్యమే. కావ్యములకు ప్రాచీన నవీన తలులేవు. అది నిరంతరమగు నిర్ఝరి. ఏకావ్యము సాహిత్య పిపాసువును పఠనో న్ముఖునిగా జేయునో నదియే సత్కావ్యము. అదియే యుత్తమ కావ్యమునకు కొలబద్ద. కావ్యలక్షణములు గ్రంథకర్త తన ప్రతిభా విశేషములను వేత్వేఱు గతులలో ప్రదర్శించుట కవకాశములు కల్పించును. అది కవి ప్రతిభావ్యుత్పన్న తలకు కొలబద్దకాదు. కొందఱి యభిప్రాయము విష్ణుచిత్తీయము మూడాశ్వాసముల కావ్యమై యుండినచో ముద్దుగా నుండెడిది. సర్వసాధారణముగ గ్రంథకర్త తన పాండిత్య ప్రకర్షనుగాని, కవితా చమత్కృతులనుగాని, భావనా పటిమనుగాని, యపూర్వ సన్నివేశ కల్పనలనుగాని పాఠకులకు సమగ్రముగా తెల్పవలెననియే కుతూహలియై యుండును. ఆ యావేదన పూర్తిగా ప్రతిఫలించుటకు తగు నవ కాశము లభించవలెను. సూక్ష్మముగా చెప్పదలచుకొనిన విషయములను తెల్పు టకు ప్రబంధయుగమునకు పూర్వగ్రంథము లుండనేయున్నవి. నూతనమగు పోకడలు కవి తన గ్రంథమందు బయల్పడవలెనని యందుకుగాను తాను విలక్షణ మార్గదర్శకుడు కావలెనని యువ్విళ్ళూరుచుండును.

రచయిత బహుముఖ ప్రజ్ఞావంతుడయినను యతని యావేదన పూర్తిగా ఫలించదు. గ్రంథము ముగిసిన పిదప యింకా తాను చెప్పదలచినది యెంతో మిగిలిపోయినదని వాపోవుచుండును. కాని యెవడును సర్వజ్ఞుడుకాడు కదా ? ఇది సహజము. ఏలయన సాహిత్య వ్యాసంగ మట్టిది; ఎంతకాలము నిష్కృష్టంబుగ కృషి చేసినను సాహిత్య స్వరూపము సమగ్రముగ సాక్షాత్కరింపదు. అందులకే "నహి సర్వ స్సర్వజ్ఞః" అను నానుడి జగత్ప్రసిద్ధమయినది. అటులనే కృష్ణ

రాయల గ్రంథము నెంత తరచినను క్రొంగ్రొత్త విషయములు బయల్పడు చుండును.

స్వతంత్రులై యశ్రాంతముగ సాహిత్య వ్యాసంగముజేయు స్వైర విహారు లగు విద్యానగర ప్రజ లెక్కడ ? జీవనభరణ ప్రయాసకులోనై శాంతిసుఖములకు విశ్వప్రయత్నములుచేయు నేటి పాఠకలోక ప్రమాణ మెక్కడ ? అథవా యుచ్ఛ్వాస నిశ్శ్వాసములకు కొంత సమయము లభించినను యే పట్టపరీక్షలకో యవశ్య పఠనీయ గ్రంథములుగా నిర్ణయింప బడిననోతప్ప ఏతత్ప్రౌఢ ప్రబంధ ముల నొకమాతేని కన్నెత్తి చూచుట కెవనితరము? పాత యొకరోత కొత్త యొక వింత గనుక యాంధ్ర సాహిత్యములో రత్నదీపికలుగా వెల్గొందు గ్రంథములను మరువక పాఠకుల నాయా గ్రంథ పరిశీలనోన్ముఖులను చేయు టకు సువిమర్శ లత్యావశ్యకములు. పాఠకులు తమ సాహిత్య పటుత్వమును వృద్ధి చేసుకొనుట కీ ప్రౌఢ ప్రబంధము లవశ్యపఠనీయములు. అక్కతమున నేతత్కావ్యమందలి గుణగణముల నింత విపులముగా పరిశీలించ వవసి వచ్చినది. అంతేగాక సహృదయు లొసంగు సూచనలను పాటించి యీ పర్యాలోకమును మున్ముందు పాఠకుల కత్యంతోపయుక్తము చేయుట కీ గ్రంథకర్త సంసిద్ధుడు. కొందఱికి తిక్కన యలతియలంతి తునియలు రుచింపవచ్చును ? మరికొందఱికి సంస్కృత సమాసపద భూయిష్ఠమగు నశిథిలపదబంధనము శిరోధార్యము కావచ్చును కాని యీరెండు నెల్లరకు సాధ్యపడునవికావు. ఒక భావమును గంభీర పద ప్రయోగములో నుడువుట యెంత దుస్తరమో, గంభీర భావమును ఔచిత్య భంగము కాకుండ చిరుపదములలో తెలుపుటకూడ దుష్కరమే. ఇవి యారో హణావరోహణముల వంటివి. దీనికి విశిష్ట దృష్టాంతము కృష్ణరాజేంద్రుని సభా మంటపమే. అందులకే యష్టదిగ్గజములు తమ ప్రత్యేకములైన పోకడలకు నాడును నేడును వాసికెక్కినారు.

మ. చకితైణాహుతి దావ మావశితపుచ్ఛ స్వల్పగచ్ఛత్తర
క్షుక మద్రిగ్రహయాళు భల్లుకము వక్షోభాగనిక్షిప్తడిం
భక వల్గత్ప్లవగీకదంబము ప్రహాదాంభః ప్రోత్థిత క్రోడనా
యక మాభీలముఖద్విపిస్థపుటితం బయ్యె౯ వనం బత్తఱి౯.

ఇది పెద్దనామాత్యుని మృగయావర్ణన. చక్కని స్వభావోక్తిగా రూపొందినది. ఈ పద్య మొక్కటే కృష్ణరాయల పాండిత్య ప్రకర్షతో తులతూగగల పద్యము. దీని కారణముననే రాయల కర్తృత్వ వాదమును శంకించువార లసంబద్ధప్రలాపములకు

తలపడుచురు. అంతేగాక తెనాలి రామకృష్ణుడు పాండురంగ విజయమందు రచించిన యీ రెండు పద్యములు కూడ కృష్ణరాయల కవనముతో సరితూగగలవే.

శా. అంభోరాశిగభీర! భీర హితచిత్తాఽఽభోగ! భోగావళీ
సంభా రామరరాజ! రాజకృత పూజాయోగ్య! యోగ్యర్ధిమి
త్రాంభోజా హిమధామ! ధామహితనిత్యావాస లక్ష్మీసము
జ్జృంభాలంకృతవక్త్ర! వక్త్రభిముఖ శ్రీమద్గుణ ప్రాభవా.

* * *

శా. శాణోత్తేజిత రత్న లక్ష్మి గురు శిక్షావత్కిశోరాకృతిన్
రేణుక్షాళన శాలిమూర్తి కలభా శ్రీదోహదోద్యన్నవ
క్షోణీజ ప్రభ ముక్తకంచుక ఫణిస్ఫూర్తిన్ సుధీబాంధవ
శ్రేణిప్రీణనకారణోజ్జ్వల కళోత్సేకాఢ్యులై రేవురున్.

ఇందు మొదటి పద్యమును 'బాలార్కాంశు విజృంభితామల' యను పద్యము తోడను, రెండవ పద్యమును 'స్వామీ నన్ను నితఃపురాపతిత' యను పద్యము తోడను పోల్చవచ్చును. ఇట్లే పోతనామాత్యుడు వ్రాసిన 'ఎవ్వనిచేజనించు' అను పద్యముతో సరితూగగల పద్యమొండు కృష్ణరాయవిరచితము 'ఎవ్వనిచూడ్కిచేసి' యనునది కలదు. శ్రీనాథ కవిసార్వభౌముడు కాశీఖండమందు వింధ్యపర్వతమును ప్రస్తావించిన పద్యము-

కాంచెన్ గాంచనగర్భ సంభవు డుదగ్రగ్రావకోటి స్థల
చ్చ్ంచన్నిర్ఝరవేణికా సలిల సంజాతాబ్జ సౌగంధ్యమున్
బంచాస్యస్ఫుట కంఠనాదహత శుంభత్కుంభి గర్వాంధ్యమున్
న్యంచ ద్ధాటకభూవిభృచ్ఛిఖర గర్వావంధ్యమున్ వింధ్యమున్.

అను శార్దూలమునకు సరితూగగల పద్యము "కాంచె న్వైష్ణవు డర్ధయోజన" మనునది యాముక్తమం దొండు కలదు. అయ్యది యిఃతపూర్వమే యుదాహృతము.

ఇట్లీ కవిచక్రవర్తి రసదృగ్ధారాళ వాగ్ధాటియందేమి, యితివృత్తకథనమందేమి, పాత్ర పోషణమందేమి, ప్రకృతి వర్ణనయందు గాని తదితర వర్ణనలందుగాని తారతమ్య పరిశీలనవలన నసామాన్యుడని తేలుచున్నది.

కృష్ణరాయలు సమకాలీన భావప్రతినిధి. అతని గ్రంథమం దుదాత్త సాహిత్య లక్షణములగు సార్వకాలీన సార్వజనీనత లంతర్భూతమై యున్న కతమున నేటికిని ప్రౌఢప్రబంధరాజముగ వెల్గొందుచున్నది. ఆ పాండిత్యప్రకర్షముం దీ

పర్యాలోకనము విలువ యెంత ? ఆ మహామహుని పాండిత్యమునకు గౌరవార్హముగ నుడుగరల నర్పించుటకే యీ చిరు ప్రయత్నము.

ఆంధ్రసాహిత్యమునకు సమగ్రాధికారమగు చరిత్ర యింతవరకు వెలువడ లేదు. వ్రాయబడిన కొన్ని వాడుకలోనున్నను "నిమిగెల్లి సందేహ నమగల్లే యనుమాన" యను కన్నడ నానుడిని సార్థకపరచుచున్నవి. అనగా నీ కెక్కడ యనుమానమో నా కక్కడే సందేహమని సారాంశము.

ఇందలి తుందుడుకులను విద్వజ్జనులు సహృదయులు పాటించక యిందలి గుణగణమే గ్రహింతురని యాశింతును. భవతు.



## క్షమార్పణము

వరుసన్వ్రాసిరి ప్రాజ్ఞు లెందఱో మహాప్రాగల్భ్య పారీణతన్
సరసాలంకృతమౌ విమర్శనల నీ సత్కావ్య రాజంబుపై
వరలన్; చర్వితచర్వణం బనుచు కోపంబూనకే యీ ప్రభా
కరు మన్నింతురుగాక ప్రాజ్ఞులు కటాక్షాలోకన ప్రౌఢిమన్.

రచన : 1957



# అనుబంధములు

## (అ) ఆముక్తమాల్యద పర్యాలోకనములో ప్రస్తావించబడిన గ్రంథానుక్రమణిక

## (ఆ) ఇందు ఉదహరింపబడిన పద్య, శ్లోక సూచిక

* * *

★

## (ఇ) ఆముక్తమాల్యదపై ఇతరగ్రంథములు

1. మేడేపల్లి వెంకటరమణాచార్యుల పీఠిక
2. వేదమువారి పీఠిక
3. విజయనగరాంధ్రవాఙ్మయచరిత్ర Vol. II — చేకుమళ్ళ అచ్యుతరావు
4. ఆంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహము — కవిత్వవేది
5. వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారి వ్యాసము — షష్ఠిపూర్తిసంచిక

*

# ఆముక్తమాల్యద పర్యాలోకన ప్రథమావృత్తిపై పండిత ప్రశంసలు

ఆంధ్రమహాకావ్యాలలో ఆముక్తమాల్యద యొకటి. దీనిలోని స్వభావోక్తులు, ప్రకృతివర్ణనము, గాంభీర్యము, భాషాకాఠిన్యము మరే ప్రబంధములోను కానిపించవు. దీని కర్తృత్వాన్ని గురించి పండితులలో అభిప్రాయ భేదాలున్నవి. కొంతమంది విమర్శకులు ఈ గ్రంథ కర్తృత్వం అల్లసానిపెద్దనకు అంటగడుతున్నారు. సహృదయులైన చాలామంది విమర్శకులు కృష్ణరాయలే ఈ కావ్యకర్తయని ఘంటాపథంగా చెప్పుతున్నారు. ఇదే ఎక్కువ సమంజసం.

ప్రౌఢకావ్యమైన ఆముక్తమాల్యదపై సమగ్రసమీక్ష వ్రాయటం అందరూ చేయగలిగిన పనికాదు. చిన్నవాడయినప్పటికి ఈ కావ్యపర్యాలోకనం చేయటానికి సాహసించిన ప్రభాకరరావు ప్రశంసాపాత్రుడు.

—ఆంధ్రప్రభ.

రాయలవారి ఆముక్తమాల్యద ఉద్దండపండితులకే అయఃపిండము. దాని వస్తుత్వ పర్యాలోకనమనగా మాటలతో పనిగాదు. అవి అనేక వాద వివాదనలకు గహనమైన సిద్ధాంతరాద్ధాంతములకు నాకరమయినది. ప్రస్తుత గ్రంథమంత పెద్ద సమీక్ష కాదుకాని యిది సాహిత్యోత్సాహులయిన నవవిద్యార్థుల కాప్రకృష్టప్రబంధమునుగూర్చి పరిచయము గలిగించుటకుమాత్ర ముపయోగించును.

—భారతి.

వెల్దండ ప్రభాకరరావు కురుగంటి సీతారామయ్య శిష్యుడు. మంచి సారస్వతోత్సాహము గలవాడు. అయఃపిండమై పండితులకుకూడ కొఱుకుడు పడని ఆముక్తమాల్యదను పర్యాలోకనచేయ సాహసించిన ప్రభాకరరావు శక్తి గొనియాడదగినది. అంటుమామిడి చిన్నదై ముదిరి మంచి ఫలము లొసగునట్లీతడుకూడ పాండిత్యాభివృద్ధిచేసుకొని మంచి గ్రంథములను సృష్టింపగలడు. ఈ రచనలో విమర్శనాశక్తియొక్క ఛాయలు కన్పట్టుచున్నవి. ప్రభాకరరావు పర్యాలోకనము నెవ్వరుకూడ నిరసింపరు.

—భావరాజు వేంకట కృష్ణారావు.

శ్రీకృష్ణదేవరాయల ప్రౌఢకావ్యమున కిది లఘువిమర్శ. సాహిత్య పర్యాలోకనములు తెలుగున తక్కువ. ఉన్నంతలో రచన బాగున్నది. గ్రంథకర్తగారి కృషి సార్థకమై రాయలవారికి జేజేలు పెట్టుచున్నది.

—రామకృష్ణప్రభ.

ఆముక్తమాల్యదాపఠనమందు ప్రోత్సాహము కలిగించుటకు మిక్కిలి యుపయోగించును. మీ సంగ్రహనైపుణి మిగుల శ్లాఘ్యము.

—కోరాడ రామకృష్ణయ్య.

ఆముక్తమువంటి మహాగ్రంథమును, ఇంతటి నేర్పుతో, ఇంతటి అభినివేశముతో వ్యాసంగము చేసినదిగాక పుస్తక రూపకముగా మీ భావములు వెలువరుచుటయందు మీరు చూపిన శ్రద్ధాభక్తులు ప్రశంసార్హములు.

—రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.

## 'ప్రేమసీమ' పై పండిత ప్రశంసలు

మీ ప్రేమసీమ పేరునకు తగిన పొత్తము. చూచి యానందించితిని. మీ శైలియందు మంచిధారాళత యున్నది. దానికన్న ప్రసన్నతాగుణ మెక్కుడుగనున్నది. మీ కావ్యము లాంధ్ర మహాజనుల నలరింపగలవని నా నిశ్చయము.

—కీ. శే. కవిసార్వభౌమ దుర్భాక రాజశేఖర శతావధాని.

ప్రేమసీమ దూరదూరాల ద్యావాపృథ్వ్యవసానానికి రెక్కలల్లార్చుకొంటూ చొచ్చుకపోయే సుఖజీవులకు ఆనందసీమ కాగలదు. కళాత్మకంగా కవి తన జీవితాన్ని కళగా మార్చుకో గలుగుదురని ఆశిస్తున్నాను, మీ సమగ్ర కృషిఫలితమైన మరొక మీ అఖండ కావ్యరచన కెదురుచూస్తున్నాను.

—ఉత్పల సత్యనారాయణాచార్య.

సులభమైన శైలిలోనూ, సుబోధకమైన భాషతోనూ పద్యాలు వ్రాయబడ్డవి. ధారాశుద్ధిగూడా యీ కవికి చక్కగా అలవడ్డదనడంలో సందేహం లేదు. ఈ యువకవికి మంచి భవిష్యత్తున్నదనడంలో సందేహంలేదు.

—ప్రగతి.

ప్రేమసీమ కీట్సుకవి ఆంగ్ల కావ్యానికి స్వేచ్ఛానువాదము. శైలి ధారాళముగా నున్నది.

—జైహింద్, తెనాలి.

ప్రేమసీమలో ప్రవేశించి తిన్నగా బయటికి వచ్చితిని. శైలి రమ్యముగా యున్నది. కమనీయంబగు నాంగ్లసాహితి కలంకారంబుగానొప్పు కీట్సు మూల మున కిది స్వేచ్ఛానువాదము. లలితకళయౌ కవితలో ఈ కవి కింత యుత్సుకత, రచనాశక్తి రమణీయదుర్గమున చొరగల ఘనమైనధాటి, రసజ్ఞతా విశేషావహ చిత్రకల్పనము మనోజ్ఞమగు కూర్పు సాధించవలయునని ఈకవియొక్క మహా దాశయము. వీణియ కేలబూని తనవీనులకింపు వహింపుసొంపునన్ గానము సేయగల యువకు డీకవి. తక్కువ దొందుడుకులతో తపముల్జేసి యితర కవుల శైలిని చందురకావిపావడంలో నుండి ఈ కవి వెలుపలికి లాగినాడు. ఇతని కవిత్వము కృత్రిమసుమాల దరికి నరుగదు. కావ్యాంగన పొందుతోడ శైలిలో రస ముద్వేలించగలదిట్ట. మొత్తము ఈ కవి

అరసికేషు కవిత్వనివేదనమ్

శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ.

అను నార్యోక్తుల గమనించి జీర్ణించుకొని ఇతరులను సుఖింపజేయగలడను నమ్మిక ప్రేమసీమలో కనబడుచున్నది.

రసికత్వము పొంగారుతు లలితతరంగ తరంగిణీగతిని, మెల్లగా చయ్యన నీచమరంధ మకరికలభాతి, హృదయము నాకర్షించు కవితాధాటి కీట్సు **Eve of St. Agnes** లో విశదమగుచున్నది. భాషాంతరీకరణము మాని స్వచ్ఛంద వృత్తిచే సుధారసము వెదజల్లుట కలతిశక్తి చాలదు.

అనుసరించిన మార్గము సంప్రదాయబద్ధమే. కనుకనే ఈ యువకవి ఆంధ్రభాషాయోషను మిక్కిలిగా భూషింపగలడను ఆశ యున్నది.

—డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, ఎం. ఏ. పి. హెచ్. డి.

కావ్యంలో అనర్గళధార వుంది. ఎంతటి సమాసమైనా సరళంగా శ్రుతిపేయంగా ఉంటుంది.

—ఆలిండియా రేడియో, మద్రాసు.

చి. వెల్దండ ప్రభాకరరావు రచియించిన ప్రేమసీమయను చిరు కావ్య మును సమగ్రముగా చదివినాను. భాషాంతరీకరణమైనను మాతృకగానే యగ పడుట యీ కావ్యముయొక్క విశిష్టత. కీట్సు మహాకవి గ్రంథమును చదివి, తన్మయుడై యందలి కథావస్తువును భావించి దానికి మన వాతావరణమును కల్పించుట యితను చేసిన గొప్పపని. ఇదియే యితని రచనా సామర్థ్యమునకు

నికషాయమాణము. శైలియు రసవంతముగానే యున్నది. వస్తువునకు తగిన శబ్దజాలమునే వాడినాడు. నిపుణతాలోక కావ్య శాస్త్రాద్యవేక్షణముల నితోధికముగా గ్రహించి యింకను రసవత్తర కావ్యములను రచియింపగలడని యాశించు,

శ్రేయోభిలాషి
—కురుగంటి సీతారామయ్య, ఎం. ఏ.

శ్రీ వెల్లండ ప్రభాకరరావుగా రాంగ్ల కవి శేఖరుఁడయిన కీట్సు రచించిన Eve of St. Agnes అను ఖండకావ్యము ననుసరించి తెలుఁగున సంతరించిన ప్రేమసీమ సాంతముగాఁ బఠించి యానందించితిని. శైలి జాతీయ పద ప్రయోగపూరితమును ఎడనెడ మృదుమధుర సమాసభూయిష్ఠమునై యలరారు చున్నది. భావములు స్ఫుటవ్యంజితములై రమణీయములుగా నున్నవి. ధారయెచ్చటను కుంటువడక ధారావాహినియై యున్నది. ఈ కావ్య మనుసరణమయ్యు నాద్యంతము స్వతంత్రమట్లు వెలుగొందుట శ్రీ ప్రభాకరరావు గారి రచనా విశిష్టతకుఁ దార్కాణము.

—దివాకర్ల వేంకటావధాని,
ఉస్మానియా విశ్వవిద్యాలయం.

మీ ప్రేమసీమ శ్రద్ధగా పఠించితిని. కావ్యము సరసముగా ఆహ్లాదకరముగా, శ్రావ్యముగా, మనోహరముగా నున్నది. ఈవ్ ఆఫ్ సెంట్ ఆగ్నిస్ లోని హృదయమును మీరు చక్కగా తెనుగులోనికి తీసికొని రాగలిగితిరి. మూలములో లేని సొబగులుగూడ చాలా ఆనందదాయకములుగా కన్పించుచున్నవి. కీట్సు కవియొక్క సౌందర్యోపాసనను ఆంధ్రులకు మీ వంటివారర్పించుట ముదావహము.

—పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

ప్రేమసీమ ఉత్కృష్టమయిన రచన. ఇది మీ స్వంత రచనవలె అనువాద ఛాయలే లేని మనోహరశైలిలో రసజ్ఞులను చవులూరించింది. మీ భవిష్యత్తులో అత్యున్నతమైన కళాఖండముల ప్రచురించ ఎదురు చూస్తున్నాను.

—శ్రీ శ్రీనివాసుల శ్రీరామమూర్తిగారు, విశాఖ.

కీట్సు కావ్యమునందుగల సొంపు మీ తెనుగు రచనయందు ప్రస్ఫుటముగా జాలువారినది. మీ ప్రేమసీమ అతి రమణీయమయిన కావ్యము. గ్రంథ

చోరులు భావచోరులవలె గాక మీరు కీట్సుకవి భావములను తెనుగునకు దెచ్చు ప్రయత్నము వెల్లడిగ చేసినదానికి మీరు ప్రశంసార్హులు. నన్నయ, తిక్కన శ్రీనాథాదుల తెనుగురచన లిట్టివే. భాషాంతరీకరణము మక్కికి మక్కి గావలయును. కాని తెనుగుసేత కొంతవరకు స్వతంత్రరచనయే యగును. మీ కృతియట్టిదే.

—భావరాజు వేంకట కృష్ణారావు.

తెనుగుతోటపై పడమటి తెమ్మెరలు వీవదొడగినది మొదలు పలురకపు టంట్లు విజాతీయములగు క్రోటనులు మనయుపవనమున కై సేయసాగినవి. అన్నిరకముల మొక్కలతో నలరారుచున్ననాడే తోటకు నిండుదనము ప్రాత వనస్పతులకు మోమెత్తిన రసికాళులు విజాతీయ వాసనలకు ఎగబ్రాకు చుండును.

ఇతర రంగములందువలెనే సారస్వత రంగమునందును విజాతీయత వేరూనినది. అదియ కవయితకు చదువరికిని విహార రంగమైనది. తత్ఫలితమే యీ ప్రేమసీమ ప్రభాకర కర వికస్వరమైన యీ ప్రేయో - ద్యాన - సీమ తెనుగు చదువరులకు కీట్సు కవిచంద్రుని కవితా విలాసముల సుంతేని చవి చూపకుండపోదు. విజాతీయ పాత్రలకు జాతీయ సంస్కృతి గరపి ప్రదర్శించినా డీ కవి.

ఇందు 'లలనా చెప్పెడి దేమి నాకుగల సర్వస్వమ్ము నర్పింతు, నిన్ దలతున్ దేవిగ నాకు నీ యెడదలోనన్ గొంత చోటిమ్ము' మొదలగు హృదయమును పుణికి పుచ్చుకొను నిక్కలేగాక 'కలవాసీమ జలాశయాశ్రితమరు త్కల్లోలవాతూల నిశ్చల రాయంచల స్వాగతంబులును, రేలున్ ఘస్రములున్ శరద్శిశిరముల్వేపోవు, శీఘ్రస్థితిన్ కాలంబేగును పూర్తి నాయు విటులి క్కాలాన క్షీణించినన్' మొదలగు వేదాంత సూక్తులేగాక, 'శారదచంద్రికామయ ప్రసన్న నిశాసమయంబులందు శృంగారవతీ సతీమణుల కౌగిళులన్ బిగిగారవించుట'లును లేకపోలేదు. చదువరి యీ సీమ విచ్చలవిడి విహరించుగాక.

కవి వర్ధిష్ణువు. ఇంకను పలునగలచే తెనుగుతోటను గై సేయుగాత.

—సాహిత్య విద్వచ్ఛిరోమణి శ్రీమాన్ కుంటి మద్ది శేషశర్మగారు.

The Author has succeeded to impress on the readers that his rendering by far excelled the original one in the matter of romance.

—Struggle-Weekly
Hyderabad

Thank you very much for the copy of your recent publication " Prema Seema ". I wish you a great future as a writer and poet.

—Sri Bezawada Gopala Reddy
1951, Madras.

You have taken a lot of trouble in getting the work produced in this form. I would like to say that this work owes only a general idea to Keats as such it is an independant rendering. I am glad to notice the great interest in the service of our language. I wish you all success as a poet.

—Achanta Janaki Ram
AIR—MADRAS

*

# OTHER WORKS OF THE AUTHOR

## Poetry

1. Prema Seema : an adaptation of John Keats'— Eve of St. Agnes— in 144 stanzas of classical metre beautifully printed with a tri-colour title (1951.)

Rs. 2/- (O. P.)

## Under active Preparation

1. A Poetical Magnum Opus of 2000 Stanzas in classical metre in 8 cantos with Bhakti and Sringara as the dominant rasas Scheduled for publication in the latter half of 1960.

## Prose

1. Vimarsaka Parijatam : An up-to-date and authentic critical survey of Sanskrit and Telugu literatures, with an elaborate treatise on the principles of literary criticism. Approximately 1000 pp. Royal Octavo, scheduled for publication in 1961.

## Sanskrit Literature

A treatise on Anargha Raghava of Bhatta Murari 150 pp. Demy with a foreward by Prof. Louis Renou, Sarbonne University, Paris, with an introduction by Prof. Chintaharan Chakravarty, Calcutta, exclusively for distribution to the members of the All India Oriental Conference, 20 th session at BHUVANESHWAR 1959.

Amuktamalyada Paryalokanamu — *Veldanda Prabhakaramatya*
Rs. 6—00.

Born in 1924 in Mahbubnagar district, Veldanda Prabhkaramatya was educated at Nizam College, affiliated to Madras University, Hyderabad. He published Amukta Malyada Paryalokanamu — a revealing and valuable critical treatise on the work of Sri Krishnadevaraya in 1945. In 1951 appeared the poetical work, Prema Seema, an adaptation of John Keats'—Eve of St. Agnes—which was an immediate success.

Veldanda as he popularly known, has travelled extensively and contributed a number of critical essays on outstanding works in Sanskrit and Telugu to various journals. A member of the All India Oriental Conference since 1949 he submitted papers in English on Indological Research.

★

*For copies apply to :*
**VELDANDA PRABHAKARAMATYA,**
" SAHITYA NIKETANAM "
248/B MALLEPALLY, HYDERABAD - DN. 1
( Andhra Pradesh)-INDIA
*or*
**AJANTA PUBLICATIONS**
7112, Mahakali Street, SECUNDERABAD - 3

Printed at AJANTA PRINTERS.